# శ్రీ కాళహస్తీశ్వర క్షేత్ర సాహిత్యానుశీలన






డా॥ బత్తల శ్రీరాములు

# శ్రీకాళహస్తీశ్వర క్షేత్రసాహిత్యానుశీలన

## A CRITICAL STUDY OF THE LITERATURE OF SRIKALAHASTISWARA KSHETRA



డాక్టర్ బత్తల శ్రీరాములు

M.A., M.Ed., M.Phil.,Ph.D.,

## ŚRĪKĀLAHASTĪŚWARA KSHETRA SĀHITYĀNUŚILANA

(A critical study of the Literature of Śrīkālahastisvara Kshetra)


**Dr. B. SREERAMULU,** M.A. M.Ed., M.Phil., Ph.D

Social Assistant

Government Junior College

Kalikiri - 517 234

Chittoor District (A P)





నవీన్ ప్రచురణలు - ప్రథమపుష్పం

ప్రథమ ముద్రణ - ప్రతులు 1000, సెప్టెంబరు 1996

వెల రూ. 100/-

ముఖపత్ర చిత్రణ, అక్షరాలంకరణ

పేట్శ్రీ (డా పేట శ్రీనివాసులురెడ్డి)

ప్రతులకు:

1. శ్రీమతి బి.ఆర్. దేవి
   W/o డా బి. శ్రీరాములు
   గుట్టపాళ్యం పోస్టు
   (వయా) కలికిరి-517 234
   చిత్తూరు జిల్లా
2. విశాలాంధ్ర బుక్‌హౌస్
   హైదరాబాద్, తిరుపతి, విజయవాడ, హనుమకొండ
   అనంతపురం, విశాఖపట్నం, గుంటూరు, కాకినాడ





ముద్రణ.

ఎల్.వి. గ్రాఫిక్స్, నెం.268,

ప్రకాశం రోడ్, తిరుపతి-517 501



*This book is published with the*

*Financial Assistance of*

*Tirumala Tirupati Devasthanams*

*under their scheme*

*"Aids to Publish Religious Books"*

# పుష్పాంజలి

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతఃపితరౌ వన్దే పార్వతీ పరమేశ్వరౌ "

-మహాకవి కాళిదాసు
రఘువంశమ్, శ్లో-1.

"కలాభ్యాం చూడాలంకృత శశికలాభ్యాం నిజతపః
ఫలాభ్యాం భక్తేషు ప్రకటిత ఫలాభ్యాం భవతుమే ।
శివాభ్యామస్తోక త్రిభువన శివాభ్యాం హృదిపున
ర్భవాభ్యామానంద స్ఫుర దనుభవాభ్యాం నతిరియమ్ ॥ "

-శ్రీ ఆదిశంకరుల
శివానందలహరీ, శ్లో-1

"అర్చామీతి ధియా యదేవ కుసుమం భిత్త్వాజనో ముచ్యతే
వధ్యామీతి ధియా తదేవ వికిరన్ భస్మీకృతో మన్మథః ।
యశ్చాభ్యంతర వృత్తి మాత్రరచితో సాక్షాత్స్వయంభూ. పుమాన్
సస్వామీ మమదైవతం తదితరో నామ్నాపి నామ్నాయతే ॥ "

- శ్రీ నీలకంఠదీక్షితుల
శివోత్కర్షమంజరీ, శ్లో-2

# శ్రీకాళహస్తీశ్వర క్షేత్ర సాహిత్యానుశీలన

## విషయ సూచిక

# కృతజ్ఞతానివేదనం

నేను M Phil . పూర్తి చేసిన తర్వాత Ph D చేయాలని ఉబలాటపడ్డాను ఎవరైన ఎం.ఫిల్ పూర్తి చేసిన వారు గైడు లేకుండా పిహెచ్.డి చేయవచ్చునే నిబంధనను ప్రవేశ పెట్టిన మా గురువుగారు స్వర్గీయ శ్రీ ఆచార్య జియస్ రెడ్డి గారికి నా నమస్కారములు

శ్రీ కాళహస్తీశ్వర క్షేత్ర సాహిత్యంపై పరిశోధన చేయుమని నాకు సలహా యిచ్చిన గురువుగారు ఆచార్య డా కె. సర్వోత్తమ రావు గారికీ, నిరంతరం ప్రోత్సహించే గురువర్యులు స్వర్గీయ శ్రీ ఆచార్య యం. సుబ్బారెడ్డిగారికీ డా॥ పి. నరసింహారెడ్డి గారికీ ఆచార్య యస్.జి.డి. చంద్రశేఖర్ గారికి తదితర అధ్యాపక బృందానికీ

మార్గదర్శకుడు లేని నా పరిశోధన అనే నావకు చుక్కానిగా పనిచేసి నామీది అవ్యాజానురాగంతో నేను ప్రాచ్యపరిశోధన సంస్థకు పలుమార్లు వెళ్లినా విసుగుకోకుండా అనేకానేక విషయాలు చెప్పి నా వ్రాతప్రతిని సమగ్రంగా పరిశీలించి, సంస్కరించి, తగుమార్పులు చేర్పులతో పరిష్కరించి యిచ్చిన డా॥ ముదివేడు ప్రభాకరరావు గారికీ

నా పరిశోధనలో తటస్థ పడిన తమిళ గ్రంథాల్లో, గ్రంథలిపిలోని తమిళ శాసనాల్లో గల విషయాలను విడమరచి చెప్పిన సహృదయులు డా టి.యస్. ఆర్.నారాయణన్ డా చతుర్వేదుల వేంకటశివ సుబ్రహ్మణ్యశర్మ గారికీ గ్రంథాలయంలో నేను కోరిన గ్రంథాలను అడిగినదే తడవుగా అందించిన శ్రీ టి. అనంతనారాయణ గారికీ, విశ్వవిద్యాలయ గ్రంథాలయోద్యోగి శ్రీ వి. షణ్ముఖం గారికీ గ్రంథాలయం పుస్తకాలు తీసుకోవడంలో సహాయపడిన శ్రీ ఎం. మునిరత్నం, డా॥ ఎస్. నరసింహులు గారికీ, డా॥ ఎస్. కృష్ణారెడ్డి గారికీ

డా॥ కిరణ్‌క్రాంత్ చౌదరిగారికీ, విద్వాన్ డి. నాగసిద్ధారెడ్డిగారికీ, డా॥ కె. రామమూర్తి గారికీ

నా పరిశోధన కాలంలో నాకెన్నో విధాలుగా సహాయపడిన మిత్రులు డా॥ మేడసాని మోహన్‌గారికి, ప్రొఫెసర్ పి. రమణయ్య అన్నగార్కి, డా॥ పి. గోవిందరాజు, డా॥ వి. దొరస్వామి నాయుడు, శ్రీ కె. పార్థసారధిరావు (హెడ్మాస్టర్, పాకాల), డా॥ యస్. ఉత్తన్న గారికీ డా॥ కె. మునిరత్నం, డా॥ జె. మునిరత్నం, డా॥ కె. దామోదరనాయుడు, డా॥ కె. ఆనందన్ గార్లకూ, నా పరిశోధనకు ప్రోత్సహించిన తల్లి తండ్రులు, శ్రీమతి పార్వతమ్మ, శ్రీ పి. మునెయ్య గార్లకూ, నాహృదయపూర్వక నమస్కారములు

నా పరిశోధనలో ఎన్ని ఆటంకాలు కల్గినా నన్ను ప్రోత్సహించి ఉత్సాహపరచిన నా తమ్ముళ్లకూ, నా శ్రీమతి బి. ఆర్.దేవికి నా ఆశీస్సులు

గ్రంథ ముద్రణాది వ్యవహారాలలో నా కెన్నో సలహాల నిచ్చిన స్నేహశీలి డా॥ ముదివేడు ప్రభాకరరావుగారికీ

శివమాహాత్మ్య ప్రతిపాదకమైన ఈ సిద్ధాంతగ్రంథం వెలుగుచూడటానికి ఆర్థికంగా చేయూతనందించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికీ

ఈ గ్రంథముద్రణ కార్యక్రమాన్ని అతి త్వరగా పూర్తిచేయించిన లక్ష్మీ విలాస్ గ్రాఫిక్స్ (L V Graphics) అధినేతలు శ్రీ ఎమ్. రాజేంద్రన్ గారికి వారి ముద్రణాలయ సిబ్బందికీ

నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

తిరుపతి, డా॥ బి. శ్రీరాములు

28-9-1996

# శ్రీకాళహస్తీశ్వర క్షేత్ర సాహిత్యానుశీలన

## ప్రథమాధ్యాయం

## శైవమతం - దాని ప్రాచీన స్వరూపం

### ప్రస్తావన

మ॥ తన యిల్లాలఖిలైకమాత తన సంతానంబు భూతవ్రజం
    బనులాపంబులు వేదముల్తన విహారాగారము ల్మౌని హృ
    ద్వనజంబుల్తన సేవకు ల్కమల జాతశ్రీధరుల్గా జెలం
    గిన దేవోత్తము నమ్మహాత్ము వరమే కీర్తింపగా నేర్చికిన్?

ఆ మహాత్ముని యిల్లాలు సమస్తలోక జనని సకల ప్రాణులు ఆయన సంతానం ఆయన పలుకులు వేదాలు మహర్షుల హృదయ పద్మాలు ఆయన విహార భవనాలు బ్రహ్మ, విష్ణువులు సేవకులు అయ్యేటట్లుగా ఒప్పుతున్న పరమశివుని, శివమహాదేవుని వర్ణించుట కెవ్వరికైన సాధ్యమా?

కైలాసవాసీ భగవాన్ శ్రీకాళహస్తీశ్వరశ్శివః।
కరోతు నిత్యకల్యాణం కరుణా వరుణాలయః ॥

### 1 శైవమతం - దాని ప్రాచీనస్వరూపం

భారతదేశంలోని ప్రాచీన మతాల్లో శైవ మతం మొదటిది భారతీయ ఆస్తిక మతాలలో విష్ణువు, శివుడు, బ్రహ్మలు ప్రసిద్ధులైన ప్రధాన దేవతలు

### 11 శైవ మతం - ఆవిర్భావం

శివుడు ప్రధాన దైవమైన శైవ మతం అత్యంత ప్రాచీన కాలం నుంచి భారత దేశంలో విశిష్ట స్థానాన్ని కలిగి వుంది ఈ మతానికి ముఖ్య ప్రమాణ గ్రంథాలు చతుర్వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు మొదలైనవి నాలుగు వేదాలలో శివుడు పరమోపాస్య దైవంగా ప్రస్తుతింప బడ్డాడు[1]

---

*1 శివసంచస్సవి - విదిరెమరం వీరభద్రశర్మ, ఉపోద్ఘాతం, పుట-77*

ఋగ్వేదంలో శివుని ప్రశంస కనిపిస్తుంది. ఋగ్వేదంలో శివుడు - రుద్రుడుగా, లయకారకుడుగా, రోగ నివారకుడుగా వర్ణింప బడినాడు. రుద్ర శబ్దానికి అనేక అర్థాలున్నాయి.[1] రుద్రుని శక్తిని గురించి యం ఏ కృష్ణయ్యర్ చక్కగా పేర్కొన్నారు. ఆయన మాటలలో చెప్పాలంటే, 'అందరినీ నాశనం చేయ గల సుడిగాలి వంటి శక్తి రుద్రుడు - అతి సుందరుడు, అతి బలిష్ఠుడు, చెడుకార్యాలను చేసే వారిపై తక్షణమే రుద్రుని ఈటె లేదా బాణం గురికావింపబడుతుంది. జనుల కష్టాలను పరిహరించడంలో శివుడు ఔషధులవంటి వాడు. మహారోగాలను సైతం నయం చేయుగల శక్తి అతనిది. భూత ప్రేతాల నుండి కాపాడుతాడు. జనానికి ధనాన్ని, పుష్టినిచ్చేవాడు సంతోష మిచ్చేవాడు రుద్రుడు'[2]

## 12. శైవ మత వ్యాప్తి

భారతదేశ మంతటా గల శివాలయాలు శైవ మత వ్యాప్తిని తెలియజేస్తాయి. మంగళమూర్తి యైన శివుడు హిమాచలంలో గౌరీ శంకరుడు, కాశ్మీరంలో మహాదేవుడు, సౌరాష్ట్రంలో సోమనాథుడు, కాశిలో విశ్వేశ్వరుడు, మధురలో సుందరేశ్వరుడు, రామేశ్వరంలో రామలింగేశ్వరుడు, దాక్షారామంలో భీమేశ్వరుడు, శ్రీశైలంలో మల్లికార్జునుడు, శ్రీకాళహస్తిలో శ్రీకాళహస్తీశ్వరుడుగా పూజింప బడుతున్నాడు.[3]

హరప్పా, మొహంజొదారో అవశేషాలను పరిశీలిస్తే శైవ ధర్మం క్రీస్తుపూర్వం 3000 సంవత్సరాల నాటికే వుండినట్లు తెలుస్తుంది. శైవుల ఉపాసనకు సంబంధించిన యోగ ముద్ర లోని రూపాలను అక్కడి అవశేషాలలో చూడవచ్చు. అక్కడి అవశేషాల లోని ముద్రలపై (seals) పద్మాసనాసీనుడైన పురుషాకారమూర్తి యోగ ముద్రలో వుండగా, చేతిలో శూలం, శిరోభూషణాలతోను, కుడి వైపున ఏనుగు, పులి, ఎడమ భాగంలో దున్నపోతు, ముందు భాగంలో జింక మొదలైన చిత్రాలు కలిగి వుండటం వల్ల అది 'పశుపతి' యైన శివుని చిత్రమని

---

*1 శివమంజరి - పుట -78*

*2 వీరశైవ పురాణగళు - ఒందు అధ్యయన*

*3 ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి షష్టిపూర్తి అభినందన సంచిక పుట-23*

గుర్తింపబడింది. ఈ తార్కాణాన్ని బట్టి శైవ మతం చాల ప్రాచీనమైనదని తెలుస్తోంది

శైవ మతం భారతదేశంలోనే గాక ప్రపంచ మంతటా వ్యాప్తి చెందిందని బండారు తమ్మయ్యగారు అభిప్రాయపడ్డారు[1] ప్రాచీన చైనా, జపాన్ దేశాలలో లింగ పూజ నడిచేదని, ఫ్రాన్స్, అరబ్ దేశాలలో శైవ మతం వ్యాప్తి పొందిందని మజుందార్ గారు చెప్పారు[2]

## 1.3 శివతత్త్వం

పరమశివుడు లయకారకుడు శివునికి సంధ్యా మారిషుడని పేరు అనగా సంధ్యాకాలంలో నాట్యము చేసేవాడు కాళిదాసాది మహాకవులీ సంధ్యాతాండవాన్ని మేఘసందేశాది కావ్యాల్లో అభివర్ణించగా, మహాశిల్పులు దేవాలయాల గోడలపై మలిచారు శివతాండవ తత్త్వాన్ని విపులీకరిస్తూ ఆచార్య ఆనంద కుమారస్వామి గారు మహాగ్రంథం వ్రాశారు శివ తాండవం నిత్య చలన శీలమైన, పరిణామ శీలమైన ప్రపంచ గతికి సంకేతం! శివుని ఆనంద తాండవం వల్లనే బ్రహ్మ సృజించిన మానవాళికి విజ్ఞానదాయకాలైన అనేక శాస్త్రాలు ఉద్భవించాయి నాట్యము శివప్రీతి కరమని పరమమాహేశ్వరాచార్యవర్యులైన శ్రీమదభినవ గుప్తపాదుల వారు వ్యాఖ్యానించారు నాట్య శాస్త్రము, అలంకార శాస్త్రము, వ్యాకరణ శాస్త్రము ఈ మూడు శాస్త్రాల ఉత్పత్తికి శివుడే మూలకారకుడు శివుని యోగ ముద్ర నుండి యోగ, వేదాంత శాస్త్రాలు మానవాళికి లభించాయి

1 శివప్రీతి కరమైన నాట్యంలో ఉద్ధతమైన తాండవం శివునిది కాగా లలితమైన లాస్యం పార్వతీ దేవి చేసినది ఆనందమే దాని పరమావధి

2 'రసోవైసః రసం హ్యేవాయం లబ్ధ్వా నందీ భవతి' అని తైత్తిరీయోపనిషత్తు (2-7-1) లో చెప్పిన వేదాంత తత్త్వాన్ని అలంకార శాస్త్రానికి అన్వయింప జేసిన రసానందం బ్రహ్మానంద సహోదర మనుటకు శివ తత్త్వమే మూలకారణము

---

*1 బసవపురాణం టీక, పుటలు - 3-16*

2 Evolution of Religion Philosophic culture in India, the cultural Heritage of India, 1956, Vol IV, P-36

3 'నృత్యావసానే నటరాజ రాజో ననాద ఢక్కాం నవ పంచ వారమ్' దీనిచే 'అ ఇ ఉ ణ్ ఋ ఌ క్' యిత్యాది అక్షర సమామ్నాయం పాణిన్యాచార్యులు దర్శించారు. దీనికే మాహేశ్వర సూత్రములని పేరు దీనిచే వ్యాకరణ శాస్త్రం ఆవిర్భవించింది.

4 కాశ్మీర శైవ సిద్ధాంత ప్రవర్తకుడైన ఉత్పల దేవునికి శివుని వల్ల శివసూత్రాలు లభించాయి. దీనిచే కాశ్మీర శైవ మతం వ్యాప్తి గాంచింది

శివుడు స్థితి (static) కీ, గతి (motion) కీ, రెండింటికీ సంకేతం శివునిది ప్రధానంగా యోగ ముద్ర కాగా, విష్ణుమూర్తిది యోగ నిద్ర కాని, విష్ణువు విశ్వపాలకుడుగా చెబుతున్నాం శివ, కేశవుల లో ఈ రెండు తత్త్వాలు అటూ యిటూ తిరుగుతుంటాయి వారిద్దరికీ అభేదం యిందుకే చెబుతారు కాగా, శివతత్త్వం రెండు విధాలు 1 శాంతం 2 వీరం. పై చెప్పబడిన శాస్త్రాలన్నీ శాంతం నుండి పుట్టినవి కావడం చేతనే లోకోప కారకములు దక్షాధ్వర ధ్వంసం చేయడానికి శివుని రౌద్రం నుండి పుట్టిన వీరభద్రుడు, ఆ తర్వాత వీర శైవ మతానికి ఆరాధనీయుడయ్యాడు నంది అవతారంగా బసవేశ్వరుడు జన్మించి వీరశైవమతానికి ప్రవర్తకుడయ్యాడు [1]

14 శైవ మత శాఖలు

శైవ మతంలో సామాన్య, మిశ్ర, శుద్ధ, వీర శైవాలని నాలుగు విధాలున్నాయి కారణాగమంలో దశవిధ శైవాలు పేర్కొనబడ్డాయి కాని, ప్రధానంగా పాశుపతం, లాకుల శైవం, కాపాలిక శైవం, కాలాముఖ శైవం, కాశ్మీర శైవం, వీర శైవం, తమిళ శైవం అనేవి ప్రసిద్ధమైనవి [2]

141 పాశుపత శైవం

దీనిని శ్రీ కంఠుడు ప్రతిపాదించాడు జీవుడు - పశువు - పతి, ఈశ్వరుడు - ప్రకృతి - పాశం అనేభావాలకు (concepts) ఒక

*1 శివతత్త్వమనే శీర్షికలో చెప్పబడిన విషయాలన్నీ డా॥ ముదివేడు ప్రభాకరరావుగారితో జరిపిన సంభాషణవల్ల గ్రహించాను. వారికి నా కృతజ్ఞతలు*

*2 పండితారాధ్య చరిత్ర ఉపోద్ఘాతం - చిలుకూరి నారాయణరావు.*

ముక్తావస్థిత రూపం యివ్వబడినట్లు పాశుపత శైవ మతంలో కన్పిస్తుంది

## 14.2 లాకుల శైవం

ఇది పాశుపతం లోని అంతర్భాగమే దీనిని లకులీశుడు ప్రతిపాదించాడు. సిద్ధాంత రీత్యా ఈ మతం పాశుపత మతాన్ని అనుసరిస్తుంది కాని ఆచార వ్యవహారాలలో కొన్ని మార్పులను చేపట్టింది. దిగంబరత్వంతో బాటు ఈ మతంలో ఊర్ధ్వలింగత్వం, నగ్నత్వం కూడ చోటు చేసి కొన్నదని నిడుదవోలు వారి అభిప్రాయం[2]

## 14.3 కాపాలికశైవం

ఇది కూడ పాశుపతంలోని అంతర్భాగమే కపాలధారియైన మహా భైరవుని (శివుని) పూజించే ఆచారం ఈ మతస్థులలో కన్పిస్తుంది ఈ మతానుసారులను కాపాలికులు అంటారు.

## 14.4 కాలాముఖశైవం

దక్షిణ భారతదేశంలోని అనేక శాసనాల్లో ఈ మత శాఖ వుండినట్లు తెలుస్తోంది తెలుగులో కుమారసంభవ మనే స్వతంత్ర కావ్యాన్ని వ్రాసిన ఒరయూరు పురాధిపతి, టెంకణాదిత్య బిరుదాంకితుడైన నన్నె చోడుని గురువు జంగమ మల్లికార్జునుడు కాలాముఖ శైవ సంప్రదాయానికి చెందిన వాడుగా గుర్తించవచ్చు

## 14.5 కాశ్మీరశైవం

కాశ్మీర దేశంలో పుట్టి వ్యాప్తి పొందినది కాశ్మీర శైవం శివ సూత్రాలను ఉత్పల దేవుడు కనుగొన్నప్పటి నుండి ఈ మతానికి ప్రాతిపదిక ఏర్పడింది ప్రత్యభిజ్ఞా సిద్ధాంతం దీనికి జీవనాడి వంటిది 36 తత్త్వాలను ఈ సిద్ధాంతం పేర్కొంటుంది

## 14.6 వీరశైవం

వీరభద్రుని జననం తో యీమతం పుట్టింది. దీనినే లింగాయత మత మంటారు బిజ్జలుని ఆస్థాన మంత్రియైన బసవేశ్వరుడు 12 శతాబ్దంలో యీ మతాన్ని వ్యాప్తి చేశాడు. వీర శైవం ప

2. పండితారాధ్య చరిత్ర ఉపోద్ఘాతం - నిడుదవోలు వేంకటరావు.

ప్రామాణ్యాన్ని వర్ణాశ్రమ ధర్మాలను అంగీకరించదు.[1] కాని ఈ మతం సమస్త శైవ సిద్ధాంతాల సారాన్ని తనలో యిముడ్చుకొని వ్యాపించినది తాత్త్విక సిద్ధాంతాలను, ఆచరణ మార్గాలను తెలియజేస్తున్నది కొన్ని మార్పులతో కాశ్మీర శైవమే వీరశైవంగా అవతరించినదని కొందరి భావన.[2]

శక్తివికాస రూపమైన శివ సామరస్యాన్ని ఈ జన్మలోనే పొంది ముక్తుడైనవాడు (జీవుడు) శివుడే అవుతాడని తెలియ చేయడం వల్ల ఈ మతానికి వీర శైవం అనే పేరు సార్థకమైంది

ఈమతంలో షట్‌స్థల సిద్ధాంతానికి చాల ప్రాముఖ్యముంది నాడి సంధులలో బలవత్ప్రేరణల కారణంగా వెలరేగే సంక్షోభాలను క్రమంగా నిగ్రహించుకొని ఆత్మ తన పూర్వ జ్ఞానాన్ని పొంది చివరకు శివసాయుజ్యం పొందుతుందని ఈ మతం చెబుతుంది ఈ మతంలో జీవుడు (పశువు) అష్టావరణమే అంగంగా, పంచ ప్రాణంగా, షట్ స్థలమే సాధనంగా గ్రహించి ముక్తి సాధిస్తాడని వీర శైవ మత గ్రంథాలు తెలియ జేస్తున్నాయి

## 1.4.7. తమిళశైవం

తమిళదేశంలో ఈ మతం ప్రారంభమైంది మెయికందర్ ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు అరువత్తుమూవురు శైవ నాయన్మారుల చరిత్రను తెలియ జేసే పెరియపురాణం, మెయికందర్ వ్రాసిన శివ జ్ఞానబోధమ్ అనేవి ఈ మత సిద్ధాంతాలను తెలియ జేస్తాయి గురు శిష్య పరంపరలో రచింపబడిన పదాలు, కృతులు, గేయాలు ఈ శైవ మతానికి మూలమని చెప్పవచ్చు.

## 1.5. శైవ సిద్ధాంతం - దాని ముఖ్య అంగాలు

శైవ మతానికి శైవ సిద్ధాంతమని పేరు ఉపనిషత్తులు దీనికి మూలం శైవ మతం వైష్ణవ మతానికి ప్రతిస్పర్ధిగా వుంటూ క్రీస్తుపూర్వం నుండి భారతదేశంలో విలసిల్లింది అంతేగాక బౌద్ధ, జైన మతాలను

---

*1. డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు - మన మతములు - సంప్రదాయములు, పుట - 29*
*2. విజ్ఞాన సర్వస్వం (7వ సంపుటం), పుట - 699*

ప్రైతం ప్రతిఘటించి విశేష ప్రాముఖ్యం సంపాదించింది డా॥ పోప్ శైవమతాన్ని గురించి విపులార్థవంతము, మూలతత్త్వ గర్భితము శైవ సిద్ధాంతమని పేర్కొన్నారు[1]

శైవ సిద్ధాంతం పశు, పతి, పాశం అనే మూడు ప్రధానాంశాలపై ఆధారపడి వుంది ఈ మూడింటిని పరిశీలిస్తే శైవ సిద్ధాంతం సులభ గ్రాహ్యమౌతుంది

### 1.5 1 పతి (ఈశ్వరుడు)

నామరూప క్రియలు లేనివాడు నిత్యుడు, అనాది, సత్తు, చిత్తు, నిర్మలత్వం, శుద్ధత్వం కలవాడు - శైవ సిద్ధాంతం ప్రకారం శివుడే పతి, పరమసత్యం అతడు అనాదిపురుషుడు మాత్రమే గాక కారణ రహితుడు, లోపశూన్యుడు, సర్వజ్ఞుడు, సంసారబంధ విచ్ఛేదకుడుగా చెప్పబడినాడు

### 1 5 1 1 పతి లక్షణాలు

స్వయంస్థితి గల పతికి ఎనిమిది లక్షణాలున్నాయి పరమ పావనత్వం, అనంత కృప, పరిపూర్ణ శక్తి, అవ్యయానందం, అనుభవ జ్ఞానం, అనంత ప్రజ్ఞ, సంపూర్ణ బంధరాహిత్యం మొదలైనవి

### 1.5 1.2 పతి కార్యాలు

సృష్టి, స్థితి, సంహారం (లయ), అనుగ్రహం, తిరోభావం అనే ఐదంశాలు 'పతి' ప్రధాన విధులు పతి (శివుడు) జగత్తునకు (ప్రకృతి) ప్రత్యక్ష కారణం కాదు అందువల్ల శక్తి ఉపకరణం చేత ముఖ్య విధులు చేస్తాడు కాబట్టి జగత్తునకు ప్రథమకారణం శివుడు, ఉపకరణ కారణం శక్తి, ఉపాదానకారణం మాయ అని చెప్పబడింది.

### 1.5.1.3 పతి అంగం (శక్తి)

శివుడు కాలాతీతుడు సర్వ శక్తి సంపన్నుడు అని చెప్పినా అతడు శక్తి సహాయం తోనే చైతన్యం పొందుతాడు పతి దేహం పంచ మంత్ర పరికల్పితమై పంచ కార్యాలను చేస్తుంది

---

*1 భారతీయ తత్త్వశాస్త్రం, పంచమభాగం, పుట - 369*

శివుడు శుద్ధ చైతన్యం కాబట్టి శివునికి (పతి) జడ పదార్థానికి మధ్య ప్రకృతి సంధాన రూప శక్తి అవుతుంది. ఈ శక్తినే ఉమాదేవి 'శివుని భార్య' అంటారు. ఈ శక్తి ఋగ్వేదంలో సర్వమహా శక్తుల సమాహార మూర్తిగా వర్ణింప బడింది.[1]

శైవ సిద్ధాంతం ప్రకారం శివుని తర్వాత అంతటి శక్తి గల సర్వ జీవ బంధ మోక్ష కారణ ఉపాధి శక్తి అది శివుని ప్రతి బింబమే కాని స్వతంత్రమైనది కాదు. కాబట్టి శైవ సిద్ధాంతంలో శివుడే ప్రధాన దేవత అని, శక్తి సహాయంతో అతడు చైతన్య వంతుడై సృష్టి, స్థితి, లయాది క్రియలను కొనసాగిస్తాడని మనకు తెలుస్తోంది

15.2. పశువు (ఆత్మ లేదా జీవుడు)

ఇది ఆత్మ (ప్రాణం) అని పిలువబడుతుంది ఇది అనేక రూపాలలో నిత్యమై, నిర్మలమై అనాది సంబంధం కలిగి వుంటుంది[2] ఈ అనంత జీవ రూపమైన పశు కోటికి శివుడే పతి జీవులు అనాద్యంతాలగుట వలన పతి వాటిని సృష్టించ లేదు పశువు (ఆత్మ) దేహాని కంటే భిన్నమైంది ఆత్మ స్థూల సూక్ష్మ దేహాలు కలిగి వున్నప్పటికీ దానికి భిన్నమైన ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులను కలిగివుంటుంది

పశువు ఈ సంసారంలో లీనమై భౌతిక ప్రపంచం మీదనే దృష్టి నిలిపి తన ఉనికిని మరచిపోతుంది అందువలన ఈ దేహం తానేనని భ్రమ పడుతుంది తనకు సహజమైన త్రివిధ పాశజాలాలకు లొంగిపోయి పతికి దూరమౌతుంది కాని, మోక్షావస్థలో ఈశ్వరునిపై దృష్టి నిల్పి మోక్ష మార్గాలను అన్వేషించి కడకు మోక్షం పొందుతుంది

శైవ సిద్ధాంతం ప్రకారం అనాది నుండి జీవులు పాశ బద్ధులై నైసర్గిక జ్ఞానేచ్ఛా శక్తులను అంతర్గతంగా కలిగివుంటారు వీటి తిరోధానానికి కారణం బంధం లేదా పాశం అందువల్ల ఈ బంధం తొలగి మోక్షం పొందడానికి 'శివానుగ్రహం' 'పతి ప్రేమ' చాల అవసరం చర్య, క్రియ, జ్ఞాన యోగాదులనే సాధనాల ద్వారా శివానుగ్రహం సాధ్యమౌతుంది

---

*1 విజ్ఞాన సర్వస్వం - సంపుటం 7, పుట - 725*

*2 ఆంధ్రవిజ్ఞానం - సంపుటం 6,*

### 1.5.3. శివాన్ముక్తి సాధనలు

పశువు (జీవుడు) పతి (ఈశ్వరుని) ని చేరడానికి చర్య, క్రియ, జ్ఞాన యోగాలనే ప్రక్రియలు సాధనాలుగా ఉపకరిస్తాయి వీటికి అనుసంధానాలైన దాస, సత్పుత్ర, సహవాస, సన్మార్గాలను జీవులు అనుసరించి పతిని చేరవచ్చు. చర్య, క్రియ, యోగం, జ్ఞానం వీటిని గురించి సంగ్రహంగా తెలుసుకొందాం

#### 1.5.3.1 చర్య

ఇది ప్రాథమిక దశ ఈ దశలో జీవుడు దేవాలయాలలో అర్చనాదులలో పాల్గొని గురు శుశ్రూషల ద్వారా అవిద్య (అణవ మలాన్ని) ను పోగొట్టుకొని వివేక జ్ఞానం సంపాదించాలి దేవునికి సేవ చేస్తూ మోక్ష మార్గం (సాలోక్యం) వైపు పయనించడాన్ని దాసమార్గం అంటారు తిరునావుక్కరసర్ ఈ మార్గాన్ననుసరించే ముక్తి పొందాడు.

#### 1.5 3 2. క్రియ

జీవుడు తానే స్వయంగా శివలింగారాధన, మంత్ర జపం, యాగాదులు మొదలైన ఉపాసనలు కొనసాగించడం వలన తన నిజ స్వరూపాన్ని తెలుసుకోవడం ప్రారంభిస్తాడు ఈ మార్గంలో తండ్రి కొడుకుల మధ్య గల సంబంధాన్ని ఈశ్వరునికి జీవునికి అన్వయింపబడి వున్నందున దీనిని సత్పుత్ర మార్గం అంటారు ఈ మార్గం వల్ల జీవుడు పతి సామీప్యం పొందుతాడు ఈ మార్గాన్ని తిరుజ్ఞానసంబంధర్ అనుసరించాడు

#### 1 5 3.3. యోగం

ఈ మార్గంలో జీవుడు అంతస్థుడగు శివుని కోసం ధ్యాన సమాధులలో పాల్గొన వలసి ఉంటుంది అందుకోసం జీవుడు తన శ్వాసను నియంత్రింప జేసి అరిషడ్వర్గాలను (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు) జయించి దైవ గుణాలు సంపాదించుకోవలసి ఉంటుంది ఈ యోగ మార్గం అనుసరించడం వల్ల పశువు పతితో సారూప్యం పొందుతుంది పరస్పర మిత్ర సంబంధం జీవేశ్వరులకు

ఆపాదింపబడడం వలన దీనిని సహామార్గం అంటారు. సుందరమూర్తి నయనార్ ఈ మార్గం అనుసరించినట్లు తెలుస్తుంది.

1.5.3.4 జ్ఞానం

ఈ మార్గాన్ని అనుసరించే జీవుడు అత్యంత భక్తితో శివునితో ఏకత్వం అనుభవిస్తాడు అంటే అద్వైతభావనతో సంచరిస్తాడని అర్థం ప్రేయసీ ప్రియుల సమాగమం లోని ఏకత్వం వలె జీవేశ్వరులకు అనుసంధానం చెప్పడం వలన దీనిని సన్మార్గం అంటారు మాణిక్య వాచకర్ ఈ మార్గాన్ని అనుసరించాడు

జీవుడు పై మార్గాలలో దేని వల్లనైనా సరే అజ్ఞానం తొలగించు కొని భక్తి ద్వారా పతిని చేరవచ్చునని శైవసిద్ధాంతం జీవుడు పంచమంత్ర పరికల్పితమైన శివుని గూర్చి తెలుసుకొని తాను పంచ శుద్ధుల ద్వారా (భూత, ఆణవ, ద్రవ్య, మంత్ర, లింగ శుద్ధులు) పవిత్రుడై మల పరిపాకం పొందినపుడు శివుడు వాత్సల్యంతో జీవుని బంధాలను తొలగించి తనలో చేర్చు కొంటాడు

పై విషయాలన్నీ పరిశీలిస్తే పశువైన జీవుడు పతి యైన శివుని అనుగ్రహం పొంది పాశరహితుడై శాశ్వతమైన, పునరావృత్తి రహితమైన సాయుజ్య మనే మోక్షం పొందడమే శైవ సిద్ధాంత లక్ష్యం అని స్పష్టమౌతుంది ఇది యింతటి పురాతనమైన మతం కాబట్టే నాటి నుండి నేటి వరకు ఎన్నో మతాలను ఎదుర్కొని శాశ్వతంగా నిలబడ గల్గింది ఇట్టి మతానికి ఆలంబన మైనదే శ్రీ కాళహస్తి క్షేత్రం!

'శంభో! స్వస్య కుతూహలస్యకరణం మచ్చేష్టితం నిశ్చితమ్
తస్మాన్మామక రక్షణం పశుపతే! కర్తవ్యమేవ త్వయా!'

'కథం రాజ్ఞాం ప్రీతిర్భవతి మయి కోఽహం పశుపతే
పశుం మాం సర్వజ్ఞ! ప్రథిత కృపయా పాలయ విభో!'

'మహాదేవం దేవం మయి సదయభావం పశుపతిమ్
చిదాలంబం సాంబం శివమతి విడంబం హృదిభజే'

-శివానందలహరి, శ్లో 66, 5, 2

# ద్వితీయాధ్యాయం

## శ్రీకాళహస్తి క్షేత్ర చరిత్ర - సంస్కృతి

### 2.0 ప్రస్తావన

తరతరాలుగా లభిస్తున్న పౌరాణిక, చారిత్రక ఆధారాల ద్వారా శ్రీకాళహస్తీశ్వర దేవాలయానికి సంబంధించిన, ఆ క్షేత్ర మత, సాంస్కృతిక పరిణామాన్ని గురించి ఈ అధ్యాయంలో వివరించడానికి ప్రయత్నించడం జరిగింది

ఒక దేవుడు లేదా ఒక దేవత యొక్క మాహాత్మ్యాన్ని ఆనాటి కవులు తమకు లభించిన చారిత్రకాంశాలకు, దైవ సంబంధమైన అంశాలను జోడించి ప్రజలలో వ్యాప్తి చేయడమే భారతీయ సంస్కృతి ముఖ్య లక్షణం కానీ చరిత్ర జరిగిపోయిన సంఘటనలు, కాల, స్థలాలను గురించి తెలుపుతుంది ఈ చరిత్ర సహాయం తోనే రాబోవు తరంవారు తమ పూర్వీకుల సంప్రదాయాలు, ఆచారాలు, ఆహారపుటలవాట్లు, వేషధారణ, ఆభరణాలు, దేవతలు, మతం యింకా మరెన్నో అంశాలను గురించి తెలుసుకోగలుగుతున్నారు పురాణాలు మత దర్శాలను వ్యాప్తి చేయగా, చరిత్ర గడచిన సంఘటనలను తెలియ జేస్తుంది పురాణాలలో చారిత్రక విషయాలు కనిపించక పోయినప్పటికీ చరిత్రలో పౌరాణిక పాత్రలు, వివిధ మతసిద్ధాంతాలు, ధర్మావతరణ మొదలైన అంశాలు ఒకరికా మనకు కనిపిస్తాయి

దక్షిణ భారత దేశాన్ని పాలించిన రాజవంశాలలో పాండ్యులు, చోళులు, మదుర నాయక రాజుల పేర్లు శ్రీ కాళహస్తికి సంబంధించిన గ్రంథాలలో పేర్కొన బడి వుండడం వల్ల ఈ గ్రంథాలు చరిత్రతో ఎక్కువ విభేదించడం లేదు స్కాందపురాణం లోని శివరహస్యఖండ మనే అధ్యాయంలో ఈ విషయం ప్రస్ఫుట మౌతున్నది శ్రీకాళహస్తి స్థలపురాణాలలో స్థానిక పాలకుడైన వీర నరసింహ యాదవరాయుని పేరు పేర్కొనబడి వుండడం వల్ల యిది చారిత్రక విషయమనే అభిప్రాయాన్ని కలుగచేస్తూ ఉంది

### 2.1 వీర నరసింహ యాదవరాయ పురాణం

ఈ పురాణం శ్రీకాళహస్తీశ్వరునితో నారాయణవనాన్ని పరిపాలించిన యాదవ వంశీయుడైన శ్రీ వీరనరసింహ యాదవరాయునికి గల సంబంధాన్నే గాక ఆ రాజ సభానర్తకి తో గల సంబంధాన్ని కూడా

తెలుపుతోంది కాంతి మతి అనే రాజనర్తకి గొప్ప శివ భక్తురాలు ఆమె జంగమ దేవరను దైవ స్వరూపంగా భావించి అతనికి ఆతిథ్యం యివ్వనిదే తన దినచర్యను ప్రారంభించేది కాదు. ఒక రోజు ఆమె ఈ సేవాకార్య క్రమంలో నిమగ్నురాలై రాజసభకు హాజరు కావటం మరచిపోయింది ఫలితంగా ఆమెను సౌందర్య విహీనురాలిని చేయడానికై రాజు ఆమెకు శిరోముండనం చేయించి శిక్షిస్తాడు ఆమె భక్తికి మెచ్చిన శివుడు ఆమెకు యథాపూర్వంగా శిరోజముల కల్పిస్తాడు దీనిని గమనించిన రాజు ఆమె పూజించిన జంగమదేవర శివుడు తప్ప అన్యుడు గాడని గ్రహించి క్షమించమని వేడుకొంటాడు ఆ సంఘటన పర్యవసానంగా రాజు శివునికీ, జ్ఞానప్రసూనాంబకు దేవాలయ నిర్మాణానికి పూనుకొంటాడు

ఈ గ్రంథం పౌరాణిక ప్రాముఖ్యం గలదైనా ఆ కథలో చెప్పబడిన రాజు చారిత్రక ప్రాముఖ్యం గలవాడు నారాయణవనాన్ని యాదవరాయ వంశస్థులు పరిపాలించినట్లు చరిత్ర చెబుతోంది ఆంధ్రదేశం లోని సంస్కృత కవులు క్షేత్ర ప్రాశస్త్యాన్ని యినుమడింప జేయడానికై పౌరాణిక, చారిత్రక విషయాలను జోడించినారు క్రీశ 12వ శతాబ్దానికి చెందిన యాదవరాయ వంశస్థులు శ్రీ కాళహస్తికి సంబంధించిన పురాణాలలో పేర్కొనబడివున్నారు

క్రీశ 12వ శతాబ్దంలో దక్షిణ భారత దేశంలో వీర శైవం ఎక్కువ ప్రాచుర్యాన్ని పొందింది ఈ పురాణంలో తెలుప బడిన వీర నరసింహ యాదవ రాయలు ఆ సమయంలో ఆ ప్రాంతాన్ని పరిపాలిస్తూ వుండిన వీర నరసింహ రాయలుగా గుర్తింప బడినాడు శైవ మతంలో శాక్తేయ, తాంత్రిక పూజాపద్ధతులు చోటు చేసికొన్నపుడు కొంతమంది చారిత్రక పురుషులకు మాహాత్మ్యాన్ని ఆపాదించి పురాణాలలో పేర్కోవడం సర్వసాధారణమైన విషయంగా కనబడుతోంది దీనికి చక్కని ఉదాహరణ బసవపురాణం దానిలో ఒక సామాన్య వ్యక్తి, శైవ మతంలో విప్లవాత్మకమైన మార్పును తీసుకొని రాగలిగాడు దానినే 'వీర శైవ' మంటారు

వీర నరసింహ యాదవరాయలు యిటుకలతో 'యాదవ గిరిజ గుహ', 'చంద్ర గుహ' భైరవునికి అతని అనుచరులకు గుళ్లు గోపురాలు, ప్రాకారాలు, నాట్యమంటపాలు నిర్మింప జేశాడు ఈ కారణం వల్లనే వీర నరసింహ యాదవరాయని పేరు శ్రీ కాళహస్తి పురాణంలో చోటు చేసికొన్నది 'రాజు' యొక్క రూపాంతరమే 'రాయ' గా

చెప్పబడి యుండవచ్చు. పై కారణాల వల్ల ప్రాచీన పురాణాలకు, చారిత్రక వివరణలకు మధ్య దగ్గర సంబంధం ఉండవచ్చని ఊహింపబడుతోంది

శ్రీకాళహస్తి క్షేత్రంలో ఆవాడు నిర్వహింప బడిన ఆశ్రమాలు, నిర్మింప బడిన గుళ్లు, గోపురాలు, తీర్థాలు, త్రవ్వబడిన చెఱువులు, బావులు, తటాకాలు, అగ్రహారాలు, పాఠెములు, పశుశాలలు, అన్నదాన సత్రములు, వీటి యొక్క అవ శేషాలు నేటికీ కన్పిస్తున్నాయి

నిర్దిష్టమైన ఆధారాలు లభ్యం కాకపోవడం వలన ఈ దేవాలయ నిర్మాతల గురించి ఖచ్చితమైన వివరాలు చెప్పడానికి వీల్లేదు గర్భ గుడి నిర్మాణ శైలి, అందలి శిల్పాలలో పల్లవ సంప్రదాయ లక్షణాలు గోచరిస్తున్నాయి పల్లవ రాజులకు సామంతులుగా ఉండిన స్థానిక పాలకులు గర్భ గుడి నిర్మించినట్లు తరువాత క్రీ శ 12వ శతాబ్దానికి చెందిన వీర నరసింహరాయులు గోపురాలు, ప్రాకారాలు నిర్మించి వుంటాడని చెప్పవచ్చు

## 2.2. భక్తకన్నప్ప కథ

భక్త కన్నప్పను గూర్చి అనేక [illegible] లభిస్తున్నాయి శృంగేరి మఠాధిపతి శ్రీశ్రీశ్రీ విమలానం[illegible]చే రచింప బడిన శ్రీ కాళహస్తి మాహాత్మ్య మనే గ్రం[illegible] త్రేతాయుగంలో కన్నప్ప శ్రీకాళహస్తీశ్వరుని అనుగ్రహం [illegible] సాయుజ్యం పొందినట్లు చెప్పబడింది కాని, శ్రీ మవి సీతారామయ్య, వవి వేణుగోపాల్ గార్లచే వ్రాయబడిన ఈశావాస్యోపనిషత్తు పీఠికలో ద్వాపర యుగం నాటి అర్జునుని అంశమే (spark) కన్నప్ప అని చెప్పబడి వుంది అర్జునుడు శివానుగ్రహం వలన పాశుపతాస్త్రం పొందినట్లు కలియుగంలో తిన్నడు లేదా కన్నప్ప పేరుతో మోక్షము పొందినట్లు చెప్పబడింది శ్రీ ధూర్జటిచే రచింపబడిన శ్రీకాళహస్తి మాహాత్మ్యములో 'ఫల్గునుడు తిన్నడై పుట్టి పడసె ముక్తి!' అనే పద్యపాదం పై విషయాన్ని బలపరుస్తూ ఉంది

కన్నప్ప ఒక కర్మయోగి శ్రీకాళహస్తీశ్వర దేవాలయంలోని కన్నప్ప విగ్రహం, కిరీట గాండీవాలతో చెక్కబడింది ఆ విగ్రహం యొక్క ముఖంలో రాజసం, కార్యసాధనలో పట్టుదల ద్యోతకమవుతున్నాయి ఇవి కన్నప్ప తన పాత జ్ఞాపకాలను మననం చేసుకొంటున్నట్లుగా వుంది ఇలా ఈ విగ్రహంలో కర్మ యోగి కన్నప్ప దర్శన మిస్తున్నాడు

## 2.3 శ్రీకాళహస్తి దేవాలయ నిర్మాణ చరిత్ర

శివ, స్కాంద పురాణాలలో శ్రీకాళహస్తి ఒక పవిత్ర క్షేత్రంగా గుర్తింపబడి దాని ప్రాముఖ్యాన్ని గూర్చి వర్ణింపబడివుంది దీనిని బట్టి శ్రీ కాళహస్తి పౌరాణిక కాలం నుండి ప్రముఖమైన కేంద్రంగా విలసిల్లిందని విదితమౌతోంది

క్రీశ 2వ, 3వ శతాబ్దాలలో తమిళ దేశానికి చెందిన శైవ నాయన్మారులు అప్పర్, సుందరర్, తిరుజ్ఞాన సంబందర్, మాణిక్యావాచకర్ మొదలైన వారు ఈ క్షేత్రాన్ని సందర్శించి దాని ప్రాముఖ్యాన్ని గురించి భక్తితో గానం చేసి వున్నారు

శ్రీ ఆదిశంకరాచార్యులు ఈ క్షేత్ర సందర్శనానంతరం తన శివానందలహరిలో భక్తకన్నప్పను ఉదాహరించడమే గాక ఆ క్షేత్రంలో భువనేశ్వరీ దేవి పీఠాన్ని, స్ఫటిక లింగాన్ని ప్రతిష్ఠించినారు

గిరిజన ప్రాంతంలో ఈక్షేత్రం నిర్మింపబడి వుండడం వల్ల క్రీశ 5, 6 శతాబ్దాల దాకా దీని పోషణ గూర్చి ఎవరూ తమ దృష్టిని కేంద్రీకరింప లేక పోయారు కాని, దక్షిణ భారతదేశంలో పల్లవుల రాకతో అద్భుతమైన శిల్పకళా ఉద్యమం రాజకీయంగా, ప్రాంతీయంగా అభివృద్ధి చెందింది ఆనాడు దేవాలయ నిర్మాణం త్వరగా పాడయిపోవు కలప, రెల్లు, మట్టితో నిర్మింప బడేవి క్రీశ 3వ శతాబ్దంలో పల్లవ రాజ్యం అంతమయింది. తరువాతి కల్లోల కాలంలో ఒక శతాబ్దం పాటు ఎటువంటి సాంస్కృతికాభివృద్ధి జరుగ లేదు దక్షిణ భారతదేశ చరిత్రలో ఈ కాలాన్ని చీకటి యుగ (Dark Period) మంటారు భక్తి ఉద్యమం (Bhakti cult) ప్రారంభమయ్యేదాకా శ్రీ కాళహస్తి క్షేత్రం స్థానికంగా పలుకుబడి కలిగియున్న ఆటవిక నాయకులచే ఆదరింప బడుతుండేది దక్షిణ భారతదేశంలో జైన, బౌద్ధ మత ప్రభావాలను తగ్గించడానికై శైవ నాయనారులు, వైష్ణవ ఆళ్వారులు, పల్లవులు ఏకకాలంలో ఈ క్షేత్రాభివృద్ధికై పాటుబడ్డారు

శిల్పం ద్వారా, శిలా శాసనాల ద్వారా లభ్యమైన ఆధారాలను బట్టి క్రీశ 9వ శతాబ్దిలో పల్లవ, చోళ రాజులు ఈ క్షేత్రంలో దేవాలయాన్ని నిర్మించినట్లు తెలుస్తోంది

కులోత్తుంగ చోళుడు ఈ దేవాలయ గోపురాన్ని నిర్మించాడు ధూర్జటి రచించిన శ్రీకాళహస్తి మాహాత్మ్యము వలన వీర నరసింహ యాదవరాయులు హేమ, గిరిజ గుహ, భైరవ గుహ అనే సదనాలను,

గోపుర మంటపాదులను నాట్య మందిరాన్ని యిటుకలతో నిర్మించినట్లు తెలుస్తోంది క్రీ.శ 16వ శతాబ్దంలో శ్రీకృష్ణదేవరాయలు ఒక మంటపాన్ని నిర్మింప జేశాడు. దీనినే 'రాయల మంటపం' అంటారు గోల్కొండ రాజ్య మంత్రులైన అక్కన్న మాదన్నలు తమ పేరతో ఇక్కడ శివ లింగాన్ని [illegible] క్రీ.శ 19వ శతాబ్దంలో [illegible] ఈ దేవాలయాన్ని పునరుద్ధరింప జేశారు 1954లో శ్రీకంచి కామకోటి పీఠాధిపతులు శిథిలావస్థలో వున్న నటరాజ రంగస్థల మంటప నిర్మాణానికై విరాళాన్ని యిచ్చారు

దక్షిణకాశి అని పిలువబడే ఈ క్షేత్రంలోని శ్రీకాళహస్తీశ్వర స్వామి మహిమలు, తెలిపే గాథలు రాయల చెరువు ప్రాంతంలో సంప్రదాయకపు పాటల వల్ల తెలుస్తోంది

శ్రీకృష్ణదేవరాయలు దేవాలయాలు, పుణ్యక్షేత్రాలు నిర్మించడమే గాక ప్రజల సౌకర్యార్థం పొలాలకు నీటి పారుదల సౌకర్యం కల్పించడానికి చెరువులను నిర్మించి కాలువలను త్రవ్వించాడు స్వర్ణముఖి నదికి వరదలు వచ్చి చెరువు కట్ట తెగినప్పుడు ఆ నీరు రాయగోపురం మీద కూర్చున్న పక్షి త్రాగేదట [illegible] చెరువు అంతటి పెద్ద చెరువు రాయ గోపుర మంతటి [illegible] గోపురం శ్రీ కాళహస్తి పరిసర ప్రాంతాలలో ఎక్కడా [illegible]

నీటి పారుదల సౌకర్యానికై [illegible] రాయల చెరువును [illegible] ఆ ప్రాంత ప్రజల [illegible] భగవంతుని మీద గల నమ్మకాన్ని, ఆత్మ త్యాగాన్ని, ఆత్మ సంబంధమైన విలువల్ని, స్వామి వారి మహిమల్ని చాటి చెబుతున్నాయి

చెరువు నిర్మాణానికై ఉపయోగించిన బండరాళ్లు మానవ మాత్రులు కదల్చడానికి సాధ్యంకానంత పెద్దవిగా వున్నాయి పని చేసిన రోజున పనివారు ఇసుకను కుప్పలుగా పోసేవారు ఆ కుప్పలను తెరచి చూడగా వారు చేసిన పనికి తగినంత బంగారము లభించేదని ఐతిహ్యం రాయల చెరువు ప్రాంతపు ప్రజలు ఈ కథలను తెలుపుతూంటే ఆ కాలం సత్య ధర్మాలకు ఎట్టి ప్రాముఖ్య ముండేదో తెలిసికోవచ్చు

చారిత్రాత్మక ప్రమాణాలు లేకపోయినా ఆ ప్రాంతాన్ని పరిపాలించిన రామరాజు కాలంలో కొన్ని అభివృద్ధి కార్యక్రమాలు జరిగాయని నమ్మవచ్చు రామరాజుకు ఒక యౌవనవతియైన కూతురుండేది ప్రజలు వాత్సల్యంతో ఆమెను రాయులమ్మ అని పిలిచే వారు ఒకసారి అధిక వరాల వల్ల చెరువు కట్టు తెగింది రామరాజు ఆ

తెగిన ప్రాంతాన్ని పరి చేయించి తన భవనానికి వెళ్ళివాడు మరల చెఱువు కట్ట తెగింది. మరల దానిని సరిచేసినా పదే పదే చెఱువు కట్ట తెగుతూ వచ్చింది దానిని పూడ్చడానికి చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనాయి రాజు వికల మనస్కుడై శ్రీకాళహస్తీశ్వరుని స్మరిస్తూ పడుకొంటాడు కలలో కాళహస్తీశ్వరుడు కన్పించి రాకుమార్తెకు ఏడు గడియల లోపల వివాహం చెయ్యి లేదా గండి పడిన చోట రాకుమార్తెను పూడ్చినచో చెఱువుకు గండి పడదని ఆజ్ఞాపించాడు ఉత్తరోత్తరం ఆ గండి పడిన ప్రాంతానికి 'రామరాజుగండి' అని పేరు ఏర్పడుతుందని చెప్పాడట రామరాజు తానమితంగా ప్రేమించే ఏకైక పుత్రిని త్యాగం చేయలేక డోలాయమాన మానసుడయ్యాడు దైవాజ్ఞ ప్రకారం ఆమెకు ఏడు గడియల లోపల వివాహం చేయటం కూడా దుస్సాధమని భావించాడు

కాని, త్వరలోనే అతని దుఃఖము తీరింది కనకవల్లి ఈ విషయాన్ని తెలిసికొని తండ్రి వద్దకు వెళ్ళి, ప్రజలందరినీ తన కన్న బిడ్డలుగా పరిపాలించే రాజు యొక్క ప్రజల యొక్క యోగ క్షేమం కోసం తాను ప్రాణపరిత్యాగం చేయడానికి సమ్మతిని తెలిపింది అంతేగాక తానే స్వయంగా గండి వద్ద నిలబడి గండిని పూడ్చమని తండ్రి నడిగింది కాని రామరాజు అందులకు అంగీకరించ లేదు అందులకు కనకవల్లి ప్రజల్ని కన్న బిడ్డలగా రక్షించే వాడే రాజని, అట్లు చేయని వాడు చరిత్రపుటలలో పనికిమాలిన వాడుగా నిలిచిపోతాడని తెలిపింది త్యాగము చిరకాలం నిలిచిపోతుంది బిడ్డల క్షేమానికై ఒక్క బిడ్డను త్యాగం చేయుటంలో తప్పు లేదనింది గత్యంతరం లేక రామరాజు ఆమె మాటను మన్నించి దైవాజ్ఞ ప్రకారము గండిని పూడ్చించాడు తరువాత ఎప్పటికిని ఆ చెఱువుకు గండి పడలేదు గండి పడిన ప్రాంతం నేటికిని గుర్తింపవచ్చు అదే 'రామరాజు గండి'గా పిలువబడుతోంది

రాయల చెఱువుకు ఒక ఫర్లాంగు దూరంలో ఆంజనేయ దేవాలయం నిర్మింప బడింది ఈ దేవాలయం ప్రక్కనే శివ లింగానికి, పార్వతీ దేవికి, నవ గ్రహాలకు కూడా ఆలయాలు వున్నాయి ఇచట శివ పూజకే ప్రాముఖ్యం శివాలయంలో ఆంజనేయ స్వామి విగ్రహ స్థాపనమే యిచ్చటి ప్రత్యేకత చెఱువు నిండితే వెనుక భాగంలో వున్న ఏడు గ్రామాలు చెఱువు నీటితో మునిగి పోయే ప్రమాదముంది ఆ విధంగా జరిగినప్పుడు ఆ గ్రామాల ప్రజలు సమీపంలోని కొండ గుట్టపై ఆశ్రయం పొందేవారు.

ఒకసారి చెఱువుకట్ట తెగినట్లు పుకారు వ్యాపించింది. ప్రజలు ప్రాణభీతితో కొండ గుట్టలపై కెక్కినారు. అంజనేయ దేవాలయ పూజారి దీని కెంతో కలత చెందాడు. కనకవల్లి త్యాగాన్ని జ్ఞప్తికి తెచ్చుకొని శ్రీ కాళహస్తీశ్వరుడు యిచ్చిన మాట వమ్మయి పోవునా" అని అనుమానించాడు. అటువంటి విపత్తునకు ఆస్కారము లేదని తలంచాడు. శ్రీకాళహస్తీశ్వరుని స్మరించి నిద్రించాడు.

శ్రీ కాళహస్తీశ్వరుడు అంజనేయుని చెఱువులోనినీరు బయటికి వెళ్లి గట్టుమీది ఒత్తిడి తగ్గుటకై చెఱువు తూము వాకిటను తెఱువుని ఆజ్ఞాపించినట్లు, ఆంజనేయుడు దైవాజ్ఞను మన్నించి తూము కడ్డముగా నున్న పెద్దబండరాయిని కొలగించినట్లు చెఱువులోని నీరు బయటికి పెద్ద శబ్దంతో వెళ్లినట్లు అతడు కలగన్నాడు.

ఆ పూజారి మేల్కొని చెఱువులోని నీరు తూముగుండా బయటకు పోవుచున్న తీరు చూచి ఆశ్చర్యచకితుడయ్యాడు. చెఱువులోని నీటి మట్టము తగ్గుటతో అపాయము జరుగుననే భీతి తొలగిపోయింది. అతడు స్థిమితపడి, గ్రామ ప్రజలను పిలిచి తన కలను గురించి, జరిగిన సంఘటన గురించి తెలియజెప్పాడు. గ్రామస్థులెంతో సంతోషించారు. ఆ సంవత్సరం శివరాత్రిని చాలా ఉత్సాహపూరితంగా జరుపుకొన్నారు.

భారతీయులలో చరిత్ర లేఖనం పట్ల ఎక్కువ ఆసక్తి లేకపోవడం వల్లనే పురాణాలలో చరిత్రకు సంబంధించిన విషయాలు ఎక్కువ లేవు. పురాణ కాలానికి చరిత్ర కాలానికి మధ్య గల కాలాన్ని చీకటి యుగంగా భావిస్తారు. భారతీయులు మేల్కొని చరిత్ర సంఘటనలు వ్రాయటం ప్రారంభించినప్పటికి చాల కాలం గడిచిపోయింది. ఫలితంగా భావితరాల వారికి అందించవలసిన అనేక విషయాల సంఖ్య తగ్గిపోయింది. ఈ కారణం వల్లనే పౌరాణిక కాలానికి, చారిత్రక కాలానికి మధ్య ఎంతకాలం గడిచిపోయిందో తెలుసుకోవడానికి తగిన ఆధారాలు లేవు.

శ్రీకాళహస్తీశ్వర దేవాలయ నిర్మాణం పౌరాణిక కాలంలో జరిగినట్లు తెలుస్తుండగా, చరిత్రలోని సంఘటనలు దేవాలయ నిర్మాణం క్రీ.శ.9 వ శతాబ్దిలో జరిగినట్లు తెలుపుతున్నాయి.

## 2.4 మతసంబంధకేంద్రంగా శ్రీ కాళహస్తి

భారతదేశం పవిత్రమైన నదులకు, పుణ్యక్షేత్రాలకు, ఆశ్రమాలకు, మత సంబంధమైన పీఠాలకు, మఠాలకు నిలయంగా ఉన్నది. భారతీయ సంస్కృతిలో ఈ సంప్రదాయం పూర్వం నుండి యిప్పటివరకు కనబడుతూనే వుంది. దక్షిణభారతదేశాన్ని పరిపాలించిన అనేక రాజవంశీకులకు వున్న మతాభినివేశం వల్లనే ఈ ప్రాంతం శిల్ప కళలతో కూడి అనేక దేవాలయాలకు, మిక్కిలి ఎత్తైన గుళ్లు, గోపురాలకు నిలయమై ఉంది. ఈ దేవాలయాలు ప్రజల మత సాంస్కృతిక విషయాలకు ప్రతీకగ నిలిచి ఉన్నాయి. శ్రీకాళహస్తి దేవాలయం కూడా అటువంటి ప్రాచీన నిర్మాణాలలో ఒకటి. ఈ దేవాలయ నిర్మాణంలోని వైలక్షణ్యం, విశిష్టత మరెక్కడా కానరాదు. శ్రీ కాళహస్తీశ్వరుని గర్భగుడి, లోపలి ప్రాకారం, బయటి ప్రాకారం గురించి పరిశీలించగా ఈ దేవాలయ నిర్మాణ చరిత్రలో గల పరిణామక్రమాన్ని తెలియ జేస్తుంది.

ఈ దేవాలయ నిర్మాణ విస్తరణ కేవలం ఉత్తర, దక్షిణ, పశ్చిమ దిశలవైపు మాత్రమే సాగినది కాని, పర్వతం అడ్డుగా ఉండడం వల్ల తూర్పువైపుకు సాగలేదు. పడమటదిశవైపు చూపుగలిగిన గర్భగుడి ఎటువంటి అలంకారాలు లేకుండ పల్లవులనాటిశైలిని పోలివుంది. దీనివలన ఈ దేవాలయం పల్లవుల కాలము నాటిదని తెలుస్తుంది. ఈశ్వరుని గర్భగుడికి ఈశాన్య దిక్కున నాలుగుమీటర్ల దూరంలో అమ్మవారి గుడి నిర్మింపబడివుంది. ఈ సన్నిధిలో నెలకొన్న దేవిని జ్ఞానప్రసూనాంబ అని పిలుస్తారు. అమ్మవారి సన్నిధి తూర్పు వైపుగా వుంది. నిర్మాణంలో అమ్మవారిసన్నిధికీ, ఈశ్వరునిసన్నిధికి భేదం గోచరిస్తుంది.

ఈశ్వరుని సన్నిధి భిత్తికల వెలుపలి భాగంపై కనుపించే అద్భుత చిత్రములైన కూట పంజరశాల వరుసలు, తామరపు మొగ్గల చిత్రములు, దేవి యొక్క మహిషాసురమర్దనీ రూపం, ముఖద్వారమున కిరువైపుల గల గణపతి, కుమారస్వాముల శిల్పాలు తరువాత నిర్మింపబడినవని తెలుస్తున్నాయి. స్తంభాలకు చివరల చెక్కబడిన తామర మొగ్గలు, భిత్తుల మీద గల

అందమైన రంగవల్లులు పాండ్య విజయనగర రాజుల కాలం నాటివని తెలుపుతున్నాయి. పై రెండు శిల్పకళావిశేషాలు పాండ్య విజయనగర రాజుల కాలము నాటివైనట్లే, స్త్రీ దేవతామూర్తులకు ప్రత్యేక దేవాలయ నిర్మాణం చోళరాజుల కాలం నుండి అభివృద్ధి చెందినట్లుగా తెలుస్తోంది. దేవాలయ ప్రధాన నిర్మాణంలో గల మంటపాలు, విశాలమైన వరాండాలలో గల శిల్పపు పని సేతలు ఆనాటి శిల్ప కళారీతిని బహిర్గతం చేస్తుంది. చతురస్రపు గుండని స్తంభములు చోళుల కాలము నాటివిగను, తామరమొగ్గల శిల్పము గల్గిన స్తంభములు పాండ్య విజయనగర రాజుల కాలము నాటివిగను తెలుస్తుంది.

క్రీ శ 18 వ శతాబ్దంలో తమిళనాడుకు చెందిన నాటుకోటి చెట్టియార్ లోపలి ప్రాకారంలో గల శివాలయం,దేవీ ఆలయాలకు, మంటపాలకు నాలుగు వైపుల వసారాలు కట్టించి వాటి కొక రూపాన్ని ఏర్పరచినారు. అందలి పెద్ద స్తంభాలపై చెక్కబడిన తామర మొగ్గలు గల అలంకరణాలు ఆ వసారా యొక్క హుందాతనాన్నీ అందాన్నీ తెలియజేయడమేగాక శివ, పార్వతులను ప్రదక్షిణ చేసికొనుటకు, ఉత్సవ మూర్తులను దర్శించుకొనుటకు అవకాశం కల్పిస్తుంది.

పశ్చిమదిశలో శ్రీ వళ్లీ దేవసేనలతో కూడిన సుబ్రహ్మణ్యస్వామి విగ్రహములు, భక్త కన్నప్ప, వివిధ పరిమాణములలోని శివలింగములు, ఉత్తర దిశలో అరువది ముగ్గురు నాయన్మారుల విగ్రహములు, కాల భైరవస్వామి విగ్రహము, తూర్పువైపున స్ఫటిక లింగములతో పాటు అనేక విధములైన శివలింగములున్నాయి.

దక్షిణపు వైపున ప్రాకార ప్రవేశ ద్వారము ఏడు మీటర్ల ఎత్తు గలిగి యున్నది. సరియైన ఆధారము లభ్యంకాక పోవడం వల్ల ముఖ్యద్వార గోపురాలు స్థానిక పాలకులచే నిర్మింప బడినట్లు అనుకొనవచ్చును. తరువాత వచ్చిన చోళ, విజయనగర రాజుల కాలంలో ప్రధాన ద్వార గోపురములు అనేక స్తంభములతో కూడిన మంటపములు నిర్మింపబడినట్లు తెలుస్తుంది.

లోపలి రాజప్రాసాదమునకు దక్షిణాభిముఖంగా నున్న ప్రవేశ ద్వారము వరుసలో 30 మీటర్ల దూరములో పది మీటర్ల ఎత్తుగల మరియొక గోపురం ఉంది. ఇది దక్షిణ గోపురముగా పిలువబడుతున్నది. దీని నిర్మాణ విషయం గురించి యిట్లూహింపవచ్చు. తిరుపతి సమీపమున గల తిరుచానూరులో ఎల్లపరము పరమేశ్వరాలయము వద్ద క్రీ. శ 1070 కి సంబంధించిన ఒక శిథిల శిలా శాసనము వలన నిర్వహణ సంఘ సభ్యులైన ధర్మకర్తలు శ్రీకాళేశ్వరుల దేవాలయమునకు దక్షిణ భాగంలో ఒక కొలను త్రవ్వించినట్లు తెలుస్తోంది. ఈ శిలాశాసనం లో గల "దక్షిణ" అనే పదం వలన ఈ గోపురం క్రీ.శ 1070 లో స్థానత్తార్ (Sthanattar) నిర్మింప బడినట్లు చెప్పవచ్చును. ఈ దక్షిణ గోపురం, లోపల ఉత్తరాభిముఖంగా ఉన్న ప్రాకార గోపురం నేడు ఉత్తరదిశగానున్న ద్వారము అభివృద్ధి చెందడానికి ముందు దక్షిణదిశలో ప్రధానద్వారంగా వుండేదను అభిప్రాయాన్ని కలిగిస్తున్నది.

దక్షిణ గోపురానికి వాయువ్య దిశలోను, లోపలి రాజప్రాసాదానికి నైఋతి దిశలోను శ్రీకృష్ణదేవరాయల నూరు స్తంభాల మంటపము, అచ్యుత రాయల మంటపములున్నాయి. వీటిలో క్రీ.శ 1516 లో నిర్మించబడిన శ్రీకృష్ణదేవరాయ మంటపము మిక్కిలి రమణీయంగా వుంది. ఇందలి భవన నిర్మాణశైలి, శిల్పము శ్రీకృష్ణ దేవరాయ కాలము నాటి కళావైభవాన్ని చాటుతోంది. ఇందలి పెద్ద స్తంభాలపై ముందు కుదుటుమున్న గుఱ్ఱములు చెక్కబడి వున్నాయి. ఆ గుఱ్ఱములపై ఒక చేతిలో ఖడ్గము, మరయొక చేతిలో కళ్ళెము పట్టుకొన్న రౌతులు హిందూ సంస్థలను నాశనము చేయుచున్న ముస్లిముల పైకి దండెత్తిపోవుచున్నారా అన్నట్లు చెక్కబడి వున్నాయి.

స్తంభముల మీద చెక్కబడిన శిల్పము పురాణ సంబంధమైనదే కాక, శైవ వైష్ణవ దేవతలు, మునులు, విష్ణుమూర్తిదశావతారములు గలిగి వున్నాయి. అయితే శైవానికి ప్రాముఖ్యం చూపడానికి మంటపం నాలుగుమూలల అంచులపై శివుని వాహనమైన నంది అలంకరింపబడి వుంది. హిందూమత

హాని. శివ, పార్వతుల అభిషేకానికి లోపలి ప్రాకారం లోని గర్భగుడికి వాయువ్యదిశలో వున్న బావి నీరే వాడేవారు.

బయటి ద్వార గోపురం వద్ద గల నాటుకోట చెట్టియార్ విగ్రహం ఈ దేవాలయ నిర్మాణానికై అతడు చేసిన కైంకర్యాలకు చిహ్నంగా ఏర్పాటు చేయబడింది. ఈ నిర్మాణం చాల చిన్నదైనా మత సంబంధమైన జిజ్ఞాస గల్గిన సందర్శకుల దృష్టిని ఎంతో ఆకర్షిస్తుంది. ఈ గోపురం మూడంతస్తులు గలిగి, ప్రతి అంతస్తు స్తంభంపై సమకోణాకారపు అలంకరణలు గలిగివున్నాయి. ప్రతి అంతస్తులోని ఉపరిభాగం శిల్పంతో కూడిన ఘటాలతో కూర్చబడి ఉన్నాయి. మొదటి అంతస్తు నందలి ఎడమ వైపున నందీశ్వరుని అధిరోహించిన శివపార్వతులు, కుడివైపున అమృత కలశం కోసం క్షీర సాగరాన్ని మధించుచున్న దేవ, దానవుల విగ్రహాలు ఉన్నాయి. మిగిలిన అంతస్తులలో గణపతి, కుమారస్వామి, సుందరమూర్తి రూపంలో శివుని విగ్రహం ఉన్నాయి.

వెలుపలి ప్రాకారంలో వున్న పశ్చిమమార్గం ఐదుమీటర్ల వెడల్పుతో, వివిధ పరిమాణాలు గల స్తంభాలతో కూడిన మంటపాలు గలిగివున్నాయి. ఇవి చోళ, పాండ్య, విజయనగర రాజుల ఆధిపత్యంలో నుండిన స్థానిక పాలకులచే నిర్మింపబడ్డాయి. ఇందలి వాస్తుశాస్త్ర లక్షణాలు కాలనిర్ణయం చేయుడానికి ఉపయోగపడుతున్నాయి.

తామరమొగ్గల చిత్రాలతో కూడియున్న రాతిస్తంభాలు దక్షిణ భారతదేశ ముఖ్యరాజవంశాలైన చోళుల, పాండ్యుల, రాయల కాలమునకు ప్రతీకగా ఉన్నాయి. అనేక అలంకరణలు, నగిషీలు గల స్తంభములున్న మంటపములు ఈదేవాలయ నిర్మాణ మందలి పడమటి భాగంలో ఉన్నాయి. ఉత్తరాన గల రాజసభకు పోవు ఈ మార్గం పశ్చిమాన గల మార్గమంత వెడల్పుగా వుంది. ఈ మార్గం గుండా దేవాలయం బయటికి వెళ్లేవారికి ఎడమవైపున మధ్యభాగంలో ఈ శతాబ్దిలో నిర్మింపబడిన శివయ్య గోపురం కనుడుతుంది. ఇది ఒక భక్తుని చేత నిర్మింపచేయ బడింది. దీనికాపేరు వరుసగా వచ్చిందే

గాని శాసనాధారాలు లేవు. ఈ గోపురం వాస్తు శిల్ప శాస్త్రాలకు ప్రతీకగా వున్నప్పటికీ దేవాలయ పరిసర ప్రాంతములతోను, ఇరువైపులనున్న రాతిమెట్లతోను దీని ఉనికిని గమనించిన, యిది ఉత్తరదిశగావున్న దేవాలయంలోనికి వెళ్లడానికి ద్వారంగా ఉపయోగపడిందని చెప్పవచ్చు. ఇది కూడ ఏడంతస్తుల ఎత్తు గల మూడంతస్తుల కట్టడం. ఇందులో చెప్పుకోదగినంత విశేషమైన శిల్పాలేవీ లేవు.

మొదటి రెండవ అంతస్థులలో గల ఖాళీ స్థలంలో యిరువైపుల శైవ ప్రాముఖ్యాన్ని తెలిపే డమరుకలను పట్టుకొన్న రెండు చేతుల నాల్గు చేతుల ద్వార పాలకులు కలరు. లోపలి నిర్మాణం ఉత్తర ఈశాన్య దిక్కుల్లో గల పూర్తిగా కట్టబడని ద్వారము దేవాలయము నుండి బయటి ప్రాకార సమీపమున అంతమవుతోంది. ఇది బయటి ప్రాకారపు గోడతో లోపలి ప్రాకారాన్ని కలుపుతోంది ఈ కట్టడపు అంచు భాగాలలో శ్రీ ఆది శంకరాచార్యులు వారి శిష్యుల చిత్తరువులచే అలంకరింపబడి యున్నవి. దీని ద్వారమునకు లోపల, బయట కుడి ఎడమలందు గణపతి, కుమారస్వాముల విగ్రహాలు కలవు.

ఈ పూర్తికాని ద్వారానికి 60 మీటర్ల దూరంలో ఉత్తర, ఈశాన్య దిక్కున పన్నెండు మీటర్లు ఎత్తుగల భిక్షల గోపురంగా పిలువబడుతున్న నాలుగు అంతస్థుల గోపురం వుంది ఇది యిప్పుడు శ్రీకాళహస్తి పట్టణం నుండి దేవాలయం లోనికి ఉత్తర, ఈశాన్య దిక్కుల నుండి ప్రవేశించడానికి ముఖ్య ద్వారంగా ఉపయోగపడుతోంది ఈ గోపురం పట్టణానికి ఉత్తర ముఖంగాను, దేవాలయానికి దక్షిణముఖం గాను ఉంది ఈ దేవాలయ నిర్మాణంలో గల అనేక కట్టడాల వలెనే ఈ కట్టడానికి కూడా శాసనాధారాలు లభ్యం కావడం లేదు. భారతీయ విద్యాభవన్ వారిచే ప్రచురింపబడి యున్ రమేష్ చే రచింపబడిన ఆంధ్రప్రదేశ్ నందలి దేవాలయాలు (Temples of Andhra Pradesh) అనే గ్రంథంలో ఈ కట్టడం క్రీ.శ. 12 వ శతాబ్దంలో

శ్రీకాళహస్తి నారాయణవనాలను పాలించిన శ్రీవీరనరసింహయాదవరాయలు నిర్మించియుండవచ్చని అభిప్రాయపడినారు.

ఈ గోపురానికి గల పేరును బట్టి, నిర్మాణ, శైలిని బట్టి ఈ అభిప్రాయం సరియైనది కాదని తెలుస్తోంది. ఈ గోపురం పేరు రెండు అభిప్రాయాలకు తావిస్తోంది. ఈ గోపురం వద్ద మెట్టును భిక్షుకులు భిక్షమెత్తుకొనడానికి ఈ స్థలం ఉపయోగపడేదని మొదటి అభిప్రాయం. భిక్ష మెత్తుట వలన, విరాళములు వసూలు చేయడం ద్వారా వచ్చిన ధనంతో నిర్మించబడినదని రెండవ అభిప్రాయం. భిక్షుకులు ఈ గోపురం వద్ద మెట్టు ప్రస్తుతం ఉండేగాక ఎప్పటినైన భిక్ష మెత్తవచ్చు. కాబట్టి ఈ మొదటి అభిప్రాయం సరియైనది కాదు. మతాభిమానులు, దైవ భక్తుల నుండి వసూలు చేసిన విరాళముల ద్వారా నిర్మింపబడి యుండవచ్చు. కాబట్టి రెండవ అభిప్రాయాన్ని బలపరిచి తమ 'మోనోగ్రాఫ్' లో ఈ గోపురం చోళుల కాలంలో నిర్మింపబడి వుండవచ్చని అభిప్రాయపడినారు. గోపుర నిర్మాణ విషయంలో యస్. శేషన్ అభిప్రాయాన్ని త్రోసి పుచ్చుతూ చోళుల కాలంలో నిర్మింపబడి వుండవచ్చని అతని అభిప్రాయంతో ఏకీభవించి ఉన్నారు (వీర నరసింహ యాదవ రాయలు విజయనగర రాజుల ఆధిపత్యంలో వుండెడి నాడని యిక్కడ గమనించాలి) ఈ గోపుర నిర్మాణశైలిని పరిశీలించినచో నిర్మాణ కాలాన్ని గూర్చి ఏర్పడిన అభిప్రాయం తొందరపాటుతో తీసుకొన్నదేమో యని అనిపిస్తోంది.

ఇచ్చట గమనింపవలసిన విషయమేమంటే ఏ గోడ పై భాగము నుండి గోపుర నిర్మాణం ప్రారంభమవుతుందో అక్కడ మూలలందు చాల సంక్లిష్టమైన అలంకరణలు, నగిషీలున్నాయి. ఇవి విజయనగర రాజుల కట్టడాలను పోలి ఉన్నాయి. మూగగా యిప్పటికి నిలిచివున్న ఈ సాక్ష్యాధారంతో, దీనిని సామాన్యుల విరాళముల ద్వారా నిర్మించినప్పటికీ నిర్మాణం చాల అందంగా, పరిపూర్ణంగా వుండాలని ఆనాడు పేరు గాంచిన వాస్తుశాస్త్రజ్ఞులను, శిల్పులను

నియమించారు. దీని నిర్మాణశైలి విజయనగర వాస్తుశిల్ప లక్షణముల కలిగివుండుటచే ఇది ఆ కాలమునాటిదనడానికి సాక్ష్యాలు.

దక్షిణ గాలిగోపుర పక్క గోడలపై పోలిన శృంగాకారపు కోణాలలో కూడ యుండి పురాణ సంబంధమైన దృశ్యముల, శిల్పములలో కూడ యున్నాయి. ఉత్తరముఖంగా వున్న మొదటి అంతస్తు పశ్చిమ మూలలో ఇరువైపుల గణపతి, కుమారస్వాములతో కూర్చున్న శివపార్వతులు వున్నారు. ఇక్కడి శిల్పములోని మరియొక విశేషం బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు గాక సుందరమూర్తి రూపంలోని శివుడు, ఆంజనేయ శిల్ప విగ్రహాలున్నాయి. దక్షిణముఖంగా నున్న మొదటి అంతస్తు తూర్పు భాగంలో పార్వతితో శివుడు వృషభారూఢుడై యున్నాడు. పశ్చిమ దిశలో నటరాజ రూపంలో శివుడున్నాడు. శివుడు నాట్యమాడుచుండగా, బ్రహ్మవిష్ణువులు తాళము వేస్తూ, గంధర్వులు, పార్వతి మృదంగం వాయించుచున్నట్లు విగ్రహాలున్నాయి. రెండవ అంతస్తులో ఈ వైపునే పార్వతితో శివుడు సుఖాసీనుడై వుండగా కాలభైరవుడు నిలుచున్నాడు. ఈ శిల్పాలు చూపరులను ఎక్కువగా ఆకర్షిస్తున్నాయి. పై అంతస్తునందలి మూలలలో తూర్పు, పడమరలను చూస్తున్న నంది విగ్రహాలు చెక్కబడినాయి. ఈ శిల్పాలన్నీ శివాధిక్యాన్నీ శివోత్కర్షనూ తెలియజేయటానికై ఎన్నుకొని శిల్పించబడినవని చెప్పవచ్చు.

భిక్షాల గోపుర మార్గానికి తూర్పున విజయనగర రాజుల లాంఛనం (రాజముద్రిక) చెక్కబడింది. భూవరాహం, ఖడ్గం, చంద్రవంక గలదే విజయనగర రాజలాంఛనం. గ్రామ శాసనాల్లో ఈ లాంఛనం ముద్రికపై చెక్కడం సంప్రదాయం. ఈ లాంఛనమూ, వైష్ణవ సంబంధమైన శిల్పాలు శైవ వైష్ణవ మతాలమధ్య పరస్పరసహనాన్నీ సామరస్యాన్నీ సూచిస్తున్నాయి. విజయనగర రాజులకీ భేదభావం లేదని వారు పోషించిన అష్టదిగ్గజ కవులే సాక్ష్యమిస్తున్నారు. శ్రీకాళహస్తి మాహాత్మ్యాన్ని వ్రాసిన ధూర్జటి మహాకవియే దీనికి ప్రత్యక్షతార్కాణం.

శివయ్య గోపురానికి ఉత్తరంలో 40 మీటర్ల దూరంలో, భిక్షాల గోపురానికి ఈశాన్యంలో 40 మీటర్ల దూరంలో క్రీ.శ. 1516 వ సంవత్సరం శ్రీకృష్ణదేవరాయల ఆజ్ఞానుసారం 40 మీటర్లు ఎత్తైన పదకొండు అంతస్తుల రాయగోపురం నిర్మింపబడింది. ఎనిమిది మీటర్లు ఎత్తు గల పీఠం, భిత్తికలపై తూర్పు, పడమరల ముఖంగా ఈ గోపురం నిలిచి వుంది. స్వర్ణముఖీనది పై వంతెన కట్టక పూర్వం పడమటి వైపు నుండి వచ్చే యాత్రికుల ఈ గోపురం వద్ద నదిని దాటేడి వారు. ఇంకా, తిరుపతి మొదలైన యితర పశ్చిమ ప్రాంతాల నుండి వచ్చే యాత్రికులకు ఒక తీర్థయాత్రా సంకేతం (symbol of pilgrimage) గా నిలిచి వుండేది. ఇప్పుడిది ముఖ్య దేవాలయ ప్రాంగణం నుండి వేరు చేయబడి ఉపయోగం లేనిదిగా మిగిలి పోయింది

రాయగోపుర పీఠము నందలి భాగాలపై కలువ పత్రాల చిత్రాలు ఉబ్బెత్తుగా, అందంగా చెక్కబడి వున్నాయి. ఈ పీఠానికి తూర్పు, పడమర ద్వారాల వద్ద యిరువైపుల గణపతి, కుమారస్వాముల విగ్రహాలున్నాయి. విజయనగరరాజలాంఛనం ఈ పీఠం పైన ద్వారం లోపలి వైపున మూలలలో, అన్ని వైపుల పెద్ద సంఖ్యలో కన్పిస్తుంది. భిత్తికాభాగం కూటపంజరశాల చిత్రాలతో చక్కగా అలంకరింపబడి వున్నాయి.

దక్షిణభారతదేశంలో దేవాలయనిర్మాణశిల్పలక్షణాలలో గంధర్వముఖ చిత్రాలు పెద్దవిగా చెక్కబడి వున్నాయి. ఈ మహోన్నత నిర్మాణంలో మొదటి అంతస్తున కిరువైపుల కామకేళిని సూచించే జంటల బొమ్మలను చెక్కడం ప్రధానం. మధ్య ఖాళీస్థలం ఇరువైపుల వున్న పెద్ద ద్వారపాలకుల బొమ్మలు ఈ మహాగోపురాన్ని మోస్తున్నట్లున్నాయి. దీని పై అంతస్తులో శివ పార్వతుల వివాహ సంబంధమైన సన్నివేశాలు, శివుని భిక్షాటన మూర్తి ఇంకను అనేక పురాణ సంబంధమైన శిల్ప చిత్రాలున్నాయి. ఈ గోపురం మొదటి అంతస్తు ద్వారం తలుపులకు క్రింది నుండి పైకి అల్లుకొన్న అనేక తీగల చిత్రాలతో అలంకరింపబడి వుంది. ఇది విజయ నగర శిల్ప విశేషమునకు ప్రతీక.

దక్షిణగోపురానికి దక్షిణంగా నూరు మీటర్ల దూరంలో మణికంఠేశ్వరాలయ మనే చిన్న శివాలయం ఉంది. పశ్చిమాభిముఖంగా వుండి ఏడుమీటర్లు ఎత్తు కలిగిన గర్భగుడి తగునైన నిర్మాణం కలిగి వున్నది. 30 చదరపు మీటర్లు వైశాల్యం గల ఈ ప్రదేశంలో ముఖ్యమైన గర్భగుడే గాక, పశ్చిమ ప్రాకార భిత్తిక వెంబడి స్తంభాలతో కూడిన వసారా, ఉత్తరం వైపున తూర్పుకు అభిముఖంగా వున్న పార్వతీ దేవి ఆలయం, దీనికి ఉత్తరాన ఎనిమిదిమీటర్లఎత్తుతో మూడంతస్తుల ప్రవేశ ద్వారముంది. ఈ దేవాలయం చుట్టూ వున్న శిథిలాల వలన యిది కొంత భాగం రాతిలోను, కొంత యిటుకతోను కట్టబడి ఎత్తైన ప్రాకారంతో వున్నట్లు తెలుస్తోంది. ఈ దేవాలయాంతర్భాగానగల మందిరంలో మహిషాసురమర్దని, దుర్గా ప్రతిమలున్నాయి. మణికంఠేశ్వరలింగం గర్భగుడిలో వుంది. మూడు మీటర్ల ఎత్తుగల దేవీ ఆలయంలో నిలువెత్తు పార్వతీ విగ్రహం వెలకొని వుంది. క్రీ.శ 1070లో శ్రీ మనిగంగ ఉదయనాయనార్ సింహాసనము దిష్టించినపుడు స్థానిక పాలకుడైన అముదాల్వాన్ మంగైనాయకన్ చే నిర్మింపబడింది.

ఈ దేవాలయము ప్రాకారపుభిత్తి, వసారా, దేవీ ఆలయము (గర్భగుడి), అందరి దేవతల అభిషేకపు నీటికై ఒక బావి, ద్వార గోపురము కలిగి ఒక ప్రత్యేక అస్తిత్వము కలదిగా వుంది. శ్రీకాళహస్తీశ్వర దేవాలయం నుండి ఈ దేవాలయం నూరు మీటర్ల దూరముతో వేరు చేయబడి వున్నా రెండింటి లోనూ కొన్ని పోలికలున్నాయి. ఇచ్చటి ముఖ్య దేవతల గర్భగుడులు పశ్చిమాభిముఖంగా నది వైపువకు ఉండగా, దేవి యొక్క గర్భగుడి తూర్పుకు అభిముఖంగా కొండవైపుకున్నది. ఈ రెండు గుడులు ఎత్తైన ప్రాకారం గలిగి ఒక్కొక్క ముఖ్య ప్రవేశ ద్వారం కలిగి వున్నాయి. శ్రీకాళహస్తీశ్వర దేవాలయం లోపలి ప్రాకార గోపురం దక్షిణాభిముఖంగా ఉండగా, మణికంఠేశ్వరదేవాలయ ప్రవేశ ద్వారం ఉత్తరాభిముఖంగా ఉన్నది. కొంత

జాగ్రత్తగా గమనించిన శ్రీకాళహస్తీశ్వర దేవాలయాంతర్భాగపు నిర్మాణం యొక్క ప్రవేశ ద్వార గోపురం, దాని దక్షిణ గోపురం, మణి కంఠేశ్వర దేవాలయ ప్రవేశ ద్వార గోపురం ఉత్తర, దక్షిణాలుగా ఒకే వరుసలో ఉన్నట్లు అగుపిస్తుంది. పై విషయాలన్నీ పరిశీలిస్తే మణికంఠేశ్వర దేవాలయం శ్రీ కాళహస్తి క్షేత్ర శైవ ప్రాముఖ్యాన్ని చాటడానికి నిర్మింపబడినట్లు అవగతమవుతున్నది.

కొన్ని నిగూఢమైన కారణాలవల్ల శ్రీకాళహస్తీశ్వరదేవాలయం పరిపూర్ణమైందిగా రూపొందింది. ఇచటి అధిష్ఠానదేవత, గర్భగృహ కేంద్ర మందలి కథ, పురాణాంతర్గతంగా ఉంది. దక్షిణ గోపురాన్ని గురించి ఆలోచించడానికి కొన్ని శిథిలాలైన ఆధారాలు వున్నాయి. కాని భిక్షుల గోపురం యొక్క చరిత్ర తెలిసికోవడానికి, స్పష్టమైన శిల్ప సంబంధ నిర్మాణము లుండగా, నూరు స్తంభాల మంటపం, అచ్యుత దేవరాయుల మంటపం, రాయగోపురాల నిర్మాణ కాలాలను తెలిసికోవడానికి శిలాశాసనాలున్నాయి. ఇచ్చటి వివిధ కట్టడాలకు భక్తుల, స్థానిక పాలకుల, రాజవంశీయుల పోషణ లభించింది. ఈ దేవాలయ సమాహార స్వరూప మందలి వివిధ నిర్మాణాలు భక్తుల చేత, స్థానిక పాలకుల చేత నిర్మింపబడి నట్లు గంభీరమైన నూరుస్తంభాల మంటపము, రాయగోపురము క్రీ.శ. 16 వ శతాబ్దంలో విజయనగర రాజులచే నిర్మింపబడినట్లు తెలుస్తోంది. మణికంఠేశ్వరాలయం మొదలుకొని యిచ్చటి ప్రతి కట్టడంలోని ప్రతి శిల్పం శ్రీకాళహస్తి క్షేత్రం యొక్క శైవ ప్రాముఖ్యాన్ని యినుమడింపజేసేవిగా వున్నాయి.

## 2.5 శాసనాలలో శ్రీ కాళహస్తి

శ్రీకాళహస్తి దేవాలయంలో చోళ, యాదవరాయ, తెలుగు చోళ, తెలుగుపల్లవ, విజయనగర రాజవంశాలకు చెందిన శిలాశాసనాలు 220 వరకు లభ్యమవుతున్నాయి. చోళ శాసనాలలో

i) మొదటి రాజరాజ యొక్క పాలనలో నాల్గవ సం॥ నుండి 27 వ సం॥ వరకు,

ii) మొదటి కులోత్తుంగ చోళుని 2 వ సం॥ నుండి 46 వ సంవత్సరం వరకు,

iii) విక్రమచోళుని 3 వ సం॥ నుండి 19 వ సం॥ వరకు,

iv) రాజాధిరాజ యొక్క 5 వ సం॥ నుండి 28 వ సం॥ వరకు

v) మొదటి రాజేంద్రుని యొక్క 4 వ సం॥ నుండి 24 వ సం॥ వరకు,

vi) మూడవ రాజేంద్రుని 4 వ సం॥ నుండి 28 వ సం॥ వరకు,

vii) మూడవ కులోత్తుంగుని 3 వ సం॥ నుండి 3 4 వ సం॥ వరకు గలవు.

*విజయనగర శాసనములు*

i) రెండవ హరిహర రాయుల కాలము నాటి శక. సం. 1323 నకు,

ii) రెండవ దేవరాయకాలపు శక. 1357 నకు,

iii) కృష్ణరాయలనాటి శక. 1431 నుండి 1454 నకు,

iv) అచ్యుతరాయ కాలము నాటి శక 1450 నుండి 1463 వరకు,

v) సదాశివరాయుల కాలము నాటి శక. 1459 నుండి 1491 వరకు గల సంవత్సరములకు చెందియున్నవి.

తెలుగు పల్లవులైన విజయగండ గోపాలుని పాలన యొక్క 4 వ సంవత్సరం నుండి 7 వ సంవత్సరం వరకు, రాజగండగోపాలుని పాలనలో 7 వసంవత్సరం తెలుపే మూడు శాసనములు కనిపిస్తున్నాయి.

ఈ శాసనాల్లో అనేక కార్యకలాపాల కోసం, దేవభోగమున కోసం యివ్వబడిన గ్రామాల వివరాలున్నాయి. చోళరాజ త్రిభువన చక్రవర్తి రాజ

రాజదేవ వీరవరశింగదేవరాయుని పాలనలో 7 వ సంవత్సరమున తిరుక్కాలత్తిఉదయనాయనార్ దేవాలయ దిగువ భాగములో గల గురుష్పరివిడైగన్ నాయనార్ దేవాలయములో పూజలకు, బాగు చేయుటకు ఒక గ్రామము యివ్వబడినట్లున్నది (No 33 of 1945-46) ఆ పాలన లోనే 11 వ సంవత్సరంలో తిరుక్కాలత్తి దేవన్ యాదవరాయన్ తిరుక్కాలత్తి యుడయనార్ ను కొలువడానికి వచ్చే యాత్రికులకు ఉచిత భోజన వసతి కల్పించుటకై కురుప్పరువాడు లో ఒక గ్రామము యివ్వబడింది (No 136 of 1922) శ. సం. 1439 లో విజయనగరరాజు కృష్ణరాయపాలనలో అతని ప్రధాని సాళ్వతిమ్మరుసు, పయ్యూర్ కోనములోని ఓనపాకం అను గ్రామము దానము చేసినట్లు వుంది. ఆ గ్రామము నుండి వచ్చు ఆదాయమును తిరుక్కాలత్తి ఉడైయనాయనార్ దేవాలయములో ప్రాతఃకాలసేవలకు, పూలహారమునకు, నాలుగు దీపములు వెలిగించడానికి అధికారులచే వినియోగింప బడేడిది. (No 113 of 1922) అదే పాలనా కాలంలో శసం. 1441 లో తెర్క్కుమాదమ్ ఇమ్మడిచ్చుదశివచారియార్ దేవాలయంలోని ప్రాతఃకాలసేవలకు మాసి, వైగాసి, పురటాసి నెలలో కొన్ని పండుగలు జరుపుటకు ఒక గ్రామము యివ్వబడినది. (No 172 of 1924) అదే పాలనా కాలంలో శసం. 1443 లో మూడవ ప్రాకారమున గల అర్ధజాది పిళ్లైయార్ పూజలకై తిమ్మప్పనాయనార్ అను సామంతరాజు చంద్రగిరి రాజ్యములో పడనాడు విభాగ మందు సన్యాసపల్లి అను గ్రామమును దానమిచ్చినట్లు కలదు. (No 1 82 of 1922) శసం 1454 లో విరోధి నామ సంవత్సర కార్తీక బహుళ 5 వ తేదిన విజయనగర రాజు అచ్యుతదేవరాయులచే తన పట్టాభిషేకము రోజున శ్రీకాళహస్తీశ్వరునికి 3 1/4 వ వంతు కొన్ని వస్తువుల పై ఎగుమతి దిగుమతి సుంకములు, పండుగ రోజులలో పూజాకార్యక్రమములకై కైంకర్యంగా యివ్వబడినది. (S I I 1 530) శసం 1454 కొండవాపి పిర్పయ్ లోని మెల్లుల హళ్లి అను గ్రామము ప్రాతఃకాల సేవల వినియోగార్ధం కాకభట్టార్ చె

యివ్వబడినది (No 168 of 1924) శసం. 1455 లో మహామండలేశ్వర పల్కారాజ తిరుమలై యాదవ మహారాజ ప్రతినిధి తిమ్మరాజ కొండమాన్ పుత్రగ్రామములో 3/4 వ వంతు కైంకర్యముగా యివ్వబడినది. (No 170 of1924) శసం. 1456 లోకలైమిచ్చిపేమై లోపి ఒక గ్రామము పరిసర ప్రాంతములతో సహా శ్రీ కాళహస్తీశ్వరుని రోజువారీ సేవలకై రామభట్టార్ అయ్యన్ చే దానమివ్వబడినది (No 163 of 1924)

శసం. 1458 లో తిరుక్కాలత్తి యుడైయార్ పూజలకై రాజగారిచే రెండు గ్రామములు దానమివ్వబడినవి. (No 178 of 1922) శసం 1459 లో రుద్రశివ ఆచార్యునిచే కాళహస్తి ఉదయనాయనార్ దేవాలయమునకు పెరియఅంజంచేడు అను గ్రామము యివ్వబడినది (No 179 of 1924) శ సం 1446 లో రామభట్టార్అయ్యన్ భార్య తిమ్మాజి అమ్మన్ చే ప్రాతఃకాలసేవలకు రెండు గ్రామములు యివ్వబడినాయి (No 187 of 1924) శ. సం. 1460 లో పూతల్కేదం విభాగము నందలి అంగుడివాదం అగ్రహారమైన సౌందర్యచోళా పురమును, కోలకొట్టి దేవనాయగల్ పెరుమాళ్లు కోదండ శాను పురి అను గ్రామమును విజయనగర విరూపాక్ష దేవుని ఎమట ఒటిమెల దీక్షితర్ కు కాళహస్తీశ్వర తంబిరానార్ సేవార్థం దానమిచ్చాడు. (No 178 of 1922)

తరువాత దానమివ్వబడిన భూములు ప్రాముఖ్యం వహిస్తాయి. ఈ దానములు కొన్ని సాధారణ స్వభావము కలిగినవి. ఒక శాసనము ద్వారా చోళరాజు కులోత్తుంగచోళుడు తన పాలనలో 15 వ యేట తొండమాన్ అయువార్ లోని భూమిని ఒక బావితో పాటు తిరుక్కాలత్తి ఉడైయార్‌కు దానమిచ్చియున్నట్లు తెలుపుచున్నది (S I I IV, 645) మరియొక శాసనము చోళరాజు రాజాధిరాజ చక్రవర్తి పాలనలో 5 వ సంవత్సరమున ఉయ్యక్కొండార్ విభాగము నందలి అంబనాడులోని పళైయూరు నందలి భూమిని పన్నులు లేకుండా యిచ్చినట్లు తెలుపుచున్నది. (No 124 of 1912) రాజరాజ చోళుని పాలన కాలములో 8 వ సంవత్సరము నందు వీరనరసింగదేవయాదవరాయులచే

కరుప్పూరువాడుకు చెందిన ఎక్కోమాలప్పండి లోని భూమిని దానమిచ్చినట్లు తెలియుచున్నది (SII, IV 648-9)

చోళరాజు త్రిలోకేంద్రచోళదేవుని పాలనలో 4 వ సంవత్సరమున భూమిని దానము చేయబడినట్లు ఒక రికార్డు తెలుపుతుంది. విజయ రాజేంద్ర చోళ దేవుని పాలనాకాలములో 7 వ సంవత్సరమున జయంగొండ అంకోలమండలములో కురుప్పర్తువాడు లోని మణ్ణిపల్లూరు లోని భూమిని నరసింగతిరుక్కాళత్తిదేవయాదవరాయునిచే దేవదానము చేయబడినట్లు తెలియుచున్నది (S I I, VIII, 379) తెలుగు పల్లవ రాజు విజయగండగోపాలదేవ పాలనలో 7 వ సంవత్సరములో త్యాగ సముద్ర పట్టి ఏమరాపన్ కుమారుడు నల్ల సిద్ధ హర్షన్ చే తిరుమనక్కాంగి ఉదయనాయనార్ దేవునికి కొంత భూమి దానమిచ్చినాడు (S I I, VIII, 501) శకం 1304 నాటి శాసనము, శ్రీరామార్పునైయార్ కుమారుడు మల్లు వడయార్ తిరుక్కాళత్తి నాయనార్ దేవునికి భూమి దానమివ్వ బడినట్లు తెలుపుచున్నది (S I I VIII, 487) మరియొక శాసనము వీరనరసింగదేవయాదవరాయునిచే పెరుప్పండివాడు లోని పల్లై భోమూర్ నందలి భూమిని దేవదానముగా యివ్వబడినట్లు తెలుపుచున్నది (SII IV 447)

కొన్నిసమయాలలో దీపములువెలిగించుటకు భూములు యివ్వబడ్డాయి. రాజరాజచోళుని కాలములో 28 వ సంవత్సరమున తిరుక్కాళత్తి సేవ ముదలియనాయనార్ దేవునికి ఇలయూర్ నందలి భూమిని దీపములకై పన్నులు లేకుండ యివ్వబడినది. చోళరాజు రాజశేఖర వర్మ కాలమున 49 వ సంవత్సరములో దేవాలయం వెనుక గోడలో శ్రీబలి ఉత్సవము ముగియు దాకా దీపములు వెలిగించుటకు 1000 కుల్‌ల భూమి దానమివ్వబడింది (No 90, of 1922)

అనేక యితర కార్యక్రమములకు కూడా భూమి దానమివ్వబడినది. కులోత్తుంగచోళుని పాలనలో 4 వ సంవత్సరమున దేవునికి భూమి దానమివ్వబడినట్లు, ఒక శాసనము తెలుపుచున్నది. అదే పాలన కాలములో

26 వ సంవత్సరమున దేవునికి ఆదివారము, అమావాస్య తిరువతేమపల్లి పండుగ రోజులలో ప్రత్యేక పూజలు జరుపుటకు 25 పట్టి భూమి పాయ్‌గయ్‌వాడులోని కన్నవల్లూర్ ప్రజలు దానమిచ్చినట్లు కలదు (No 157 of 1922) అదే కాలములో 26 వ సంవత్సరములో ఆర్య రాజేంద్ర చోళునిచే పై తెలిపిన కార్యక్రమములు నిర్వహించుటకుభూమి దానమివ్వబడినది. (158 of 1922). అదే పరిపాలనలో 30 వ సంవత్సరమున చిత్రార్‌మలి ప్రజలచే తిరుక్కాలతి ఉడైయార్ పూజలకు, రథనిర్మాణమునకు భూమి దానమివ్వబడినది. అదే పాలనలోని 31 వ సంవత్సరమున సిరుసింగదేవయాదవరాయలచే తిరుక్కాలత్తి రుడైయార్ దేవునికి పూలతోట దానమివ్వబడినది. (No 120 of 1922) పై పాలనలో 32 వ సంవత్సరమున త్యాగసముద్రపట్టి వినరాసన్ చే అలాలసుందరన్ పూలతోటలో యిద్దరువ్యక్తులను నియమించుటకు గామ 800 మళ్లు భూమి దానమివ్వబడినది. (92 of 1922) 32 వ సంవత్సరములోనే పెనుగొండై (పెనుగొండ) కు చెందిన ముగ్గురు బోయన్ల్లు చేస్కొనాడు లో వందమారు గ్రామము 500 మళ్లు భూమి దానమివ్వబడినది.

పాట్టప్పినాడు (పొత్తపివాడు) లోని తంగట్టూర్ గ్రామము తిరుక్కాలత్తి ఉడైయార్ దేవునికి ప్రతిరోజు పూలమాలలు సమర్పించుటకై యిద్దరు తోటమాలుల సంరక్షణకు యివ్వబడినది. (133 of 1922) 47 వ సంవత్సరమునకు సంబంధించిన రికార్డులలో దేవాలయవీధులను నిర్వహించుటకు ఏర్పాటు చేయబడిన అంరారుల ( సేవకులు) భోజనము నకై భూమి దాన మివ్వబడినట్లున్నది. ( 173 of 1922) అదే పాలనలోని 47 వ సంవత్సరపు రికార్డులో మానవిల్‌కోనమ్ విభాగ మండలి అరుంబాక్కం గ్రామ పెద్దగా నున్న ఆర్యనోసియర్‌దేవన్ చే జయంగొండ చోళ మండల మండలి నల్లైకదన్‌పాక్కం గ్రామసభ వద్ద కొన్న భూమి దానమివ్వబడినట్లు ఉన్నది. (125 of 1922) అదే పాలనకు చెందిన 8 వ సంవత్సరం శాసనంలో

**తిరుమావిక్కుంగై ఉడైయనాయనార్ దేవాలయంలో ప్రతిష్ఠించబడిన శ్రీ మల్లికార్జున ముడైయార్ సేవలకై దానమివ్వబడిన భూమిని గురించి కలదు (SII, VIII No 499)**

అదే కాలపు 8 వ సంవత్సరములో వీరనరసింగ దేవ యాదవ రాయలచే తిరుక్కాళ ఉడైయనాయనార్ దేవుని నందనవనము, దానిని నిర్వహించు తోటమాలుల భుక్తికై దేవదానముగా భూమి యివ్వబడినది. ( SII, VIII 482) అదే కాలపు 15 వ సంవత్సరములో వీరనరసింహ దేవ యాదవరాయలచే కొండమీదిమఠము నిర్వహించుటకు, అందలి మహేశ్వరుల భుక్తికి పన్నులు, యితర శుల్కములు లేకుండ భూమి దానమివ్వబడినది. (SII, VIII, No 469) తెలుగు పల్లవరాజు విజయగండ గోపాలపాలనలో 4 వ సంవత్సరములోని శాసనము తిరువల్లుత్తాన్ తిరునట్టిప్పెరుమాన్ త్యాగమేఘన్‌చే 30 యాత్రికులకు, 5 మంది బ్రాహ్మణులకు దిన భుక్తికై భూమి దానమివ్వబడింది. ( SII, VIII, 470)

భక్తులచే బంగారుకానుకలు కూడా యివ్వబడినవి. చోళరాజు రాజశేఖర వర్మన్ పాలనలో 24 వ సంవత్సరములో మావిక్కుడై మాదేవన్ మోళుడుముడు బంగారు కానుకలు యిచ్చినాడు. చోళరాజు రాజశేఖర వర్మన్ కాలపు 12 వ సంవత్సరపు శాసనము బంగారు, ఆవులు కానుకలుగా యిచ్చినట్లు తెలుపుచున్నది. (290 of 1904) పై కాలము నాటి 12 వ సంవత్సరపు శాసనము మల్లాడు పాలకుడు గంగైకొండ చోళునిచే కృత్తిక పండుగకుగాను బంగారు, గొర్రెలు, దానమిచ్చినట్లు తెలుపుచున్నది. (No 291 of 1904) చోళరాజు పరకేసరివర్మ కాలపు 23 వ సంవత్సరంలో బంగారు దానమివ్వబడినట్లు మరియొకశాసనము తెలుపుచున్నది.

భక్తులు కూడా అనేక కార్యములకు ధనము యిచ్చినారు. త్రిభువన చక్రవర్తి కులోత్తుంగ చోళ దేవుని పాలన కాలములో 46 వ సంవత్సరమున

దేవాలయములో అఖండ దీపములు వెలిగించుటకు ధనము యివ్వబడినది (82 of 1922) చోళరాజు త్రిభువనచక్రవర్తి రాజరాజదేవునిపాలనలో 4 వ సంవత్సరమున శికులశాలుక్కి తమ్మిపిర్ మెనర పిరవరుంగ దేవుడు ఉర్ యాదవరాయన్ చే విరాళమొసగబడినది. చోళరాజు పరకేసరివర్మన్ ఉరఫ్ రాజేంద్ర చోళ దేవుని పాలన కాలములో 12 వ సంవత్సరమునకు చెందిన శాసనములో విరాళ మొసగబడినదని తెలుపుచున్నది (276 of 1904) విజయనగర రాజు వీర ప్రతాప అచ్యుత రాయమహారాయకాలములో శ.సం. 1453 నాటి శాసనము ఒక హమ్మనాథయ్యర్ చే దైవ పూజకై 1020 పణములు, యివ్వబడినట్లు తెలుపుచున్నది. (171 of 1924) అదే కాలములో శ.సం. 1454 నాటి శాసనం ఒక ప్రత్యేక వ్యక్తిచే తిరుక్కాట్టియూదంవాయునార్ ప్రాతః కాల సేవలకు 1000 పణములు ఒక రజిత పళ్లెరము యిచ్చినట్లు తెలుపుచున్నది (No 183 of 1922) అదే పాలన కాలములో శ.సం. 1454 లో రామభట్టార్ అయ్యన్ చే మాసిమాసం ఉత్సవమయమున తాను కట్టించిన మండపములో దేవుని ఉత్సవ విగ్రహము ఆగుటకుగాను 4000 పణములు యిచ్చినట్లు చెప్పబడినది. (No 18 of 1924)

అదే పాలనలో శ.సం. 1455 లో రామభట్టార్ చే తాను పంగుని ఉత్తరం నాడు ఉద్యానవన మందలి మండపములో బసచేసినందులకుగాను రాజు, వరదాదేవిఅమ్మన్‌కృపకై 2000 పణములు యిచ్చినట్లు చెప్పబడినది (No of 1922) అదే పాలన కాలంలో 1457 వ సంవత్సరం నాటి శాసనం లో జయంగొండచోలమండలం లోని అరూర్‌నాడుకు చెందిన తిరుక్కాలత్తి నాయనార్ దేవుని ఖజానా అధికారులకు, పండితార్ శామరాజకుమారుడు తిమ్మరాజుకు మధ్య జరిగిన ఒప్పందము ద్వారా అతనిచే యివ్వబడిన విరాళమునకు పూజలు జరుపవలెనన్నట్లు తెలుపుచున్నవి ఈ విరాళము దేవదాన గ్రామమగు తొండమానాడ్రూర్ లోని చెఱువు పని చేయుటకై ఉపయోగించవలెనని చెప్పబడినది ( No 152 of 1924) 1459 వ

సంవత్సరమునకు చెందిన మరియొక శాసనము రామభట్టార్‌అయ్యన్ తన తల్లి దండ్రుల జ్ఞాపకార్థము అదే దేవాలయము నకు నిత్యము క్షీరాభిషేకమునకై విరాళ మొసగ బడినదని తెలుపుచున్నది. (No 174 of 1924) 1461 లో రామభట్టార్‌అయ్యన్ రాజు కృపాపాత్రుడగుటకై 6360 పణములు యిచ్చినాడు (160 of 1924) క్రీ.శ. 1462 వ సంవత్సరపు శాసనములో రామభట్టార్ అయ్యన్ చే విశ్వేశ్వరతంబి దానార్, విగ్రహాభిషేకానికి కల్లాడిల్‌అరువత్తుమూవార్ మండప దేవాలయము నిర్మించుటకు తిరుక్కాళత్తి ఉడైయనార్ పూజలకు సేవలకు 1000 పణములు యివ్వబడినట్లు తెలుపుచున్నది (167 of 1922) శ. సం 1462 లో రామభట్టార్‌అయ్యన్ సేవార్థము మార్గళి మాసములో దేవుని ప్రాతః కాల సేవలకై 200 పణములు యివ్వబడినవని తెల్పబడినది (162 of 1922) శ.సం. 1462 లో లేపాక్షి నందిలక్కొ సెట్టియార్ కుమారుడు పెనుగొండ విరుపన్న 1306 పణములు విరాళమిచ్చెను. తిరుక్కాళత్తి యుడైయనార్ దేవుని సేవలకు, కొన్ని ఉత్సవములు జరుపుటకు రెండు గ్రామాల ద్వారా వచ్చు ఆదాయము ఉపయోగింపబడినది. (166 of 1922)

## 2.6 శ్రీ కాళహస్తి లోని కన్నప్ప శాసనం

**(S I I, Vol IV, No 650)**

(దక్షిణహిందూదేశశాసనసంపుటం లోని తమిళ గ్రంధ లిపి లోని శాసన పాఠానికిది యథాతథమైన తెలుగు లిపి)

(ఇది సదాశివ దేవరాయల కాలంలో వెలువడిన శాసనం క్రీ.శ 1544 - 1570 )

1 పుణ్యేన కేనాపి పురాకృతేన

2 అదృష్ట పూర్వాను [పుమర్థా] న్
సిద్ధాంజన శ్యామ మిదం వ పుస్తే [క]

3 అఖిలషితకలానామర్పితోదర్పకారీ
భవతిమిరనివాపీ భక్తపాధోధివాపీ

4 అచ [ల దుహితుర్ధేనేంద్రనీలాయమానః
సభవతు మణిగంగాతీర చింతామణిర్నః [వక్త్రా
5 ంబోజైః మదన విజయిమ్నాన నియంచతుభిః
మధ్యే కృత్వా గిరిదుహితాజ్ఞా..
6 క్తపాంగం అంగై రంగాన్యధిక మధురాణ్యాదరాత్ స్పష్ట మక్ష్ణో భాగ్యం
7 ప్రథమ ఘట [నే] షిగేహా నిస్పృహస్య పూర్వం కిరాత పతితే
[శ] సేమాహృతాని పుష్పా
8 ణీ భూతపతి భుక్త సమాఖుతాని పిండః ప్రభాత సమయే పుర
తోగణానాం
9 సోం చేత భక్తి భయ మాతనుతేష్వమాకా(త్)భక్తేషు సాభిభయ
యాన ధురం
10 ధరేషు నేత్రార్పణాత్ కమపి ధన్యతరం ను వీతః ఉ (ఫ్రి) ష్టమం
బాత [థ ] యంతి యదస్యశం
11 భోర్దేవస్య నిత్య మభిషేక విశుద్ధి [వా] తు కమల భవతరోటి
సర్వ చంద్రస్రవ
12 న్తి వనచరపతిపాదో పాన దాక గ్వలేభ్యః అనితర శూల భేభ్యో
భూషణే భ్యోః
13 పురారే రతను మన మదోక్తిం కాళహ శ్స్యరస్య భవతి భువనే సత్య
14 ప ఏవ వట్మ్రుమః కనక ముఖరీ మూలం యస్యావసించతీ వారణా
అపి చ శీవరం
15 చూడాసీ సింధు స్తరంగమరం హాసలీల విహైరై భో శ్రీకాళహస్తి గిరిస్థితేః
16 అంగైశైల ప్రతిహతగతే శంకర్యార్ధేః ముఖర్యాశ్శంభోరాత్మ ప్రతిఫలః
17 నతో భూషణాం చాంబరం చ కాళహస్తి ద్వయ మపి భవతో పూజనే
కల్ప్య మానే
18 నిత్యం సంవాద యతి ఇతి మే [ని] శ్చి [త] బుద్ధి రాసీతో ఆర్ద్రాయేక్షణ
మేక మర్పితవతః పూ

19 ర్వామ తోన్యతే జ్ఞావా, దుర్ధర్షం వ్యవసా ధి | న (స్ప) పిముఖం హస్తం విషాద (ప్రభో కామల్పో

20 షూ కాళహస్తి మతేః కాంతా (వి) మిశారుణే

వామస్తే.... యతం రురోధ వల

21 ధీ వాణీస్తదా వత్సలః అపోసజల్ ద - సముఖం శిలీముఖం ప్రలంబయుతోసుర

22 గిరికార్ముకం కరం పుర్వాతయే త్రిదశ దృశామగోచరసము - మత్యపి సమ భాస్త

23 స వరః (య)

## S.I.I., IV., 650

### (A.R.NO. 202 of 1892)

<u>పై సంస్కృత శాసనానికి యథాతథమైన తెలుగు అనువాదం</u>

1) పూర్వ జన్మ సంబంధమైన అదృష్ట విశేషం చేత కలుషితమైన వృత్తి కలిమ్పటికీ భగవద్భక్తుల రూపు రేఖలలో విశిష్టమైన స్థానాన్ని సంపాదించిన ఆటవికుడు కన్నప్ప

2) ఆటవికుడైన కన్నప్పకు ఈశ్వరుని మొదటి దర్శనము లోనే అచంచలమైన భక్తి భావం ఏర్పడి అది సంస్కారం లేకపోవడం వలన పామరత్వాన్ని ఆపాదించుకొని భక్తియే సర్వస్వమని భావించి సాకారమైన ఉపాసనయే భగవంతుని యొక్క ఆరాధన అని మొండిపట్టుతో లింగాకారం లో నున్న సాంబ శివునికి కళ్లు లేవని తన కళ్లను పీకి యిమ్మిట భక్తులలో అన్య సామాన్య ప్రతిభ

శ్రీ కాళహస్తీశ్వరుని యొక్క అనుగ్రహ విశేషానికి పాత్రుడైన ఆ కన్నప్ప తనను ఎటుల ఆరాధించెనో ఆనందపడి ఈశ్వరుడు అతనికి ముక్తిని ప్రసాదించెను కాళహస్తీశ్వరునికి భూషణాలు లేవు కొలనులోని తామర పుష్పాలను అలంకరించి, మాట్లాడలేరని ఆ లింగంతో

మాట్లాడమని, ప్రాధేయపడుట మొదలగునవి అతని ముగ్ధభక్తికి ఉదాహరణ

3) కళలకు యిలు వేల్పైన శంకరుడు నిరాకారుడై దర్పం లేని వాడై చీకటిలో శ్మశానమున తిరుగుతూ ఆశ్రయించిన భక్తులను భోళా శంకరుడై తరతమభేదంలేక కోరినకోర్కెలుతీర్చువాడునూ, సకల పాపాలను పోగొట్టే గంగను శిరమునధరించి, అనేక మణులకు గొప్పదైన చింతామణిని ధరించియున్న ఆ స్వామి నాకున్న సకల చింతలను పోగొట్టి మోక్షమును ప్రసాదించుగాక !

4) ఆ కన్నప్ప కాళహస్తీశ్వరునికి నిత్యం అభిషేకం చేస్తూ సర్పములను ధరించి యున్న ఆ స్వామికి సరస్సులోని కమలములను అర్పణ చేస్తూ అరణ్యములో దొరికేటటువంటి అనేక పత్రాలు, పుష్పాలు, భూషణాలుగా సమర్పించుచు ఆ కిరాతుడు అడవిలో మదించివున్న జంతువులను చంపి ఆ మాంసమును సకల షడ్రసోపేత భోజనముగా భావించి నివేదన చేసెడివాడు

*(ఈ శాసన మూలపాఠం ప్రక్క పుటలో యివ్వబడింది)*

# శ్రీ కాళహస్తి దేవాలయ నిర్మాణంలో గల వివిధ స్థలాలు

(Ground Plan)

1. శ్రీకృష్ణదేవరాయ గోపురం
2. నాల్గో ప్రాకార గోడ

2a మూడో ప్రాకార గోడ

2b రెండో ప్రాకార గోడ

3. భిక్షాల గోపురం
4. అంగళ్ళు
5. కాశీ విశ్వేశ్వర దేవాలయ గోపుర ముఖ ద్వారం
6. కాశీ విశ్వేశ్వర దేవాలయ ప్రాకార గోడ
7. కాశీ విశ్వేశ్వర దేవాలయ గర్భ గృహం
8. కాశీ విశ్వేశ్వర దేవాలయ ముఖ మండపం
9. అన్నపూర్ణాదేవి గుడి
10. పాపాముల గది
11. కార్య నిర్వహణాధికారి కార్యాలయం
12. బాల జ్ఞానాంబ గోపురం
13. మండపం
14. కుమార స్వామి గుడి
15. మండపం
16. శివయ్య గోపురం
17. చిన్న గుడి
18. గణపతి గుడి
19. మండపం
20. శివుని గుడి

21. పాతాళ విఘ్నేశ్వరుని గుడి
22. గుఱ్ఱపు పాని మండపం
23. రెండు కాళ్ల మండపం
24. సదాశివేశ్వర గుడి

25
26 } మండపాలు
27

28. పడమర వైపున్న నంది మండపం
29. మండపం
30. కుమార స్వామి గుడి
31 తిరు మంజన గోపురం
32. గణపతి గుడి
33. నూరు కాళ్ల మండపం
34. కల్యాణ మండపం
35. మండపం
36. నాలుగుకాళ్ల మండపం
37 అష్టోత్తర శత లింగాల గుడి
38 ఎత్తైన నాలుగుకాళ్ల మండపం
39 ఎత్తైన నాలుగుకాళ్ల మండపం
40 మండపం

41
42. } శివుని గుచ్చు

43. దక్షిణ గోపురం

44.
45. } మండపాలు

46 శివుని గుడి

47. శిథిల మండపం

48.
49. } ఈశ్వరుని గుళ్ళు
50.

51. మండపం

52. బాల రామేశ్వరుని గుడి

53. శివుని గుడి 54. పడికట్లు (మెట్లు)

55. దక్షిణ వైపున్న నంది మండపం

56. బలి పీఠం

57. నంది స్తంభం

58. దక్షిణ గోపుర రెండో ముంగిలి

59. కొలువుకూటము

60. గదులు

61. వాహనాల గది

62. ఉత్సవ మూర్తి గది

63. స్తంభాల ప్రార్థనాగారం

64. నటరాజ గుడి

65. ఒంటి స్తంభపు కొలువు కూటం

66. వంట గది

67. స్తంభాల వారపాక (ప్రదక్షిణ)

68. మృత్యుంజయేశ్వరుని గుడి

68 కన్నప్ప గుడి

69 ధ్వజ స్తంభం

70. బలి పీఠం

71 దక్షిణామూర్తి

72. కొలువు కూటము

73. నంది

74. ముఖ మండపం

75 ప్రదక్షిణా పథం

76 గర్భ గృహం (ప్రధాన గుడిలోనిది)

77

78 } అంతరాళాలు

79

80 జ్ఞాన ప్రసూనాంబిక గుడి ముఖ మండపం

81 జ్ఞాన ప్రసూనాంబిక గుడి ప్రదక్షిణ మార్గం

82 జ్ఞాన ప్రసూనాంబిక గుడి అంతరాళం

83. జ్ఞాన ప్రసూనాంబిక గుడి గర్భ గృహం

84. శయన మందిరం

# శ్రీ కాళహస్తీశ్వర క్షేత్ర మాహాత్మ్యము

# తృతీయాధ్యాయం

## సంస్కృత, తమిళ, కన్నడ సాహిత్యాలలో శివుడు, శ్రీ కాళహస్తి

### 3.0 వేదాలలో శివుడు

భారతీయ ఆస్తికులలో బ్రహ్మ విష్ణు మహేశ్వరులనే త్రిమూర్తులు సుప్రసిద్ధులు, శివుడు మహాదేవుడు. ఋగ్ - యజుస్ - సామ - అధర్వ రూపంగా వున్న వేదరాశిలో శివుడు పరమోపాస్యదైవంగా ప్రస్తుతింపబడినాడు. ఋగ్వేద ప్రథమ మండలం 43 వ సూక్తంలోని ''కద్రుద్రాయ ప్రచేతసే" అను తొమ్మిదవ మంత్రంలోను, 114 వ సూక్తంలోని ''ఇమారుద్రా తవసే" అనే పదకొండు మంత్రాలలోను, ద్వితీయ మండలంలో 33 వ సూక్తంలోని ''ఆతే పిత ర్మరుతాం" అను పదునైదు మంత్రాలలోను, సప్తమ మండలంలో 46 వ సూక్తంలోని ''ఇమారుద్రాయ స్థిర ధన్వనే" అనే నాల్గు మంత్రాలలోను, మొత్తం 39 మంత్రాలలో విశ్వ కల్యాణ (శివ) స్వరూపుడైన రుద్రుని మహిమ కీర్తింపబడింది. నాల్గు సూక్తాలు రుద్ర సూక్తాలనియే వైదికుల వ్యవహారం. కావున ''కేవల చైతన్య స్వరూపుడు, మహాజ్ఞాని, శంకరుడు, రోగ నివారకుడు, వైద్యుడు, ప్రవక్త, ఉపదేశకుడు, పశుపతి, శూరుడు, పరమాత్మ, విశ్వాధిపతి, మృత్యుంజయుడు, తేజస్వి, అగ్ని రూపుడు, సూర్యుడు అని ముఖ్యమైన అర్థాలనిచ్చే పేర్లు రుద్రునికి ప్రయుక్తమై వున్నాయి."

ఈ సూక్తాలలోనే గాక ఇతర దేవతా సూక్తాలలో కూడ ఈ రుద్ర శబ్దం రెండు వందల సార్లు ప్రయోగింపబడింది. దీనివల్ల రుద్ర శబ్దమెంత విస్తృతమైన అర్థవ్యాప్తిని కల్గివుందో తెలుస్తుంది.

ఋగ్వేదంలో ప్రత్యేకంగా శివ సూక్తమనే పేరుతో మంత్రాలు లేకపోవడం వల్ల రుద్రుడు శివుడు కాడని కొందరు శంకిస్తున్నారు. కాని ఇది సమంజసం

కాదు. వేదవిభాగకాలంలో మహర్షులకు శివరుద్రుల్లో ఏకభావమే వుండేది. కాబట్టి రుద్రునికి, శివునికి వేర్వేరుగా సూక్తాలను విభజించలేదు. కాని, దశమమండలంలో దాదాపు యాభై పర్యాయాలు 'శివ' శబ్దం ప్రయోగింపబడింది. దీనికి వివిధార్థములున్నప్పటికీ కొన్ని చోట్ల విశేష్యంగాను, విశేషణం గాను వచ్చినందున శివ దేవతా భావాన్నే స్పష్టంగా గ్రహింపవచ్చు. రుద్ర శబ్దానికి సామాన్యంగా ''భయంకరుడు'' అనే ఒకే అర్థాన్ని కొందరు గ్రహించడం వల్లనే యిలాంటి విపరీత భావం ప్రచారమౌతోంది. వైదిక నిఘంటు - నిరుక్త కారుడైన యాస్కాచార్యుడే మంటున్నాడో చూడండి.

''రుద్రో రౌతీతి సతః, రోరూయమాణో ద్రవతీతి వా, రోదయ తేర్వా, ''యదరుదత్త ద్రుద్రస్య రుద్రత్వ'' మితి కారకం, యదరోదీత్త ద్రుద్రస్య రుద్రత్వం '' ఇతి హారిద్రవికం''

సత్పురుషుల కుపదేశించేవాడు. కరుణతో కరిగేవాడు. ఏడ్చువాడు అనగా మేఘస్థానం నుండి జలాన్ని రాల్చువాడు. ఏడ్పించువాడు. ''అథాపి నిషతిషిద్ధార్థా భవంతి '' ''ఏక ఏవ రుద్రః'' ''అసంఖ్యాతా రుద్రాః?'' రుద్ర శబ్దానికి వేరే అర్థాలు కూడా ఉన్నాయి. ఎందువలననగా రుద్రుడొకడుగాను, అసంఖ్యాతులు గాను కలరని వేదం చెబుతోంది.

యజుర్వేదంలో సుప్రసిద్ధమైన శతరుద్రీయ నమక, చమకాలలో రుద్రుడు శివుడుగానే ఘోషింపబడినాడు. పరమేశ్వరుడు లోకకల్యాణార్థమై రుద్రరూపాన్ని, శివరూపాన్ని ధరించుచున్నాడనియు, శివ, భవ, ఉగ్ర, అర్క, భర్గ, అగ్ని, రుద్ర, బ్రహ్మ, శర్వ మొదలైన పేర్లు శివవాచకాలు. అసలు అగ్నియే రుద్రు డన్నప్పుడు వైదికతాత్పర్యం శివోపాసనమే యని తెలుస్తోంది. ''భర్గో దేవస్య ధీమహి'' అని చెప్పిన గాయత్రీ ప్రతిపాద్యమైన భర్గము కూడా శివ తేజమనీ, సౌరోపాసన యిట్టి దేనని గ్రహించాలి.

పై అభిప్రాయాన్ని సమర్థించే కొన్ని ప్రమాణాలను యిక్కడ ఉదాహరిస్తున్నాము.

రుద్రం రుద్రేషు రుద్రియం హవామహే - ఋగ్వేదం 10-64-8
శంనో రుద్రో రుద్రేభి ర్జలాషః - ఋగ్వేదం 7-35-6
యః శుక్ర ఇవ సూర్యో హిరణ్య మివ - ఋగ్వేదం 1-43-5
భువనస్య పితరం గర్భిరాభీ రుద్రం - ఋగ్వేదం 6-49-10
అయం మే విశ్వభేషజో శివాభిమర్శనః - ఋగ్వేదం 8-1-2
యాతే రుద్ర శివా తనూ రఘోరా - యజుర్వేదం 16-1
నమశ్శివాయ చ శివతరాయ చ - యజుర్వేదం 16-18
జగతాం పతయే నమో నమో రుద్రాయా - యజుర్వేదం 16-5
సోఽర్యమా సవరుణః స రుద్ర స్సమాదేవః - అధర్వవేదం 13-4-4
య ఇమా విశ్వా భువనాని చక్లుపే తస్మైరుద్రాయ-అధర్వవేదం7 -92-1
అగ్నిర్వై స దేవః, తస్యై తాని నామాని, శర్వ ఇతి, భవ ఇతి,
పశూనాంపతీ, రుద్రోఽగ్నిరితి - శతపథ బ్రాహ్మణం 1-7-3-7
శివశ్శివ ఇతి శమయత్యే వైనం - శతపథం 6-7-3-15

## 3.2 యజుర్వేదం - శివ సంకల్ప సూక్తం

యజుర్వేదం పరమ శివుని ప్రస్తుతిస్తూ జీవులకు శివ సంకల్పం ప్రసాదించాలని చెప్పింది.

*యజ్జాగ్రతో దూరముదైతి దైవం తదుసుప్తస్య తథైవైతి*
*దూరంగమం జ్యోతిషాం జ్యోతిరేకం తన్మే మనః శివ సంకల్పమస్తు ॥*

ఓ దయానిధీ ! నీ కృప చేత నా మనస్సు జాగ్రదవస్థలో ఎంతో దవ్వు ప్రసరిస్తూ దివ్యగుణయుక్తమై వుంటుంది. నిద్రించేటప్పుడు నా మనస్సు సుషుప్తిని పొందుతుంది స్వప్నంలో దూరంగా పోయినట్లు వ్యవహరిస్తూ ప్రకాశాలకు ప్రకాశకంగా ఉంది. అలాంటి నా మనస్సు శివసంకల్పం తన కోసమూ, ఇతరుల కల్యాణం కోసమూ సంకల్పించేది అగుగాక ! అనగా ఎవరికీ ఎన్నటికినీ హాని చేయుట కిచ్ఛగింపకుండుమ గాక !

*యేన కర్మాణ్యపసో మనీషిణో యజ్ఞే కృణ్వంతి విద థేషు ధీరాః ।*
*యద పూర్వం యక్షమాతః ప్రజానాం తన్మే మనః శివ సంకల్పమస్తు ॥*

ఓ సర్వాంతర్యామీ ! కర్మయోగులు ధర్మయుక్తులగు విద్వాంసులు యజ్ఞమందు, యుద్ధాదులందు దేనిమూలాన పని చేయుచున్నారో, ఏది అపూర్వ సామర్థ్యంతో కూడి పూజనీయమై ప్రజల లోపల నుండునో అలాంటి నా మనస్సు ధర్మం చేసే యిచ్ఛతో కూడి అధర్మాన్ని సర్వధా వదలి పెట్టును గాక !

*యత్ప్ర జ్ఞాన ముత చేతో ధృతి శ్చ యజ్జ్యోతి రంత రమృతం ప్రజాసు ।*
*యస్మాన్న ఋతే కించన కర్మ క్రియతే తన్మే మనః శివ సంకల్ప మస్తు ॥*

ఏది ఉత్కృష్ట జ్ఞానమో ఏది యితరులకు చైతన్యము నిచ్చు నిశ్చయాత్మక వృత్తియో, ఏది ప్రజలలో ప్రకాశ యుక్తముగను, నాశ రహితముగను ఉండునో, ఏది లేక యెవ్వడు ఏ కార్యమును చేయజాలడో అట్టి నా మనస్సు శుద్ధ గుణములను కోరి దుష్ట గుణాల నుండి దూరముగా నుండుగాక !

*యేనేదం భూతం భువనం భవిష్యత్పరి గృహీత మమృతేన సర్వమ్ ।*
*యేన యజ్ఞస్తాయతే సప్త హోతా తన్మే మనః శివ సంకల్ప మస్తు ॥*

ఓ జగదీశ్వరా ! యోగులందరును దేనిమూలమున నీ భూత, భవిష్యద్వర్తమాన వ్యవహారాలన్నింటిని తెలియుచున్నారో, ఏది నాశరహితమైన జీవాత్మను పరమాత్మతో కలుపుచు అన్ని విధాల త్రికాలజ్ఞానిగ చేయుచున్నదో, దేని యందు జ్ఞాన క్రియ యున్నదో, దేని యందు పంచ జ్ఞానేంద్రియాలు, బుద్ధియు ఆత్మతో కూడియుండునో యోగరూపయజము దేనిచే వర్ధిల్లునో అట్టి నా మనస్సు యోగ విజ్ఞాన యుక్తమై అవిద్యాది క్లేశాల నుండి దూరమగును గాక!

*యస్మి న్నృచః సామ యజూగ్ంషి యస్మిన్ప్రతిష్ఠా రథనా భావి ।*
*యస్మిం శ్చిత్తగ్ం సర్వమోతం ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు ॥*

ఓ పరమ విద్వాంసుడవగు పరమేశ్వరా! చక్రమధ్యంలో అడ్డంగా ఆకులు కూడి యుండునట్లు ఏ నా మనస్సు నందు ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అధర్వణ వేదాలు ప్రతిష్ఠితాలగుచుండునో, దేని యందు సర్వజ్ఞుడున్ను, సర్వ వ్యాపకుడూ, ప్రజలకు సాక్షియగు చిత్త చైతన్యుడు విదితుడగునో ఆ నామనస్సు అవిద్యను పోగొట్టుకొని సదా విద్యాప్రియమగును గాక!

*సుషారధి రశ్వానివ యన్మను ష్యాన్నేనీయతే భీశుభిర్వాజిన ఇవ ।*
*హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠం తన్మే మనః శివ సంకల్పమస్తు ॥*

ఓ సర్వ నియంత వగు ఈశ్వరా ! గుఱ్ఱములను పగ్గముల చేత సారధి త్రిప్పునట్లు ఏది మనుష్యుల నటు యిటు త్రిప్పుచున్నదో, ఏది హృదయం నందుండి గల్గి అత్యంత వేగవంతమై యుండునో అట్టి నా మనస్సు సమస్తేంద్రియాలనూ అధర్మాచరణం నుండి నిరోధించి ధర్మపథమందు సర్వదా నడిపించునట్లు కృప చేయుము.

*అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్ ।*
*యుయోధ్య స్మజ్జుహు రాణమేనో భూయిష్ఠాంతే నమ ఉక్తిం విధేమ ॥*

సుఖమునిచ్చు వాడవై స్వప్రకాశస్వరూపుడవై సర్వజ్ఞుడ వైన పరమాత్మా! నీవు మమ్ముల్ని శ్రేష్ఠమార్గంలో నడిపి సంపూర్ణ ప్రజ్ఞానం అందజేయుము. కుటిల పాపాచరణ మార్గం నుండి మమ్ము దూరం చేయుము. మేము నమ్రతాపూర్వకంగా మిమ్ము నుతించు చున్నాము. మమ్ము పవిత్రుల్ని చేయుము.

*మా నో మహాంత ముత మా నో అర్భకం మా న ఉక్షంత ముత మా న ఉక్షితం ।*
*మా నో వధీః పితరం మోత మాతరం మా నః ప్రియాస్తన్వో రుద్ర రీరిషః ॥*

ఓ రుద్రా ! దుఃఖ రూపమైన పాప ఫలాలనిచ్చి దుష్టుల నేడ్పించు పరమేశ్వరా ! నీవు మా యందలి అర్భకులను, పెద్దలను, తల్లి తండ్రులను ప్రియులను, బంధు వర్గమును, శరీరములను చంపుటకు మమ్ము ప్రేరేపింపకుము. నీ దండనమునకు పాత్రులము కాకుండునట్టి మార్గము మమ్ము నడుపుము.

ఈ విధంగా వేదము శివపారమ్యాన్ని, శివభక్తిని ప్రతిపాదించి ప్రచారము చేసినది. వేదాలలో ప్రముఖంగా ప్రస్తుతింప బడిన రుద్రుడే, 'శివము మంగళము, శుభము అనే అర్థాలలో ప్రయోగింపబడి ''శివ'' శబ్దము రుద్ర శబ్ద స్థానమున రూఢి కెక్కినది. ఇలా రుద్ర, శివ శబ్దాలు వేదాలలో పర్యాయపదాలుగా వాడబడిన వని చెప్పినా దోషము లేదు.

### 3.2 ఉపనిషత్తులలో శివుడు

ప్రపంచోప శమం శాంతం శివ మద్వైతం - మాండూక్యోపనిషత్తు 1-
ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థుః - శ్వేతాశ్వతరోపనిషత్తు 3-
న సన్న చాసత్ శివ ఏవ కేవలః - శ్వేతాశ్వతరోపనిషత్తు 4-
ఏకో రుద్రో న ద్వితీయాయ తస్మై - అథర్వ శిరోపనిషత్తు -5
రుద్రమేకత్వ మాహుః శాశ్వతం వై పురాణం - అథర్వ శిరోపనిషత్తు 3-
శివ ఏకః స్వేన భాసేదం సర్వం - త్రి బ్రాహ్మణము 1-1

వేదోపనిషత్తులలో నిరూపింప బడిన పరమ పురుషుడు శివుడు ఇతడే రుద్రుడని, ఈశానుడని, లింగస్వరూపుడని ఆయా సందర్భాలలో చెప్పబడింది. 'శివ ఏవ కేవలః' అని శ్వేతాశ్వతరోపనిషత్తు ప్రతిపాదిస్తోంది శివుడు మాత్రమే పర దైవమనీ, అతడొక్కడే కలడని ఈ మంత్రాని కర్థ

*''యదా తమస్తన్న దివాన రాత్రి ర్న సన్న చా సచ్ఛివ ఏవ కేవలః* అని వేదవచనం. సృష్టికి పూర్వం సత్తుగాని, అసత్తుగాని లేదనియు కేవల

శివుడొక్కడే కలడనియు ఈ మంత్రానికి అర్థం.

*''ఋతగ్ంం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణ పింగళం*

*ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయవై నమోనమః ॥"*

*''ఈశాన స్సర్వ విద్యానా మీశ్వర స్సర్వ భూతానాం*

*బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోఽధిపతి ర్బ్రహ్మ శివోమే అస్తు సదా శివో ఓం "*

అని మొదలైన శ్రుతి సంచయం పర బ్రహ్మముగను, సమస్తాధిపతి గను శివుని వర్ణించినది.

'ఏకోరుద్రో న ద్వితీయాయ తస్థే విశ్వాధికో రుద్రో మహర్షిః' 'శివ ఏకో ధ్యేయః' అను మంత్రోపనిషదాదికములైన వాక్యాలు రుద్రుని విశ్వాధికునిగ అద్వైతునిగ, ధ్యాన యోగ్యునిగ అనేక విధములుగ ప్రశంసిస్తున్నాయి. రుద్రశబ్దానికి శివ తత్త్వసుధానిధి యిట్లు పరిష్కరించినది. ''*రుద్ర ద్వేవ చ సంసార దుఃఖం ద్రావ యతి ప్రభుః రుద్ర ఇత్యుచ్యతే వేదైః వేద వేదాంత వేదిభిః । రుద్ర ఏవ శివః ప్రోక్తః రుద్ర ఏవ సదాశివః, రుద్ర ఏవ పరం జ్యోతి రుద్రోహ ఏష వాక్యతః*'' సంసార దుఃఖాన్ని హరించు నాతడే రుద్రుడగుచున్నాడు.అతడే పరంజ్యోతి యగు శివుడగుచున్నాడు.

3-3 ఈశావాస్యోపనిషత్తు - జీవేశ్వర తత్త్వం [1]

*ఈశావాస్య మిదం సర్వం - యత్కించ జగత్యాం జగత్ ।*

*తేన త్యక్తేన భుంజీథాః - మాగృధః కస్య స్విద్ధనమ్ ॥*

a) విశ్వగతి నాశయించిన వైయక్తిక ప్రపంచ గతి యేది కలదో ఆ సర్వము పరమేశ్వరునకు నివాసము. కాబట్టి విరక్త (త్యాగ) బుద్ధిచే ననుభవింపుము. అన్య ధనము నభిలషింపకుము.

---

1 *ఈశావాస్యోపనిషత్తు (భాష్యారవిందము) ఆచార్యతుమ్మపూడి కోటేశ్వరరావు మలయకూట ప్రచురణలు, అనంతపురం, 1985.*

b) కర్మలను నిర్వహించుచునే మానవుడు శతవర్షములు జీవించ గోర వలెను ఇదే నీ యందున్నది. ఇంతకంటె మార్గము లేదు. నరునకు కర్మ లేపన మంటదు.

c) అంధ తమస్సుచే నావరింప బడిన అసూర్యనామ లోకములకు ఆత్మ హంతలగువారు మరణించి పోవుచున్నారు.

d) ఏకము, అచలము, మనో వేగాధికము ముందు పరిక్రమించున దగుటచే దేవతలు అందుకోరానిది(కదలిక)నిలుచుండి పరుగెత్తు వాని నతిక్రమించునది. దాని యందు ప్రాణపతి నీటిని నిక్షేపించెను.

e) అది చలము. అచలము. అది దూరస్థితము. అంతిక స్థితము. సర్వమున కంతర్గతము, బహిర్గతము.

f) ఎవడు సర్వభూతములందు ఆత్మను, ఆత్మ యందు సర్వభూతముల దర్శించునో వాడంతట జుగుప్స నొహించడు.

g) ఎవని యందలి ఆత్మయే సర్వభూతములుగానయ్యెనని సమ్యగ్ జ్ఞానమందుయున్నాడో అట్టి ఏకత్వమును దర్శించు వానికి శోక మెక్కడిది! మోహమెక్కడిది!

h) శుక్రము (స్వచ్ఛమైనది) అశరీరము, అవ్రణము (అపరిపూర్ణత యన్న దోషము లేనిది) స్నాయువులు లేనిది (నరములు లేనిది) పరిశుద్ధము, పాపరహితమునగు అతడు సర్వమునం దభివ్యాపించెను. కవి, మనీషి (ప్రజ్ఞావంతుడు) సర్వవ్యాపి, స్వయంభువు (ఇతర మందాధార పడకుండ తనంతట నున్నవాడు) శాశ్వత కాలము నుండి పదార్థములను తత్తత్స్వ భావానుసారముగ నియమించెను.

i) అవిద్యో పాసకులు అంధ తమస్సును ప్రవేశించు చున్నారు. విద్యారతుల అంతకంటె (అంధతమస్సు) ను ప్రవేశించుచున్నారు.

j) అవిద్య చేతనే యని కొందరు, విద్య చేత నని మరి కొందరు ఇది పండితులు మా యొఱుక కందించిన సంప్రదాయము

k) జ్ఞానా జ్ఞానములను రెంటిని ఒకటిగా దర్శించు వాడు, అవిద్యచే మృత్యువును తరించి విద్యచే అమృతత్వము ననుభవించు చున్నాడు

l) అసంభూతి (అజన్మ) నుపాసించువాడు అంధ తమస్సును ప్రవేశించు చున్నాడు. సంభూతి (జన్మ) కంటి పెట్టుకొన్నవాడు అంతకంటె కారు చీకటిలో ప్రవేశించు చున్నాడు

m) కొందఱు జన్మ (సంభవము) చే ననగా మరి కొందఱు అజన్మ (అసంభవము) చే ననుచున్నారు. ఇది పండితులు మా యొఱుక కందించిన సంప్రదాయము

n) జన్మ - జన్మనాశములు రెంటి నొకటిగా దర్శించు వాడు వినాశముచే మృత్యువును తరించి సంభూతి (జన్మ) చే అమృతత్వ మనుభవించు చున్నాడు

o) సత్యము యొక్క ముఖము (అగ్రము) కాంతిమంతమైన బంగారు మూతచే కప్పబడి యున్నది. ఓయీ! పూషుడా! సత్య ధర్మ దృష్టి కొఱకు నీవు దానిని తొలగింపుము

p) పూషా! ఏకైక ఋషీ! నియామకా! (ప్రకాశించు) సూర్యుడా! సర్వమునకు పితృ దేవుడగు ప్రజాపతి శక్తీ! నీ కిరణములను వెల్వరింపుము. నీ తేజస్సును ఏక ముఖముగా నొనర్పుము. నీ సర్వాతి శాయిమైన భద్రంకర దివ్య రూపము దర్శించు చున్నాను. ఆయా పురుషుడెవడో వాడే నేను.

q) పదార్థ గత ప్రాణము అమృత జీవనము (మరణము లేని బ్రతుకు కలది) కాని శరీరము భస్మాంతము (బూడిదగా మిగులునది) ఓం. ఓ మనసా! చేసినది స్మరింపుము. ఓ మనసా! స్మరింపుము. కృతమును స్మరింపుము

r) ఓ అగ్ని దేవా! సృష్టింప బడిన సమస్త వస్తు జాతము నెఱిగిన వాడవు. మమ్ము ఆనంద లక్ష్యములైన ఉత్పథము లందు నడిపింపుము. దుర్మార్గ

మగు పాపాకర్షణముల నుండి మమ్ము తొలగింపుము. నీకు సంపూర్ణమైన వినమితోక్తిని సమర్పించు చున్నాము.

ఈ చిట్టచివరి మంత్రం యజుర్వేదం లోని శివసంకల్ప సూక్తం నుండి గ్రహింపబడినది కావున ఈశావాస్యోపనిషత్తు నందు ఈశ్వర తత్త్వం జీవ ప్రబోధాత్మకంగా వేదాంత పరిభాషలో వర్ణింప బడినదని చెప్పవచ్చును. ఇందలి సంక్షిప్తార్థ మిది -

1. ఈశ్వరుడు - జగత్తు 2. త్యాగము - భోగము 3. కర్మ - అంతరస్వాతంత్ర్యము 4. ఏకము - అనేకము 5. తత్త్వము - సృష్టి 6. సాక్షి భూతాత్మ - క్రియాత్మక మూర్తి (నిర్గుణ సగుణతత్త్వములు) 7 జ్ఞానము - అజ్ఞానము 8 సంభూతి (జన్మ) - అసంభూతి (అజన్మ) 9. సృష్టి - ప్రళయము 10 భౌతిక జీవితము - దివ్య (అభౌతిక) జీవితము, అమృతత్వము, ఈ ఉపనిషత్తాత్పర్యము పై చెప్పబడిన కేవల విరుద్ధాంశ సమన్వయము

"వాస్య శబ్దమునకు మూడర్థములున్నాయి.

1 ఆచ్ఛాద్యము 2. వస్త్రము వలె ధరింప దగినది 3. నివాసయోగ్యము.

మొదటిది సామాన్యముగ నంద రంగీకరించినదే. విశ్వము, ప్రేరకమైన - పాలకమైన తత్త్వమునకు వస్త్రము (ధరింప దగినది) లేక గృహము. ఇది యందలి భావ చిత్రణము. ఈ యర్థమే యుపనిషత్తు సాధించిన సమన్వయమున కనుకూలము. "

"ఈశావాస్యమైన జగత్తూ - ఈశ, మనస్సు వలె సర్వ దేవతా జీవ నివాసం ఈశావాస్య మంటే, ఏకం సత్ - అయినా - బహుధా - తనను తాను శిల్పించు కొంటున్నది. ఇవన్నీ శిల్పాలే శిల్పి ఏకర్షీ ఈశుడు. తచ్ఛిల్పిత శిల్పం జగత్తు. శిల్పి మనస్సే శిల్పంగా ఆవిర్భూతమౌతున్నది. ఇదే విషయం సపర్యగాత్ - అన్నచోట కవిగా చెప్పబడ్డది. ఈ మంత్ర వ్యాఖ్యలు చూస్తే శ్రీఅరవిందులు ఈ కళాసూత్ర దృష్టి తోనే ఈశావాస్యాన్ని వ్యాఖ్యానించటం స్పష్టపడుతుంది. అందుకే ఆ మహాత్ముడు వేదమంత్రాలను

Mystic Poetry అన్నారు. కవి సత్యమైతే కావ్యమూ సత్యమే!"

## 3.5 పురాణాలలో శివుడు

### 3.5.1 పురాణ నిర్వచనం

పురాణ శబ్దానికెన్నో నిర్వచనాలున్నాయి.

a) పురా భవ మితి పురాణం b) పురాపి నవం పురాణం c) పురా అనక్తి ఇతి పురాణం d) పురానీయతే ఇతి పురాణమ్. ఛాందోగ్యోపనిషత్తు ఇతిహాస పురాణము పంచమ వేదము తెలుపుతోంది. ఎవడు నాల్గు వేదాలు చదివి కూడా పురాణాలను పఠింపడో అతడు విద్వాంసుడు, విచక్షణుడు కాడని వాయుపురాణము తెల్పుతోంది. దేవీ భాగవతమున పరమేశ్వరునకు శ్రుతి స్మృతులు రెండు నేత్రములనియు, పురాణము హృదయమనియు చెప్పబడినది.

*పురాణం సర్వ శాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణా స్మృతమ్ ।*
*అనంతరం చ వక్త్రేభ్యః వేదా స్తస్య వినిర్గతాః ॥*

అని నారదీయ పురాణం పేర్కొనేంది. పురాణ శబ్దమే వాని ప్రాచీనతను చెబుతోంది. వేదభాష ప్రాచీనమవడంచేత జనులకు దురవగాహమైనప్పుడు తత్ప్రతిపాదిత ధర్మనీతి తత్త్వాలను కథాఖ్యానాల ద్వారా వివరించ డానికై వ్యాసుడు లౌకిక సంస్కృతంలో పురాణాలను, భారతాన్ని రచించినాడని చెబుతారు. ''ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్ " అనే కూర్మ పురాణ వచనం దీనిని బలపరుస్తోంది.

### 3.5.2 అష్టాదశ మహాపురాణాలు

అతి ప్రాచీన కాలంలో వేద మొక్కటే ఉండేది. దానిని వర్గీకరించి చతుర్వేద విభాగ మేర్పరచినవాడు కృష్ణద్వైపాయనుడు. అట్లే ప్రాచీన కాలంలో పురాణ మొక్కటే ఉండేది. దానిని వర్గీకరించి అష్టాదశ మహాపురాణాలుగా విశ్లేషించిన పుణ్య పురుషుడు వేదవ్యాసుడే.

1) మత్స్య పురాణం 2) మార్కండేయ పురాణం 3) భాగవత పురాణం

4) భవిష్యత్పురాణం 5) బ్రహ్మాండ పురాణం 6) స్కాంద పురాణం 7) బ్రహ్మ పురాణం 8) వైవర్త పురాణం 9) వామన పురాణం 10) వాయు పురాణం 11) విష్ణు పురాణం 12) వారాహ పురాణం 13) అగ్ని పురాణం 14) నారద పురాణం 15) పద్మ పురాణం 16) లింగ పురాణం 17) గరుడ పురాణం 18) కూర్మ పురాణం

### 3.5.3 ఉప పురాణాలు

ఉశన, కపిల, కాళి, సనత్కుమార, శంభు, సౌర, దౌర్వాస, నందీయ, నారసింహ, నారదీయ, పారాశర, అంగీరస, భృగు, మారీచ, మానవ, వాశిష్ఠ సంహితలు ఉప పురాణాలు.

### 3.5.4 ఉపోప పురాణాలు

శ్రీ రంగమాహాత్మ్యం, శ్రీ కాళహస్తి స్థల మాహాత్మ్యం, భీమేశ్వర మాహాత్మ్యం, శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యం ఇత్యాది అసంఖ్యాకమైన స్థల మాహాత్మ్యాలన్నీ ఉపోప పురాణాలు. ఉపోప పురాణాలనే మాటను బట్టియే అవి తర్వాత వ్రాసి చేర్చబడినవని చెప్పకనే చెబుతోంది. శ్రీకాళహస్తి స్థల పురాణం కూడా ఉపోప పురాణమే. H H Wilson స్థలమహాత్మ్యాలను గూర్చి ప్రస్తావిస్తూ అవి ప్రక్షిప్తములు "latter additions" అన్నారు. మన వారు దానికాపేరు ఆ ఉద్దేశముతోనే పెట్టినారు.

### 3.5.5 శివ పురాణం అష్టాదశ పురాణముల లోనిదా ?

అష్టాదశ మహా పురాణాల పేర్లలో శివపురాణం పేరు లేదు. "మద్వయం భద్వయం చైవ" అనే దేవీ భాగవత ప్రోక్త శ్లోకంలో శివ పురాణాన్ని సూచించే అక్షరం లేదు. 'వ' చతుష్టయంచే విష్ణు, వాయు, వరాహ, వామన పురాణాలు సూచింపబడుతున్నాయి. స్కాందపురాణం శివ పురాణాన్ని నాల్గవ పురాణం గాను, బ్రహ్మాండ పురాణానికి బదులు వాయువ్యపురాణాన్ని పదునెనిమిదవ పురాణంగ తెల్పింది. మత్స్య పురాణంలోని-

*యత్ర తద్వాయవీయం స్యాద్రుద్ర మాహాత్మ్య సంయుతమ్ ।*
*చతుర్వింశ సహస్రాణి పురాణం శైవ ముచ్యతే ॥*

అనే శ్లోకం వలన వాయుపురాణం రుద్రమాహాత్మ్య సంయుతమని, 24 వేల శ్లోకాలందున్నవని, అది శైవపురాణమని చెప్పబడినది. కొన్ని ప్రతుల్లో "ఇతి వాయు పురాణం శివాపరాహ్వాయం సమాప్తమ్" అను వాక్యము కానవచ్చుచున్నది. దీనిని బట్టి కొందరు పండితులు వాయు, శివ పురాణాలు అభిన్నములని నిశ్చయించారు. భాగవతం "బ్రాహ్మం పాద్మం వైష్ణవం శైవం లైంగం చ గారుడమ్" అని వాయుపురాణాన్ని పేర్కొనక శైవ పురాణాన్నే పేర్కొనింది. కాబట్టి శివ పురాణం మహాపురాణాలలో వాల్గవది.

కొందరు పురాణాలను త్రిగుణాలను బట్టి మూడు విధాలుగా విభజించారు. పద్మ పురాణం ఒక్కొక్క గుణానికి ఆరేసి చొప్పున పదునెనిమిదింటిని సమంగా విభజించినది. అందులో శివ పురాణం తామస వర్గీకరణం క్రింద వస్తుంది. స్కాందపురాణం "అష్టాదశ పురాణేషు దశ భిర్గీయతే శివః" అని పది పురాణాలు శివస్తుతి పరాలని చెప్పింది. కొందరు బ్రహ్మ సూర్యాగ్ని శివ విష్ణు పరాలని పురాణాలను పంచవిధాలుగా విభజించారు. మరికొందరు విషయాన్నిబట్టి పురాణాలను ఆరు విధాలుగా వర్గీకరించారు. ఈ విభజనంలో శివ పురాణం మత ప్రాధాన్యాన్ని వివక్షించే వర్గంలో చేరుతుంది.

### 3.5.6 శివ పురాణ ప్రాశస్త్యం

శివ పురాణంలో విద్యేశ్వర సంహిత (2000 శ్లోకాలు) రుద్ర సంహిత (12,680) శత రుద్ర సంహిత (1120 శ్లోకాలు) కోటి రుద్ర సంహిత (1120 శ్లోకాలు) ఉమాసంహిత (1860 శ్లోకాలు) కైలాస సంహిత (4000 శ్లోకాలు) వాయవీయ సంహిత అను ఆరు సంహితలున్నాయి. 457 అధ్యాయాలుగా విభజింప బడింది. పురాణానికి చెప్పబడిన సర్గ ప్రతిసర్గ వంశ మన్వంతర వంశాను చరితములను పంచలక్షణాలిందున్నాయి. శైవ మతానికి సంబంధించిన సర్వ విషయాలిందు ప్రపంచింపబడినాయి.

విద్యేశ్వర సంహితలో-లింగార్చన ప్రాముఖ్యం, పంచాక్షరీజపవిధానం, ప్రణవ పంచాక్షరీ మహిమ, పార్థివ పూజా విధానం, రుద్రాక్ష శివనామ మహిమ, భస్మమాహాత్మ్యం వివరింప బడినవి.

రుద్ర సంహిత చాల పెద్దది. పురాణంలో సగ భాగం యిదియే. దీనిలో సృష్టి ప్రళయాది వర్ణనలో సంధ్యాకృత శివస్తోత్రం, దుర్గా స్తోత్రం, దేవతాకృత శివ స్తోత్రం, దక్షాధ్వర ధ్వంసం, శివ పార్వతీ వివాహం, కుమార జననం, తారకాసుర సంహారం, గణపతి జననాదికం, త్రిపురాసుర సంహారం, జలంధర శంఖ చూడుల వృత్తాంతం, అంధకాసురవృత్తాంతం, బాణాసురవృత్తాంతం మొదలైన విషయాలున్నాయి. ఈ సంహితలోని పార్వతీ ఖండం నుండియే మహాకవి కాళిదాసు కథా వస్తువును గ్రహించి కుమార సంభవాన్ని రచించాడు. ఇందలి ఋతువర్ణనలు కావ్యోచితాలై హృద్యంగా ఉన్నవి. శతరుద్ర సంహిత శివుని అవతార విశేషములు వర్ణిస్తున్నది. కోటి రుద్ర సంహిత ద్వాదశ జ్యోతిర్లింగములను, శివలింగ స్వరూపమును, శివ సహస్ర నామములను, శివరాత్రివ్రతోద్యాపనమును విశదీకరిస్తున్నది. పాతకోపపాతక నిరూపణం, వివిధదానములమహిమ, నరక పాతాళ లోక జంబూద్వీపాదుల వర్ణనం, త్రిస్వభావం, వేద వ్యాస వృత్తాంతం ఉమాప్రాదుర్భావం మున్నగునవి ఉమాసంహిత లోని ముఖ్య విషయాలు. కైలాస సంహితలో సన్యాస స్వీకారానుష్ఠాన విధానాలు, వాయవీయ సంహితలో శివాద్వైత సిద్ధాంత వివరణం, ఉపమన్యుచరిత్ర, నిత్య నైమిత్తిక కర్మల స్వరూపం, శివ మహాస్తోత్రం మున్నగునవి కలవు. దక్షాధ్వర ధ్వంస వృత్తాంత మిందు పునరుక్తమైనది. ఈ విధంగా యీ పురాణం లోని షట్సంహితలలోనుగల విషయవిస్తృతిని గమనించినచో నిదియొక విజ్ఞానకోశము వలె కన్పించును. కావుననే శివశ్రీ నిర్మల శంకర శాస్త్రి ఆరాధ్యుల వారు యీ పురాణాన్ని వచనంలో వ్రాసి దీనికి 'శివవిజ్ఞానసర్వస్వ' మని పేరు పెట్టినారు.

ఆయా పురాణాలు ఆయా దైవాల పారమ్యాన్ని ప్రకటించునట్లే

శివపురాణం శివుని పారమ్యాన్ని ప్రకటిస్తుంది. భగవంతుడెవరు? ముక్తి యనగానేమి? ముముక్షువులు పొందవలసిన దీక్ష యెట్టిది? సాధన సంపత్తి యెట్టిది? మున్నగు ప్రశ్నలకి పురాణంలో శివపరంగా సమాధానాలు చెప్పబడినాయి. త్రిమూర్తులకు మూలపురుషుడు శివుడే యనియు, పరాశక్తి శివాజ్ఞావర్తిని యగు శివధర్మచారిణి అనియు శివేతర దైవాలను కొలుచువారు కూడ అయాదైవముల లోకముల కేగి చివరికి శివ సాయుజ్యము నొందుదురని తెలుప బడింది. సకామముగ దైవముల నర్చించు వారు కూడ శివునే యర్చించినచో ఫలప్రాప్తి నొందుదురు. శివాపచార మొనరించు వారిని శివుడే క్షమించును. అభీష్ట ప్రదాలగు మంత్రాలు, స్తోత్రాలు, దీనిలో అనేకం వున్నాయి. గాయత్రీ మంత్ర మందలి భర్గుడు శివుడని భావించినచో అతడు సూర్యునిలో నుండి ఆ మంత్రాన్ని జపించే వారి బుద్ధులను ప్రేరేచునని యిందు ప్రతిపాదింపబడింది.

### 3.5.7 ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రం

అనాదిగా భారత దేశంలో శైవమే ప్రధాన మతం. కాశ్మీరం నుండి కన్యాకుమారి వరకు, అటకం నుండి కటకం వరకు లింగపూజ సాగుచుండెడిది. హిందూమతంలో ఏకాత్మతను ప్రతిపాదించే ద్వాదశ జ్యోతిర్లింగాలు భారత దేశ మంతటా వ్యాపించి వున్నాయి. అవి -

1) సోమనాధ లింగము - సౌరాష్ట్రము
2) మల్లికార్జున లింగము - శ్రీశైలము
3) మహాకాళ లింగము - ఉజ్జయిని
4) ఓంకార లింగము - పరమేశ్వరం
5) కేదార లింగము - హిమవంతము
6) భీమశంకర లింగము - ఢాకినీ క్షేత్రం
7) విశ్వేశ్వర లింగం - వారణాశి
8) త్ర్యంబక లింగము - గౌతమీతటం

9) వైద్యనాథ లింగము - చితాభూమి
10) నాగేశ లింగము - దారు కావనము
11) రామేశ లింగము - సేతు బంధనం (రామేశ్వరం)
12) ఘుశ్మేశ లింగము - శివాలయం

॥ శ్లో ॥ సౌరాష్ట్రే సోమనాథం చ - శ్రీశైలే మల్లికార్జునం ।
ఉజ్జయిన్యాం మహాకాల - మోంకారే పరమేశ్వరమ్ ॥
కేదారం హిమవత్ పృష్ఠే - ఢాకిన్యాం భీమ శంకరమ్ ।
వారాణస్యాం చ విశ్వేశం - త్ర్యంబకం గౌతమీ తటే ॥
వైద్యనాథం చితా భూమౌ - నాగేశం దారుకావనే ।
సేతు బంధే చ రామేశం - ఘుశ్మేశం చ శివాలయే ॥

ఫలశ్రుతి

ద్వాదశైతాని నామాని - ప్రాతరుత్థాయ యః పఠేత్ ।
సర్వపాప వినిర్ముక్తః - సర్వసిద్ధి ఫలం లభేత్ ॥
యం యం కామ మపేక్ష్యైవ పఠిష్యంతి నరోత్తమాః ।
ప్రాప్స్యంతి కామం తం తం హి - సర్వతేహ మునీశ్వరాః ॥

### 3.5.8 ఉప లింగాలు

a) సోమనాథుని ఉపలింగము అంతకేశుడు
b) మల్లికార్జుని ఉపలింగము రుద్రేశ్వరుడు
c) మహాకాలుని ఉపలింగము దుగ్ధేశుడు
d) ఓంకారేశ్వరుని ఉపలింగము కర్దమేశుడు
e) కేదారేశ్వరుని ఉపలింగము భూతేశుడు
f) భీమశంకరుని ఉపలింగము భీమేశ్వరుడు
g) నాగేశ్వరుని ఉపలింగము భూతేశ్వరుడు
h) రామేశ్వరుని ఉపలింగము గుప్తేశ్వరుడు
i) ఘుశ్మేశుని ఉపలింగము వ్యాఘ్రేశ్వరుడు

ఇక్కడ పరిశీలింపవలసిన ప్రధానాంశమేమనగా ద్వాదశ జ్యోతిర్లింగాల లోను ఉపలింగాల లోను ఎక్కడా శ్రీకాళహస్తీశ లింగము చెప్పబడలేదు. శ్రీ ఆదిశంకరులు తమ స్తోత్ర వాఙ్మయంలో ద్వాదశ లింగ స్తోత్రం చేశారు అందులో దేశనామములు కూడా చెప్పారు కాని అందులోను శ్రీకాళహస్తీశలింగ ప్రశంస లేకుండుట చూడగా శ్రీకాళహస్తీశ్వరుని ప్రసిద్ధి శ్రీశంకరుల తర్వాతనే అనగా క్రీ.శ 7 వ శతాబ్ది పిమ్మటనే ఏర్పడినదని చెప్పవలసివుంది. కాబట్టి ఈ స్థలమాహాత్మ్యం ఉపోప పురాణంగా గుర్తింప వలసి వుంది. కాని, దీనికి బాధకంగా నిల్చినది శ్రీశంకరుల 'శివానందలహరి'లో

*మార్గావర్తిత పాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే*
*గండూషాంబు నిషేచనం పుర రిపోర్దివ్యాభిషేకాయితే ।*
*కించి ద్భక్షిత మాంస శేష కబలం నవ్యోప హారాయతే*
*భక్తిః కిం న కరోత్యహో వనచరో భక్తావతంసాయతే ॥ (శ్లో 63)*

ఈ శ్లోకంలో కన్నప్పనాయనారు లేదా భక్త కన్నప్ప,ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యానుసారం తిన్నని భక్తి విషయం ప్రస్తావింపబడింది నాయన్మారులు, ఆళ్వారులు శ్రీశంకరుల కాలానికి ముందే వెలసినట్లు చెప్పవచ్చు. కన్నప్ప కాలంనాటికి పొత్తపినాడులోని అరణ్య మధ్యమున శివలింగమే వుంది ఆ శివుని భక్తుడే కన్నప్ప, ఈతడే కాదు, తిరుజ్ఞాన సంబంధర్, నక్కీరుల విషయం కూడ శ్రీఆది శంకరులు సౌందర్య లహరీ స్తోత్రంలో ప్రస్తావించారు. అది యిలా వుంది -

*తవ స్తన్యం మన్యే ధరణీధర కన్యే హృదయతః*
*పయః పారావారః పరివహతి సారస్వత మివ ।*
*దయావత్యా దత్తం ద్రవిడ శిశురాస్వాద్య తవ యత్*
*కవీనాం ప్రౌఢానామజని కమనీయః కవయితా ॥ (శ్లో 75)*

ఈ శ్లోకంలో చెప్పబడిన 'ద్రవిడ శిశువు' 'తిరుజ్ఞాన సంబంధర్' నాయన్మారు గా గుర్తింపబడినాడు. అలాగే సంగ కాలము నాటి నక్కీరుని

కధను స్ఫురింప జేస్తూ సౌందర్య లహరిలో -

*ధునోతు ధ్వాంతం నస్తులిత దలితేందీవరవనమ్*
*ఘన స్నిగ్ధశ్లక్ష్ణం చికుర నికురుంబం తవ శివే।*
*యదీయం సౌరభ్యం సహజముపలబ్ధుం సుమనసో*
*వసన్త్యస్మిన్ మన్యే వల మథన వాటీ విటపినామ్ ॥ (శ్లో. 43)*

"సింధురరాజగమనా ధమ్మిల్లబంధంబు సహజగంధంబని" ధూర్జటి కావ్యంలో, నత్కీరుడు శివుని కవిత్వంలో తప్పు పట్టిన ఘట్టం యిక్కడ జ్ఞప్తికి రాకమానదు కదా!

కాబట్టి, సారాంశమేమనగా ఆళ్వారులు, శివ భక్తులైన అరువత్తు మూవురు నాయన్మారులలో కొందరు శ్రీ శంకరుని కంటే ప్రాచీనులు కావునసే వారిని ఆయన స్తోత్రాలలో ప్రశంసించడం జరిగింది. ఆంధ్ర దేశంలో బౌద్ధ, జైన కాలాల నుండి శ్రీశైలానికి శైవక్షేత్రంగా గల ప్రసిద్ధి మరియే యితర దేవాలయానికీ లేదు. కావున శ్రీ శంకరుల తర్వాతనే శ్రీ కాళహస్తికి ప్రసిద్ధి రావడం ప్రారంభించినదని చెప్పవచ్చును.

3.5 9 వాయు లింగము - శ్రీ కాళహస్తీశ్వరుడు

వాయువ్య పురాణమే శివ పురాణంగా గుర్తింప బడినట్లు, పురాణాలలో చెప్పబడక పోయినా ఉపాప పురాణంలో పంచ భూత లింగాలలో శ్రీ కాళహస్తీశ్వర లింగం వాయులింగంగా పేరు కెక్కినది.

a) కంచి లో ఏకామ్రేశ్వరుడు పృథ్వీలింగం
b) శ్రీ రంగం దగ్గర లోని జంబుకేశ్వరమున జలలింగం
c) అరుణాచలములో తేజోలింగం
d) చిదంబరమున ఆకాశలింగం
e) శ్రీ కాళహస్తిలో వాయులింగం

కృత యుగంలో యిక్కడ స్వామి, వాయురూపం లోనే యుండి మహాయోగులకు స్పర్శ మాత్రముననే ఒనుగ్రహించెడివాడట! త్రేతా యుగంలో స్వర్ణరూపం, ద్వాపర యుగంలో రజత రూపం, కలియుగంలో

శ్వేత శిలా రూపాన్ని పొంది, తన సహజ వాయు తత్వ నిదర్శనంగా గర్భాలయంలో స్వామికి కుడి ప్రక్క నున్న దీపములు రెండింటిలో ఒకటి నిశ్చలముగా "యథా దీపోనివాతస్థో" అన్న భగవద్గీతా శ్లోకానికి ప్రమాణంగా ఉండగా, మరియొకటి ద్వంద్వాత్మక ప్రవృత్తి గల్గిన జీవుని వలె ఎల్లప్పుడూ చలించు చుండుటయే దీనికి ప్రబల దృష్టాంతం !

### 3.5.10 స్కాంద పురాణాంతర్గత శివరహస్య ఖండం

స్కాంద పురాణంలో శంకర సంహిత యందు శివరహస్య ఖండమున్నది. దీనిలో ఏడు కాండములున్నవి.

a) సంభవ కాండము b) ఆసుర కాండము c) వీర మాహేంద్ర కాండము d) యుద్ధ కాండము e) దేవ కాండము f) దక్ష కాండము g) ఉపదేశ కాండము. దీనిలో శివోత్కర్ష ప్రతిపాదింప బడినది.

ఈ శివ రహస్య ఖండాన్ని తెలుగులో ఐదుగురు కవులు వేర్వేరు కాలాలలో అనువదించి యున్నారు.

a) కోడూరివేంకటాచలకవి (క్రీ.శ.1650 -1700)

b) రాపాక వేంకట దాసకవి (క్రీ.శ. 1700)

c) రేవూరిఅనంతయజ్వ (క్రీ.శ. 18 వ శతాబ్ది మధ్య భాగం)

d) వంకాయల పాటి వీరభద్రకవి (క్రీ.శ. 18 వ శతాబ్ది)

e) ముదిగొండ బ్రహ్మయ లింగారాధ్యుడు (క్రీ.శ. 1750)

ఈ విధంగా వైదిక వాఙ్మయంలోని సంహితలు, బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు, నిరుక్తం మున్నగు ప్రాచీన గ్రంథాలలోని ప్రమాణ వాక్యాలను పర్యాలోచించగా శివ - రుద్ర శబ్దములు ఏక దేవతా వాచకాలనియు, మంగళార్థకమైన 'శివ' శబ్దం, ఉపనిషత్తుల్లో 'ఈశాన' మనే పర బ్రహ్మ స్ఫోరకంగా ప్రయోగింప బడిందనీ, పురాణాల్లో 'శివ' మనే పేరుతో శైవ మత ప్రాతిపదిక తో ప్రపంచింప బడిన దనియు అందులో శివలింగ పూజా ప్రాముఖ్యమునే చెప్పినపుడు శ్రీకాళహస్తి ప్రస్తావన లేకపోవుట కది యొక ప్రసిద్ధ క్షేత్రంగా ఆ నాటికి స్థిరపడ లేదనియు చెప్పవలసి వచ్చుచున్నది. కామికాది శైవాగమములు, స్కాందాది శివ పురాణములు,

శివ రహస్యాది యితిహాసములు మొదలైన అపారమైన వాఙ్మయం నుండి యీ తత్త్వముల రహస్య మింకను విపులంగా పరిశీలింపవచ్చు.

### 3.5.11 రామాయణం

వాల్మీకి రామాయణంలో సాంఖ్యతత్త్వం చెప్పబడిందని పెద్దలు చెబుతారు. రామేశ్వరం వద్ద రాముడు శివ లింగాన్ని స్థాపించడం, రాముడు శివ నామాన్ని, శివుడు రామనామాన్ని సదా జపించడం, వాయు పురాణమే శివ పురాణమైనట్లు, వాయుపుత్రుడైన హనుమ శివావతార మనుట, యివన్నీ పురాణ కాలం నాటికి వచ్చిన కల్పనలు. అధ్యాత్మ రామాయణంలో-

*శ్రీ రామ గీతా మాహాత్మ్యం కృత్స్నం జానాతి శంకరః ।*
*తదర్థం గిరిజావేత్తి తదర్థం వేద్మ్యహం మునే ॥*

అని బ్రహ్మ చెబుతున్నాడు ''శ్రీరామగీతామాహాత్మ్యం సంపూర్ణంగా తెలిసిన వాడు శివుడొక్కడే! తదర్థము అమ్మ పార్వతికి తెలియును. అందులో సగము బ్రహ్మనైన నాకు తెలియును" అని స్వయంగా బ్రహ్మముఖతః వెలువడిన మాటలు. కావుననే ఆ తర్వాత ఉపపురాణాలుగా ప్రసిద్ధి చెందిన స్థలమాహాత్మ్యాలన్నీ శివుడు పార్వతితోనో, నారదునితోనో చెబుతున్నట్లుగా, విష్ణుమాహాత్మ్యం శివుని కొక్కనికే తెలియునని శివకేశవా భేద ప్రతిపాదకమే ప్రధానోద్దేశ్యముగా చిత్రింపబడినది.

### 3.5.12 మహాభారతం

మహాభారత కాలం నాటికి వ్యాసుడు శివ కేశవులకు సమాన ప్రాధాన్యమిస్తూ యితిహాసాన్ని రచించాడు. మహాభారతం అనుశాసనిక పర్వంలో శివుడు పార్వతితో తన స్వరూపాన్ని చెప్పడమే గాక, సాంఖ్యతత్త్వ ప్రకారాన్ని, ఆత్మ సాయుజ్య ప్రాప్తిని తెలిపే ఘట్టాలు పౌరాణిక వాసనలు గలిగినవే. అట్లే భీష్ముడు ధర్మరాజుకు విష్ణుమంత్ర ధ్యానము, విష్ణునామ ప్రభావాన్ని తెలుపుతాడు. శివుడు అర్జునునికి పాశుపతాస్త్రాన్ని అనుగ్రహించడం, కురుక్షేత్ర సంగ్రామంలో అదృశ్యరూపుడై యుద్ధ వీరుల్ని

అర్జునబాణం తగులకముందే సంహరించడం శివాధిక్య సూచన కోసం అని తెలుస్తోంది. ఈ అర్జునుడే శ్రీ కాళహస్తి స్థలపురాణంలో తిన్నడై జన్మించినాడనడం యితిహాసానికి, పురాణానికి గల సన్నిహిత సంబంధాన్ని స్థాపిస్తోంది. దీనికి మరొక ఉదాహరణ, శివ పురాణంలోని వాయవీయసంహితలో ఉత్తరభాగంలో శ్రీ కృష్ణమూర్తికి శివుని వలన పుత్రవరప్రాప్తి కలిగినట్లు చెప్పబడింది. దీనిని ఉత్తర హరివంశంలో నాచన సోమనాథుడు తన హరిహరాద్వైత భావన కనుకూలంగా ఉందని గ్రహించాడు. తిక్కన యొక్క హరిహరాద్వైతానికి కూడా మహాభారత కథ, పౌరాణిక కల్పనలే ప్రేరక మయ్యాయని చెప్పవచ్చు. వ్యాసుని కథలోనే దీనికి మూల బీజాలున్నా కొన్ని పౌరాణిక కల్పనలు వ్యాసభారతం లో తర్వాత ప్రక్షిప్తాలని చెప్పవచ్చు.

## 3.6 సంస్కృత స్తోత్రసాహిత్యంలో శ్రీ కాళహస్తి

శివ పురాణంలో శివ సహస్రనామస్తోత్రమున్నది. శివ పంచాక్షరీ మంత్రమే తారకమహామంత్రంగా వ్యాఖ్యానింప బడింది.

"ఆకాశం లింగమిత్యాహుః - పృథివీ తస్య పీఠికా" అనే ప్రమాణం అనుసరించి ఆకాశము లింగముగను, భూమిపీఠముగను భావింపబడుతున్నది. శివలింగము ప్రణవాత్మకమని ఆచార్యుల నిర్వచనం. నిరాకారుడగు పరమాత్మ సూక్ష్మ జ్యోతి స్వరూపంలో ప్రణవ మందు వ్యక్తమై కర చరణాది విగ్రహము కలవాడయ్యెను. అందుకే విగ్రహారాధనం కన్న శివలింగార్చనమే శ్రేష్ఠమని మహాభారతంలో అశ్వత్థామార్జున ప్రకరణంలో వేదవ్యాసుడు పేర్కొన్నాడు.

'పీఠ మంబామయం సర్వం - శివలింగం చ చిన్మయమ్' శివ లింగానికి చెందిన పీఠ మంతయు అమ్మవారనియు, లింగము శివుడనియు తెలియవలెను. దేవతలు, మునులు, బ్రహ్మ విష్ణువులను అనుగ్రహించుటకు గిరిజాశంకరులు శివలింగ స్వరూపంగా పరిణమించారు. సృష్టి స్థితి లయములకు కారణమైన పరబ్రహ్మమే లింగమన బడును.

*లింగంచ శివయోర్దేహ స్తాభ్యాం యస్మాదధిష్ఠితమ్ ।*

శివ శక్తుల శరీరమే లింగమగును. కాన పార్వతీ పరమేశ్వరులు లింగము నందుండువారు. ఇందువల్లనే శివుడు పార్వతీ దేవితో లింగ మందు పూజింపబడుచున్నాడని గుర్తింపవలెను.

*లింగవేదీ మహాదేవీ - లింగం సాక్షాన్మహేశ్వరః।*

లింగానికి చెందిన వేదిక శక్తి అనియు, లింగము సాక్షాత్ శివుడని తెలియాలి. లింగము పొక్క దానిని పూజించుట వలనే పార్వతీ పరమేశ్వరుల నారాధించిన వారగుదురు. వాస్తవము విచారింపగా శక్తి శివులు జ్యోతిస్స్వరూపులై లింగ రూపులైనారని భావించాలి. శివమాయా ప్రభావము బ్రహ్మ విష్ణువుల కూడ మోహింప జేసింది. ఒకప్పుడు ప్రళయ కాలమున బ్రహ్మ, విష్ణువులు 'నేనే భగవంతుడను, నేనే జగత్కర్తను' అని వాదించుకొని పోరాడగా వారి వైరాన్ని ఉపశమింప చేయడానికి పరమేశ్వరుడు జ్యోతి స్తంభముగా సాక్షాత్కరించినాడు. అదే 'మహాలింగం'

ఇది శివలింగస్వరూప వర్ణనం కాగా, శివలింగార్చనమండి స్తోత్ర సాహిత్య ముత్పన్నమైనది. లింగము స్థావరమని, జంగమమని రెండు విధాలు. పర్వతములు, వృక్షాలు మొదలగునవి స్థావరలింగములు కాగా, క్రిమికీటాదికములు జంగమలింగములు. స్థావరాలను సేవించుట, జంగమాలను సంతృప్తి పరచుట ఆయా కామ్యములు సిద్ధించుటకై 'శివారాధన' చేయడం. అర్చనలో స్తోత్రము ప్రధాన పాత్ర వహించును. దీనినే మహిమ్నుడు "వాక్యుప్తస్తవనేరా" మనినాడు.

### 3.6.1 శివ పంచస్తవి - పుష్పదంతుని శివమహిమ్న స్తోత్రం

'పుష్పదంతాభిధాను'డైన ఒక గంధర్వుని 'ధూర్జటి' స్తోత్రమే శివ మహిమ్న స్తోత్రంగా ప్రసిద్ధి కెక్కినది.

స్కాంద పురాణ ప్రభాస ఖండం 142 వ అధ్యాయంలోను పద్మ పురాణోత్తర ఖండం 43 వ అధ్యాయంలోను, దేవీభాగవతం 9 వ అధ్యాయం

లోను పుష్పదంతుని కథ కానవచ్చుచున్నది. "ప్రథాన మనే ఒక క్షేత్రమును నిర్మించి, అందు ఘోర తప మాచరించి శివానుగ్రహము పొంది అక్కడ పుష్పదంతేశ్వర నామమున శివ లింగాన్ని స్థాపించి ప్రతిరోజు భక్తి విశేషంతో శివుని ఆరాధిస్తూ ధన్యుడైన మహనీయుడే పుష్పదంతాచార్యుడు. ఇతడు గంధర్వరాజు. తన ఉపవన పుష్పాలతో తనివి తీరక మరొక రాజు ఉద్యానవనం లో అదృశ్యుడై ప్రవేశించి కొల్లలుగ పుష్పాలను సంగ్రహించి తెచ్చి యథేచ్ఛగ శివు నారాధించు చుండినాడు. వేరొక వైపు ఆ ఉద్యానవనంలోని రాజు తన శివార్చనకు పుష్పములు లభింపక ఈ పుష్ప చోరుని పట్టుటకై చేసిన ప్రయత్నములన్నీ వ్యర్థము లయ్యెను. చివరకు మంత్రుల ఉపాయం వల్ల ఉద్యానవనము చుట్టును శివనిర్మాల్యము వెదజల్లబడెను. పుష్పముల పైని భ్రాంతి వలన ఎప్పటి వలె అదృశ్యుడై ప్రవేశించు పుష్ప దంతునిచే శివ నిర్మాల్యము దాటబడినది. కావున నతని అదృశ్యకరణ శక్తి నశించెను. అంత ఉద్యానవన పాలకులు అతనిని పట్టి రాజాజ్ఞ ననుసరించి కారాగృహంలో బంధించిరి. ఎట్టి వాడైనా అపరాధ ఫలం అనుభవింపక తప్పదని తుదకు గ్రహించి తన చౌర్యానికి పశ్చాత్తప్తుడై పవిత్రమైన హృదయంతో పరమ శివుని మహిమను 'మహిమ్న' స్తోత్రమున గ్రథించి కృతార్థుడైనాడు. అమోఘమైన ఈ స్తుతికి మెచ్చి శివుడు ప్రత్యక్షమై పుష్పదంతుని అనుగ్రహించి, చౌర్యపాపం నుండి, కారాగారం నుండి విముక్తుని గావించి, నిరతిశయమైన శివసాయుజ్య కైవల్యమును ప్రసాదించెను."

కాశీ క్షేత్రంలో జగద్గురు విశ్వారాధ్య సింహాసనపు జంగమవాడి మఠము చౌషష్టి దేవ్యాలయమునకు ఉత్తరము వైపున శ్రీ పుష్పదంతేశ్వర లింగము ప్రతిష్ఠితమై యున్నది. భారతదేశపు మధ్యమండలి నీమాడ్ జిల్లాలో ఓంకారేశ్వర జ్యోతిర్లింగ క్షేత్రమున్నది. అక్కడి అమరేశ్వర మందిరంలో (క్రీ.శ.1063) లో చెక్కబడిన శివమహిమ్నస్తోత్ర శిలాశాసనమున్నది.

*త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవ మితి*
*ప్రభిన్నే ప్రస్థానే పరమిద మదః పథ్యమితి చ ।*

రుచీనాం వైచిత్ర్యా దృజు కుటిల నానాపథ జుషాం
నృణామేకో గమ్యస్త్వ మసి పయసామర్ణవ ఇవ ॥ (శ్లో 7)

యజ్ఞాది కర్మ ప్రధానమతమనియు, పంచవింశతి తత్త్వాత్మకమైన సాంఖ్య మత మనియు, హఠరాజ లయాత్మకమగు యోగమత మనియు, పశు పశుపతి రూపమగు పాశుపత మతమనియు, లక్ష్మీధవుడైన నారాయణుని కైంకర్యాన్ని చెప్పే వైష్ణవ మత మనియు, లోకమున భిన్న భిన్నములైన ఆత్మతత్త్వబోధక మతములున్నవి. దేనివారు దానిని ఉత్తమ మనుకొనుచున్నారు. ఇందు కొన్ని పెడతోవలును సరళ మార్గములును ఉన్నవి. ఎన్ని డొంక తిరుగుళ్లు కలిగి యున్నా నదీనదము లన్నియు ఒక సముద్రాన్నే చేరునట్లు, తమ తమ యభిరుచి భేదము వలన నరులు భిన్నములైన మతమార్గముల ననుసరించినను, సద్భక్తులగుచో వీరందరికిని ఓ పరమేశ్వరా ! నీవొకడవే శరణ్యుడవు. ఇమ్మాటికి అన్యము లేదు. వివిధములైన మత శాస్త్రములున్నను, అది సాధకుని యధికారాన్ని బట్టి తారతమ్యము బోధించుచున్నది కాని, ఈశ్వరుడు భిన్నుడు కాడు ఒకడే నని భావము.

మహోక్షః ఖట్వాంగం పరశు రజినం భస్మ ఫణినః
కపాలం చేతీ యత్తవ వరద తంత్రోపకరణం ।
సురాస్తాం తా మృద్ధిం దధతి తు భవ ద్భ్రూ ప్రణిహితాం
నహి స్వాత్మారామం విషయ మృగతృష్ణా భ్రమయతి ॥ (శ్లో 8)

భక్తులకు ఇష్టార్థముల ననుగ్రహించు ఓ మహేశ్వరా ! నిన్ను చిరకాల తపస్సు చేత నుపాసించి నీ భృత్యులైన యింద్రాదులకు నీ కటాక్ష మాత్రమున స్వర్గాధిపత్యము మున్నగు మహా పదవులు లభించి యున్నవి. ఇట్టి మహామహులకు ఈశ్వరుడవగు నీ సాన్నిధ్యము నందున్నవో ముసలి యెద్దు, మంచము కోడు, గండ్ర గొడ్డలి, ఏనుగు తోలు, బూడిద, పాములు, పుర్రెలు అనునవి యే సాధన సంపత్తి. విచారించి చూడగా ఆత్మానందఘనుడైన మహానుభావుని, నశ్వరమైన విషయ భోగ రూపమైనట్టి ఎండమావులు చలింపజేయజాలవు గదా ! అనగా భృత్యులకు

సకలైశ్వర్యములు నిచ్చు శివుని వద్ద అట్టి భోగ భాగ్యములు రాశిరూపముగా మన స్థూలదృష్టికి గమపించనందున విపరీతబుద్ధులు దరిద్రునిగా భావించినచో నది ప్రమాదః మనియు, శివుడు శాశ్వతమగు చిదానందముతో నిండియున్నాడని, నిత్యతృప్తుడనీ, తరుగని సంపదలను కనుసన్నలచే సృష్టింప గలుగువానికి వాని యందు వ్యామోహము కలుగ జాలదని భావము

*శ్మశానేష్వా క్రీడా స్మరహర పిశాచా స్సహచరా*
*శ్చితా భస్మాలేపః స్రగపి నృకరోటీ పరికరః ।*
*అమంగల్యం శీలం తవ భవతు నామైవ మఖిలం*
*తథాపి స్మర్తౄణాం వరద పరమం మంగలమసి ॥*

ఓ పరమేశ్వరా ! నీకు క్రీడాస్థలము శ్మశానము స్నేహితులు పిశాచములు కాటి బూడిదయే శరీరమునకు కస్తూరీ గంధపుపూత కపాలమాలయే మల్లెపూలదండ. ఇట్లు నీ బాహ్యవేషము చూడగా వికారముగ దోచును. కాని నిన్ను స్మరించు భక్తుల కందరకు నీవు కేవల కల్యాణ స్వరూపుడ వనుటయే నిక్కము. నీ వేషము సామాన్యముగనట్లు కన్పట్టినను అంతస్తత్త్వ మెల్ల మంగళకరమైనదని భావము

*భవః శర్వో రుద్రః పశుపతి రథోగ్రః సహ మహాం*
*స్తథా భీమేశానా వితి యదభిధానాష్టక మిదం ।*
*అముష్మిన్ ప్రత్యేకం ప్రవి చరతి దేవ శ్రుతి రపి*
*ప్రియాయాస్మై ధామ్నే ప్రణిహిత నమస్యోఽస్మి భవతే ॥*

ఓ దేవా ! భవ, శర్వ, రుద్ర, పశుపతి, ఉగ్ర, మహాదేవ, భీమ, ఈశాను లనెడు ఈ యెనిమిది నామములు నీ ముఖ్య వాచకములుగా శ్రుతియే చెప్పుచున్నది. కావున ఏతచ్ఛబ్ద వాచ్యుడును, తేజోరూపుడును, భక్తవత్సలుడును అగు నీకు సర్వాత్మనా విధేయుడనై నమస్కరిస్తున్నాను

### 3.6.2 మల్హణస్తవం

కాశ్మీర దేశంలో భారతీ పీఠ నగరాన నివసించిన సువర్ణ భట్టారకుడను

(శివార్చకుడు) శివద్విజునకు మల్లణుడను కుమారుడున్నాడు ఇతడు శివదీక్షితుడై వేదాగమ శాస్త్రముల నభ్యసించి, శివగణ సేవకుడై తండ్రికి ప్రియకరుడై నడచుకొనెడివాడు అంత యువకుడైన మల్లణునకు దినమునకు వేయి సువర్ణముల లెక్కతో నూరు వత్సరములకు సరిపోవు ధనము నిచ్చి తండ్రి పరలోకగతుడయ్యాడు. పిదప ఈ మల్లణుడు ఒకనాడు దేవాలయమున సేవార్థమై వచ్చిన పుష్పగంధి యను వేశ్య లావణ్యమున కాసక్తుడై ద్రవ్యమునంతయు దాని పాలు గావించి, దానికి మల్లణి యను పేరిడి కొంత కాలము సుఖించుచుండ, మల్లణి తల్లి తన కూతురు మరియొక ధనికుని కంటగట్టనెంచి ఈ మల్లణుని బహిష్కరించింది. ఆ మల్లణి క్రొత్త ధనికునితో మాట్లాడుచున్నను హృదయమంతయు మల్లణున కర్పితమై యుండుట వలన ఆ ధనికుడు నిద్రింపగానే యా రాత్రి యిలు వెలుపలికి వచ్చి తనకై వేచియున్న మల్లణుని కలిసికొని విజయేశ్వరాలయానికి వెళ్లి కొన్ని యుపశమన వాక్యాలను పలుకుచు, "హృదయేశ్వరా! నీవు విద్వద్వరేణ్యుడవు, నీ వాక్చాతుర్యాన్ని నీవు నన్ను వినోదింప జేయుటకే వినియోగ పరచు చున్నావు గాని యీ మహేశ్వరుని స్తుతించినచో శాశ్వత సౌఖ్యము చేకూరదా !" అనింది అంత మల్లణుడు "నా హృదయము భవన్మయముగా నున్నది కావున నీవు శివ లింగము వెనుక సరగా నిలుచుచో భగవన్మయముగ స్తుతి నల్లెద" నన్నాడు. ఆమె యట్లే నిలువగా భావోద్రిక్తుడై "కాంత కచ ప్రచయము" అనె మాటతో ప్రారంభించి 39 శ్లోకములతో నత్యద్భుతముగ స్తుతి గావించి, శివుడు ప్రత్యక్షము కాగా మహాశివ భక్తుడగు మల్లణుడు తన్నే కాక మల్లణిని, ఆమె వృద్ధ మాతను ఆమె సాకుచుండిన చిలుకను గూడ నుద్ధరించి శివ లోకము నందించెను.

క్రీ.శ. 1230 ప్రాంతమున నున్న పాల్కురికి సోమనాథుడు, పండితారాధ్య చరిత్రములో మల్లణుని కథను వివరించినాడు. ఈతని చరిత్ర యించుమించు బిల్వమంగళ (లీలాశుక - చింతామణి) కవిని బోలి వుంది. లీలాశుకుడను కృష్ణ కర్ణామృతము ప్రారంభంలో

''చింతామణిర్జయతు" అని తన ప్రేయసి యైన 'చింతామణి' (వేశ్య) నామము నుల్లేఖించినట్లే, ఈ మల్లణ కవియు స్తోత్రారంభంలో ''కాంతాకచ" ''పుష్పగంధి" అనే శబ్దాలను మల్లణ అనే ధ్వని వచ్చునట్లు ప్రయోగించినాడు.

*కాంతా కచప్రచయ పుష్ప సుగంధి గంధ*
*లుబ్ధ భ్రమద్భ్రమర కర్బుర కంధరాయ ।*
*గంధర్వ యక్ష సుర సిద్ధ కిరీట కోటి*
*సంఘట్ట ఘృష్ట చరణాయ నమశ్శివాయ ॥*

పార్వతీదేవి కొప్పులో వున్న కుసుమ సుగంధముచే నాకృష్టములై వచ్చి గుంపులుగా జేరిన పెక్కు వన్నెల తుమ్మెదల చేత చిత్ర విచిత్రమైన గళము గలవాడును, సురాసుర గంధర్వ కిన్నర సిద్ధ సాధ్యులు సమూహముగావచ్చి యెడతెగక నమస్కరించుచున్నందున వారి కిరీటములయొక్క యగ్రభాగములచే సంఘర్షణగల పాదములు గలవాడును, నిత్య మంగళ విగ్రహుడును అగు శివునకు నమస్కారము.

*ఉర్వీ సమీర యజమాన జలానిలార్క*
*సోమాంబరాదిభి రహో భవతస్తనూభిః ।*
*వ్యాప్తం సమస్త భువనం సమవేక్ష్య విద్వాన్*
*కుర్యాన్న కో ఽ త్ర భగవంస్త్వయి పక్షపాతః ॥*

ఓ పరమేశ్వరా ! ఈ సమస్త ప్రపంచమును పృధ్వి, అప్, తేజస్, వాయు, ఆకాశ, సూర్య చంద్ర, యజమానులనెడి అష్టమూర్తులతో అహహో నీవు వ్యాపించి యున్నావు. ఇది సుప్రసిద్ధము. ఈ సంగతి నెరిగిన విద్వాంసు డెవ్వడైనను, నిన్ను శరణము పొందకయుండగలడా! నీ తనువు లేని విశ్వమే లేదు కావున జ్ఞానమున్న వారు నీ భక్తులే యగుదురు.

*చర్యావబోధరహితా భవభక్తిమాత్రా*

*న్వీతాస్త్వయా శివపురం యదహో కిరాతాః ।*

*జాతి స్మరత్వ మథవా పరమామరత్వం*

*యే త్వాం విముక్తి రథవా భవతః ప్రసాదాత్ ॥*

లోకకారణా ! శాస్త్రోక్తములైన ఎట్టి క్రియలు తెలియకున్నను, భక్తి మాత్రమున కరుణతో ఆ బోయలను కైలాసమును జేర్చితివే! ఆహా! నీ భక్త పక్షపాతము ! తాను యిట్టి జాతి వాడు, అనే జ్ఞానము గాని, శ్రేష్ఠమైన దేవతాజన్మముగాని, శాశ్వతమైన ముక్తిగాని, నీ కృపకు అధీనములై వున్నాయి. నీ కరుణ వలన కలుగని దేది?

ఈ శ్లోకంలో బోయవాడైన కన్నప్ప వృత్తాంతం చెప్పబడింది. కన్నప్ప నాయనార్ అరువది ముప్వురు నాయన్మారులలో వొకడుగా ప్రసిద్ధుడు.

3.6.3 మలయరాజస్తవం

మేరు పర్వత దక్షిణమున గల మలయ దేశము నందలి మలయవతి రాజధానిలో దేవరాజు, శచీదేవి యను రాజదంపతులుండిరి వారు సమస్త భోగభాగ్యముల ననుభవించుచున్నను సంతానము లేనందున రాజ్యభారమును మంత్రి కప్పగించి ఊరి బైట నిర్మింపబడిన రహస్య శివాలయమున శివుని గూర్చి ఘనమైన తపము నాచరించిరి. అందుకు శివుడు ప్రసన్నుడై శతవర్షాయుష్కుడగు దుష్పుత్రుని గాని, షోడశవర్షాయుష్యము గల సుపుత్రుని గాని వరముగా గోరు కొమ్మని చెప్పగా ఆయుష్య మల్పమైనను సుపుత్రునే ఆ దంపతులు కోరి కొని ఇంటికి జేరి రాజ్యమును పరిపాలింప దొడగిరి శచీదేవి నవమాసములు గడిపి సుముహూర్తమున కుమారుని గనెను. అతనికి మలయరాజను నామమిడ బడెను. మలయరాజు కూడ మిక్కిలి సుగుణ సంపన్నుడై క్రీడల వలనను, విద్యాభ్యాసము వలనను మాతాపితలకు సంతోషము గలుగ జేయు చుండెను. కాని పదునారు వత్సరములు ముగిసి కొక దినము మాత్రమే మిగిలియుండెను. తల్లి తండ్రులతని ఆయుష్యము

సమాప్తమగుచున్నదని తెలిపి దుఃఖింప దొడగిరి. అందులకు దుఃఖింప వలదని తల్లి దండ్రులకు జెప్పి మలయరాజు శివభక్తి యుక్తుడై "యోవ ధియా మధిగమ్యః" అను శ్లోకము మొదలుగొని 73 శ్లోకములలో శివుని ధ్యానించి శివానుగ్రహము వలన అకాలమృత్యువును జయించి తల్లి తండ్రులకు సంతోషము గలిగించాడు.

*యో వ ధియామధి గమ్యస్తస్య కుతస్సంభవో గిరాం వృత్తేః ।*
*స్తౌమి తథాపి భవంతం మనోరథో యాత్య భూమి మపి ॥*

ఎవ్వాడు మహానిశితములైన బుద్ధుల వలన గూడ దెలియబడ జాలడో అట్టి వానిని శబ్దముల శక్తి వలన కనిపెట్టుట అసంభవమే కదా! ఐనను, ఓ భగవంతుడా! నిన్ను గొనియాడ బూనినాడను. మానవుల మనస్సులు అందని దానినైనను అపేక్షించుట సహజమే! నీవు దెలియ శక్యుడవుగావని యెరిగియు నీ స్తుతిని యథాశక్తి సల్ల బూనినాడనని భావము.

*కాలవ్యాధో ధావతి భగవన్నాసన్న మేవ హంతుం మాం ।*
*క్రందామి త్వా మీశం పాశచ్ఛేదాయ తే నార్తః ॥*

ఓ సర్వేశ్వరా! సంసార బాధకు తాళ జాలక, వేరొక వుపాయము లేక నిన్ను శరణ బొంది, నీ సన్నిధికి జేర ప్రయత్నించు చుండగనే కాలుడను వేటకాడు తన పాశములో నన్ను జిక్క బట్టి తుద ముట్టింప బూనినాడు. ఆ పాశ బాధ అసహ్యముగా నున్నది. కావున విశ్వేశ్వరుడవైన నిన్ను గూర్చి మొరపెట్టి కొనుచున్నాను. కరుణించి యా బంధమును త్రెంచి వేయుము.

*ఆసన్న మరణ మశరణ - మున్మార్గ భ్రమణ ఖిన్న మవసన్నం*
*త్రాయస్వ శివ సమాశ్రిత - మంధ మధ స్త్రాస్తతంతం మాం ॥*

ఓ కల్యాణ నిలయా! నా మృత్యువు సమీపించినది. కావునే జీర్ణత నొంది మూడుకాళ్లముదుసలినై చావ సిద్ధముగా నున్నాను. త్రోవ దప్పి తిరిగితిని కావున మిక్కిలి డస్సి వున్నాను. వివేక హీనుడను కావున

పతితుడనైనాను. ఏ దిక్కూను లేని వాడనగుట వలన నీ చెంత జేరి వాడను. ఇట్టి నన్ను రక్షింపుము స్వామీ !

మలయరాజు కథ మార్కండేయుని కథ వలె వున్నది. మలయరాజు మిషతో ఆయన చేసిన స్తోత్రముతో సార్వకాలికమైన జీవుని మొఱ అష్టదిక్కులకూ ప్రసరించినది. ఇది త్రైకాలికమైన జీవుని మొఱ! దీనికి అన్యథాత్వము లేదు.

### 3.6.4 దండి కృత అనామయస్తవం

దండి సంస్కృత సాహిత్యంలో సుప్రసిద్ధుడు "దండినః పదలాలిత్యమ్" అన్నది ప్రసిద్ధ సూక్తి ! ఇతడు భారవి మహాకవి (క్రీ.శ.575) మనుమడు. దండికాలము క్రీ.శ. 640. ఇతని దశకుమార చరితము, కావ్యాదర్శము, అవంతి సుందరీ కథ - ప్రఖ్యాతమైనవి.

సర్వ శాస్త్ర విశారదుడునూ, సర్వ కవి శ్రేష్ఠుడును అగు ఈ దండికి కాలవశమున కుష్ఠురోగము సంభవించింది. ఔషధోపచారాల వల్ల అది నయం కాలేదు. సూర్యనారాయణో పాసనను గూడ గావించాడు. ఐనా ఆ వ్యాధి నివారణము కాలేదు. చిట్ట చివరకు శివ భక్తికి శరణాగతుడై మహాభక్తితో భవరోగ వైద్యుడును, దేవాది దేవుడును, భక్తవత్సలుడును, ప్రపంచ కారణుడును, పరమేశ్వరుడును అగు శివుని గూర్చి "తృష్ణాతంత్రే" అను శ్లోకము మొదలుకొని ముప్పై ఒకటి దాకా వున్న యీ యనామయ స్తవమును విరచించి తన కవిత్వముతో బాటు జన్మము గూడ ధన్యము గావించుకొన్నాడు. పార్వతీపతి యగు పరమశివుడీ స్తవమునకు ప్రసన్నుడై దండిని రోగ విముక్తుని జేసి పరమపదము నన్నుగ్రహించాడని ప్రతీతి

*తృష్ణా తంత్రే మనసి తమసా దుర్దినే బంధవర్తీ*
*మాదృగ్జంతుః కథ మధికరో త్త్యైశ్వరం జ్యోతిరగ్ర్యం ।*
*వాచస్స్ఫీతా భగవతి హరే సన్ని కృష్టాత్మ రూపాః*
*స్తుత్యాత్మానం స్వయమివ ముఖా దస్య మే నిష్పతంతి ॥*

శ్రీపరమేశ్వరుని దగు సర్వోన్నతమైన మహాప్రకాశమును అవిద్యాంధ కారముతో గూడినట్టి నా వంటివాని దురాశాభూయిష్ఠ మైనట్టి, తామసాక్రాంత మైనట్టి, మనస్సు ఎట్లు తెలిసి కొనగలదు! ఐనను సర్వాంతర్యామియు సర్వకర్తయునగు పరమేశ్వరుని గూర్చి ఈ స్తోత్ర రూపమైన వాక్కులు శివునితో సంబంధించి యున్నవియా అనునట్లు నా ముఖము నుండి తమంతట తామే వెలువడు తున్నాయి. నా ప్రయత్నము వలన గాని, పాండిత్యము వలన గాని ఇవి రచితములు కాలేదని భావము.

*కశ్చి న్మర్త్యః పరికృశ తను ర్నీలకంఠ త్వయా చేద్*
*దృష్ట స్స్నిగ్ధస్స పునరమర స్త్రీ భుజ గ్రాహ్య కంఠః ।*
*అప్యారూఢ స్సార పరివృతం స్థానమాఖండలీయం*
*త్వం చేత్క్రుద్ధస్స పతతి నిరాలంబన ధ్వాంత జాలే ॥*

శ్రీ కంఠా! కృశుడును, మలిన దేహుడును, అగు ఒకనొక అనామధేయుడు కూడ నీ కృపా దృష్టి కలిగినచో సుందరమైన దేహము కలవాడై దేవతాస్త్రీ ల ప్రేమకును పాత్రుడై సౌఖ్యమునను భవింప గలడు. మరియు సకల దేవతల చక్రవర్తి అయిన ఇంద్రుని సింహాసనము గూడ నాక్రమింప గలడు. కాని నీ దయ తప్పినా, వాడే స్వర్గము నుండి జారి శూన్యమును, అంధకార బంధురమును, ఆధార రహితమును అగు స్థానమున బడగలడు.

*తిర్య గ్యోనౌ త్రిదశ నిలయే మానుషే రాక్షసే వా*
*యక్షా వాసే విషధరపురే దేవ విద్యాధరే వా ।*
*యస్మిన్ కస్మిన్ సుకృతి నిలయే జన్మ నిశ్శ్రేయసే వా*
*భూయాద్భూయ శ్చరణ కమల ధ్యాయినీ చిత్త వృత్తిః ॥*

మహేశ్వరా! నా జన్మ పశు పక్షి జాతిలో గాని, దేవ దానవ మానవ లోకములలోగాని, యక్ష విద్యాధరులలోగాని, పాతాళమునగాని, అథవా

ముక్తి కొఱకే కాశి, ఎక్కడ నైనను పవిత్ర స్థలమువ అగుగాక ! నా కది యొంక ముఖ్యమైనవిషయము కాదు. ఎక్కడ నెట్టి రూపములో బుట్టినను పోయే కాని నా హృదయము మాత్రము నిరంతరము నీ పాద పద్మముల ధ్యానించు నట్టిదిగా వుండాలి. ఇదే నా ముఖ్యాభిలాష

శ్రీ కాళహస్తి క్షేత్రమున సాలెపురుగు, పాము, ఏనుగు మొదలగు జంతువులు బోయవాడు శివ సాయుజ్యము నొందిరి.

### 3.6.5 హలాయుధ స్తవం

క్రీ.శ. 760-80 లలో దక్షిణ దేశాధిపతి అయిన రాష్ట్రకూట కృష్ణరాజు ఆస్థానంలో హలాయుధకవి విద్వాంసుడు. ఇతని జన్మభూమి వంగ దేశ ఢాకా మండల మందలి నవగ్రామము. దేశ సంచారం చేస్తూ కాలక్రమమున దక్షిణ దేశము చేరుకొని కొంత కాలముండి తరువాత తన భూమిని చేరుకొని చరమదశను గడిపాడు. అభిధాన రత్నమాలా, కవి రహస్యమ్, మృత సంజీవనీ అనే సంస్కృత గ్రంథముల విరచించినాడు. ఈతడు మహాశివభక్తుడు మహావిద్వాంసుడు. మొదటి గ్రంథమునకు హలాయుధ కోశమనియే సాధారణముగ వ్యవహారం. ఈ శివస్తుతి కూడ హలాయుధ స్తవ మనే కవి నామము తోడనే ప్రసిద్ధమైనది. ఈతని కవితాశయ్య మనోహరమై గంభీరముగ వుంటుంది. శివ భక్తి పొంగి పొరలినట్లుంటుంది. శివభక్తి ప్రభావము వలన నీతనికి సదా శివుడు ప్రత్యక్ష మగు చుండెడి వాడట!

హలాయుధుని కధ విస్తృతంగా పాల్కురికి సోమన బసవ పురాణంలో 136 ద్విపదల్లో చెప్పబడింది. పండితారాధ్య చరిత్రము (దీక్షా ప్రకరణము - 115) లో -

*అయత ప్రీతి హలాయుధంబున హ*
*లాయుధ ప్రియుఁడిహలాయుధు బొగడు*

అని యున్నది. బసవ పురాణంలో సిరియాలుడు తన కంటె గొప్ప శివ

భక్తుడున్నాడా అని శివుని ప్రశ్నించినప్పుడు శివుడు పిరియాలుని చేయి పట్టుకొని హలాయుధుడున్న పురానికి వచ్చినట్లున్నది. అది హలాయుధుడు దక్షిణ దేశంలో కొంత కాలం నివసించిన 'హలాయుధ పుర' మని 'పాదిలెసీమదండకవిలె' ఆధారంగా మనం నిశ్చయింపవచ్చు. 'పాదిలె' కు ద్వాపర యుగంలో 'హలాయుధపుర'మని కవిలె లో చెప్పబడింది.[1]

ఒకనాడు హలాయుధుడు పిరియాలుని కథను వినెనట. అందు శివుడు జంగమ వేషముతో వచ్చి పిరియాళుని భక్తిని పరీక్షించడం, మాంస మారగించడం వచ్చినది కదా ! దీనిని విని హలాయుధుడు ఉద్రగుడై అభక్ష్యమును భుజించిన శివుని, శివ భక్తుడైన పుత్రుని వధించిన పిరియాళుని గూడ వెలివేసితినని ప్రకటించెనట ! ఇందుకు కినిసి పై బహిష్కృతుల భార్యలగు పార్వతి, చెంగళవ్వ మారువేషంలో వచ్చి హలాయుధుని వేడుకొనగా వారి బహిష్కారాన్ని దీసి వేసెనట ! ఈతని అనుపమానమైన శివభక్తిని, శివాచార దీక్షను గని శివుడు మెచ్చి ప్రత్యక్షమై ఈతని యభీష్టానుసారము నవగ్రామ ప్రజలతో బాటు కైలాసము ననుగ్రహించెను. అను కథ బసవ పురాణాదులలో కలదు. హలయుధస్తవము భారతదేశ మధ్య ప్రాంతపు నీమాడ్ జిల్లా ఓంకార అమరేశ్వర మందిరమున శిలాశాసన రూపంగా శా.శ. 985 లో చెక్కబడి యున్నది

*ధత్తే శోభాం ఘుసృణ తిలక స్పర్ధి చక్షుర్లలాటే*
*మౌలౌ లగ్నా త్రిదశ తటినీ మాలతీ మాలికేవ।*
*క్రీడా మృగ మదమయీ షత లేఖేవ కంఠే*
*శ్లాఘ్య శ్శంభో స్ఫురతి సహజః కోఽపి భూషా విధిస్తే ॥*

ఈశ్వరా ! ఫాల భాగమున నున్న యగ్ని నేత్రము కుంకుమ బొట్టు

---

1 *గణపాల చరిత - అముద్రిత వీర శైవ ద్విపద కృతి - ముదివేడు ప్రభాకరరావు, S V U O Journal, Tirupati*
*Vol XXIV, Pts 1 - 2, 1981, PP 23 - 48*

చందమునను, జడలోని దేవ గంగ పొగడ పూదండ వలెను, కంఠమందలి విషరేఖ కస్తురితో వ్రాసిన పత్ర రేఖల కరణిని యెంతయో అందము నీను మన్నవి. స్వామీ ఎటులైనను నీయీ సహజమైన అభరణ భంగిమము విలక్షణమై సర్వలోక స్తోత్ర పాత్రముగ నున్నది.

*దేహాస్సర్వే దధతి వపుషా భూషణం హేమరత్నం*
*గుంజామాత్రం కనకమపి తే నాస్తి కర్ణే కరేవా ।*
*మార్గాతీతం స్ఫురతి సహజం యస్య సౌందర్య మంగే*
*తస్యా హార్యే కృతరజనవన్నాదరః స్యాద్గుణేషు ॥*

స్వామీ! దేవత లెల్ల తమ ఒడలి నిండను స్వర్ణమణులతో నిర్మింపబడిన సొమ్ములచే నలంకరించు కొన్నారు. నీ చేతిలో గాని, చెవిలో గాని గురిగింజ యెత్తు బంగార మగుపడదు. ఎవని దేహము నిండ అఖండమైన సహజ సౌందర్యము వెలుంగు చున్నదో అట్టివాడు సామాన్య మనుష్యుని వలె కృత్రిమములైన సొమ్ములలో భ్రాంతి నిడునా ! ఇది నీ యద్భుతమైన వైరాగ్యమునకు సాక్ష్యము.

*పృథ్వీపీఠే కృతపదమదః స్వచ్ఛమాకాశలింగం*
*తారాపుష్పైః శిరసి రచితా భ్యర్చనం చన్ద్రచూడ ।*
*ఇత్థం భావా దవహిత ధియో యే భవంతం భజంతే*
*తే లీయంతేత్వయి జలనిధౌ నిమ్నగానా మివౌఘాః ॥*

ఇందు శేఖరా! ఈ పృథ్వి యనెడి పీఠంపై నీ నిర్మలమైన యాకాశ మనెడు లింగము నిలచినదై చుక్కలనెడు పూలతో పూజింపబడు చున్నది అని యీ విధముగ నెవ్వరు ఏకాగ్రచిత్తులై నిన్ను తలంచుచున్నారో వారు సముద్రమున నదీజలములవలె నీ యందు సర్వాత్మనా లయమంది ముక్తులగుచున్నారు.

### 3.6.6 బిల్హణ స్తవం

క్రీ.శ 12 వ శతాబ్దములో నుండిన బిల్హణుడు విక్రమాంకదేవ చరితమను మహాకావ్యము రచించినవాడు. ఈతని శివస్తోత్రము బిల్హణ స్తవంగా ప్రసిద్ధి కెక్కినది. ఇందు 36 శ్లోకములు గలవు.

*సంతు సహస్రం దేవా స్తద్గుణ దోషోక్తిభిః కి మస్మాకం ।*
*శివమేవ వర్ణయామః పునరపి శివమేవ శివమేవ ॥*

వేల కొలది దేవతలుందురు గాక వారి గుణ దోషములతో మాకేమి పని? మేము శివునే వర్ణింతుము. మరల మరల శివునే స్మరించెదము.

*పంచ బ్రహ్మ షడంగ బీజ ముఖర ప్రాసాద పంచాక్షర*
*వ్యోమ వ్యాపి పురస్సరేషు మనుషు ప్రౌఢిః కుతో మాదృశాం ।*
*ఓంకారాది నమోంత ముద్రిత భవన్నామావలీ కల్పితం*
*సర్వం మంత్రతయా ప్రభో పరిణమత్యంతర్బహి ర్యోగతః ॥*

ప్రభో! సద్యోజాతాది (సద్యోజాతము, వామదేవము, అఘోరము, ఈశానము, తత్పురుషము) పంచ బ్రహ్మల వశ్యాకర్షణాది షడంగ బీజాక్షరముల చేత మిక్కిలి గొప్పదగు ప్రసాద పంచాక్షరి యక్షరములతో భూనభోంతరాళములు నిండుకొను మహా మంత్రములలో మా బోంట్లకు పాండిత్య మెక్కడిది? ఓంకారము ఆది యందును, నమః అను శబ్దము అంత్యము నందును నీ నామ ధేయములకు అంతర్బాహ్యముగ చేర్చినచో సమస్తము కూడ మంత్ర స్వరూపమై పోవుచున్నది.

### 3.6.7 ఆది శంకరుల శివస్తోత్రాలు

క్రీ.శ.7వ శతాబ్దిలో అద్వైత మత స్థాపనార్థం అవతరించిన శ్రీ ఆది శంకరులు శివ పరంగా అనేకమైన స్తోత్రాలను ప్రసాదించారు. అవన్నియు మిక్కిలి ప్రసిద్ధములగుటచే వాటి నామధేయములిట స్మరింపబడుచున్నది.

1) అన్నపూర్ణాష్టకమ్ 2) మీనాక్షి పంచరత్నమ్ 3) మీనాక్షి స్తోత్రమ్ 4) దక్షిణామూర్తిస్తోత్రమ్ 5) కాలభైరవాష్టకమ్ 6 ) గంగాష్టకమ్ 7) మణికర్ణికాష్టకమ్ 8) భ్రమరాంబాష్టకమ్ 9) శివ పంచాక్షర నక్షత్రమాలాస్తోత్రమ్ 10) ద్వాదశ లింగ స్తోత్రమ్ 11) అర్ధనారీశ్వర స్తోత్రమ్ 12) కాశీపంచకమ్ 13) శివానందలహరి 14) సౌందర్యలహరి 15) లలితా త్రిశతీ భాష్యమ్

### 3.6.8. శివానందలహరి

ఇందులో శివానంద, సౌందర్యలహరులు జగత్ప్రసిద్ధములైనవి. అయినను శ్రీశంకరుల గాఢభావన, జీవుని వేదనను తెలియజేయు శ్లోకం

*సదామోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ*
*నటత్యాశా శాఖాస్వటతి ఝటితి స్వైర మభితః ।*
*కపాలిన్ ! భిక్షో ! మే హృదయకపి మత్యంత చపలమ్*
*దృఢం భక్త్యా బద్ధ్వా శివ ! భవదధీనం కురు విభో ।*

ఈ శ్లోకాన్ని కవి సమ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ గారు 'త్రిశూల' మనే నాటకంలో యిలా అనువదించియున్నారు.

*సీ॥ మోహాటవి జరించు ముగుదల కుచగిరి*
*నెత్తమ్ము లందున నృత్యమాడు*
*ఆశా మహాశాఖ లందు భ్రమించు బు*
*త్తులటన్ని ఫలముల దిని మెలంగు*
*నోయి కపాలి ! భిక్షూ ! యీ మనస్సన్న*
*చపలాతి చపలంబు కపివరంబు*
*భక్తి పేరిట రజ్జుబంధంబునం గట్టి*
*నీ యధీనంబుగ నిలుపుకోవె*

బాల చంద్రమును శేఖర ! పర్వతేంద్ర !
దుహితృ తేజః కుటుంబి ! నిర్ధూత కలుష!
పశుపతీ ! సల్పు త్రెంచుక సారిపోవు
పశుల బంధము బంచి కాపాడుమయ్య !

శ్రీకాళహస్తి స్థల మాహాత్మ్యానికి సంబంధించిన వనచరుడైన తిన్నని (కన్నప్పనాయనార్) భక్తిని శ్రీ శంకరులిలా ప్రశంసించారు.

మార్గావర్తిత పాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే
గండూషాంబు నిషేచనం పురరిపోర్దివ్యాభిషేకాయతే ।
కించి ద్భక్షిత మాంసశేషకబలం నవ్యోపహారాయతే
భక్తిః కింన కరోత్యహో వనచరో భక్తావతంసాయతే ॥ (శ్లో.63)

దీనిని కార్యంపూడి రాజమన్నారుగారు యిలా ఆంధ్ర శివానందలహరిలో అనువదించారు.

సీ ॥ తిరుగగా తిరుగగా నరిగి పోయిన చెప్పు
గోత్రజాపతి మేని కూర్చమయ్యె
పుక్కిలించిన నీరు పురహరు దివ్యాభి
షేకాంబు జలంబయి చెన్ను మీఱె
ఎంగిలి చేసిన మేటి మాంసపు ఖండ
మభవు నైవేద్యమై యతిశయిల్లె
అడవుల ద్రిమ్మరునట్టి కిరాతుండు
భక్తవతంసుడై వాసిగాంచె

తే॥గీ॥ అహహా! భవదీయ భక్తిసాధ్యమ్ము గాని
దేమి కలదు శ్రీ కాళహస్తీశ్వర విభు

భక్తజనకల్పకం బగు భర్గు నిన్ను
శరణు పొంద లభింపదె పరమపదము

శ్రీ మదాంధ్ర శివానందలహరిలో దేవులపల్లి చెంచు సుబ్బయ్యగారు పై శ్లోకాన్నే యిలా అనువదించారు.

*పశుపతి కయ్యెఁ బాదముల వాడిన పాదుక కూర్చగా మహో*
*యశమునకు నయ్యెఁ బుక్కిటి లహాంబువు నా యభిషేకవారియై*
*విశదముగాఁ బురారి కిటు ప్రేమను భక్షిత మాంస శేషమే*
*యశనము నయ్యె భక్తునకు లాటవికుండు సుభక్తుఁడయ్యె ద*
*ద్దశమున నున్న భక్తుఁడగు భక్తి కయారె యసాధ్యమేమియో !*

దీనినే మహాకవి ధూర్జటి శ్రీకాళహస్తీశ్వర శతకములో రెండు పద్యాలలో వర్ణించాడు.

*నీకు న్మాంసము వాంఛయేని కఱవా ? నీ చేత లేడుండగా*
*జోకైనట్టి కుఠారముండ, ననలజ్యోతుండ, నీరుండగా*
*పాకంబొప్ప ఘటించి చేతిపునుకన్ భక్షింప కా బోయచే*
*జే కొంటెంగిలిమాంస మిట్లు దగునా? శ్రీకాళహస్తీశ్వరా (ప. 20)*

పంచభూతములు తన యధీనమందున్న శివుడు భక్తి అధీనుడగుచున్నాడని ధూర్జటి నిరూపించినాడు.

*దొప్పం దెంగిలి దెచ్చి యిచ్చినను గండూషాంబు ధారావలిన్*
*దొప్పం దోగిన చెప్పుకాల తలపై ద్రొక్కంగ నట్టిన గ*
*న్నప్పం బ్రాతుని జేసి తింటటకే సమ్మానంబు దీపింపగా*
*చెప్ప న్వేరము నీ విహార మహిమల్ శ్రీకాళహస్తీశ్వరా ! (ప. 118*

### 3.6.9 సౌందర్యలహరి

“శివ శ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్” అని ప్రారంభమవే

సౌందర్యలహరిలో శ్రీ శంకరులు ప్రాచీన తమిళ కవియైన నక్కీరుని, అరువత్తుమూవురు నాయన్మారులలో నొకడైన తిరుజ్ఞాన సంబందర్ ను 'ద్రవిడ శిశువు' అని సంబోధించిన శ్లోకాలు పూర్వమే చెప్పబడింది. కాబట్టి యిక్కడ వివరించడం లేదు.

### 3.6.10 శివ పరమైన స్తోత్రాలు

సంస్కృత బృహత్ స్తోత్ర రత్నాకరంలో (ప్రథమభాగం) శ్రీ గరిమెళ్ల సుబ్బరాయ శాస్త్రుల వారు శివపరాలైన స్తోత్రాలను సంకలనం చేశారు. అవి -

1) శివకవచమ్ - స్కాంద పురాణాంతర్గత బ్రహ్మోత్తర ఖండం ద్వాదశాధ్యాయం.
2) శివ మానస పూజాస్తోత్రమ్ - అజ్ఞాత కవి కృతమ్
3) శివ షడక్షరీ స్తోత్రమ్ - శ్రీ మచ్ఛంకర భగవత్పాదులు
4) శివాష్టకమ్ - శ్రీ కృష్ణజన్మ ఖండాంతర్గతము
5) శివాపరాధ క్షమాపణ స్తోత్రమ్ - శ్రీ మదప్పయ దీక్షిత విరచితమ్
6) శివపంచాక్షరీ స్తోత్రమ్ - అజ్ఞాత కవి కర్తృకమ్
7) శివ భుజంగ ప్రయాత స్తోత్రమ్ - శ్రీ శంకర భగవత్పాదులు
8) శివ తాండవ స్తోత్రమ్ - దశకంఠరావణ విరచితమ్
9) శివనామావళ్యష్టకమ్ - శ్రీఆదిశంకరాచార్యులు
10) శివస్తోత్రమ్ - ఉపమన్యు విరచితమ్
11) శివస్తుతిః - శ్రీలికుచిసూరి తనయుడు నారాయణాచార్యవిరచితం
12) శివ పంచాక్షరీ నక్షత్రమాలా స్తోత్రమ్ - శ్రీ ఆదిశంకరాచార్యులు

13) ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రమ్ - శ్రీ శంకరభగవత్పాదులు
14) విశ్వనాథాష్టకమ్ - వేద వ్యాసులు
15) పశుపత్యష్టకమ్ - అజ్ఞాత కవి కృతమ్
16) ద్వితీయ శివకవచమ్ - బ్రహ్మవైవర్త పురాణాంతర్గతం
17) లింగాష్టకమ్ - అజ్ఞాత కవి కృతమ్
.18) చంద్రశేఖరాష్టకమ్ - మాఘమాహాత్మ్యే మార్కండేయ కృతమ్
19) సోమ సుందరాష్టకమ్ - హాలాస్య మాహాత్మ్యే ఇంద్ర కృతమ్
20) అర్ధనారీశ్వరాష్టకమ్ - ఉపమన్యు విరచితమ్
21) వేదసార శివస్తోత్రమ్ - శ్రీశంకరభగవత్పాదులు
22) రుద్రస్తుతి - కూర్మపురాణే వ్యాసోక్తమ్
23) సదాశివాష్టకమ్ - హాలాస్యమాహాత్మ్యే పతంజలి కృతమ్
24) ఉమామహేశ్వర స్తోత్రమ్ - శ్రీశంకరభగవత్పాదులు
25) కాలభైరవాష్టకమ్ - శ్రీఆదిశంకరాచార్యులు
26) శివస్తవరాజమ్ - బ్రహ్మవైవర్త పురాణే బ్రహ్మఖండే సౌతి శౌనక సంవాదాంతర్గతమ్
27) దక్షిణామూర్త్యష్టకమ్ - గురుజ్ఞానవాసిష్ఠమ్ (2-1) వ్యాసకృతమ్
28) హాలాస్యేశాష్టకమ్ - హాలాస్యమాహాత్మ్యే కుండోదర కృతమ్
29) పరమేశ్వర స్తుతిసార స్తోత్రమ్ - బ్రహ్మానంద విరచితమ్
30) బ్రహ్మాండ విజయ కవచమ్ - బ్రహ్మ వైవర్తపురాణాంతర్గతమ్

31) ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రమ్ - శివ పురాణాంతర్గతమ్
32) అట్టాల సుందరాష్టకమ్ - హాలాస్య మాహాత్మ్యే షికమ పాండ్య కృతమ్
33) అగస్త్యాష్టకమ్ - అజ్ఞాతకవికృతమ్
34) దక్షిణామూర్తిస్తోత్రమ్ - శ్రీ శంకరులు
35) పార్వతీ వల్లభాష్టకమ్ - శ్రీశంకరయోగీంద్రులు
36) ప్రదోషాష్టకమ్ - స్కాంద పురాణాంతర్గతమ్
37) దారిద్ర్యదహన స్తోత్రమ్ - వశిష్ఠ విరచితమ్
38) నిర్వాణదశక స్తోత్రమ్ - శ్రీశంకరభగవత్పాదులు
39) దశ శ్లోకీ - శ్రీశంకరాచార్యులు
40) నిర్వాణషట్కమ్ - శ్రీశంకరాచార్యులు
41) ఆత్మపంచకమ్ - శ్రీశంకరాచార్యులు
42) రుద్ర కవచమ్ - స్కాంద పురాణే దుర్వాసః ప్రోక్తమ్
43) మహాదేవస్తుతిః - మత్స్యపురాణే బ్రహ్మాది దేవ కృతమ్
44) శివస్తోత్రమ్ - కూర్మపురాణే శ్రీ కృష్ణ కృతమ్
45) శివస్తుతిః - వరాహ పురాణే ఇంద్రాది కృతమ్
46) శివస్తోత్రమ్ - హాలాస్య మాహాత్మ్యే వరుణ కృతమ్
47) శివస్తోత్రమ్ - బ్రహ్మవైవర్త పురాణే శ్రీ కృష్ణ జన్మ ఖండే హిమాలయ కృతమ్
48) శివస్తోత్రమ్ - కల్కి పురాణే కల్కి కృతమ్
49) పరమేశ్వర స్తోత్రమ్ - అగ్ని పురాణే అగ్ని వశిష్ఠ సంవాదే వశిష్ఠ కృతమ్
50) శివస్తోత్రమ్ - బ్రహ్మ వైవర్త పురాణే అసిత కృతమ్

51) శివస్తోత్రమ్ - వరాహపురాణే దేవకృతమ్
52) ఉమామహేశ్వరాష్టకమ్ - హాలాస్య మాహాత్మ్య సంఘలకృతమ్
53) శివస్తోత్రమ్ - మత్స్య పురాణే రతీదేవకృతమ్
54) తీక్ష్ణదంష్ట్ర కాలభైరవాష్టకమ్ - అజ్ఞాత కవికృతమ్
55) మృత్యుంజయ స్తోత్రమ్ - నృసింహ పురాణే శివ బ్రహ్మ సంవాదే మార్కండేయ కృతమ్
56) శివస్తోత్రమ్ - శివ రహస్యే సప్తమాంశే శివ గౌరీ సంవాదేకాశీమాహాత్మ్యే పశుపతేశ్వ రేతిహాస కథనమ్ విష్ణు కృత స్తోత్రమ్
57) అపరాధ స్తోత్రమ్ - హాలాస్య మాహాత్మ్యాంతర్గతమ్
58) హాటకేశ్వర స్తోత్రమ్ - వామన పురాణాంతర్గతమ్
59) మహేశ్వర పంచరత్న స్తోత్రమ్ - అజ్ఞాతకవికృతమ్
60) పరమేశ్వర మాతృకావర్ణమాలా - అజ్ఞాతకవికృతమ్

### 3.6.11 నీలకంఠదీక్షితుల శివలీలార్ణవం, శివోత్కర్షమంజరీ

శివలీలార్ణవం 22 సర్గల మహాకావ్యం. ఇది పరమ శివుని చతుష్షష్టి లీలలను వర్ణించుకావ్యం. మధురలో వెలసిన సుందరనాథ శివుని లీలలే అవి. సంప్రదాయ కథనానుసారం పరమశివుడు పాండ్య రాజ వంశంలో సుందర పాండ్యుడై అవతరించి ఈ అరువది నాలుగు లీలల్ని భక్తానుగ్రహం కోసం ప్రదర్శించినాడని చెబుతారు. దీనికి మూలం స్కాందపురాణంలోని 45 వ ఖండమైన హాలాస్యమాహాత్మ్యము.

నీలకంఠ దీక్షితులనే అయ్యా దీక్షితులంటారు. ఈ కవి క్రీ.శ. 17 వ శతాబ్ది పూర్వార్ధంలో నివసించినవాడు. అప్పయ్య దీక్షితుల సోదరుడు రత్నఖేటదీక్షితులు. ఈయన మనుమడే నీలకంఠ దీక్షితులు. ఇతడు

మధురనాయకరాజగు తిరుమలనాయకుని ముఖ్యమంత్రే గాక ఆస్థాన పండితుడు కూడా. ఇతడు 36 సంవత్సరాలు ఆ పదవిని నిర్వహించాడు.

ఇతని యితర కృతులు కలివిడంబన శతకము, సభారంజన శతకము, అన్యాపదేశ శతకము, శాంతి విలాసము, వైరాగ్య శతకము, ఆనంద సాగర స్తవము, శివోత్కర్ష మంజరీ, గంగావతరణము, నల చరిత నాటకము, కైయ్యటవ్యాఖ్య, శివతత్వ రహస్యము మొదలగునవి.

నీలకంఠ దీక్షితుడు ధూర్జటికి తరువాతి వాడు. ధూర్జటి మనుమడైన కుమార ధూర్జటి (పెద కాళహస్తి మాహాత్మ్యకర్త) కి సమకాలికుడు. ధూర్జటి సంగ సాహిత్య కవులలో శ్రేష్ఠుడైన నక్కీరుని కథను కాళహస్తి మాహాత్మ్యములో వర్ణించగా, నీలకంఠ దీక్షితుడు సంగ సాహిత్యము మధురలో ప్రవర్తించినదిగాన మధురలో వెలసిన సోమసుందరుని లీలలు వర్ణించు సందర్భమున 20 వ సర్గలో 51 వ లీల నుండి 55 వ లీల వరకు నక్కీరుని కథను కథాబద్ధము చేసినాడు. తమిళంలో నక్కీరర్, తెలుగులో నక్కీరుడు కాగా, సంస్కృతంలో కీరకవి అని వున్నది. 20 వ సర్గలో -

1) కవిసంఘాయ ఫలకదానమ్ ।

2) నిజార్చకాయ వంశ శేఖర పాండ్య చింతాను గుణపద్య దానమ్ ।

3) విద్యావివాదే విహితాతివాదస్య కీరకవేః పునరనుగ్రహః।

4) మూకముఖేన తత్ర ద్రావిడ సూత్ర వృత్తి వివేచనమ్

5) భక్తస్య కవే రవమానమేవ క్రోధాద్దేవస్య పురాద్బహిర్నిర్గమనమ్ ।

6) దాశకులే అవతీర్ణాయాః అంబాయాః పాణిగ్రహః ।

కాశీ ఖండంలో వ్యాసుని శివుడు కాశీ క్షేత్రం నుండి బహిష్కరించినట్లు శివుని కవిత్వంలో తప్పు పట్టిన కీరకవిని శివుడు మధుర నుండి బహిష్కరించినట్లుగా నీలకంఠ దీక్షితుడు తీర్పు చెప్పాడు.

నీల కంఠ దీక్షితుల తర్వాత తెలుగులో ముగ్గురు కవులు హాలాస్య మాహాత్మ్యమను పేర ప్రబంధముగా ఈ చతుష్షష్టి లీలలను వ్రాశారు. వారు

1) హాలాస్యమాహాత్మ్యము - మల్లమ పల్లి బుచ్చికవి

ఇతడు ఆరాధ్య బ్రాహ్మణుడు. ఇది ఆరాశ్వాసముల ప్రబంధము. హాలాస్య క్షేత్రమనగా దక్షిణ మధుర. అక్కడ వెలసిన సుందరేశ్వరస్వామి వారి యఱువది నాలుగు లీల లిందు వర్ణింపబడినవి. స్కాంద పురాణాంతర్గత మగు శంకర సంహిత లోని మూలమున కిది తెలుగు సేత. ఈ కవి కాలము గాని నివాసము గాని సరిగా తెలియరాదు. గ్రంథాది పద్యము లందిట్లున్నది.[1] హరిత మౌనికి కాశి యందు విశ్వేశ్వరుని యనుగ్రహముచే గుమారాంశమున విశ్వేశుడను పుత్రుడు కలిగాడు. అతనికి ఏకోరాముడును, ఏకోరామదేశికునకు, పల్లినాథుడును పుట్టారు. పల్లినాథుడు తన తపః ప్రభావమున నొక కుల్యను గల్పించి, వేటకు వచ్చి దప్పి గొన్న యాదేశ నృపతిని, దత్సైన్యమును బ్రదికించి మల్లమపల్లి యనే అగ్రహారాన్నిపొందాడు. అప్పటి నుండి యీ కవి వంశము వారు మల్లంపల్లి వారన బడ్డారు. మల్లంపల్లి గ్రామము కృష్ణామండలములోని చల్లపల్లి సంస్థానంలో ఉంది. బుచ్చికవి తండ్రి వీరారాధ్యుడు. తల్లి నందమ్మ. ఇతనికి దన పిన తండ్రి యగు పేరయలింగము లింగధారణము చేయించిన దీక్షాగురుడు. అత్తలూరి పాపయారాధ్యుడు ఈతని విద్యా గురువు. కవి కాలము ప్రాయికంగా 19 శతాబ్ద్యారంభము కావచ్చును.

ఈ కావ్యం పంచమాశ్వాసంలో 50 వ లీల యందు సంఘ పీఠ ప్రదాన లీల, 53 వ లీలలో నక్కీర రక్షణ లీల, 54 వ లీలలో నక్కీర ద్రావిడ సూత్రోపదేశ లీల, 57 వ లీలలో సంఘకవి వాదోప శమన లీల చెప్పబడినాయి.

*తెలుగులో మరి కొన్ని హాలాస్యమాహాత్మ్యాలు వెలువడినాయి. అవి*

1) హాలాస్య మాహాత్మ్యము - కఱువె నంజరాజు (క్రీ.శ.1720)

---

*1 హాలాస్య మాహాత్మ్యము - మల్లపల్లి బుచ్చికవి శ్రీ మాహిష్మతీ ముద్రణ శాల, ముక్త్యాల, 1917*

2) హాలాస్య మాహాత్మ్యము - తిరుమలశెట్టి జగన్నాథదాసు (క్రీ.శ.1888)

3) శ్రీమదార్షధ హాలాస్య మాహాత్మ్యము - జనమంచి శేషాద్రిశర్మ (క్రీ.శ.1906)

తెలుగు శతకాల వలె మకుట నియమం పాటిస్తూ శ్రీ నీలకంఠ దీక్షితుడు 17 వ శతాబ్ది పూర్వార్ధంలో రచించిన 'శివోత్కర్ష మంజరి' శివాధిక్యాన్ని ప్రతిపాదిస్తోంది. "సస్వామీ మమ దైవతం తదితరో నామ్నాపివామ్నాయతే" అనేది మకుటం. మచ్చుకు ఒక శ్లోకం

*అర్వామీతి ధియా యదేవ కుసుమం క్షిత్వాబుచో ముచ్యతే*
*వధ్యామీతిధియా తదేవ వికిరన్ భస్మీకృతో మన్మథః ।*
*యత్వాభ్యంతరవృత్తి మాత్ర రసికో సాక్షాత్స్వయంభూరపున్*
*సస్వామీ మమ దైవతం తదితరో నామ్నాపివామ్నాయతే ॥*

### 3.6.12 సంస్కృత శ్రీ కాళహస్తి స్థల మాహాత్మ్యమ్

ఉపాప పురాణంగా రచింప బడిన సంస్కృత శ్రీకాళహస్తి స్థలమాహాత్మ్యము 1893 వ సంవత్సరం, శ్రీకాశీవిశ్వనాథ ముద్రాక్షరశాల, వెంకటగిరి లో ముద్రింపబడి వెలువడింది. ఈ ఉపాప పురాణం శివ పురాణాంతరిత శివరహస్యాంతర్గత మని, రోమశ భరద్వాజ సంవాద రూపమని, బ్రహ్మాది పద్మ సేవాంత మహాజనాద్భుత విచిత్ర చరిత్ర చిత్రిత మని చెప్పబడింది. ఈ పురాణం బ్రహ్మశ్రీ చేట్లూరు వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు పరిష్కరింపగా వెంకటగిరి సంస్థానాధీశులైన శ్రీ వెలుగోటి రాజా శ్రీముద్దుకృష్ణ యాచేంద్ర భూపాలవర్యులచే ప్రకటింపబడినది.

*ఇందలి ముఖ్య విశేషములివి*

1) శ్రీ కాళహస్తి క్షేత్రోత్కర్షః । 2) తత్తద్యుగ భక్త చరిత్ర సంగ్రహః ।
3) దక్షిణ కైలాస మహిమానువర్ణనమ్ । 4) పాతాళ గణేశ ప్రశస్తి ।

5) సువర్ణ ముఖర్యుత్పత్తిః । 6) వృద్ధద్విజ వేష శివాష్మగహా కథనమ్
7) మయూర ముక్తి ప్రదానం । 8) శబర చరిత్రే లింగరక్షణ కథనం।
9) శబర ముక్తి ప్రదానం ।10) సుభగా ముక్తి కథనం ।
11) జపాలాముక్తి వర్ణనమ్ । 12) వరగుణ పాండ్యాష్మగహా కథనం।
13) రాజకన్యాయుగలస్య సాలోక్యముక్తి ప్రదానం । 14) భరద్వాజస్య శ్రీ కాళహస్తీశ్వర సాక్షాత్కార కథనం ।

ఈ ఉపోప పురాణం ధూర్జటి కాలానికి ఉందో లేదో చెప్పలేము. ధూర్జటి కావ్యంలో వచ్చిన విషయాలివి.

అధ్యా . 53 శబర చరిత్రే లింగ రక్షణ కథనం

అధ్యా . 54 శబర ముక్తి ప్రదానం

అధ్యా . 55 కుళింద శ్రీ నామక ముక్తిదానం

అధ్యా . 56 కాళహస్తినోః ముక్తి ప్రదానం

అధ్యా . 57 కాళహస్తినోః పూర్వ వృత్త కథనం

ఇవి మాత్రమే ధూర్జటి కావ్యంలో ఉన్నాయి. కాబట్టి ధూర్జటి కావ్యానికిది మూలం కాదని ఆయన తన కాలం నాటికి ప్రసిద్ధమైన స్థల పురాణ కథలను, తమిళ సంగ సాహిత్యం నుండి నత్కీరుని కథను స్వతంత్రంగా గ్రహించి ప్రప్రథమంగా తెలుగులో కావ్యీకరించినాడని,ధూర్జటి కథావస్తువును స్వతంత్రముగా తీర్చిదిద్ది నాడని, దానికి సంస్కృత పురాణము మూలము కాదని చెప్పవలసివస్తున్నది.

### 3.6.13 శ్రీ శివానందతీర్థుల శ్రీ కాళహస్తీశ శతనామాబ్జ మాలికా వ్యాఖ్య

క్రీ.శ. 1893 వ సంవత్సరంలోనే వేంకటగిరి లోని శ్రీ కాశీవిశ్వనాథ ముద్రాక్షరశాలలో ముద్రింపబడిన గ్రంథమున్నది ఇది శ్రీ కాళహస్తి

స్థలమాహాత్మ్య పురాణంలో చెప్పబడిన శతనామావళికి వ్యాఖ్యారూపమైన గ్రంథం. వ్యాఖ్యాత పేరు శ్రీ శివానంద తీర్థులు. ఈయన పరమహంస పరివ్రాజకాచార్యవర్యులు, శ్రీమత్ చిదంబరానంద తీర్థపాదుల శిష్యుడు. ఈ గ్రంథం వెంకటగిరి సంస్థానాధీశుడైన శ్రీ మద్వెలుగోటి రాజా శ్రీ ముద్దుకృష్ణ యాచేంద్ర భూపాలవర్యులచే ప్రకటింపబడింది. పరిష్కర్త బ్రహ్మశ్రీ చేట్లూరు వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

పై రెండు గ్రంథాలను పేర్కొనక పోయినా దీని యందలి విషయాలను యథాతథంగా గ్రహించి తెలుగు వచనంలో వ్రాసినవారు శ్రీ పూడి వేంకట రామయ్యగారు[1]. ఉపోస పురాణంలో చెప్పబడిన తీర్థాలు, భక్తులు వారి వివరాలన్నీ ఈ తెలుగు గ్రంథంలో పొందుపరుపబడినాయి. రెండవ గ్రంథమైన శతనామాబ్జమాలిక ను శతనామావళి అనే పేరుతో గ్రంథాంతంలో అచ్చువేశారు, శ్రీ పూడివారు.

### 3.6.14 స్థల పురాణ కాల నిర్ణయం

పై చెప్పబడిన ఉపోస పురాణం శ్రీకాళహస్తి స్థలపురాణం ఏ కాలంలో రచింపబడిందో దానికి ఆధారాలు లేవు. శివ పురాణాంతర్గతమని చెప్పిన మాట వాస్తవం కాదు. ప్రధాన శివపురాణంలో శ్రీకాళహస్తి ప్రశంసేలేదు. ద్వాదశ జ్యోతిర్లింగాలలోను కాళహస్తి లింగ ప్రశంస లేదు. శివపురాణంలో శివరహస్య మన్నారు. శివరహస్యఖండం స్కాందపురాణాంతర్గతం. అందులోను శ్రీకాళహస్తి ప్రశంసలేకపోవడం మూలాన ధూర్జటి కావ్యానికి యిది మూలం కాకపోవడం వలన, శతనామాబ్జమాలిక శ్రీకాళహస్తి స్థల మాహాత్మ్య పురాణాంతర్గతమని చెప్పి దానికి వ్యాఖ్య వ్రాసిన శ్రీ శివానంద తీర్థుల గురువులు, పరమహంస పరివ్రాజకాచార్యవర్యులు, సంతత ప్రణవార్థాను సంధాన పరాయణులైన శ్రీమత్ చిదంబరానంద తీర్థ పాదులే

---

*1 శ్రీకాళహస్తి క్షేత్ర వైభవం - విద్వాన్ పూడి వేంకటరామయ్య, శ్రీనివాస భారతి, శ్రీకాళహస్తి, 1992*

ఈ సంస్కృత శ్రీకాళహస్తి స్థల మాహాత్మ్య పురాణాన్ని గ్రంథించి వుండవచ్చు శిష్యుడైన శివానంద తీర్థులు శతనామాబ్జమాలిక కు వ్యాఖ్య వ్రాసినాడని అది గురువుగారి గ్రంథం మీద గల విశేషమైన ఆదరణ వల్లనే. ఉపో పురాణమనే మాటయే అది తర్వాత వ్రాయబడిన దను అర్థాన్ని చెప్పక చెబుతుంది కదా ! కాబట్టి ధూర్జటి తర్వాతనే క్రీ.శ. 17, 18 శతాబ్దాల్ సంస్కృత శ్రీకాళహస్తి స్థల మాహాత్మ్య పురాణం గ్రథింపబడిందని చెప్పవచ్చు. నిశ్చితమైన యితరాధారాలు లభించేటంత వరకు ఈ విషయంలో యిదమిత్థంగా చెప్పడానికి వీలు లేదు. ఈ పురాణానికి తాళపత్ర గ్రంథాలే యింతవరకు లభించలేదు. తాళపత్ర గ్రంథాలు కనీసం ఒక్క ప్రతియైన లభించిన పక్షంలో ఆ ప్రతి ప్రాచీనత్వం, విలేఖన కాలాన్ని బట్టి, కర్తృత్వ నిర్ణయం చేయడానికి వీలవుతుంది. ముద్రణ యంత్రం ప్రవేశపెట్టబడి తర్వాత కూడా 19 వ శతాబ్ది వరకు కూడా మన దేశీయులు తాళపత్రాల్లో వ్రాయడం మాన లేదంటే ఆశ్చర్యకరంగా విడ్డూరంగా ఉండవచ్చు. కాబట్టి మూడువందల యేండ్ల క్రితం ఈ సంస్కృత ఉపోప పురాణం [illegible] చిదంబరానంద తీర్థపాదుల చేతనో లేక వారి పర్యవేక్షణలోన గ్రథింపబడిందని, అది ఒక శతాబ్దం తర్వాత అంటే క్రీ.శ. 1750 ప్రాంతాలల్ గ్రథింపబడగా, క్రీ.శ. 1893 లో వెలుగోటి వంశీయుల ఆదరణతో అచ్చుకెక్కినదని చెప్పవలసి ఉంది. శ్రీకాళహస్తి క్షేత్రానికి అ[illegible] ప్రాచీనత్వమున్నదని చెప్పటకు సంస్కృత భాషలో, శివపురాణాంతర్గతమ[illegible] చెప్తూ వ్రాసిన దానిని మరియే యితర పురాణాలు, కావ్య కవులు యిటీవలి కాలం వరకు పేర్కొనక పోవడం మూలాన ఈ ఉపోప పురాణం ధూర్జటికి తర్వాత ఏర్పడిందని నిర్వివాదంగా చెప్పవచ్చు.

### 3.6.15 శ్రీ కాళహస్తీశ్వర స్తోత్ర సాహిత్యం

ఈ ఉపోప పురాణ గ్రథనంలో శతనామాబ్జమాలిక శ్రీకాళహస్తీశు[illegible] పరంగా ఉందని చెప్పబడ్డది. ఆ తర్వాతనే విరివిగా స్తోత్రాలు, దండకాలు

స్తుతులు, అష్టకాలు, సంస్కృతంలో రచింపబడివుంటాయి. వాటి కర్తల పేర్లు యిప్పటికీ తెలియడం లేదు. కాని, సంస్కృత శ్రీకాళహస్తి మాహాత్మ్య పురాణంలో ప్రారంభంలోనే కర్త పేరు లేకుండా శ్రీకాళహస్తీశ్వర దండకం ముద్రింపబడివుంది.

## 3.6.16 శ్రీ కాళహస్తీశ్వర దండకము

జయ పరమశివార్ధ చంద్రోల్లసచ్చూడ చంద్రాభ చక్షుశ్శ్రవో మాల్య దాక్షిణ్య విఖ్యాత కైలాసవాసి న్మహాదేవ దేవేశ యక్షేశ సంపూజ్య మానాంఘ్రి పంకేరుహాంభాసగాగర్వ సర్వంకష వ్యోమకేశాబ్జ భూపుండరీకాక్ష సంభావి తాత్మన్స్వభక్తౌఘజేగీయ మానాపదాన స్మరాభిఖ్య మాతంగ పంచాస్య శధోదయా సారసింధో సతామేక బంధోక బంధాగ్ని వాయ్విందు రవ్యాది మూర్తే నిరస్తాఖిలార్తే శ్రిత జ్ఞాన పద్మ ప్రబోధా హిమాంశోమృకండూద్భవా తంక కార్యంతకానల్ప గర్వాంధ కారార్క సేవా సమానమ్ర దిక్పాల కోటీర రత్నప్రభా రూషితాంఘ్రే ప్రభో ॥ ౧ ॥

విమలతర విభూతి రేఖాసముద్భాసమానాళిక ప్రోల్లసజ్జాత వేదోక్తి శోభాపరాభూత వర్షాంతకాలోల్ల సన్మేఘ మధ్యస్థ బాలార్క బింబ జ్వాలత్కాల కూట ప్రభా దిగ్ధ కంఠాభిభూతేంద్ర నీలోపలాత్యుగ్ర దైత్యేంద్ర భీకారి శూలాయుధోద్భాసి పాణే నగేంద్రాత్మ జాలీఢ వామార్ధ దేహోరగా ధీశ కాంచీగుణోల్లాసి మధ్యప్రదేశ స్ఫురద్వ్యాఘ్ర చర్మాంబరోష స్ఫుర త్పంక జోద్దామ శోభాపరా భూతి పంకల్ప సంయోజితాంఘ్రే జటాజూట కారాగృహాబద్ధ తారేశ సంత్యాజనేచ్ఛా సమాయాత పాదావనమ్రమక్ష్య సంఘ భ్రమాదాయి దీవ్యన్నఖాళే మృడానీవిభో ॥ ౨ ॥

జలధి మధన కాల సంజాత లోకత్రయోద్వేగ కృత్కాల కూటాగ్ని కీలాళి దంద్యమానామరేంద్రా, సురేంద్రాది జీవౌఘ రక్షాతి విఖ్యాత దీనార్తి హారిత్వ కీర్తే కృతార్థీష్ట పూర్తే జగజ్జాల మేతత్సృజన్ పాసి భూయస్త్వ మేవా త్సనాధ త్వయ్యైవైష లోకోభి లేషు స్వకార్యేషు సంప్రేర్యమాణోవరీవర్తి

తుభ్యం మహీనిర్జరాః ప్రత్యహం ప్రాతరర్ఘ్యం దదత్యాదరా త్త్వత్ర సేవార్య మాదిత్రయో దేవి నిత్యం నమస్తే శివాన్యాః పతిర్లీన మేత జ్జగత్త్రయ్య శస్మిం మహేశం నిరస్తాంతర ధ్యాన ధారాభిలస్వాంత దోషా విపశ్చిద్వరేణ్యా పశూనాంపతే కాళహస్తి ప్రభో ॥ 3 ॥

సనకముఖ శిష్యాణాం దక్షిణామూర్తి రూపేణ నిస్సంగ మద్వైతమ స్థూల మశోక మగోత్ర్య మహ్రస్వ మాకాశరూపం పరం నిర్వికారం విశుద్ధం విబుద్ధం సదానందరూపం పరాత్మస్వరూపం వటానోక హస్యస్థితోధః ప్రదేశే భవాన్బోధయామాస యస్తంభవంతం శరణ్యం ప్రపన్నో భవామీశ మాతాపితా చత్వ మేవాసి బంధుస్సుహృన్మే గురుస్త్వం న జానే పురారే భవత్తోన్య దేవం ప్రసీదానరాధా న్మయాశక్యమానాన్ క్షమ స్వస్వశక్త్యాపరాధాన్ పితేవేప్సితం మే ప్రదేహ్యాశు మామయ్యుపేక్షాం కురు జ్ఞానసూనాంబికానాథ నిత్యం నమస్తే నమః పాహిమాం పాహిమాం ॥ 8 ॥

శ్రీజ్ఞాన ప్రసూనాంబాసమేత శ్రీకాళహస్తీశ్వర ప్రసాదోఽస్తు ।

### 3.6.17 శ్రీ కాళహస్తీశ్వర శతనామాబ్జమాలికా

శ్రీ కాళహస్తీశుని శతనామావళిలో ప్రధానమైనవి కొన్ని యిట పేర్కొనబడుచున్నవి ఈ శతనామాబ్జమాలికకు శ్రీశివానందతీర్థులు వ్యాఖ్యను సంస్కృతంలో రచించియున్నారు.

*దివ్యకైలాస శిఖరోద్ర నివాసభువే నమః ।*

*అఖండ బిల్వప్రదాన ప్రియాయ నమః ।*

*లూతార్తి మోచకాయ నమః ।*

*సంసార వైద్యకాయ నమః ।*

*కాళేభాజంజనధ్వంసినే నమః ।*

*శబరాభయదాయకాయనమః ।*

*తురుక్షేణ పూజితాయ నమః ।*

*సువర్ణముఖరీ తీరవాసినే నమః ।*

*పంచాక్షరాకారాయనమః ।*

*లింగోద్భవాయనమః ।*

*అనామయాయనమః ।*

*యక్షవపుర్ధరాయనమః ।*

*వరగుణాభీప్సితార్థ ప్రదాయ నమః ।*

*శ్రీ మత్పాండ్య పురస్థితాయనమః ।*

*ప్రసన్న కాళహస్తీశాయనమః ।*

శ్రీకాళహస్తి స్థల మాహాత్మ్య పురాణంలో చెప్పబడిన భక్తుల పేర్లన్నీ కథా ఘట్టాలన్నీ భగవత్పరంగా యిక్కడ సంబోధింపబడినవి. కాబట్టి ఈ శతనామావళికి ఆధారం - స్థల పురాణమే. శ్రీ శివానందతీర్థులు కూడా ఆ స్థల పురాణ ఘట్టాన్నే సూచిస్తూ ఈ శత నామావళికి వ్యాఖ్యను వ్రాశారు. కాబట్టి పురాణ కథా వ్యాప్తి కోసం, దాని యితోఽధిక ప్రాచుర్య ప్రశస్తిని సంతరించి పెట్టడం కోసం స్థల పురాణాన్ని గ్రథించిన / గ్రంథింప జేసిన చిదంబరానంద తీర్థపాదుల శిష్యుడైన శివానంద తీర్థులు దీనికి వ్యాఖ్య వ్రాయడం జరిగిందని స్పష్టంగా తెలుస్తోంది. ముఖ్యంగా, మయూరార్తి ప్రహర్తా, జపాలా భక్తిగోచరః, మూకమృత్యుంజయార్తిఘ్నః, వృద్ధ బ్రహ్మణవేషధృత్, మాయాశివద్విజాకారః, యక్షవపుర్ధరః, వరగుణా భీప్సితార్థ ప్రదాయకః, శ్రీమత్పాండ్య పురస్థితః వంటి నామముల వ్యాఖ్యలో పురాణ కథా ప్రసక్తి చేసియే శివానందతీర్థులు వ్యాఖ్యానించుట చేత ఈ స్థల పురాణానికి యితోఽధిక ప్రాశస్త్యం, ప్రచారం సమాకూర్చడం కోసం ఆయన యీవ్యాఖ్య వ్రాసినాడనుటలో ఔచిత్యమెంతైనా యున్నది. ఆయన వ్యాఖ్యా ధోరణికి ఒకటి రెండు ఉదాహరణాలు.

*లూతార్తి మోచకః* లూయతే విచ్ఛిద్యతే స్వోత్పాదిత తంతు రచ యేతి లూతా । కీట విశేషః। లూఙ్ ఛేదనే । కశ్చిద్ద్విజాధమః కువిందం

ధనిన ముపజీవ్య తస్య సద్మ న్యేవా మరణం వపన్నంతేకస్మై చిచ్చివ యోగినే మహాలింగమస్త్రం దత్వా సద్యో మమార । తత్ప్రభావేనాయ మాలయ నికట దేశే తంతువాయ జంతుర్జాతిస్మరో జనిత్వా శివగర్భాలయే నిజ తంతు నిహార్గోపురా స్థాన మంటప పరస్తటాక శిఖరాదీని విచిత్రాణి నిర్మాయ తేష్వే కాజ్ఞయా ప్రజ్వలితేషు సరభసం స్వతమామపి తత్రాగ్నౌ జుహావ । తదా తస్యార్తిం భవ పీడాం మోచయామాసేతి కథా ।

సర్వజ్ఞః  సర్వం తత్తత్ప్రాణి కర్మ ఫలానుభవయోగ్య శరీరాదికం
కల్పాదౌ యౌగపద్యేన జానాతీతి సర్వజ్ఞ ఇత్యర్థః ।

స్థాలీపులాకన్యాయంగా పరిశీలింపగా ఈ వ్యాఖ్య ఉత్తమంగా ఉందని, విశిష్ట విధానంలో సంతరింపబడిందని చెప్పవచ్చు.

## 3.6.18 శ్రీ జ్ఞానప్రసూనాంబికాస్తోత్రమ్[1]

ఇది యే పురాణాంతర్గతమో, లేక విడిగా యే పండిత కవిచే యెప్పుడు వ్రాయబడినదో తెలియదు గాని వాదాపు వంద యేండ్ల నుండి ఈ శ్లోకములు తెలుగు దేశంలో సుప్రసిద్ధం. 'ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికామ్ ' అనే మకుటంతో 10 శ్లోకాలిందున్నాయి. దీనికి విద్వాన్ జి తిరువేంగడ సూరిగారు తెలుగులో టీకాతాత్పర్యాలు వ్రాశారు. శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా గ్రంథమాల వారు దీనిని తొలుత ప్రచురించినవారు. ఆ తర్వాత సూరిగారి వ్యాఖ్యతో శ్రీకాళహస్తి దేవస్థానము వారిప్పటికి ఆరుసార్లు ముద్రించి యున్నారు.

*మాణిక్యాంచితభూషణాం మణిరవాం మాహేంద్రనీలోజ్జ్వలాం*
*మందారద్రుమమాల్యభూషితకుచాం మత్తేభకుంభస్తనీం ।*
*మౌనిస్తోమనుతాం మరాళగమనాం మాధ్వీరసానందినీం*
*ధ్యాయేచేతసి కాళహస్తినిలయాం జ్ఞానప్రసూనాంబికామ్ ॥*

*1 ఈ పదిశ్లోకములు ఈ సిద్ధాంత గ్రంథానికి అనుబంధం (Appendix)లో చూడవచ్చు.*

లెక్కింప శక్యము కాని మణి భూషణములను, మందార కుసుమ మాలలను ధరించి, యున్నత స్తనములను హంసగమనమును గలిగి ఇంద్రనీలముల వంటి దేహకాంతులతో జ్ఞాన ప్రసూనము లందలి మకరంద రస పానమున నానందించు చుండు శ్రీ కాళహస్తి యందలి జ్ఞాన ప్రసూనాంబికా దేవిని మానసము నందు ధ్యానింతును.

### 3.6 19 శ్రీ కాళహస్తీశ్వర స్తోత్రం

అగస్త్య మహర్షి, యోగిని యైననీలాదేవికి ఉపదేశించినట్లుగా శ్రీకాళహస్తి క్షేత్ర మాహాత్మ్య పురాణంలో శ్రీ కాళహస్తీశ్వర స్తోత్రం చెప్పబడి వుంది. ఇందులో 16 శ్లోకాలున్నాయి. ఈ శ్లోకాలు, తాత్పర్యంతో సహా శ్రీపూడి వేంకటరామయ్య గారి శ్రీ కాళహస్తి క్షేత్ర వైభవంలో పుటలు 49 నుండి 55 వరకు ఉన్నాయి.[1] "శ్రీ కాళహస్తి నిలయం శివమాశ్రయామి" అనే మకుటం గల ఈ శ్లోకాలు విస్తృత ప్రచారంలోనికి రావలసియున్నది.

*స్వాధీనశక్తి లవకల్పిత పంచకృత్యం*
*శుద్ధేందు ఖండ సుర సింధు జటావిభూషమ్ ।*
*జ్ఞానప్రసూనకలికా కలితార్ధదేహం*
*శ్రీకాళహస్తినిలయం శివమాశ్రయామి ॥*

తన అవిద్యాశక్తి చేత సృష్టి స్థితి సంహార ఆవిర్భావ తిరోభావము లనెడి పంచకృత్యములు గలవాడును, చంద్రకళ, ఆకాశ గంగలతో విరాజిల్లు చుండు జటా జూటంతో ప్రకాశించుచుండు, జ్ఞాన ప్రసూన కలికార్థ దేహుడును, శ్రీకాళహస్తి నిలయుడును అయిన శివుని ఆశ్రయించెదను.

### 3.6 20 విశ్వనాథ వారి శివ సహస్రమ్

ఇది అముద్రిత కృతి అసంపూర్ణకృతి. దీనిని పది శతకాలుగా వ్రాయుడానికి విశ్వనాథ వారు సంకల్పించినట్లున్నది. ఆధునిక యుగంలో ప్రభవించిన యొక తెలుగు కవి సంస్కృతంలో 'శివసహస్రము' లేని లోపాన్ని

[1] శ్రీ కాళహస్తీశ్వర స్తోత్రంలోని 16 శ్లోకాలు, ఈ సిద్ధాంత గ్రంథం అనుబంధం (Appendix) లో యివ్వబడి వుంది.

పూరించడానికి ప్రయత్నించినట్లుదీనిచే తెలుస్తోంది. సంస్కృతంలో 'లక్ష్మీ సహస్రమ్' వ్రాసినవారు వేంకటాధ్వరి, కాగా, 'ఉమాసహస్రమ్' వ్రాసినవారు వాశిష్ఠ గణపతి ముని. కాని 'శివసహస్రమ్' లేని లోపాన్ని తాను పూరించాలని విశ్వనాథ భావించినట్లు దీనివల్ల తెలుస్తోంది. మచ్చుకు ఒక శ్లోకం

*సంధ్యావేళా ప్రశమితతనూ తాపరమ్యానుయాతా*
*ప్రాణోష్వేవం పునరపి సమాయాత మేహోరు దుఃఖః ।*
*జీవః కోఽయం కధ మిహ సమాయాత ఉగ్రోరు సంసృ*
*త్యంభోరాశి ప్రవితత తరంగాహతి క్లిష్ట వృత్తిః ॥[1]*

3.6.21 విశ్వనాథవారి దేవీస్తుతిశతి

ఇది అముద్రిత ప్రతి సమగ్రముగా నున్నది దీని రచనాకాలం 1958 మచ్చుకు ఒక శ్లోకం -

*చిత్తం హ్యేతత్ సకలదితిజారాధనే యస్య మే సా*
*బుద్ధి ర్నో దేత్య వితల పరబ్రహ్మ భావోల్బణస్య ।*
*దేవ్యాః నామ్ని శ్రుతిపధ మహో గచ్ఛతి ప్రాక్ హృదంతః*
*కంచిత్ స్పందం వహతి మధునా స్విన్న వాచోవిధేయమ్*

సంస్కృత స్తోత్ర సాహిత్యంలో శ్రీ కాళహస్తి ప్రశంసను క్రీ.శ. ౧ శతాబ్దికి చెందిన వామన భట్ట బాణుని హంస సందేశంలో శ్రీకాళహస్తి గూర్చి వర్ణించిన శ్లోకం యిలా వుంది.

*అక్షోణ్యగే తదనుభవితా కాళహస్తో గిరిస్తే*
*తస్యోపాంతే కనకముఖరీనామ కల్లోలినీ చ ।*
*తీరే యస్యాః కలితవసతే ర్మూర్ధ్ని శంభోః కిరాతో*
*గండూషాంభః స్నపన విధయా ప్రాప గంగాధరత్వమ్ ॥* (శ్లో ౫౫)

1. 2 విమర్శిని (విశ్వనాథ వాఙ్మయ జీవిత విశేష సంచిక) Vol II, 1977, అముద్రిత రచనలు (పుట-263-265 (పుట-267-268)

ఇది కాళిదాసు మేఘ సందేశాన్ని అనుసరించి వ్రాయబడిన హంస సందేశం. దీనిలో దక్షిణకైలాసగిరిని ఆనుకొని వున్న శ్రీకాళహస్తిని, దాని సమీపంలో గల సువర్ణ ముఖీనదిని, ఆ నది నీటిని తన నోటితో పుక్కిలించి శివుని నెత్తిపై ఉమిసి ఆ దేవునికి గంగాధరత్వమును ప్రాప్తింప జేసిన కిరాతుడైన కన్నప్ప స్మరింప బడినారు.

## 37 ప్రాచీనతమిళసాహిత్యంలో శ్రీ కాళహస్తి

అతిప్రాచీనకాలంనుండి తెలుగుభాషకు, తమిళభాషకు అవినాభావసంబంధ మున్నది. భాషా విషయికంగానే గాక, చారిత్రకంగాను, సాంస్కృతికంగాను కూడ తెలుగు వారికి తమిళులకు మధ్య చుట్టరికం వుంది. చారిత్రకదృష్టితో చూస్తే తెలుగువారికీ తమిళులకు గల అనుబంధాన్ని మూడు విధాలుగా వర్గీకరించ వచ్చును.

1) తమిళులు, తెలుగువారు స్నేహభావంతో సంచరించిన కాలం మొదటి విభాగం. ఇది సంగకాలసాహిత్యంలో కనబడుతుంది.

2) సంగ కాలానికి తర్వాత పల్లవ మహీపతి మామల్లుని సేనాధిపతి అయిన పరంజోతి వాతాపిని ముట్టడించి హస్తగతం చేసుకోవడంతో తెలుగు వారికి, తమిళులకీ నడుమ రాకపోకలకు శ్రీకారం చుట్టినట్లయింది.

3) పల్లవుల పరిపాలనాకాలంలో భక్తి ఉద్యమానికి ( Bhakti movement) రాజాదరణ బాగాలభించింది. ఈఉద్యమనాయకులు దక్షిణాపథమంతా పర్యటించివారు. దేశంలో అంతకుముందు ప్రచారంలో ఉన్న జైన బౌద్ధమతాలకు అడ్డుకట్ట వేశారు. ఈ ఉద్యమంలో సంఘీభావంతో కలిసిపనిచేసినకాలంలో తెలుగు, తమిళుల సాన్నిహిత్యం మరింతగా పెరిగి వుండవచ్చు.

అందువల్లనే 'తేవారమ్' లో తెలుగునాడులోని శ్రీశైలం, శ్రీకాళహస్తి పుణ్యక్షేత్రాల ప్రశంస చోటుచేసికొనివుంది. అంతేగాక, అంతకు ముందే పెరియపురాణంలో కన్నప్ప కథ చెప్పబడింది.

## 3.7.1 శేక్కిలార్ రచించిన పెరియపురాణం

తమిళ పెరియపురాణంలో చెప్పబడిన అరవైమువ్వురు నాయన్మారుల కథలు ద్రావిడ భాషలైన తెలుగు, కన్నడ భాషలలో కూడ వున్నాయి వీటికి సంస్కృతం, తమిళ భాషల్లోని కథలే మూలం. సంస్కృతంలో 'ఉపమన్యు భక్త విలాసం', 'అగస్త్య భక్త విలాసం 'మొదలైన గ్రంథాలలో స్కాంద పురాణాంతర్గతమైన నాయన్మారుల చరితలు చెప్పబడ్డాయి.

ఉపమన్యుభక్తవిలాసంలో సుందరమూర్తి నాయనార్ తెల్ల ఏనుగు నెక్కి బొందెతో కైలాసాన్ని చేరినపుడు ఒక పర్వతం వద్ద ఉపమన్యు మహర్షి తన శిష్యులకు ''తిరుత్తొండ తొగై" లోని శివశరణులకథలను వినిపిస్తుంటాడు. ఈ గ్రంథాలలో సుందరమూర్తినాయనార్ పేరు సూచింపబడింది. అందువల్ల ''తిరుత్తొండ తొగై" సంస్కృతంలోని ఉపమన్యు భక్త విలాసానికి మూలం అని చెప్పవచ్చు.

తమిళపెరియపురాణానికి ''తిరుత్తొండ తొగై" ఆధారమని శేక్కిలార్ స్వయంగా చెప్పికొన్నాడు. తర్వాతి కవులు కూడ పెరియ పురాణానికి తేవారమ్ మొదలగు గ్రంథాలు ఆధారాలని చెప్పినారు.

శేక్కిలార్ పెరియపురాణం రెండు కాండలుగా 13 సర్గలుగా విభజింపబడింది. దీనిలో మొత్తం 4286 పద్యాలున్నాయి. కాని వీటిలో కొన్ని ప్రక్షిప్తాలున్నట్లు తెలుస్తుంది. ఈ గ్రంథం శివపారమ్యాన్ని భక్తుల ద్వారా బోధిస్తుందనడంలో అతిశయోక్తి లేదు.

## 3.7.2. పెరియపురాణం - దాని పుట్టుక

అనపాయచోళుని కాలంలో జీవకచింతామణి అనే జైన మత గ్రంథం మిక్కిలి జనాదరణ పొందింది. రాజు ఆ గ్రంథాన్ని ప్రశంసించగా శేక్కిలార్ ఆ గ్రంథం ఇహపరసాధనకు ఉపకరించదని చెప్పి రాజుకు నాయన్మారుల కథలు చదివి వినిపింపగా, ఆయనకు శైవం మీద అభిమానం కల్గి

నాయన్మారుల కథలు సులభ శైలిలో విస్తరించి వ్రాయమని శేక్కిలార్‌ను ప్రోత్సహించాడు. ఆ విధంగా వ్రాయబడినదే పెరియపురాణం.

### 3.7.3 పెరియపురాణం - దాని ప్రాశస్త్యం

శేక్కిలార్ పెరియపురాణ రచన పూర్తి చేసిన సందర్భంలో పల్లవరాజు సపరివారంగా చిదంబరానికి వెళ్లి శేక్కిలారుకు ప్రణమిల్లినాడు. వేయి స్తంభాల మంటపంలో ఆహ్వానితులైన సాధువులు, పండితులు ఆ కృతిని గూర్చి ఒక సంవత్సర కాలం ప్రవచనాలు చేశారు. శేక్కిలార్ స్వయంగా తన పురాణరచనను పాడి వినిపించి వ్యాఖ్యానం చేశాడు. అందరు ఆయన రచనను మెచ్చుకున్నారు. రాజు ఆ రచనను బంగారుపెట్టెలో పెట్టించి స్వయంగా వింజామరం వీస్తూ ఊరేగింపు చేశాడు. తర్వాత శేక్కిలార్‌ను తొండరసిర్ పరనావ్పుర్ (భక్తుల కీర్తి ప్రచారకుడు) అనే బిరుదుతో సత్కరించాడు. అంతేగాక, పవిత్రమైన మహనీయమైన ఆ పెరియ పురాణాన్ని ఒక తామ్ర ఫలకంలో చెక్కించి దానికి పన్నెండవ తిరుముఱై గా స్థానం కల్పింప జేశాడు.

తెలుగులో శ్రీ కృష్ణదేవరాయలు స్వయంగా గండ పెండేరాన్ని పెద్దన కాలికి తొడిగి, పల్లకీ మోసినాడని ప్రసిద్ధి. కాని, అంతకుపూర్వమే పల్లవరాజు స్వయంగా కవిని గ్రంధాన్ని ఊరేగింపు వేయిస్తూ వింజామర వీచినాడని తెలుస్తుంది. ఇట్టి మహాపురాణం భక్తి ప్రధానమైంది. శేక్కిలార్ క్రీ.శ 1070 ప్రాంతం వాడని చెప్పవచ్చు. శేక్కిలార్ తన గ్రంధానికి పెట్టిన పేరు తిరుత్తొండర్ మాక్కథై. కాని, తర్వాతి కాలంలో దానికి తిరుత్తొండ పురాణం, పెరియ పురాణం అనే పేర్లు ఏర్పడ్డాయి. కణ్ణప్ప నాయనార్‌పురాణం పెరియ పురాణంలోని మూడవసర్గలోని ఏడుభాగాలలో మూడవదిగా చెప్పబడింది

### 3.7 4 కణ్ణప్ప నాయనార్ పురాణం - ధూర్జటి తిన్నడు

కణ్ణప్ప నాయనార్ పురాణంలో ఆటవికుల సామాజిక జీవన విధానం

చక్కగా వర్ణింపబడింది. దీనివలన ఆటవికులకుటుంబవ్యవస్థ, సముదాయాలు, సమూహాలు, విద్య, మతం, రాజ్యపాలనావిధానం, వారి ఆర్థికజీవనపరిస్థితులు, సంస్కృతి మొదలైన అంశాలు తెలుస్తాయి.

శ్రీకాళహస్తి మాహాత్మ్యం లోను ధూర్జటి పై అంశాలన్నీ యథాతథంగా నిరూపించినాడు. ప్రాచీన సాహిత్యంలో ఎక్కువ భాగం రాజుల చరిత్రలే చెప్పబడ్డాయి. కాని సామాన్యుల చరిత్రల కందులో అవకాశం ఉండేది కాదు. కాని, ప్రబంధ యుగం లోని కవులు వీటికి కొంత అవకాశం కల్పించారు. ఈ నేపథ్యంలో ధూర్జటి ఆటవికుల సమాజాన్ని తన రచనలో చిత్రీకరించె ప్రయత్నంలో సఫలీకృతుడైనాడని చెప్పవచ్చు. దీనికి తిన్నని కథే సాక్ష్యం.

ధూర్జటి కావ్యంలో తిన్నని ఊరు పొత్తపినాడులోని ఉడుమూరు కాగా, శేక్కిళార్ పురాణంలో పొత్తపినాడు లోని ఉడుప్పూర్ అని చెప్పబడింది.

తిన్నని తండ్రిపేరు నాథనాథుడు కాగా, కణ్ణప్ప తండ్రి పేరు నాగడు, తల్లి పేరు తత్తై. తిన్నని తల్లిపేరు తండె.

ఆటవికులందరూ ఒకే ప్రాంతంలో నివసిస్తూ ఒకే రకమైన ఆచారవ్యవహారాలను, వృత్తులను ఆచరిస్తుంటారనే గిరిజనసముదాయ లక్షణం వీరిద్దరి వర్ణనల్లోను కన్పిస్తుంది.

ఆటవికులు వనమూలికల తోను, ఆకుపసరుతోను వ్యాధులు నయం చేసుకుంటారనే విషయాన్ని యిద్దరు కవులు స్పష్టపరిచారు. సాధారణంగా పల్లెల్లో నేడు వ్యాధి నివారణకు పల్లె ప్రజలు ఉపయోగించే వివిధ రకాల చిట్కా వైద్యాలు వేటగాళ్ల సమాజంలో వున్నట్లు ధూర్జటి వర్ణించాడు. వాటి పేర్లను పేర్కొనడం ధూర్జటి ప్రత్యేకత.

వేటగాళ్ల సముదాయాన్ని వర్ణిస్తూ ఉడుప్పూర్‌ను శేక్కిళార్ యిలా వర్ణించాడు.

*అరువరైక్కు అవర్ తంగల్ అగన్ కూడి ప్పిఱూర్ అయుమ్*

*పెరువిళ ఎడుత్తుమిక్క పెరుంకళి కూరుమ్ కాలై*[1]

సామాన్యులు అధిరోహించడానికి చాల కష్ట సాధ్యమైన కఠిన శిలలతో కూడిన పర్వత ప్రాంతం (కుఱింజి) లో ఉన్న ఉడుప్పూర్ అనే గ్రామంలో వేటగాళ్ల సముదాయం ఉండేదని చెప్పబడింది.

ధూర్జటి దీని నిలా వర్ణించాడు-

*పొత్తపినాటిలో విపినభూమి గిరాతుల కాటపట్టు,*

*లోకోత్తర వన్యవస్తు వుడుమూరను పక్కణ మొప్పు, ధ్రదమో*

*దాత్త మహత్త్య మద్భుత రసావహ మూహ యొనర్పు , మేదినీ*

*భృత్తట నిర్ఝరాంబురుహ బృంద మరంద సుగంధ వాహమై(3-3)*

శేక్కిలార్ పెరియపురాణంలో ఆటవికులు పండుగల సందర్భంలో పాల్గొనే విల్లు తిరునాళ్లను యిలా వర్ణించాడు

*అయల్ వరైప్పలత్తిన్ వందార్, అరుంగడి ఇరుప్పిన్ ఉళ్లార్*

*ఇయల్ వగై ఉణవిల్ ఆర్న్ద ఎయిట్టియర్ ఎయినర్ ఎల్లాం*

*ఉమర్ కదిర్ ఉచ్చినీంగ ఒళివిల్ పల్ నఱుప్రమాంది*

*మయిలుఱు కళప్పిన్ నిడి వరిసిలై నిళవు కొళ్వార్ (ప.36)*

ఇక్కడ ఉడుప్పూర్ సమీపంలోని పర్వతవాసులు (అయల్వరైప్), గుడిసెవాసులు (అరుంగడి ఇరుప్పిన్‌ఉళ్లార్) వేటకత్తెలు (ఎయిట్టియర్), ఉడుప్పూర్ వాసులు (ఎయినర్) మొదలైన వారంతా కలిసి ఆటవిక సముదాయంగా చెప్పబడ్డారు. వీరందరూ సామూహికంగా విల్లు తిరునాళ్లు మొదలైన పండుగల్లో పాల్గొంటారని చెప్పబడింది.

---

*1 కణ్ణప్పనాయనార్ పురాణం - పద్యం 15*

ధూర్జటి కాళహస్తిమాహాత్మ్యంలో కాటిజేని జాతర విపులంగా ఒక పెద్దవచనంలో వర్ణింపబడింది. దానికి ముందే తిన్నడు విల్లు పట్టిన వెల పదినాళ్లు అంటే ఒక మండలం (40 రోజులు) లో తడవిల్లు, వెదురువిల్లు, పెలసువిల్లు, మొదలైవ చేవ గల విండ్లను అవలీలగా స్వాధీనం చేసికొన్నాడని తెల్పబడింది. ఆ సందర్భంలోనే

''ఆ సమయంబున నవయౌవనం బాసన్నంబగుటయు దిన్ననికి బహువిధమృగయావిహారంబుల తెఱంగెఱుక పఱుపవలయునని వనచరు లెఱుకు జేనికి న్విన్నవింప, నింపెసలార నాతండాటవిక పుటభేదనంబునం గాటిజేని జాతరకుం జాటం బనుప.. బలి వెట్టుటకై మన్కోడ త్రామచూడ మహిషాజావిక ప్రముఖాటవిక మృగంబులం బట్టుకొని బండికట్టుకొని, కాటేనిగుడికి నడచునప్పుడు తప్పెటల చప్పుళ్లును, వెట్టి సొరకాయల బుఱ్ఱలం గట్టిన సరకట్ల కిన్నరలు మెఱయ మొరయించు మ్లేచ్ఛుల పాటల తానమానంబులును, గుమ్మెబల చటుల రవమును, గొమ్ములదిమ్మును జెలంగె (3-36)

ఇది శేక్కిలార్, ధూర్జటి కవుల భావనా వ్యాపార మందలి సామ్యాలు

జడవస్తువులో కూడా చైతన్యాన్ని దర్శించిన ముగ్ధభక్తుడు తిన్నడు, మూగ జంతువులైన శ్రీకాళహస్తులు మోక్షం సాధించిన మహిమాన్వితమైన కథలను తెలియజేసె శ్రీకాళహస్తి మాహాత్మ్యమనె క్షేత్ర మహాత్మ్య గ్రంథం వ్రాపి తెలుగుసాహితీలోకంలో ధూర్జటి చరితార్థుడయ్యాడు

### 3.7.5 తిన్నని కథకు మూలం

ధూర్జటి తిన్నని కథా రచనకు మూలం శేక్కిలార్ పెరియ పురాణం లోని కణ్ణప్పనాయనార్పురాణం అని నిశ్చయంగా చెప్పవచ్చు సంగ కాల సాహిత్యం నుండి నత్కీరునికథను, పెరియపురాణం నుండి కణ్ణప్ప కథను ధూర్జటి గ్రహించి స్వయంప్రతిభతో తీర్చిదిద్దినాడని చెప్పవలసిఉంది

తమిళదేశంలో శైవమతప్రాబల్యంకోసం పాటుపడిన మొదటి తరం నాయన్మారులైన తిరుజ్ఞానసంబంధర్, తిరునావుక్కరసర్, సుందర మూర్తినాయనార్, మాణిక్యవాచకర్ ల చరిత్రలతో పాటు మొత్తం అరవై ముగ్గురు శైవ భక్తుల జీవిత చరిత్రలను వెలయించి ప్రసిద్ధి పొందిన కవి శేక్కిలార్ పెరియ పురాణం తిరుముఱైగళ్ లో పన్నెండవ గ్రంథంగా కీర్తి పొందింది

శేక్కిలార్ (క్రీ.శ. 1070-1140) ధూర్జటికి (క్రీ.శ. 1500-1560) మధ్య దాదాపు మూడున్నర శతాబ్దాల వారడి ఉన్నప్పటికీ వారిద్దరి రచనా దృక్పథం మాత్రం శైవ పారమ్యాన్ని బోధించడమే వీరిరువురి రచనల్లోను ఆనాటి ప్రజల కష్టసుఖాలు, జీవన వైఖరులు, ఆరాట పోరాటాలు, సంస్కృతులు, ప్రజల సామాజిక జీవన విధానాలు, రాచరిక పద్ధతులు మొదలైన అనేకాంశాలు వర్ణించబడ్డాయి ఈ అంశాలనన్నింటిని తులనాత్మకంగా పరిశీలిస్తే కొన్ని మౌలిక తత్వాలు వీరిద్దరి రచనల్లోను ఆవిష్కరింపబడినట్లు తెలుస్తుంది. అందుకే శేక్కిలార్, ధూర్జటులు తర్వాతి తరం కవులకు మార్గదర్శకులయ్యారు

## 3.7.6 శేక్కిలార్ ప్రభావం :

శేక్కిలార్ పెరియపురాణ ప్రభావానికిలోనై తెలుగులో వీరశైవ భక్తులచరిత్రలను బసవపురాణ, పండితారాధ్యచరిత్రలలో వర్ణించిన పాల్కురికి సోమనాథుడు మొదటివాడుగా చెప్పవచ్చు. ఆతర్వాత శ్రీనాధుడు ఆ పిమ్మట ధూర్జటి శ్రీనాధుడు హర విలాసంలో సిరియాళుని కథను వ్రాశాడు. శేక్కిలార్ పెరియ పురాణంలో చిరుత్తొండర్ నాయనార్ కథ చెప్పబడింది. ధూర్జటి కన్నప్పనాయనార్ కథను పెరియపురాణం నుండే గ్రహించాడు. శేక్కిలార్ ప్రభావం కన్నడ భాషా సాహిత్యం పై కూడా ప్రసరించింది. చిరుత్తొండర్ నాయనార్ కథను అనుసరించి కన్నడ భాషలో బసవన సిరియాళ శెట్టి కథ ను వ్రాసినట్లు తెలుస్తున్నది

## 3.8 తేవారమ్

"నాయన్మారులలో క్రీ.శ. 7 వ శతాబ్దంలో తిరునావుక్కరసర్, తిరుజ్ఞానసంబందర్ పాడిన పాటలు వేలసంఖ్యలో ఉన్నాయి. తమిళదేశంలోని శివాలయాలు పెక్కింటిని గూర్చి వారు పాడిన పాటలు కలవు. ఉపలబ్ధాలు కాని పాటలు పోగా ఈనాడు లభిస్తున్న వీరి పాటలు యించుమించుగా ఏడువేలున్నవి. తర్వాతి శతాబ్దంలో వెలసిన సుందరమూర్తి నాయనార్ పాడిన పాటలు ఒక వేయి లభిస్తున్నాయి. ఈ ముప్పురు నాయన్మారుల యొక్క పాటలు ఎనిమిదివేలును 'తేవారము' అనే పేరుతో గొప్ప భక్తి సాహిత్యంగా వెలసి యున్నది.[1] "

### 3.8.1 తిరుజ్ఞాన సంబందర్

తిరుజ్ఞానసంబందర్ తన చేత తాళములను ధరించి యాడియు, పాడియు శివుని కొలిచినవాడు. యాళ్ అను సంగీత వాద్యమును వాయించుటలో నిపుణులైన 'పాణర్' కుటుంబమున పుట్టిన తిరునీలకంఠ యాళ్ పాణర్ అతనితో పాటు పెక్కు గ్రామములలోని దేవాలయములకు పోయి యతని పాటల ననుగుణముగా యాళ్ ను వాయించుచుండెడివాడు. ఆ సంగీతవిద్వాంసుల యొక్క మార్గము ననుసరించిన ఆ కుటుంబము వారు వంశపారంపర్యముగా నా పాటలను పాడెడి సంగీత సంప్రదాయములను సంరక్షించుచు వచ్చిరి. వారు ప్రసాదించిన సంగీత సూత్రములే నేడును కలవు.

తిరుకాళత్తి'ని గూర్చి తిరుజ్ఞానసంబందర్ వ్రాసిన పాటలు పదకొండు ఒక పదిగాను, మరియొక పదకొండు వేరొక పదిగాను కూర్చబడినవి. అనగా శ్రీ కాళహస్తిని గూర్చి మొత్తం ఆయన వ్రాసిన పాటలు ఇరవై రెండు. ఈ వేదవిద్మునిని తమిళులు ఈయనను తిరుజ్ఞాన సంబంధమూర్తి నాయనార్" అని పిలుస్తారు.

1 తమిళవాఙ్మయ చరిత్రము - ము వరదరాజన్ అను తిమ్మావజ్ఝల కోదండరామయ్య, సాహిత్య అకాడెమీ న్యూఢిల్లీ, పుటలు 118-128

*తిరుక్కాళత్తి*

*రాగం - 'పణ్ - కొల్లి'*

*చందమార కిలొడు సాదితేక్కుం మజం*
*ఉందుమా ముగలియిన్ కరయునిలుమైయొడుం*
*మందమార్ పొళిల్ వళర్ మల్గు ఏస్ కాళత్తి*
*ఎందై యారిణై యడియెన్ మనత్తుళవే ॥*

''నందనవనంలో అనేక పుష్పాలచేత, అనేక వృక్షాలచేత, అనేక ఫలపుష్పాలు గల చెట్ల చేత శోభిల్లుచు ఆ ఉద్యానవనం పరిసర ప్రాంతాలన్నీ పుష్పాల సుగంధ వాసనలచే విశాలమైన వృక్షచ్ఛాయలచే ఆ ప్రదేశం మిక్కిలి ఆహ్లాదకరంగా ఉంది ఆ వన మందు కోరిన కోర్కెలు తీర్చునట్టి వాడును, సమస్త పాపాలను పోగొట్టి సర్వ సుఖ శాంతులను యిచ్చువాడును, దర్శనము చేతనే సమస్త క్లేశాలను పోగొట్టి యిష్ట కామ్యార్థ సిద్ధి నిచ్చే శ్రీ కాళహస్తీశ్వరస్వామి జ్ఞాన ప్రసూనాంబతో కొలువై వుండగా భక్త సందోహానికి జ్ఞానము నొసంగి మోక్షపదాతలగుచున్నా ు ఆ స్వామిని సేవించిన వారికి అష్ట సిద్ధు లివ్వడమే గాక జటాధారియైన ఆ కాళహస్తీశ్వరునిభక్తామ్మగూ పారవశ్యమున అనెక శ్రుతి స్మృతి పురాణేతిహాసములనుండి సాధించిన విజ్ఞానవిశేషంచే ఆశర్యుని అనుగ్రహవిశేషానికి ఎల్లరు పాత్రులగుదురని విశ్చయంగా నేను చెప్పగల్గు మన్నాను''

అతడు రచించిన గీతములు ఒక లక్ష అరువది వేలు అని చెప్పబడు చున్నది. కాని ప్రస్తుతము లభించుచున్నవి 4168 మాత్రమే ఆదిశంకరులు దక్షిణభారతీయు డగుటచే తిరుజ్ఞానసంబందర్ ను గురించి యతనికి చక్కగా తెలియును. శ్రీ శంకరులు 'సంబందర్' ను గురించి - ''ద్రవిడ శిశువు'' అని 'సౌందర్యలహరి'లో కీర్తించినాడని ముందే చెప్పబడినది కనుకనే తిరుజ్ఞానసంబందర్ ఆ కాలపు వారి చేత ఒక శిశుజ్ఞానిగాభావింపబడి కీర్తింప బడెనని తెలియవచ్చుచున్నది. సంస్కృతంలో భక్తి స్తోత్రములలో

కౌండిన్యుడు (శాండిల్యుడు) ఒక్కడే భక్తి ఉద్యమానికి మూలంగా వెలిసిన మహనీయుడని పేర్కొన బడినాడు. తిరుజ్ఞానసంబందర్ 'గాణియర్' అని పేర్కొనబడుట చేత నా ప్రశంస యతనికే చెందునని విద్వాంసుల యభిప్రాయము

## 3.8.2 తిరునావుక్కరసర్

ఈ భక్తకవికి 'అప్పర్ 'అనే ప్రసిద్ధ నామాంతరము కలదు. దక్షిణార్కాడు జిల్లాలోని తిరువాయూరులో ఈయన జన్మించెను. ఇతని అసలు పేరు మారుల్ నెక్కియర్ సంబందర్ ఇతనిని 'అప్పా' అని పిలువగా నాటి నుండి 'అప్పర్' అయినాడు ఈతని తల్లి తండ్రులు మదినాయర్, పుగళనార్ ఇతడు పల్లవ రాజైన మొదటి మహేంద్రవర్మ కాలము వాడని తెలుస్తోంది అప్పర్ మొదట జైనుడు జైన సిద్ధాంతాల్లో అనిష్టత ఏర్పడిన తర్వాత అప్పర్ శైవం స్వీకరించాడు. ఆయన ప్రోద్బలం చేతనే మహేంద్రవర్మ కూడా శైవుడైనాడు

తిరువునావుక్కరసర్ సంస్కృతంలోను, తమిళంలోను గొప్ప విద్వాంసుడు ఇతని పాటలు 'తిరుత్తాండగం' అనే ఒందో భేదంలో రచింపబడినవి. అప్పర్ ఆ పాటలను పాడుట యందు గొప్ప ప్రసిద్ధి పొంది యుండుటచే నతడు తాండగ వేన్దర్ (దండక చక్రవర్తి) అని ప్రశంసింపబడినాడు

ఇతడు శ్రీకాళహస్తిని గూర్చి వ్రాసిన పాటలు మొత్తం పదకొండు. వీటిలో ఒక్కొక్క పాటలో 8 పాదాలుంటాయి

*వీటా నోణ్ యిల్లాదినల్ కూర్ వాన్ కాణ్*

*వియన్ కచ్చి క్కంబన్ కాణ్ పిచ్చై ఎల్లాల్*

*మ్మటూణాన్ రిల్లాది మాశదురన్ కాణ్*

*మయానత్తు మైందన్ కాణ్ మా శ్శానిలలాం*

*పొటూణ్ కాణ్ మామణి పట్ట్యూణ్ రొప్పాప్ కాణ్*

*పాయ్యాదు పాలి దాంగిప్ప*

*కటూణ్ కాణ్ కాలత్తి క్క్యాణపట్టు*

*గణనాధన్ కాణ మనెవ కణ్ణులావే ॥*

ఇతని పాటలు పెక్కు వేలుండెనట. ప్రస్తుతం 3066 పాటలు మాత్రమే లభిస్తున్నాయి.

## 3.8.3 సుందరమూర్తినాయనార్

క్రీ.శ 8 వ శతాబ్దానికి చెందిన సుందరర్ జీవితచరిత్రము ఆశ్చర్యావహమైనది. అతడు బ్రాహ్మణుడు. కులాచారము ననుసరించి యతని తల్లిదండ్రులు ఏర్పాటుచేసిన వివాహము శివుని చేత నడ్డగింప బడెనట ! పిదప శివానుగ్రహము వలన నితర కులజలైన యిరువురు కన్యలను వివాహమాడాడు. శివ భక్తుడైన యీతడు పెక్కు పదిగములను రచించాడు. ప్రస్తుతము అతడు రచించిన పాటలు 1026 మాత్రమే లభింస్తున్నాయి.

ఇతడు శ్రీకాళహస్తి శివుని కీర్తించుచు వ్రాసిన పాటలు పది లభిస్తున్నాయి. అందు మొదటిది-

*చెండాడి మవిడై యూయ్ శివనే యెన్ చెలున్ మడరే*

*వండారుణ్ గుళ లా నుమై పాగ మగిల్ ద్దవనే ।*

*కండార్ కాదలిక్కుణ్ గణనాధనెంగాళత్తియాయ్*

*అండావున్ని యల్లా లజిందేత్తమాండేనే ॥*

## 3.8.4 మాణిక్యవాచకర్

క్రీ.శ. 8 వ శతాబ్దమున మాణిక్యవాచకర్ పరమేశ్వరుని గూర్చి రచించిన భక్తిగీతాలు 'తిరువాచకమ్' అనే పేరుతో వ్యవహరింపబడుతున్నాయి. తిరుక్కోవైయార్ అను గ్రంథము కూడ యితడు రచించినదే. అందుగల

400 గీతముల లోను నాలుగు వందల ప్రేమ సన్నివేశములు వున్నాయి. శివుని నాయకునిగనూ, తనను నాయిక గాను, అమర్చి ప్రేమ సన్నివేశము రూపమున రచితమైన గ్రంథమది. అయినను భక్తి గీతాలుగా ప్రసిద్ధిగాంచినవి తిరువాచకములోనివి 550 గీతాలే.

తిరువాచకమునకు ద్రవింపని వారు ఏ వాచకమునకును ద్రవింపరు "తిరువాచకత్తుక్కు ఉరుగాదార్ ఒరువాచక్కత్తుక్కుమ్ ఉరుగార్ "అనునది సామెతయై పోయినది. క్రైస్తవమతబోధకుడుగా తమిళ దేశమునకు వచ్చి గొప్ప సేవ చేసిన జియు. పోప్ అను వాంగ్లేయుని హృదయమును కూడ ఈ భక్తి కవిత ఆకర్షించినది. దానినతడు ఆంగ్లములోనికి అనువదించాడు.

పాండ్య రాజు వద్ద అమాత్యుడుగ నుండిన మాణిక్య వాచకర్ శి భక్తి యందు మగ్నుడై మనసు ద్రవించి ద్రవించి పాడిన యీ పాటలు నేటికిని ప్రతి శైవ గృహము నందును పూజా సమయములందు గానము చేయబడుతున్నాయి.

తిరువాచకములో 'శివ వేదైక్కియుమ్' (శివైక్యము) అనే అధ్యాయంలో శివ సాయుజ్యము పొందిన భక్తుల ప్రశంస చేయబడినది. అందు నాలు పద్యంలో కణ్ణప్ప నాయనార్ ప్రశంసను మాణిక్య వాచకర్ యిలా చేశారు.

*కణ్ణప్పన్ నొప్పదోర్ అన్బిన్మై కండపిన్*
*ఎన్నప్పన్ ఎన్నొప్పిల్ ఎన్నైయుమ్ ఆడ కొండరుళి*
*వణ్ణ ప్పణిత్తెన్నై వావెన్ద వాంగరుణై*
*సుణ్ణ ప్పొన్ నీట్రఱ్కే సెన్నూదాయ్ కోత్తుంపీ ॥*

శివుడు మాణిక్యవాచకర్ భక్తికి మెచ్చి ప్రత్యక్షమై 'నీ కంటే మించిన భక్తుడు వేరొకడు నాకు లేడు' అని చెప్పగా దాని పై మాణిక్యవాచకర్ యిలా అంటున్నాడు "నన్ను కంటే మించిన భక్తుడు కణ్ణప్ప నాయనార్ ఉండగా ఆయనచరిత్రాన్ని తెలిసి కూడా తాను గొప్పవాడినను కోవట

సరికాదు". అని. ఈ విధంగా కణ్ణప్ప నాయనార్ ప్రశంసను అత్యద్భుతంగా చేశాడు మాణిక్యవాచకర్.

ఈ విధంగా 'నాల్వర్' (చతుష్టయము) అని ప్రసిద్ధి పొందిన తిరుజ్ఞాన సంబందర్, తిరునావుక్కరసర్, సుందరర్, మాణిక్య వాచకర్ అను నలుగురు నాయన్మారులు అరువత్తుమూవురు నాయన్మారులలో మిక్కిలి ప్రశస్తి గాంచి శ్రీకాళహస్తి క్షేత్రాన్ని, దైవాన్ని, కణ్ణప్ప వంటి భక్తులను కీర్తించి యున్నారు.

## 3.9.0 తమిళ సాహిత్యంలో శ్రీ కాళహస్తి ప్రశంస

తమిళమున మధురలో వెలసిన సుందరేశ్వరుని చతుష్షష్టి లీలలను వర్ణించే తిరువిళైయాడల్ పురాణం ప్రసిద్ధమైనది. వేమ్బత్తూరార్, పెరుం బట్టపులియూర్‌నంబి, పరంజ్యోతి అనే కవీశ్వరులు ముగ్గురు తిరువిళైయాడల్ పురాణాన్ని వేర్వేరు కాలాల్లో రచించారు. అందు పరంజ్యోతి వ్రాసిన పురాణమే నేడు మిక్కిలి ప్రచారములోనున్నది. అతని విరుత్తం (వృత్తం) పద్యములు మాధుర్య వైశద్యములు గలిగి యుండుటయే దీనికి కారణము. 3360 పద్యాలు గల బృహద్గ్రంథమిది. ఇతడు క్రీ.శ. 14 వ శతాబ్దానికి చెందినవాడు.

## 3.9.1 సంస్కృతం

ఉతని తర్వాతనే నీలకంఠదీక్షితుడు సంస్కృతంలో 'శివ లీలార్ణవమ్' అనే పేరుతో 22 సర్గలలో మధురలో వెలసిన సుందరేశ్వరుని 64 లీలను కావ్యీకరించాడు. మధురనేలిన తిరుమల నాయకుని మంత్రి యితడు. అప్పననే పరంజ్యోతి గ్రంథాన్ని యీతడు పఠించి వుంటాడు. ఈ కవి కాలం క్రీ.శ. 17 వ శతాబ్ది.

పై రెండు గ్రంథాలలోను నత్కీరుని కథ కలదు. ధూర్జటి నత్కీరుని కథను తమిళంలోని తిరువిళైయాడల్ పురాణంనుండి, సంగసాహిత్య సంకలన

గ్రంథాల నుండి గ్రహించాడు. ధూర్జటికి నత్కీరుని కథా వస్తువ నన్నుగ్రహించినది తమిళంలోని 'తిరువిళైయాడల్ పురాణమే' న చెప్పవచ్చు. అందులో ఆయన పై ముగ్గురు పురాణ కర్తలలో ఎవర రచన సంగ్రహించినాడో తెలియదు.

తెలుగులోను కన్నడంలోను తిరువిళైయాడల్ పురాణాన్నే హాలాస్య మాహాత్మ్య మనే పేరుతో కవులు అనువదించారు. కన్నడ సాహిత్యంలో హాలాస్య పురాణం వెలువడిన తర్వాతనే తెలుగులో వెలసినట్లు చెప్పవచ్చును.

### 3.9.2 కన్నడంలో వెలసిన హాలాస్యమాహాత్మ్యాలు

1) హాలాస్య పురాణ - (వర్ణక) - సదాశివరాజ (క్రీ.శ. 1674 - 1697)
2) హాలాస్య పురాణ (షట్పదక) - ఇమ్మడి గురు సిద్ధ (క్రీ.శ.1720)
3) హాలాస్య పురాణ (చంపూ) - వేంకటేశ (క్రీ.1740)
4) హాలాస్య మాహాత్మ్య (గద్య) - కళువె నంజరాజ (క్రీ.శ.1740)
5) హాలాస్య మాహాత్మ్య (గద్య) - ముమ్మడి కృష్ణరాజ (క్రీ.శ 1794 - 1868)

వీరిలో కళువె నంజరాజు తెలుగులోను హాలాస్య మాహాత్మ్యాన్ని రచిం యున్నాడు.

ఈ హాలాస్య పురాణంలో ఇమ్మడి గురుసిద్ధ విరచిత మైనదా లోను, ఇతర కన్నడ హాలాస్య పురాణ మహాత్మ్యాలలోను నత్కీరుని కథ వుండడం విశేషం.

### 3.9.3. తెలుగులో వెలసిన హాలాస్యమాహాత్మ్యాలు

నత్కీరుని కథను తెలుగులో మొట్టమొదట కావ్యీకరించినవాడు ధూర్జటి ఈతని తర్వాత హాలాస్య మాహాత్మ్యాలను తెలుగులో వ్రాసిన కవ పెక్కురు నత్కీరుని కథను కావ్య బద్ధము చేశారు. వారి గ్రంధాలివి-

1) హాలాస్యమాహాత్మ్యం - కళువె నంజరాజు (క్రీ.శ.1740)

2) హాలాస్యమాహాత్మ్యము - తిరుమలసెట్టి జగన్నాథదాసు (క్రీ.శ.1888)

3) శ్రీ మదాంధ్ర హాలాస్య మాహాత్మ్యము - జనమంచి శేషాద్రి శర్మ (క్రీ.శ.1906)

4) హాలాస్యమాహాత్మ్యము - మల్లమపల్లి బుచ్చికవి (క్రీ.శ. 1917)

ఈ విధంగా నత్కీరుని కథను సంగకాలం నుండి తెచ్చి తెలుగు సాహిత్యోద్యానములో నాటిన ధూర్జటి పరిశ్రమ ఫలించి తెలుగులో మరి నల్గురు కవులు దానిని మూడు పూవులు ఆరు కాయలుగా వర్ధిల్ల జేశారు



# చతుర్థాధ్యాయం

## ప్రాచీన ఆధునిక తెలుగు కావ్యాలలో శ్రీ కాళహస్తి

*శ్రీ విద్యానిధియై, మహోమహిమచే జిష్ణు, వసిష్ఠా జలూ*
*తా వాతాశవ సామజాటవిక గోత్రాదేవ నక్షీర రా*
*జీవాక్షీయుగ యాదవాధిపులకున్ శ్రేయస్కరం బైన యా*
*ర్యావామాంగము దివ్యలింగము మదీయాభీష్టముల్ ప్రోవుడున్*

*-శ్రీ కాళహస్తిమాహాత్మ్యము ప.1*

*శ్రీ విద్యుత్కలితా జవంజవ మహాజీమూత పాపాంబుధా*
*రావేగంబున మున్మనోబ్జ సముద్భూతత్వంబు గోల్పోయితిన్*
*దేవా నీ కరుణాశరత్సమయమింతేజాలు సద్భావనా*
*సేవం దామరతంపరై మనియెదన్ శ్రీ కాళహస్తీశ్వరా*

*-శ్రీ కాళహస్తీశ్వర శతకము ప-1*

### 4.0 మహాభారతము - హరిహరనాథతత్త్వం

వ్యాసభారతంలో శివతత్త్వం బహుధానిరూపింపబడింది. అది కవిత్రయ కాలానికి శివకేశవాద్వైతంగా పరిణమింప జేయవలసిన ఆవశ్యకత ఆనాటి దేశ కాల పరిస్థితులు తెచ్చిపెట్టినవి తిక్కన కాలం నాటికి వీటి నిరూపణావశ్యత ఏర్పడినది వ్యాస ప్రతిపాదితమైన వైదికాభిప్రాయాన్ని తిక్కన 'హరిహరనాధుడు' గా స్థాపించి, పురాణ మతానికి విరుద్ధంకాని రీతిలో తత్త్వాన్ని ప్రపంచించినాడు.

## 41. తిక్కన హరిహరనాథ తత్త్వం [1]

వేదకాలము నాటి అగ్నీషోమ తాత్త్విక సూత్రమే యర్ధనారీశ్వర తత్త్వముగా (సగుణ) మత దృష్టిగా నవతరించినది. 'అగ్నీ షోమాత్మకం జగత్' - అస్యవామీయసూక్త మంత్రభాగవివరణంలో ఆచార్య వాసుదేవశరణ్ అగ్రవాలాగారు యిదే అర్ధనారీశ్వర తత్త్వమైనదన్నారు. ''అగ్నీషోమౌ కథం పూర్వం ఏక యోని ప్రవర్తితౌ" (శాంతి. 3-29-1)

ఈ ప్రథమతత్త్వమే నిష్కళమని యుపనిషత్తు చెప్పినది. విశ్వము శీతోష్ణ శక్తి సమన్వయ రూపమున నున్నది ఇదే సూత్రము తిక్కన గారి శ్రుతి మహత్వమైన దృష్టి కట్లవతరించినది. ఇది అనాది సంప్రదాయము. పంచాగ్ని విద్యచే ఉన్మేషించిన జీవుడు సూర్య కాలాగ్ని చే తప్తుడై మరణించి స్వజ్ఞాన కర్మ వ్యాపృత బుద్ధిచే దేవయాన, ధూమయానమున ద్యు పితృ లోకముల కేగుచున్నాడు ఈ రెండు సూర్యచంద్రులద్వారమున అర్చిర్మార్గమున వేగిన వానికి పునరావృత్తి లేదు. పితృలోకగామి కర్మక్షయానంతము - పై పంచాగ్ని సమన్వయమున జనించి మరణించుచున్నాడు. ఈ వృత్తమనాది పంచాగ్నిరూప ప్రపంచము విష్ణుమయము. మహాక్రతుమూర్తి యతడే.

విష్ణు సహస్రమందలి ప్రథమ నామము - విశ్వం. ఇది వ్యక్త తత్త్వము. దాని పేరు విష్ణువు. అవ్యక్తము పేరు శివము

''. .. అవ్యక్తమనగ బ్రహ్మంబునా - శివంబన విమతికెక్కి (శాంతి 5-345) ఇందుకే శివసహస్ర ప్రథమ నామము స్థిరః ఇది కదలనిది. స్థాణువు ఇది విశ్వమున కాధారము. పైది కదలు శక్తి ఈ హరిహర - వ్యక్తా వ్యక్త సమన్వయమునే మహాభారతము బోధించు చున్నది"

---

1 హరిహరనాథ తత్త్వము - తిక్కన మహాభారతం, ఆనుశాసనిక పర్వ పీఠిక డా. తుమ్మపూడి కోటీశ్వరరావు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ హైదరాబాదు 1974

## 4.2 పాల్కురికి బసవపురాణం - ఉడుమూరి కన్నప్ప కథ

పాల్కురికి సోమనాథుడు (క్రీ.శ. 1160-1240) సంస్కృతాంధ్ర కర్ణాట భాషలలో అసమాన్యమైన పాండిత్యమును గడించి, ఆయా భాషలలో శైవమత ప్రచారార్థము అనేక కృతులను వెలయించిన సాహితీమూర్తి. తెలుగులో రచించిన దాదాపు ముప్పై కృతులలో బసవపురాణము, పండితారాధ్య చరితము ప్రముఖములైనవి. అందులో బసవపురాణము అత్యంత ప్రముఖమైనది.

"బసవపురాణము తెలుగు సాహిత్యంలో శుద్ధమైన దేశిపద్ధతిలో తొలిసారి వెలువడిన స్వతంత్రమైన వీరశైవ పురాణము. ఇది ఏడు ఆశ్వాసముల ద్విపద కావ్యము. ఇందు సి.పి. బ్రౌను ప్రకారము 6288 ద్విపదలున్నవి. ఇది రుద్రాది మహాపురాతన కథా వ్యాప్తమైనది. మహాపురుషుడగు బసవ చరితమే యిందు ప్రధానేతివృత్తము. బసవ పూర్వావతారములు, జననము, వృషభోద్భవ మాహాత్మ్యములు, వీరశైవ ధర్మరక్షా ప్రచారములు, జంగమసేవ, లింగైక్యము మొదలైన వివిధ విషయములతో పాటు ప్రాసంగికముగా సుమారు 75 మంది భక్తుల కథలు అనుసంధింపబడినవి. ఈ భక్తులు ద్రవిడాంధ్ర కర్ణాటక మహారాష్ట్ర దేశములకుసంబంధించినవారు. బసవనకు సమకాలికులు, పూర్వులు నగు శివభక్తులు. బసవన చరితకు ఈ భక్తుల చరితలు ఉపాఖ్యానములుగా జోడింపబడి శివాంశసంభూతులగు మహాపురుషుల మాహాత్మ్యాదికములు అలౌకికములుగా వర్ణింపబడుటచే దీనిని పురాణమని పేర్కొన వచ్చును".

"బసవపురాణము నందలి భక్తుల కథలను విషయమును బట్టి మహిమాన్వితుల కథలు, ముగ్ధ భక్తుల కథలు, వీర శైవ మత సిద్ధాంత ప్రతిపాదకములగు కథలు అని మూడు విధాలుగా వర్గీకరింపవచ్చును. ఈ భక్తులలో ముగ్ధభక్తులు, మిండజంగములు, మొండివారు, మహాయోగులు, సిద్ధపురుషులు మొదలైన వారెందరో ఉన్నారు. ఇందలి కథలలో ముగ్ధసంగయ్య, బెజ్జమహాదేవి, గొడగూచి, ఉడుమూరి కన్నప్ప, సకలేశ మాదిరాజయ్య, మడివాలు మాచయ్య మొదలైన కథలు మనోజ్ఞ కళాఖండములు, రసనిర్భరము లనదగినవి"[1]

---

1 తెలుగు సాహిత్య సమీక్ష - (Vol I) డా॥ జి. నాగయ్య 1983, 112, 124 125

బసవ పురాణంలో ఉడుమూరి కన్నప్ప కథ 731 వ ద్విపద నుండి 1280 ద్విపద వరకు ఆక్రమించియున్నది. అనగా 549 ద్విపదలలో ఈ కథ చెప్పబడినది.

### 4.3. ఉడుమూరి కన్నప్ప కథా విశేషాలు

''శ్రీకాళహస్తి గిరి ప్రదేశమున -
శ్రీకంఠ భక్తుండు లోకైకమతుఁడు
ఉడుమూరికన్నప్ప డొక్క నా డర్థి -
నడవికి వేఁటమైనరిగి యొక్కడను
దోడెలుకులు దాను దోఁపునముండి -
యాడనొక్కింత నిద్రావస్థ దో ప
గలయఁగ రుద్రచిహ్నాలతోడ నీశు -
డలరుచు దపసియైయరుదెంచి తన్ను
జన్నకముం దునిచి నొసల భూతి వెట్టి-
శివతీర్థ కలశాభిషిక్తు గావించి

*''మన జన ముందట ఘనలింగమూర్తి -*
*గనియెదు ప్రాణలింగంబు నీ కదియు"*
*నని యుపదేశించినట్లు స్వప్నమున -*
*గని మేలు కాంచి నల్గడలు వీక్షింప*
*మునులేనిదొక్కదేవ ముందట నున్న -*
*'దొనర నిక్కలయయ్యె దోకల' యనుచు*
*దన తోడి యెలుకుల నునిచి యొక్కండు -*
*చనిన ముందట ఘనలింగమూర్తి*

యున్న సంతోషించి కన్నప్ప దేవుడు -
వ్రత భక్తి సంయుక్తుడై మ్రొక్కి."

బసవ పురాణంలో కన్నప్ప పుట్టిన ఊరిపేరు, పరిసరాలనూ, పుట్టుకనూ, తల్లి తండ్రులనూ వర్ణింపక ఎకాయెకి స్వప్న వృత్తాంతము మొదలుకొని కథారంగ ప్రవేశం చేయడం కన్పిస్తుంది. ధూర్జటి తన కావ్యంలో పాత్రలవాటి వర్ణన తిన్నని జననం, విలువిద్య నభ్యసించుటను విపులంగా వర్ణించి వేటకు పరివారాలతో బయలు దేరడం చెప్పి అక్కడ స్వప్న వృత్తాంతాన్ని వివరించాడు.

బసవ పురాణంలో భక్తుల భక్త్యావేశం ప్రధానంగా చిత్రీకరింపబడాలి. కాబట్టి సోమనాథుడు ఆ పద్ధతిని పాటించడం సరియైనదే. ధూర్జటి రచిస్తున్నది కావ్యం కాబట్టి, కథానాయకుని నేపథ్య వర్ణన లేకుండ హఠాత్తుగా కథలోని ప్రధానసన్నివేశాన్ని వర్ణించడం న్యాయంకాదు, గనుక పుట్టుపూర్వోత్తరాలు చెప్పడం ఔచితీవంతమైనదే.

ధూర్జటి కన్నప్ప కథా వస్తువును తమిళంలోని పెరియ పురాణంలో చూచియున్నప్పటికీ రచనా విధానంలో ఆ కథను తొలిసారిగా తెలుగులో వ్రాసిన పాల్కురికి సోమనను అనుసరించినాడని తులనాత్మక పరిశీలనచే తెలుస్తుంది. సోమన చిత్రించిన కన్నప్ప శివలింగాన్ని చూచి యిలా అంటాడు-

కటకంఠ ! మా పల్లె గల దెల్ల సుఖము
అడవుల మనుబిళ్ల కడుమంచిపాలు -
నాడిపిలిపాసెంబు నుడుప నేతులును
నిప్ప పూవును దేనె తెల్ల ఫలాదు -
లొప్పెడు వెదురు బ్రాలోగిరంబులును
మటి యట్లుగాక నీ మనసు వచ్చినను -
నెఱచులు గఱకుట్టు లెన్నేని గలవు
రావయ్య ! మ్రొక్కెద దేవ దేవుండ !
ప్రేవులు మాడంగ జావ దప్పెనదె ! "

ధూర్జటి చిత్రించిన తిన్నడు కూడ సరిగ్గా యిట్లే పలికినాడు -

కం॥ ఓ లింగమ ! విను విన్నరి
ప్రాలుమ్ము వాడిపళ్లు, గుమకు ద్రాలుమ్ము వెదురుం
ద్రాలుమ్ము సవరపు మెకముల
పాలుమ్ము గలవచట నీకు బాయసముసకున్

కం॥ పుట్టుతేనియ పెరతేనె పుట్టుజాన్ను
తొట్టితేనియ గల వందు దోఁచి తోఁచి
కాలి దులదులనైె పిండి పోలె రాలు
నట్టి నించెట్లు గలవు నీ కారగింప [1]

ధూర్జటి రచనావిధానంలోని వైశిష్ట్యమేమనగా సోమనాధుడు తన రచనలో సూచించిన ఒక పదాన్ని గ్రహించి ప్రపంచించి ఒక వృత్తమో, సీసమో వ్రాయుట. ఉదాహరణకు "ఎల్ల ఫలాదు లొప్పెడు" అని చెప్పిన పాల్కురికి మాటను గ్రహించి ఫలముల పేర్లన్నీ ఏకరువు బెట్టుచు ఒక సీస పద్యాన్ని వ్రాశాడు ధూర్జటి. 'వేరేడు పండులు. '(69 వ పద్యం)

ధూర్జటి రచనలో రాని విశేష మొకటి సోమనాధుని రచనలో గలదు. దానవులు అతి ఘోర తపమాచరింపగా శివుడు వారికి పూర్వం ప్రత్యక్షమయ్యాడట ! వారిని వరము కోరుకొమ్మనగా వారు -

"ఈ రమ్య మగు మా శరీరముల్మీకు -
నారగింపంగ నాహారముల్గాగ
గరుణింపు దనుడు శ్రీ కంఠు డిట్లనియె-
ధర గాళహస్తి భూధర సమీపమున
మృగముల్లై పుట్టుడు మిమ్ము వధించి -

1 శ్రీకాళహస్తి మాహాత్మ్యము - ఆ 3 - 67,68 ప.

*బగతు డొక్కడు పరిపక్వంబు సేసి*
*యర్పింప నేర్చు గన్నప్ప డనంగ -*
*నర్పింపనపుడు మిమ్మారగించెదము"*

ఈ కార్య కారణ కల్పనమును ధూర్జటి గ్రహించ లేదు. అడవిలో జంతువులున్నాయి. వాటిని వేటాడినాడు అన్నాడు, అంతే !

సోమనాథుని కన్నప్ప స్వామి కిలా ఆహారాన్ని సమర్పించాడు -

*''చక్కన మొగి లేటి నదములోదకము -*
*లక్కజంబుగ రెండు పుక్కిళ్ళ బట్టి*
*దాపలికరమున జాపంబు శిరము - లేపార వల చేత నిట మాంసమున్న*
*దొప్పయు బట్టి కన్నప్ప డే తెంచి - చెప్పు గాలను దొంటి శివుమీదిపూజ*
*పోనూకి తెచ్చిన పుక్కిటి నీట - మానుగా శివునకు మజ్జనం బార్చి*
*పఱికి వెంట్రుకలపై బత్తిరి రాల్చి - మఱిదొప్పదెచ్చినమాంస మర్పించి*
*యనయంబు నిట్లు గన్నప్ప దేవుండు - ననురాగమున గొల్వ ...."*

ధూర్జటి ఈ సన్నివేశాన్ని యిలాగే చిత్రీకరించాడు.

*విల్లొక చంక, నంపపొది వీపున, దొప్పలు కేలుదోయి బు*
*క్కిళ్ల బవిత్ర కాంచన ముఖీజల మొప్పగ వచ్చి, భక్తిరా*
*జిల్ల దదంబు మజ్జనము సేయుచు, దొప్పల నంజు దదిరా*
*జిల్లని ''నారగింపు" మన నాపరమేశ్వరు డార కుండినన్ (3-87)*

శివ బ్రాహ్మణుడు తరువాత వచ్చి ఈ పూజచే జరిగిన రోతను చూచి చింతించిన ఘట్టం కూడ రెండింటి యందు సమానంగానే ఉంది. ఈ సన్నివేశంలోనే పాల్కురికి సోమనాథుడు చాక చక్యంగా శివబ్రాహ్మణుని మనోగతంగా శ్రీ- కాళ-హస్తుల భక్తిని స్మరించినట్లు కథాగతిలో నిముడ్చుట మెచ్చదగినది. ధూర్జటి కావ్యమే దానికై వ్రాస్తున్నాడు కాబట్టి ఆయన యిక్కడ ఈ మనోగతాన్ని స్మరింప నీయలేదు.

ఇక్కడ పాల్కురికి మూగ జంతువుల భక్తిని ఎందుకు వర్ణించినాడంటే తత్సమానమైన ముగ్ధభక్తుడు కన్నప్ప అని నిరూపించడానికే కన్నప్ప "పుక్కిటినీట మామా శివునకు మజ్జనం చార్చి"నాడు. ఏనుగు ఏమిచేసింది. "తాదెచ్చిన తుండాంతరమున నిండారు మొగిలేటి నిర్మలాంబువుల పంటికాధవునకు నభిషేక మార్చి"నది. కన్నప్ప మనుజుడైనా, ఏనుగు జంతువైనా వారిద్దరి మనోప్రవృత్తులు దైవభక్తి విషయంలో ఒకేవిధంగా ప్రవర్తించాయి. ఈ ఔపమ్యాన్ని మరింత బలపర్చడానికే శ్రీ-కాళ-హస్తుల కథను, వారి మధ్య సంభవించిన వైరాన్నీ కన్నప్ప - శివ బ్రాహ్మణుల మధ్య ప్రవర్తింపబోయే సమన్వయానికి సూచకంగా పాల్కురికి శివద్విజ మనోగతంగా ఈ సన్నివేశస్మరణ కల్పించి ఉండవచ్చు. అందువల్ల పాల్కురికి యిట్లంటున్నాడు

*"కన్నప్పదేవుని ఘనముగ్ధతయును -*
*సన్నుత భక్తియు సంస్పృహాత్వంబు*
*దాపసికి జూపఁగఁదలచి శంకరుఁడు -*
*విపరీతగతి ద్రిన్నేత పరీతమైన*
*వదనంబు ధరియించి వలవలికంట -*
*నుదకంబు గాఱంగ నున్న యత్తఱిని"*

కన్నప్పదేవుని ఘనముగ్ధభక్తిని చిత్రించడానికే పాల్కురికి తన సర్వకవితాశక్తిని వినియోగించినాడా అన్నట్లున్న ఈ క్రింది ద్విపద పాదాలు సాక్ష్యమిస్తున్నాయి. (999 నుండి 1021 వరకు ద్విపదలు)

నేడు నీ కడకంట నిర్నిమిత్తంబ
పోడిగా జలములు పూరించుటేమి?
అలుబిడ్డల బాపి యడవుల గిరుల -
పాలైతినని దుఃఖపడి యేడిచెదవా?
ఏకాకి నైతి నింకేకియ బ్రోతు
లోకంబులని ధృతి లేక యేడ్చెదవా?

కడుపు గాలంగ వాఁ కటి కోర్వలేక -
తడవయ్యె రాఁ డని తలఁ చి యేడ్చెదవొ?
అక్కడ దండి మృగాలి చే నాదు -
చిక్కుటమూహించి వెక్క మేడ్చెదవొ?
పనిపాటు పేయు నోపక యొంటి విడిచి -
చనియెనో తమపల్లె కనుచు నేడ్చెదవొ?
అటిముటి నొక పువ్వు మటి మూరుకొన్న -
నెఱయ ప్రాణమునకు నెఱచి యేడ్చెదవొ?
కారణం బేమి ? గన్నంట బుట్టెండు -
నీరు గాఱగ నేడ్వ నీకేమి వలసె?
చెప్పవే ! నాకని చేర్చు గౌగిటను
నప్పళింపుచును 'వాయట్టి పుత్రుండు
గలుగ నీ కేల యప్పుల బ్రుంగ" ననిన -
పొలుపున గంటి యప్పులు వాఱ దుడిచి
పొసియు బాయదు వ్యాసంగ ''మనుచు -
నీ పరి లింగముల్ నిను వగరయ్యె
ఊరకో నాయన్న ! యూరకో తండ్రి !
యూరకో నా స్వామి ! యూర కింతేల?
యుమ్మలికము తగ దుడుగవే యనుచు
రొమ్మున నేత్రోదకములట్లొత్తు
నెసగ నా ముగ్ధత కీ కంటిలోని -
కసువ పొ" మ్మనునట్లు గన్ను శోధించు."

ఇది కన్నప్ప ముగ్ధభక్తికి పరాకాష్ఠ ! ధూర్జటి కవిత్వంలోను యింత స్నిగ్ధమైన మస్సణమైన శిరీషకుమారమనోహరమైన వాక్యముల పోహళింపు ఈ ఘట్టమున లేదు. పాల్కురికి ఎంత వీరశైవకవియైనను, భక్తిలోని లోతులకువెళ్లి దానిఆయువుపట్టుమ నొక్కి చెప్పగల వాక్సౌ శిల్పం,

వాక్పాకుమార్యంతో బాటు భక్తునిలో తాను తాదాత్మ్యం చెంది ఆ భావావ్యాపారాన్ని తనదిగా చేసికొని వర్ణించేతీరు నాన్యతోదర్శనీయమని చెప్పవచ్చు ఇక్కడ కేవలం భక్త్యావేశం లేదు. ముగ్ధత్వ మనే సున్నితమైనరేఖ గల పరిధిలోనే ఆవేశం ప్రవర్తించింది. ఇలాంటి వర్ణనల్లోనే కవి కెంతో సంయమనం, నిగ్రహశక్తి కావాలి! ధూర్జటిలో ఈ గుణాలున్నా పాల్కురికిలో సపదనమెక్కువగా కనబడుచున్నది. కన్నప్ప ఆలోచనాసరణిలోని ఒక క్రమికవికాసాన్ని అది చివరికి నేత్ర రోగమని అతడే నిర్ణయించుకొన్న తీరు చదివినప్పుడు పాఠకునికా భావనలోని పరిణామమెంత సహజరమణీయమో అవగతమౌతుంది. కన్నప్ప శివునికి అక్షిరోగ నిర్ధారణ చేయడం యిలా వుంది.

*''ఒండు దుఃఖంబేని యూహించిచూడ -*
*రెండుగన్నుల గాఱకుండునే నీరు?*
*తాపొక్క గంటనె ధార వర్షెడిని -*
*కానొప్పు నక్షి రోగంబ యేమేని*
*చెప్పు శీతము! గోడి తెప్పు వెగ్గినదొ?*
*తెప్పవో నొప్పవో? తడి కంటి విధము?*
*నొప్పియో పొర గప్పెనో? మూద తెప్పులో*
*పువ్వు వట్టిల్ల నా పువు కంటి పోటొ?*
*మయుల వడ్డదియొ దుర్మాంస దోషంబొ?*
*అయురయో వెండియు నక్షిరోగంబొ?''*
*కానొప్పు నిట్లనుమానంబులేదు - ''*

అని నేత్రరోగమని నిర్ధారణచేసి దానికి ప్రత్యామ్నాయముగా తన కంటిని అర్పింప నుద్యుక్తుడౌతాడు. ఇక్కడ పాల్కురికి చిత్రించిన కన్నప్ప భక్తి నేరుగా సమాధానము వైపు దారితీయగా, ధూర్జటి చిత్రించిన తిన్నడు మానుష ప్రయత్నాలు మొదట చేసి తర్వాత కంటిని సమర్పించినట్లుగా ఉంది. మానుష ప్రయత్నాలలో నేత్రరోగ చికిత్సకు సంబంధించిన మందుల

పేర్లు సీస పద్యంలో వర్ణించినాడు. పాల్కురికి కన్నప్ప అట్లుగాక పౌరుషాన్ని వదలి దైవాన్నే అభిమానించే వాడుగా కనబడుతాడు. ఇది వీరశైవ మతంలోని ప్రధాన గుణం.'

"  ఇప్పాట జూచుచు నేనుండ జాల
నా కంట బుట్టని నాటను గోలె -
శ్రీ కంఠ ! రోగంబు సెంద దెన్నడును
యొప్పని కన్నులోనున్నట్లు గాగ -
గప్పెద నా లెప్ప కంట నీ కన్ను
నా కన్న చూపందు నీకంటి కనుచు -
జేకొని శిరమున ఛేదించి పుచ్చి
కలకంఠు కంటిపై గన్నప్ప దేవు -
డలిముఖి దన నేత్ర మర్పింపదడవ
అక్కంట దొరుగు ధారావళి యుడగి -
గ్రక్కున డాపలి వంట నుప్పొంగ"

ఈ విధంగా కుడి కన్ను యివ్వగా ఎడమ కన్ను నుండి ధారగా నీరు రాసాగినది. అప్పుడు కన్నప్ప కాసంతయినా చలించకుండ కుడికంటికి కుడి కన్ను మందు, ఎడమ కంటికి ఎడమ కన్నే మందని చెప్పి అలాగే పెకలిస్తాడు. కన్నప్ప అమితోత్సాహానికి కారణం కవి యిలా చెబుతున్నాడు. ''తన నేత్ర కమలంబు శివునేత్ర కమలమై" అమరడం అమితోత్సాహాన్ని కల్గించగా రెండవ కన్ను సమర్పించాడు కన్నప్ప.

''క్రేగంట లింగంబు డాకన్ను జూచి -
యూ కంటికిని మందు నీ కన్నె కాక
యనుమాన మింకేల యనుచు దన్నేత్ర
జనిత వినిర్మల జలధార దొరుగ

*గందువ దవ చెప్ప గాలి యుంగుటయు -*
*నొందించి దాకన్ను వుచ్చ గైకొనుడు*
*నంత తోపలవ ప్రత్యక్షమై యప్పు -*
*డంతక సంహారు డనురాగ మెపగ*
*గన్నప్పదేవర కరయుగ గ్రహణ -*
*సన్నుతహస్తుడై చక్కనిలిచి"*

ఈ విధంగా కన్నప్ప అనన్యసాధ్యమైన మహాకార్యాన్ని ముగ్ధభక్తితో సాధించడంతో భోళాశంకరుడైన శివుడు - తన భక్తుని ముగ్ధ స్వభావానికి మెచ్చి ప్రత్యక్షమయ్యాడు.

శివుడు తన చేత తీసుకొన్న కన్నే తిరిగి యిచ్చాడో లేక తన మూడవ కన్నునే యిచ్చాడో తెలియక కలవలపడుతూ ఆనందాశ్చర్యాలలో మునిగి పోయాడు ముగ్ధభక్తుడైన కన్నప్ప.

ఇక్కడ అంతరార్థమేమంటే కన్ను జ్ఞానానికి సంకేతం. రెండు కళ్లు సమదర్శనానికి ప్రతీక ! శివుని మూడవకన్ను ఆజ్ఞా చక్రస్థానీయమైనది. అది యోగసిద్ధిని, జ్ఞానపరిపక్వతను తెలియజేసేది. కన్నప్ప భక్తిచే జ్ఞానాన్ని జయించాడు.

జ్ఞానయోగం చేత శివ బ్రాహ్మణుడు లాంటివాళ్లు ఆజీవితాంతం వేదన ననుభవిస్తుంటారు. అలాంటిది త్రుటికాలంలో తీసుకొన్న నిర్ణయం చేత అంతటి జ్ఞాన సాగరాన్ని అవలీలగా దాటి మోక్షానికి సన్నిహితుడయ్యాడు కన్నప్ప. ఇతనిది అవ్యాజమైన భక్తిమార్గం. ఇది కూడ ఒక యోగమే ! ఒక రకంగా యిది జ్ఞాన మార్గం కంటె కష్టమైనది, క్లిష్టమైనది కూడా.

అందుకే శివ బ్రాహ్మణుడు, అంతః ముందు ప్రమథులు యిలా అంటారు.

*కన్నప్ప శుద్ధ ముగ్ధతయు మహా*
*గుణోన్నతి యును భక్తియోగ సంపదయు*
*నా పరాపరుడు ప్రత్యక్షమైయునికి -*

*గోపించి మును బొంచియున్న లోపపి*
*కమగొని పంథభద్మాకాంతాత్ముడగుచు -*
*జనుదెంచి భువి జక్క సాగిలమ్రొక్కి*
*''తలప నీ సహజ ముగ్ధత్వ మెఱుగమి*
*దలచితి నీ కపోతంబు సేయంగ*
*దప్పు సైరింపు గన్నప్ప! దయాత్మ!*
*చెప్పనున్నదె నీవు శివుఁడవు గాక*
*యిట్టి ముగ్ధత్వంబు నిట్టి వీరత్వ -*
*మిట్టి మహత్త్వంబు నెందునుగలదె?"*

అని ఆశ్చర్యకరంగా భావ శబలితుడై శబరునిభక్తి తత్త్వానికి చేతులు మోడ్పాడు శివబ్రాహ్మణుడు! ముగ్ధత్వంలో మూఢత్వం ఉండవచ్చు. మూఢత్వంలో అజ్ఞానం చోటుచేసికొనిరావచ్చు. కాని, జ్ఞానంతో కూడిన వీరత్వం కలిసి రావడం మహత్త్వం కాక మరేమి? కన్నప్ప తన నేత్రాలను యిచ్చి శివుని జ్ఞాన నేత్రాలను తాను దాల్చినట్టైంది. కాని, కన్నప్ప నేత్రాలను ధరించిన శివుడు ''సర్వసంపన్నుడై"నాడట! వీర శైవంలో ఒక భక్తుని వీరకృత్యం తర్వాత కవి నిర్ణయించే విషయాలు ఆ మతానికి సంబంధించిన భక్తులందరిలోను అతడు సర్వశ్రేష్ఠుడు అని నిశ్చయింపబడుతుంది. ఏ దేవతను మనం వ్రతం చేత ఆరాధిస్తామో ఆ దేవతయే సర్వోత్కృష్టుడని మనం ధ్యానావాహనాది షోడశోపచార క్రియావిధుల చేత భావించేటట్లు అలాగే వీరశైవం లోను కన్నప్ప సిరియాలుని కంటె, నిమ్మవ్వ కంటె, నంబి కంటె గొప్ప వాడని చెప్ప బడినది. అంతేకాదు

*కన్నప్ప పాదరక్షా స్పర్శ శివుఁడు*
*సన్నుత భక్తవత్సలుఁ డన బరగె*
*కన్నప్ప నేత్రంబు కతమున నీశుఁ*
*డెన్నంగ సర్వ సంపన్నుడై నెగడె*

కన్నప్ప మెప్పు, నిర్మాల్యము, గండూషాంబువు, ప్రసాదము చేత శివుడు పరమపవిత్రుడయ్యాడనడం శివునికంటే శివభక్తునికే అగ్రతాంబూలాన్ని వీరశైవం అంగీకరించిన విధానం తెలుపుతున్నది.

*ఈ దేవుఁడితని ప్రసాదంబు గుడిచి -*
*వేద శాస్త్రముల వివేకంబు గడచె*
*శివుడు గన్నప్ప యుచ్ఛిష్టంబు గుడిచి,*
*యవికల విధి నిషేధాతీతుడయ్యె*
*లింగంబు గన్నప్ప యెంగిలిగాన -*
*యంగమంతయు నుత్తమాంగమై యొప్పె*

ఇలా భక్తుని భగవంతుని కభేదంగా స్వీకరించడం వీరశైవం అంగీకరిస్తుంది. కన్నప్ప భక్తి శివునికి శిరోధార్యమైనదని అంతరార్థం

కన్నప్పకథకుఫలశ్రుతిగా పాల్కురికి పల్కినపల్కులు వీరశైవ మతానికి ఫలశ్రుతిగా భావింపవచ్చు.

*"అన్నగాధీశు డంత నందంద -*
*కన్నప్ప దేవుని గౌగిట జేర్చి*
*పరగు చతుర్వర్గ ఫలము లాదిగను -*
*వరమిత్తు నడుగుము వాంఛితార్థమ్ము*
*లనవుడు మందస్మితాననుండగుచు -*
*ననురక్తి ముకుళిత హస్తుడై మ్రొక్కి*
*యెఱుగ మోక్షముల పేరెఱుగ వాంఛితము-*
*లెఱుగ వేడెడు మాఁట మెఱుఁగ నేమియును*
*ఎఱుఁగుదు నెఱుఁగుదు నెఱుఁగుదు మఱియు -*
*మఱియును మఱియు ముమ్మాటికి నిన్ను*
*కావునఁ గోరెద కవమయు గలదె -*
*దేవ ! మూలస్తంభ దివ్యలింగాంగ !*

నీ యతులిత దయాన్విత దృష్టి యుట్లు -
నా యందు నాటి కొనలు పసరింప
నాదగు సంస్పృహోపాదిత దృష్టి -
నీ దృష్టిలోనన నెక్కొని పొదల
గరుణింపు దక్కొన వరము లే నొల్ల -
బరమాత్మ !" యని విన్నపం బాచరింప
నభిమతార్థ ప్రమ దట్లు కన్నప్ప -
కభిముఖుండై నిల్చె నంత నిచ్చలును
వెలయు వానన్యోన్య వీక్షణానంద -
కలితాత్ములై <u>తిరుకాళత్తి పురిని</u>
గన్నప్ప దేవుండు గౌరీశ్వరుండు -
నన్నిరీక్షణ లీల నున్న వారిప్పుడు"

ఈ విధంగా 'తిరుకాళత్తిపురి' లో శివుడు కన్నప్ప కభిముఖుడై నిల్చియున్నాడు ఈ అభిముఖత్వంలో చూపులు చూపులు కలుపు కొంటున్నారు. కన్నప్ప వరమదే కదా! "నా దగు సంస్పృహోపాదిత దృష్టి నీ దృష్టి లోన నెక్కొని పొదల గరుణింపు దక్కొన వరము లే నొల్ల" అన్నాడు కన్నిచ్చిన కన్నప్ప కంటిచూపులతో స్వామి తన చూపులు కలుపుతూ వుండే చోటు "తిరుకాళత్తి పురి" అంటున్నాడు సోమనాథుడు. కన్నప్ప కంటిచూపులు స్వామికి సదారక్షగా ఉంటాయన్నమాట! స్వామికి రక్షకభటుడు కన్నప్ప! కన్నప్పకు రక్షకభటుడు స్వామి! వీరశైవంలో భక్తునికీ శివునికీ అభేదప్రతిపత్తి!

కాబట్టి, ఈ నాటికి కూడా కన్నప్ప పుక్కిటి నీరు స్వామికి అభిషేకం. కన్నప్ప నిర్మాల్యం స్వామికి పూజ. కన్నప్పకు నైవేద్యమైన తర్వాతనే స్వామికి నైవేద్యం. ముగ్ధస్వభావులైన భక్తులను శివుడిలా కృపతో పాలించుచున్నాడు" అంటాడు పాల్కురికి సోమనాథుడు.

తెలుగు సాహిత్యంలో శ్రీ కాళహస్తి క్షేత్ర ప్రప్రథమ ప్రశంసచేసిన వాడు పాల్కురికి సోమనాథుడు ఆ క్షేత్రమందలి శివభక్తులలో అగ్రగణ్యుడైన కన్నప్ప నాయనార్ చరిత్రాన్ని తెలుగులో మొట్టమొదటగా గ్రంథస్థము చేసినవాడు కూడా పాల్కురికి సోమనాథుడే. పాల్కురికి మహాకవికి తమిళంలోని శేక్కిలార్ పెరియపురాణం ఆధారగ్రంథం కాగా, ధూర్జటి కథావస్తు శిక్షపెట్టినవి పెరియపురాణమూ, బసవపురాణమూ రెండూనని చెప్పవలసివుంది.

## 4.4 పద్య బసవపురాణము – పిడుపర్తి సోమన

పిడుపర్తి కవులలో పిడుపర్తి సోమన ముఖ్యుడు ఇతడు పాల్కురికి వ్రాసిన ద్విపద బసవ పురాణాన్ని పద్యరూపంగా మలిచాడు ఈతని రచనలోను 'కన్నప్ప' జీవిత చరిత్ర, ముగ్ధభక్తి గ్రంథస్థములైనాయి

## 4.5 పండితారాధ్య చరిత్ర – పాల్కురికి సోమనాథుడు

పాల్కురికి సోమనాథుని రచనల్లో విశిష్టమైంది పండితారాధ్య చరిత్ర దీనిలో శివభక్తుల కథలు వున్నప్పటికీ శివ తత్త్వసారాన్ని రచించిన మల్లికార్జున పండితారాధ్యుని జీవిత చరిత్రే ప్రధానంగా నడుస్తుంది కర్ణాటక దేశంలో బసవేశ్వరునిలా పండితారాధ్యుడు ఆంధ్రదేశంలో శైవమత ప్రచారం గావించాడు వెలనాటిచోడునిసభలో బౌద్ధమతాన్ని, ఇతర మతాల్ని ఖండించి పండితారాధ్యుడు శివపారమ్యాన్ని స్థాపించాడు

సోమన శివతత్త్వ సారంలోని కొన్ని పద్యాలను ద్విపదలుగా మలిచాడు పండితుని సాహిత్య ప్రకర్ష మహిమలు ఉపదేశాలు, దీనిలో చోటుచేసికొన్నాయి తెలుగు సాహిత్య విమర్శకులు ఈ గ్రంథాన్ని తెలుగు వారి తొలి విజ్ఞాన సర్వస్వంగా గుర్తించారు సోమనాథుని పండితారాధ్య చరిత్రను తరువాత వచ్చిన తెలుగు కవులు అనుసరించారు శ్రీనాథుడు దీనిని పద్యకావ్యంగా రచించాడు నేడుయిది అలభ్యం దీనిలో పర్వత ప్రకరణాన్ని విస్తరించి వాగటూటి శేషాధార్య కవి శ్రీపర్వత పురాణాన్ని రచించాడు గురురాజకవి పండితునిచరిత్రను సంస్కృతంలో అనువదించాడు

## 4.6 శివగణ సహస్రమాల - గణసహస్ర మాలికాస్తవము

పాల్కురికి సోమనాథుడు మొట్టమొదట పండితారాధ్య చరితలో శివ గణ సహస్రాన్ని స్తుతించి పిదప దానినే కన్నడంభాషలో కూడ కవి కాబట్టి 'శివ గణసహస్రమాల' వ్రాశాడు.

కర్ణాటకదేశంలో వీరశైవమతోద్ధరణంకోసం నందికేశ్వరుని అవతారంగా బసవేశ్వరుడు జన్మించినాడు. శివునియాజ్ఞచే మరొక ప్రమథ మూర్తి ఆంధ్ర దేశంలో మల్లికార్జున పండితుడుగా జన్మించినాడని పండితారాధ్యచరిత చెబుతోంది. శివ భక్తగణములను ప్రశంసిస్తూ పాల్కురికి సోమన పండితారాధ్య చరితలో 'గణ సహస్ర మాలికాస్తవము' రచించినారు. సంస్కృతమున గురురాజకవి రచించిన 'సహస్ర గణమాలిక' కు పాల్కురికి రచనే ఆధారము[1]. మల్లికార్జున పండితుడు వెలనాటిచోడుని శపించి అమరావతికి తిరిగి వచ్చి, స్వామి సన్నిధిలో అమరేశ్వరాష్టకము, పురాతన శివభక్త గణసహస్రమును సన్నుతించి, తత్ప్రసాదంతో ఊర్ధ్వనేత్రలాభాన్ని పొందినట్లు పండితారాధ్య చరిత, మహిమ ప్రకరణంలో చెప్పబడింది. ఆ సందర్భంలో పండితు డొనర్చిన పురాతన శివ భక్తగణ సంకీర్తనమే 'గణసహస్ర మాలికాస్తవం'గా ప్రసిద్ధి కెక్కినది. అనాడు పండితుడు వాస్తవంగా యెవరెవరిని స్మరించి వారిరార స్తుతించినాడో ఎవరికిని తెలియదు. పాల్కురికి సోమన పండితారాధ్య చరితలో వేయికి పై గానే రమారమి 1064 ప్రమథ గణాలను ప్రస్తుతించాడు. తెలుగులోని ఈస్తవానికి కన్నడభాషలో సోమనాథుడే 'శివగణ సహస్రమాల' గా వ్రాశాడు. ఇది గాక 'లలితరగళె' రూపంలో నొక యనువాదము సోమనాథుని పేరనే వెలసి యున్నదట! సోమనాథుడు 'శివ గణ సహస్రమాల' ను 'లలితరగళె' అనే రగడ భేదముతో రచించి యుండును. రెండును ఒకటే కావచ్చును.[2]

---

1 గణపాల చరిత - అముద్రిత వీరశైవ ద్విపద కృతి -ముదివేడు ప్రభాకరరావు S V U O Journal, Tirupati Vol XXIV 1981, పుట-41.

2 గణసహస్రమాలిక - శివశ్రీ బండారు తమ్మయ్య 'వ్యాసావళి', ద్వితీయభాగం, పుటలు 202-211

## 4.7 నన్నెచోడుని కుమారసంభవము

శివాధిక్యమును నిరూపించుటకు నన్నె చోడుడు కుమార సంభవము రచించాడు. తన గురువగు జంగమమల్లికార్జునుని శివునితో అభేదం పాటించి వర్ణించియున్నాడు. జంగమమల్లికార్జునుడు కాలాముఖ సంప్రదాయానికి చెందిన మతాచార్యుడు. తన గురువగు జంగమమల్లికార్జునునిచే పార్వతికి శైవాగమములను బోధింప జేయుట, శివుడు వటు రూపమున శివాగమములు చదువుచు పార్వతి కడకు వచ్చినట్లు చెప్పుట, శివుని అష్టమూర్తిత్వమును వర్ణించియుండుట, లింగ ధారణ విషయము చెప్పకుండుట, వేదములను ప్రస్తావించుట, బ్రాహ్మణుల యెడ ఆదరమున్నట్లు వర్ణించుట యిత్యాదులను బట్టి నన్నె చోడుడు శైవ సంప్రదాయమునకు చెందినవాడే గాని నిడుదవోలు వేంకటరావు కుమార సంభవ పీఠికలో[1] వ్రాసినట్లు వీర శైవుడు కానేరడు.

నన్నె చోడుడు కుమార సంభవమును శైవమత ప్రచారార్థము రచించి యున్నట్లు చెప్పలేదు. తన గురువు, సర్వస్వమునగు జంగమ మల్లికార్జున యోగికి కుమారసంభవకృతి అంకితము చేసి కృతార్థత నందుట, లోకమున కవిగా తాను ప్రసిద్ధి చెందనెంచుట అనునవి కుమార సంభవ కావ్యనిబంధ రచనకు ప్రేరకములు. రుద్రవాద శైవము, నవనాధ సంప్రదాయము, కౌలాచారములు మున్నగు అవాంతర శైవభేదాలను కూడా కుమార సంభవం ప్రపంచించినది.

## 4.8 శివతత్త్వసారము

శివతత్త్వసారాన్ని శతకంగా చెబుతారు. కాని దీనిలో శతక లక్షణాలు ఏవీ లేవు. శివలీలలు అద్వైతఖండన, శివభక్తులు, పాటించవలసిన ఆచారవ్యవహారాలు. శివ భక్తుల మహిమల్ని పండితుడు ఈ గ్రంథంగా తీర్చిదిద్దాడు. ఈ శైవస్మృతి గ్రంథంలో పరమతనిరసన ఎక్కువ. పండితుడు అద్వైతమతాన్ని కూడ నాస్తికమతంగా దూషించాడు. అన్యదేవతా దూషణం, ధ్వజాధ్వరధ్వంస సన్నివేశంలో ఎక్కువగా కనిపిస్తున్నాయి. పాల్కురికి సోమనలోను పండితుని రచనలోను శ్రుతి, స్మృతి, పురాణ విషయాలెన్నో దొర్లాయి.

*కం॥ ప్రమథ గణంబు లసంఖ్యా*
*తము లీశ్వర ! యెఱుగ వేగు దత్సంఖ్యలు, వే*
*దములు "న సంఖ్యాతా" యని*
*యమరగ ఘోషించు చున్నయని గడలేమిన్*

*అని 34 కంద పద్యాల్లో శివగణవర్ణన చేయబడింది.*

*కం॥ ఏ భంగి తలచు భక్తుం*
*డాభంగిన నీవు నెగడి యవిరళ భక్తి*
*స్వాభావోత్సరమ*
*ప్రాభవవిభవమున నతని బ్రఋచుతింతు శివా ।*

*కం॥ శివునకు దనువును మనువును*
*శివభక్తులకును ధనంబు జిత్తప్రీతిన్*
*భువి నిచ్చి నెల్లవారికి*
*శివుడను నే ననక యునికి శివభక్తియగున్ ।*

ఈ రెండు పద్యాలకు ప్రత్యక్షోదాహరణము కన్నప్ప చరిత్రయే ! కన్నప్ప వంటి ముగ్ధభక్తుని ఆతని మనస్తత్త్వానికి నచ్చిన ధోరణి లోనే పరీక్షించి గెలిచేటట్లు చేసి ముక్తి ప్రసాదించాడు శివుడు.

## 4.9 గణపాల చరిత్ర - కన్నప్ప ప్రశంస

కర్త యెవ్వరో తెలియని 162 ద్విపదలు గల గణపాల చరిత్ర అముద్రిత తాళపత్ర ప్రతిగా శ్రీ వేంకటేశ్వర విద్యాలయ ప్రాచ్య పరిశోధన సంస్థ (Stock No 7611 (c) లో గలదు.[1]

---

*1 గణపాల చరిత్ర - అముద్రిత వీరశైవ ద్విపద కృతి - ముదివేడు ప్రభాకరరావు,*
*S V U O Journal, Tirupati Vol XXIV 1981, పుటలు 23-48*

దీనిలో శివభక్తుడు, వీరమాహేశ్వరాచార వ్రత నిష్ఠుడైన గణపాలుడు శివునికే లింగధారణము చేస్తాడు. వీరశైవ మతాని కంతటికీ ప్రధాన దీక్ష యైన లింగధారణ వైశిష్ట్యాన్ని ఈ కృతి వివరిస్తోంది.

''గురుమూర్తి నిగమసూక్తి శిష్యునకు లింగధారణ జేసి బ్రోచు" అంటోంది రేపాల రాజలింగశతకం. దీని కర్త కొమఱ్ఱాజు వేంకట శివుడు. ఈ కథలో శివుడు గణపాలునితో యిట్లంటాడు -

*''కరుణఁ దలిర్చ లింగముఁ గట్టునాకు*
*గురుఁడవు దీక్ష గైకొందు నీచేత"*

శివభక్తుడైన గణపాలుడే గురువు. శివుడే శిష్యుడైనాడు. ఇది వీరశైవంలో భక్తుని శివుడనుగ్రహించే విధానం. ఇదొక విలక్షణమైన అనుగ్రహం! అప్పుడు -

*భూకాంతు డీశునకు-*
*హరి యహాదులకు దొరయై వెలుగునట్టి*
*ప్రమధ వల్లభునకు పార్వతీ పతికి -*
*రమణీయ లింగధారణంబు గావించె*
*గణపాలు చేతను లింగంబు వడసి -*
*గణపతి పెంపొందె కన్నప్ప చేత*
*ఘనముగా నయనంబు గైకొన్నయట్లు"*

శివునికి కన్నప్ప యెంతటి భక్తుడో, గణపాలుడు అంతటి భక్తుడని యిందు చెప్పబడింది

4.10 నవచోళచరిత్ర - శ్రీ కాళహస్తి ప్రశంస [1]

నవచోళచరిత్ర మనే ద్విపద కావ్యాన్ని పోశెట్టి లింగకవి రచించాడు ఇతడు ఎఱ్ఱన యుగసాహిత్యానికి చెందినవాడు. కావ్యావతారికలో పాలకురికి

1. *ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగు నాడు - డా పి నరసింహారెడ్డి 1984, పుటలు 91-92*

సోమేశుని స్తుతించినాడు. ఈ కవి గార్లపాటి లక్ష్మణుని శిష్యుడు. బగిరామపల్లి, శ్రీరామపల్లి నివాసి మృత్యుంజయేశ్వరుడు. బగిరాముపల్లి దివ్యక్షేత్రనివాసుడు అని కూడా కవి ఆ దేవుని పేర్కొన్నాడు. ఆ స్వామి కృతిభర్త కథకు శ్రోత చక్కిలాల లింగప్ప.

ఈ కావ్యంలో శ్రీకాళహస్తి ప్రస్తావన ఉంది. కరికాళచోళుడు కావేరికి కట్ట కట్టిస్తుంటాడు. దేశ దేశాల నుండి రాజులు, తమ రాజ్యాల నుండి ప్రజలతో వెట్టి చేయించేందుకు వస్తారు. పిట్టవ్వకు బదులు శివుడే వెట్టిచేస్తాడు. ముక్కంటిచోడడు మాత్రం రాడు. కరికాళుడు శివునికి ఆన పెడుతాడు, ముక్కంటిచోడని ప్రసాదం స్వీకరించవద్దని ముక్కంటి చోడని ప్రార్థన పై ఈ విషయం చెబుతాడు శివుడు. ముక్కంటి చోడడు చివరకు కరికాళుని మాటవినకతప్పలేదు

ముక్కంటిచోడడు సామాన్యుడు కాడు శ్రీ కాళహస్తీశ్వరాంశ సంభూతుడు. ఒక చోడరాజు శ్రీకాళహస్తిపురంలో ఉంటాడు. ఆ పట్టణ స్త్రీ లు గుడికి వచ్చి శ్రీ కాళహస్తీశ్వరుని పూజించి అంజలి పడుతారు. పూజారులు ప్రసాద మిస్తారు. నళినాక్షులు 'తమ మఱదలి జూచి కొమరొప్ప నీ చిన్ని కోమలికిపుడు రమణమై ఘ్నతుచ రక్షించి తేని ఈ దేవదేవున కిభచర్మధారున కా దేవదేవున కత్యంతప్రీతి - దీపముల్ వెలిగింతు మనుచు పూజారులచే నా ప్రసాదంబు చపలాక్షి కిప్పించి" నారు.

శ్రీ కాళహస్తీశ్వరుని ప్రసాద మహిమతో ఆబాల గర్భవతి యైనది తల్లితండ్రులు ''వాసనగల పాలవంటివంశమున వాసన దప్పె నీ వలన " అంటూ 'అసలు విషయం చెప్పు' మని తొందర పెడుతారు. ''అరుదందగా శ్రీ కాళహస్తి ఈశ్వరుని దర్శనంబునకు ముత్తైదువు స్త్రీ లు పెక్కండ్రు నేగి సంప్రీతి నర్చించి ప్రసాదంబు చేకొనునపుడు ''నేను చెయ్యి జాపినాను" నా వదినలు ఇలాటి కోరిక హాస్యానికి కోరినారు. ఆ ప్రసాద మహిమ వల్లనే గర్భవతి నైతినని పల్కింది. ''ఇది నమ్మకుంటిరే నీశుడే సాక్షి ముక్కన్నులును గల మూర్తియై పుట్టు" అంటుంది. ముక్కన్నులున్న

శిశువు పుడతాడు. కాస్త పెరిగి పెద్దవాడయిన తర్వాత "తండ్రి యెవ్వట గలడు.. తండ్రులు లేనట్టి తనయులున్నారె"అని నిలదీస్తాడు తల్లిని.

"బాల్యమున నాటలాడుచును చని శ్రీ కాళహస్తి ఈశ్వరుని దివ్య ప్రసాదంబు వడసిన కతన జయమున నా ప్రసాదంబు నీవయ్యె సమకూరినావు. దేవదేవుడు మహాదేవుడైనట్టి శ్రీకాళహస్తి చిదాకాశ మూర్తి నీకైన జనకుండు" అని జవాబిచ్చిందా తల్లి.

శ్రీకాళహస్తీశ్వరుడే తన జనకుడని తెలుసుకున్న బాలుడు వెళ్లి స్వామితో నీ కుమారుడను. నేనిలా స్వంత నగరం లేకుండా ఉండటం బాగులేదంటాడు. శ్రీ కాళహస్తీశుడే ముక్కంటి చోడనికి పట్టణం కట్టిస్తాడు.

## 4.11 శ్రీ నాథుని హరవిలాసం - శ్రీ కాళహస్తి ప్రశంస

శ్రీనాధుడు (క్రీ.శ 1385-1475) కవి సార్వభౌముడు.హరవిలాసము, కాశీఖండము, శృంగారనైషధము, భీమేశ్వరపురాణము, క్రీడాభిరామము, శివరాత్రిమహాత్మ్యము, పలనాటివీరచరిత్ర మొదలగునవి ఈతని కావ్యాలు. హరవిలాస రచన శృంగార నైషధానికీ, భీమేశ్వర పురాణానికీ నడుమ క్రీ.శ 1425-30 మధ్యకాలంలో జరిగిందని పండితాభిప్రాయం. తన బాల్య సఖుడైన అవచి తిప్పయ్య శెట్టి కి అంకితంగా శ్రీనాథుడు హర విలాస ప్రబంధాన్ని చెప్పడం మొదలుపెట్టాడు.

దక్షారామాన్ని దక్షిణకాశిగా శ్రీ నాథుడు ఎన్నోసార్లు పేర్కొన్నాడు. అటువంటి శ్రీనాధుడే శ్రీకాళహస్తిని కూడా దక్షిణకాశిగా ఉటంకించడం విశేషం. "శ్రీ మద్దక్షిణ కాశికాపుర మహా శ్రీ కాళహస్తీశ్వర ప్రేమాత్మోద్భవ కాలభైరవ కృపా శ్రీవర్ధితా" (5-59) అని కృతి భర్తయైన అవచి తిప్పయ శెట్టిని ప్రశంసించాడు

శ్రీకాళహస్తీశ్వరుని ఆలయంలో పాతాళ గుహా ప్రణీతుడని, శ్రీ కాళహస్తిభక్తసుధీకల్పితవిభవుడు అవచితిప్పయకు కవి సంబోధనా పూర్వక ప్రస్తుతులు అవి యిలా వున్నాయి. -

"శ్రీ కాళహస్తినాధ ప్రాకారాంతః ప్రణీత పాతాళగుహా !"

శ్రీ కాళహస్తి భక్త మధీ కల్పిత విభవ యమవిదేవయ శివా!" (7-1)

హరవిలాసము శ్రీనాధుని శివభక్తికి తార్కాణము. ఈశ్వరార్చన కళాశీలుడైన శ్రీనాథుడు హరవిలాసమున చిరుతొండ నంబి కధ, గౌరీ కల్యాణము, పరమ శివుని దారుకావన విహారము, సముద్రమథన వృత్తాంతము, కిరాతార్జునీయము అనే శివ లీలలు, శివగాధలు కూర్చినాడు.

## 412 చిరుతొండనంబి కథ

శ్రీ నాధునికి పాల్కురికి బసవపురాణం చిరుతొండనంబికథకు మూలం కాగా, పాల్కురికి మహాకవికి తమిళంలో శేక్కిలార్ వ్రాసిన పెరియపురాణంలోని 'తిరుత్తొండర్ పురాణం' మూలం. శ్రీ నాథుని తర్వాత వాలెకోటయ్య అనునతడు 'చిరుతొండ భక్త కధానిధానము" అనే పేరుతో యక్ష గానాన్ని రచించినాడు.[1]

బసవపురాణంలోని సిరియాళుడే హరవిలాసంలో చిరుతొండనంబి. చిరుతొండనంబి పుత్రుడు సిరియాలుడు. బసవపురాణంలో సిరియాళుని భార్య తిరువెంగనాచి ఆమె హర విలాసంలో చిరుతొండనంబి భార్యగా చెప్పబడింది. బసవ పురాణంలోని సంగళవ్వ హర విలాసంలో చందనిక అయ్యింది. శివ యోగి విందారగిస్తూ బాలుని తల మాంసాన్ని కోరుతాడు. చందనిక సమయస్ఫూర్తితో దానిని ముందే తీసి పక్వం చేసి వడ్డిస్తుంది. హరవిలాసంలో శ్రీనాధుడు చిరుతొండనంబిని తల్లి దండ్రులకు మించిన శివ భక్తునిగా తన్ను తానుగా స్వామికి ఆహారంగా సమర్పించుకొన్న త్యాగమూర్తిగా తీర్చిదిద్దాడు.

## 413 భీమేశ్వర పురాణము - శ్రీ కాళహస్తి

శ్రీనాధుని భీమేశ్వర పురాణంలో కాళహస్తి ప్రస్తావన నామమాత్రంగా కనిపిస్తుంది. కాంచీ, చిదంబర, కాళహస్తి, కాశీ, శ్రీశైలాది మహాస్థానంబుల కంటెను సేతు కేదారంబుల కంటెను నతిశయంబుగా జేసి యీ క్షేత్రంబును

1 డా కె ఆనందన్ పరిష్కరించి 1989వ సంవత్సరంలో ప్రకటించారు.

(దక్షారామంబును) మరగి.. భీమలింగంబు సర్వమంగళాదేవియుం దాను లోకరక్షణార్థంబుగా నధిష్ఠించినాడు. (6-76)

## 414 కాశీఖండము - శ్రీ కాళహస్తి

స్కాంద పురాణాంతర్గతమైన కాశీ ఖండానికి యిది అనువాదం. దీనిలో ఆంధ్రతాముద్ర లోని భాగంగా ఆంధ్ర దేశంలోని తీర్థాలు,క్షేత్రాలు సందర్భానుసారంగా కవి వర్ణించియున్నాడు. అందులో కాళహస్తి ప్రస్తావన కూడ కనిపిస్తుంది.

''దివోదాసుడు భూమండలానికి సార్వభౌముడై దేవతలను స్వర్గానికి, నాగులను పాతాళానికి, భూతాలు తమ యిష్టం వచ్చిన చోటికి వెళ్లి పోవాలని చాటిస్తాడు. దివోదాస దాసులు ''కాశీ శ్రీశైల కుంభకోణ.. కాళహస్తి, కాంచీ, వేంకట రామేశ్వరాది దివ్యస్థానంబుల ఘంటా పథంబుల ఘంటా డిండిమ ధ్వనుల తోడం గూడం" జాటినారు. (5-275) ఈ చాటింపు విని ''కోయిల దిరుమల బెరుమా కోయిల దిరుపతులు.. మురాంతక ప్రతిమల్" మాయమై ఎక్కడికి పోయినవో తెలియదు. (5-288)

## 415 శివరాత్రి మాహాత్మ్యము - శ్రీ కాళహస్తి

శ్రీనాథుడు ప్రాయముక్కై వ్రాలిన పిమ్మట క్రీ.శ. 1440 ప్రాంతమందు రచించిన కావ్యము శివరాత్రి మాహాత్మ్యము. శ్రీ శైలమునందలి శాంత భిక్షావృత్తి మఠాధిపతికి మూల భృత్యుడైన ముమ్మడి శాంతయ్యకు శివరాత్రి మాహాత్మ్యము అంకితమీయబడినది

గ్రహరాజు కోదండరాశి నుండి మాఘమాసంలో మకరరాశిలో ప్రవేశించే సమయంలో కాశి, పిఠాపురం, దక్షారామం, మార్కండేయ పురులలో చక్రపుష్కరిణీ, కుక్కుటేశ్వర కుండం, సప్త గోదావరం, గౌతమీ నదులలో తీర్థ మాడడానికి అఖిల మునులు వస్తార. ఒక సీస పద్యంలో వర్ణించి, ఈ మాఘమాసం లోనే ''దాక్షారామ భీమేశ్వరుండు దక్షిణ జలధి వేలా వలయితంబులగు నేలా లవంగ లవలీ మల్లికా కుడుంగ క్రోడంబులం గ్రీడించుటకునై సారంగ లోచనలు దానును గోరంగి" వెడలినాడు. ఈ సందర్భంలోనే ''కాశీ, శ్రీశైల, కుంభఘోణ, శోణార్క, కాంచీ, కాంచన

పథా, కాళహస్తి, కురుక్షేత్రాది పుణ్యస్థానంబులం బరమర్షి సార్థంబు తీర్థంబాడె" (4-34) అని కవి వచనం.

## 416 శివలీలావిలాసము

శివలీలావిలాస కృతికర్త నిశ్శంక కొమ్మనామాత్యుడు. ఇతడు శ్రీనాథ యుగానికి చెందినవాడు. ఇతని కృతిలో రెండు ఆశ్వాసాలు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, కాకినాడ వారు ప్రచురించారు. కాని 'అవతారిక' లేని గ్రంథమది. కాని తర్వాత శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు 'History of Reddy Kingdoms' అనే గ్రంథాన్ని ఆంధ్రా యూనివర్సిటీ వాల్తేరు (1932) వారిచే ప్రచురింప జేస్తూ 'అనుబంధం'లో తనకు లాలిఖిత గ్రంథాల్లో లభించిన శివలీలావిలాసం యొక్క 'అవతారిక'ను పరిష్కరించి ప్రకటించారు. అవతారికతో కలిసి పూర్తి కావ్యం యింత వరకు వెలువడ లేదు. ఈ కవి కాలము 15 వ శతాబ్దము. ఇతడు అష్టభాషాకవితా ప్రవీణుడు. శివలీలావిలాసము నందు 36 శివ లీలలు వర్ణింప బడినట్లు కవి గ్రంథాదిలో చెప్పినాడు. కాని లభించిన గ్రంథములో 13 శివలీలలు మాత్రము కనబడుచున్నది. శివలీలావిలాసము కాశీఖండ కృతిపతియైన వీరభద్రారెడ్డి తమ్ముడగు దొడ్డారెడ్డికి అంకితము చేయుబడినది. ఇందలి అవతారికలో 34 పద్యములున్నవి. దీనిని బట్టి ఆనాటి చారిత్రక విషయములెన్నో తెలియుచున్నది. లభించిన గ్రంధము నందు నక్కీరుని కధ లేదు గాని మిగిలిన గ్రంధ భాగములో తప్పక యుండుననిపించుచున్నది. ధూర్జటి కాలానికిది సమగ్రముగా లభించెడిదేమో! ఇప్పటికిది అసమగ్రముగానే లభించుచున్నది. నిశ్శంక కొమ్మన వీర మాహేశ్వరమను మరొక గ్రంధమును కూడ రచించినట్లు ప్రబంధ రత్నావళిని బట్టి తెలియు చున్నది. ఇది శివలీలా విలాసమునకు నామాంతరమో దానికి భిన్నమో తెలియరాదు.

## 417 శివయోగసారము

కొలని గణపతి దేవుడు (క్రీ.శ. 1400) శివయోగ సారమను పద్య గ్రంథమునూ, మనోబోధ అను మంజరీ ద్విపద గ్రంధమును రచించెను. పశుపాశుపతి జ్ఞానము, అశరీర భవ విజయము మొదలగు శివపరములైన

కృతులను కూడ రచించినట్లు శివయోగ సార పీఠికలో చెప్పుకొన్నాడు. కాని అవి లభింప లేదు.

'శివయోగసార' అవతరణికను సంపాదించి ప్రకటించిన వారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. ఈ అవతరణిక 'కాకతీయ సంచిక' అనుబంధముగా ప్రకటితమైనది. ఈ పీఠికలో గణపతిదేవుడు తన వంశమునకు చెందిన పాల్కురికి సోమనాథుని శిష్యుడైన ఇందులూరి అన్నయ వంశ చరిత్రను చెప్పినాడు. శివయోగ సారము నందు పూర్వోత్తర భాగములున్నది. పూర్వభాగములో 8 ఆశ్వాసాలు ఉత్తర భాగంలో 4 ఆశ్వాసాలున్నాయి. ఇది శైవ మత ప్రచారమునకుద్దేశించిన గ్రంథము.

మనోబోధ 459 పాదముల మంజరీ ద్విపద గ్రంథము. మనస్సును సంబోధించుచు శైవ మాహాత్మ్యమును, శైవభక్తిని ప్రబోధించుట యిందలి కథా విషయం. దీనిలో కొలని గణపతి దేవుడు వైరాగ్యాన్ని తేట తెలుగు మాటలతో చెప్పినాడు.

పిడుపర్తి కవులలో ముఖ్యుడైన బసవన (క్రీ.శ 1475-1500) పిళ్లెనారు కథ, బ్రహ్మోత్తరఖండము, వీరశైవదీక్షాబోధ రచించెను. ఇందు మూడవ గ్రంథము మాత్రమే లభ్యము.

4.18 శ్రీ కాళహస్తి మాహాత్మ్యము - ధూర్జటి

ధూర్జటి రెండు గ్రంథాలను రచించాడు. ఒకటి శ్రీకాళహస్తి మాహాత్మ్యమనే ప్రబంధం. మరొకటి కాళహస్తీశ్వర శతకం. రెండు కూడ కాళహస్తీశ్వరునికి సంబంధించినవే. ధూర్జటి కవిత్వాన్ని గురించి శ్రీకృష్ణదేవరాయలు "స్తుతి మతియైన యాంధ్ర కవి ధూర్జటి పల్కుల కేల గల్గె నీయతులిత మాధురీ మహిమ" అన్నాడని ప్రతీతి. స్తుతిమతి అన్నది ధూర్జటి వ్యక్తిత్వాన్ని 'మాధురీ మహిమ' ఆయన కవిత్వా సూచించేవిగా గుర్తింపవచ్చు.

4.18.0 ధూర్జటి కాలనిర్ణయం

ధూర్జటి శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమందలి అష్టదిగ్గజకవులలో నొకడని నిరూపించుటకు తగిన సాక్ష్యాధారములు ఆయన రచించిన గ్రంథాలలో కానరావు. కాని ధూర్జటి అష్టదిగ్గజ కవీశ్వరులలో నొకడని పరంపరాగతమైన

పత్తితి మాత్రం బలముగానున్నది. పైన చెప్పబడిన సుప్రసిద్ధ చాటుధార కేవలం కల్పన కాదు. ధూర్జటి మునిమనుమడైన కుమార ధూర్జటి అని ప్రసిద్ధి వహించిన వేంకటార్యుడను కవి (క్రీ.శ. 17 వ శతాబ్ది ప్రారంభము) తన కృష్ణరాయ విజయము, పీఠికలో దీనిని ఆనాటికే ప్రామాణికచాటుధారగా పేర్కొనియున్నాడు. తనను, తన వంశమును ఆర్వీటి చిన వెంకటాద్రి రాజు యిలా కీర్తించినట్లు కుమార ధూర్జటి వ్రాసినాడు. అందులో చాటుధార ప్రథమ పాదము పేర్కొనబడి యుండడం విశేషం.

*'స్తుతమతి యైన యాంధ్ర కవి ధూర్జటి పల్కుల కేల కల్గెనో*
*యతులిత మాధురీ మహిమ' నా మును మీ పెదతాత చాల ప*
*స్తుతి గనె కృష్ణరాయల మనోజ్ఞ సభన్ విను మీవు నట్టు మ*
*త్కృత బహుమాన వైఖరుల కీర్తివహింపుము ధాత్రి లోపలన్*

దీనిని బట్టి కాళహస్తి మాహాత్మ్య కర్తయగు ధూర్జటి, కృష్ణరాయల ఆస్థాన మలంకరించి యుండెనని, రాయలచే మన్ననలంది యుండెనని విశ్వసింపవచ్చును. కుమార ధూర్జటి తనయుడగు ధూర్జటి లింగరాజ కవి కూడ తన పెదకాళహస్తి మాహాత్మ్యమున ధూర్జటిని యిట్లు కీర్తించినాడు.

*"శ్రీ కాళహస్తి గౌరీ నాధ పద పద్మ*
*సద్భక్తి యుక్తి నిశ్చలత గాంచి*
*సార సుధాసార సరసోక్తి గుంభన*
*గాళహస్తి మహత్త్వ కధ నొనర్చి*
*కృష్ణరాయకిరీటకీలితమణిగణా*
*ర్చిత పదాబ్జద్వయశ్రీ వహించి*
*యాసేతు కాశీ తటావనీ విఖ్యాత*
*సత్కీర్తి విస్ఫూర్తి జాల వెలసి*

*ధరణి జెలువొందె నే కవీశ్వరవతంస*
*రత్న మమ్మహనీయు ధూర్జటి సుధీంద్రు*
*దలతు జలనిధి వీచికా కల కలాను*
*కారి భూరి కవిత్వ వాక్పటిమ గులుక"*

మరియొక ప్రమాణము, శ్రీకృష్ణదేవరాయుల "స్తుతమతియైన..." యిత్యాది సమస్యను సభలో చెప్పగా తెనాలి రామకృష్ణకవి - "....

.... హా! తెలిసెన్ భువనైక మోహనో
ద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతాపహారి సం
తత మధురాధర రోదిత సుధారసధారల గ్రోలుటం జుమీ!

అని పూరించెనని చిరంతన మైన జనశ్రుతి కలదు. కృష్ణరాయ విజయ పెదకాళహస్తిమాహాత్మ్య గ్రంథ ప్రమాణములను బట్టి, ఈ జనశ్రుతిని బట్టి ధూర్జటి శ్రీ కృష్ణదేవరాయుల ఆస్థానములోని అష్టదిగ్గజ కవులలో నొకడని అందరిచే అంగీకరింపబడినది. కావున ధూర్జటి కాలము (క్రీ.శ. 1470-1540) అని విశ్వయింపబడుచున్నది. కృష్ణరాయల కాలము రాజ్యపాలనా సంవత్సరాలు క్రీ.శ 1509-1530 కావున రాయల ఆస్థాన ప్రవేశము నాటికి ధూర్జటికి 40 సంవత్సరముల ప్రాయమనుకొన్నను, రాయల తర్వాత మరొక పదేండ్లు జీవించి మునిమిలో శ్రీకాళహస్తీశ్వర శతకము రచించినాడని చెప్పవచ్చును.

### 4.18.1 ధూర్జటి తల్లిదండ్రులు - సూత్ర గోత్ర శాఖలు

భవరాజ్యముఖుడైన ధూర్జటి తనను గురించి విశేషముగా చెప్పి కొనక పోయినను శ్రీకాళహస్తి మాహాత్మ్యము ఆశ్వాసాంతగద్య వలన ఆయన తల్లి పేరు సింగమ అనీ తండ్రి జక్కయకుమారుడైన నారాయణుడని తెలుస్తున్నది

"ఇది శ్రీమత్కాళహస్తీశ్వర చరణ కమల సేవాపరాయణ సింగమ రమా నారాయణ జక్కయ నారాయణ తనూభవ భవరాజ్యముఖ ధూర్జటి కవి ప్రణీతంబైన.."

ఇంత మట్టుకే ధూర్జటి తనను గురించి చెప్పికొన్నాడు. కాని ధూర్జటి పౌత్రుడైన కుమార ధూర్జటి (వేంకటార్యుడు) 'కృష్ణ రాయ విజయమున' యిలా పేర్కొన్నాడు.

నను భరద్వాజ గోత్రుని సదాపస్తంబ
సూత్రుని బాంధవ స్తోత్ర పాత్రు

*పాకనాటార్వేల వంశ ప్రసిద్ధుని*
*ధూర్జటి పౌత్రు, బంధురచరిత్రు*
*సద్గురు కారుణ్య సంప్రాప్త విద్యా వి*
*హారుని శ్రీకాళహస్తి నిలయు*
*చిత్రసూనాంబికా శ్రీకరామ్నగవా*
*సాధిత కవితారసజ్ఞ హృదయు*

*సార రచనా ధురీణు గుమార ధూర్జ*
*టి ప్రధానాగ్రగణ్యు బటీర హీర*
*మహిత సత్కీర్తి, గాలయామాత్య పుత్రు*
*వేంకటార్యుని బిలిపించి వేడ్క ననియె"*

ముత్తాత సూత్ర గోత్ర శాఖలే మనుమడికి ఉంటాయి కాబట్టి కుమార ధూర్జటి పరంగా చెప్పబడినవే, ధూర్జటికి వర్తిస్తాయని చెప్పవచ్చు. ధూర్జటి భారద్వాజ గోత్రుడు, ఆపస్తంబసూత్రుడు. పాకనాటి ఆర్వేల శాఖ (నియోగి) బ్రాహ్మణుడని తెలుస్తోంది. ధూర్జటి లింగరాజకవి వ్రాసిన పెదకాళహస్తి మాహాత్మ్యము, ధూర్జటి దౌహిత్రుడైన చెలుకుమూడికృష్ణకవి 'శృంగారరాఘవము' లోని పద్యాలను బట్టికూడ పైవిషయం స్పష్టమవుతుంది.

*శ్రీకాళహస్తీశ సేవనాన్వితచిత్త*
*చిత్తజాకార లక్ష్మీవిహార*
*రమణీయశీల భరద్వాజగోత్ర ప*
*విత్ర యాపస్తంబసూత్ర మహిత*
*ధూర్జటివంశపాథోధిచంద్రకుమార*
*ధూర్జటినామ విస్ఫూర్తితాంక*
*స్తుతమతి వేంకటపతి తనూభవలింగ*
*రాజకులేంద్ర ధైర్యాచలేంద్ర !*

అని లింగరాజకవి పెదకాళహస్తి మాహాత్మ్యములో పేర్కొన్నాడు. ఈ

లింగరాజ కవి కుమారుడగు ధూర్జటి వేంకటరాయకవి తన ''రత్నావళీ పరిణయ" కావ్యమున తన వంశమునకు మూల పురుషుడైన పెదధూర్జటిని క్రింది విధంగా నుతించినాడు

*పటుగంగాలహరీతరంగ సమచుంబత్ప్రౌఢతాంచత్కృ బా*
*ఘటనన్ బాద విషమ క్ష్మావరరాడ్గంభీర కోటీర వి*
*స్ఫుట రత్నద్యుతి పాటలీకృత పదాంభోజాతు, సర్వజ్ఞు ధూ*
*ర్జటినిం గొల్చెద నస్మదీయకులకర్తన్ భక్తి రంజిల్లగన్*

''ధూర్జటి సోదరుడగు సుధీమాధవుని మనుమడింకొక ధూర్జటి కలడనియు, నాతడు శ్రీ కాళహస్తీశ్వర దండకమును రచించెననియు దొరతనము వారి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము వారు ప్రకటించి ''యక్షగానములు - దండకములు" అను 8 వ సంపుటమును బట్టి తెలియుచున్నది".

'మాధురీ సాధురీతిన్ రచింపెన్ బ్రియూవల్లకీ భాతి జెతోభవారా పై నూత్నశృంగార మీ దండకం బాంధ్రభాషాకవి గ్రామణీకిన్ జక్కయామాత్య నారాయణ శ్రీ సుధీ మాధవాఖ్యావనీ దెపితా విశ్వనాధ ప్రధానీండు ప్రోలాంబికా పుత్రుడున్ ధూర్జటి ప్రాఖ్యుడున్ జేసె '

''ధూర్జటి స్వయంగా వ్రాసుకొన్న ఆశ్వాసాంత గద్యను బట్టి అతని తల్లి పేరు సింగమ అనీ, తండ్రి జక్కయతనయుడైన నారాయణు డనియు తెలియుచున్నది. సుధీమాధవుడు కూడ ఈ నారాయణుని తనయుడే యని పై కాళహస్తీశ్వర దండకమును బట్టి తెలియుచున్నది. అందుచే కొందరు ధూర్జటి తండ్రి జక్కయ నారాయణుడు ముసలితనంలో సింగమను రెండో వివాహం చేసుకొన్నాడని ఆమె యందు ధూర్జటి జన్మించాడనేది అతని సూత్రగోత్రాదులను బట్టి తెలుస్తోందని అంటారు"

---

*1 ఆంధ్రకవి తరంగిణి, సం. 7, పుటలు 253-54 (చాగంటి శేషయ్య)*

### 4.18.2 ధూర్జటి బాల్యం - విద్యాగురువు - నివాసం

చిన్నతనంలో ధూర్జటి చాల అల్లరిగా, సోమరిగా ఉండేవాడని, చదువు సంధ్యలు లేకుండ ఆకతాయిగా ఉన్న ధూర్జటిని అన్నదమ్ములు మందలించగా అతడు రోషంతో వెళ్లి శ్రీకాళహస్తీశ్వరుని ఆశయించి అనన్య సామాన్యమైన కవితాశక్తి ని సంపాదించాడని తెలియజేసే కథ ప్రచారంలో ఉంది. ధూర్జటి తను బాల్యం నుంచి శ్రీకాళహస్తీశ్వరస్వామి వారి తీర్థ ప్రసాదాలు సేవించి పెరిగినట్లు శ్రీ కాళహస్తీశ్వర శతకంలో చెప్పుకున్నాడు

*నీ పేరున్ భవదంఘ్రితీర్థము భవన్నిష్ఠ్యూత తాంబూలముల్*
*నీ పళ్లెంబు ప్రసాదముం గొని కదా నే బిడ్డనైనా (డ న*
*న్నీ పాటిం గరుణింపు మోప ని (కనే న్వ్వారికిం బిడ్డగా (*
*జేపట్టం దగు (బట్టి మాన (దగదో శ్రీకాళహస్తీశ్వరా ! (ప. 26)*

ఈ పద్యాన్ని బట్టి ధూర్జటి కాళహస్తి నివాసియని తెలుస్తుంది. ధూర్జటి నివాసం కాళహస్తి యని ఆంధ్ర కవులచరిత్రములో కందుకూరి వీరేశలింగం గారు, కావ్య పరిమళములో విశ్వనాథ సత్యనారాయణగారు అభిప్రాయపడ్డారు కాని ధూర్జటి పూర్వులు, ''ధూర్జటిఅమ్మపాళెం గ్రామవాస్తవ్యులుగా వుండిరని డా॥ పోణంగి శ్రీ రామ అప్పారావుగారి అభిప్రాయం."

''వేంకటగిరి సంస్థానములో 'కారూరు, ధూర్జటి అమ్మపాలెము' అను గ్రామములున్నవి. కారూరులో ధూర్జటి వారని యింటిపేరు గలవారు యిప్పటికిని ఉన్నారు. వీరి వద్ద గొన్ని శాసనము లేవో యున్నవట వానినెల్ల బరిశీలించి సాధ్యమైనంత యీ కవియొక్క చరిత్రమును క్రమంబుగ బ్రకటింతుము". అని 1895 లో ధూర్జటి కావ్య ప్రథమ ముద్రణ పీఠికా కర్తలు తెల్పినారు. కాని ఆ ప్రయత్నము కొనసాగినట్లు కన్పట్టదు. ఇంక ప్రస్తుతము - ధూర్జటి పూర్వులు ''ధూర్జటి అమ్మపాలెము" గ్రామ వాస్తవ్యులై యుందురనియు, ఈ గ్రామనామమే వారి యింటిపేరై యుండుననియు, ధూర్జటి తన యింటిపేరునే కృష్ణ రాయల సభలో ప్రసిద్ధుడై యుండుననియు,

అందుచేత, అసలుపేరు విస్మృతమై యుండుననియు, వేంకటార్యుడు కుమార ధూర్జటిగా ప్రసిద్ధుడై నప్పుడు ధూర్జటి "పెదధూర్జటి" అయ్యెననియు తలంపవచ్చును.""

"ధూర్జటి యన్నది యీ కవి పేరేనా? యను సందేహము కల్గుచున్నది. ప్రసిద్ధాంధ్ర కవులలో చాలమంది పేళ్లు తెలుగు పదాలై యున్నవి. శ్రీనాధుడు, భాస్కరుడు వంటివి కొన్ని సంస్కృత పదాలున్నప్పటికిని, తెలుగు కవుల పేళ్లలో నెక్కువ తెలుగు దనము కన్పట్టుట తెల్లము. ధూర్జటి సమకాలికుల లోను పెద్దన, తిమ్మన, మల్లన వంటి పేళ్లే యెక్కువగా నుండెను. ఇంటి పేళ్లతో వ్యక్తులను వ్యవహరించుట మనకు నేడు వచ్చిన విద్యయే కాదు. పూర్వము కూడ నిట్టి వ్యవహారము గలదు. "అల్లసానివాని యల్లిక జిగిబిగి" మొదలైన విట్టివే". [1]

"ధూర్జటియను నింటిపేరుగలవారే నాడు చిత్తూరు మండలములో నున్నారు. ఇది తొలుత గ్రామనామమై యుండి యుండును. వెంకటగిరి ప్రాంతములో ధూర్జటి యను గ్రామము కలదట. అది క్రమముగా కొందరకు నింటి పేరై వెలసి యుండును. ఆశ్వాసాంత గద్యములో 'ధూర్జటి ప్రణీతం బైన' అని స్పష్టముగా పేరైనట్లే కనబడుచున్నది "ఈ శుభ కావ్య రత్నమును కీశు నధీశుని జేసినన్ మహాదేశికసార్వభౌముడు మదిం బ్రమదంబు వహించి ధూర్జటీ !" మొదలైన పద్యములో 'ధూర్జటీ' యను సంబోధనము కూడ యిది పేరే సుమా ! యన్నట్లున్నది. ఒక వైపు ధూర్జటి ఇంటి పేరు గల వారుండుట. ఆ పేరుగల గ్రామముండుట, వేరొక వంక ధూర్జటి కవి పేరై ఖ్యాతి వహించియుండుట యీ యను మానమునకు తావిచ్చుచున్నది " [2]

*1 శ్రీ కాళహస్తి మాహాత్మ్యము- (సంపా) డా ॥ పియస్ఆర్ అప్పారావు 1968, పీఠిక, పుట - 8 - 9*

*1,2 శ్రీ కాళహస్తి మాహాత్మ్యము - (సంపా) చిలుకూరిపాపయ్య శాస్త్రి పీఠిక - వెంపల్లి రంగాచార్యులు, వెంపరాలసూర్యనారాయణ శాస్త్రి ,*
*పుట - 2, 2nd Ed 1967*

శ్రీకాళహస్తి మాహాత్మ్యము కృత్యావతారికలో ధూర్జటి తన స్వీయ గురు ప్రశంస చేసి యున్నాడు

*ఈ శుభ కావ్య రత్నమున కీశు నధీశుని జేసినన్ మహా*
*దేశిక సార్వభౌముడు మదిం బ్రమదంబు వహించి ధూర్జటీ !*
*నీ శివభక్తి కావ్య పరణిం గడు ధన్యత బొంద నవ్య భా*
*షా శతధా నిగుంభన రసస్థితి నొప్ప దలిర్ప జెప్పుమీ !*

''అని గురు డనుపమ కరుణావనధి యనుగ్రహముపేయు..." (ష.8,9)
ఈ గురు ప్రశంస భంగ్యంతరంగ మరియొక చోటకూడ కలదు.

*దివ్య దేశిక హంసోపదిష్ట మార్గ*
*నిర్గుణ ధ్యాన సంధాన నిరుపమాన*
*సౌఖ్య సంపత్తి సాధక జన నివాస*
*మమృత లింగాకరము కాళహస్తి పురము (శ్రీకాళ మా1 -17)*

4.18.3 శ్రీ కాళహస్తి మాహాత్మ్యము - ముద్రణములు

| క్రమసంఖ్య | ముద్రణ సంవత్సరం | సంపాదకుడు |
|---|---|---|
| 1) | 1895 ప్రథమ ముద్రణ (శ్రీ జ్ఞానప్రసూనమాలిక - No 1) | కొ. పద్మనాభశాస్త్రి ఢ. వెంకట సుబ్బయ్య |
| 2) | 1914 ద్వితీయ ముద్రణ (శ్రీ జ్ఞాన ప్రసూన మాలిక - No 1) | క్రొత్తపల్లి అన్నపూర్ణమ్మ |
| 3) | 1930 తృతీయ ముద్రణ (శ్రీ జ్ఞాన ప్రసూన మాలిక - No 1) | దీపాలపిచ్చయ్యశాస్త్రి |
| 4) | 1963 సారస్వతకుటీర గ్రంధమాల (సంఖ్య 8) | తిమ్మావజ్ఝల కోదండరామయ్య |

| | | |
|---|---|---|
| 5) | 1964 ప్రథమ ముద్రణ<br>వేంకట్రామా అండ్ కో<br>విజయవాడ | చిలుకూరి పాపయ్య శాస్త్రి<br>టీకాతాత్పర్యములు<br>వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి<br>పరిష్కరణ |
| 6) | 1967 ద్వితీయ ముద్రణ (పీఠిక)<br>వేంకట్రామా అండ్ కో<br>విజయవాడ | చెలమచర్లరంగాచార్యులు |
| 7) | 1966 వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులు<br>మద్రాసు | (లఘుటీక) బులుసు<br>వేంకటరమణయ్య |
| 8) | 1968 ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ<br>హైదరాబాదు | పీఠికా కర్త<br>డా॥ పోణంగి శ్రీ-<br>రామ అప్పారావు |
| 9) | 1970 ఎమెస్కో ఎడిషన్<br>మచిలీపట్నం | బొమ్మకంటి వేంకట-<br>సింగరాచార్య-<br>బాలాంత్రపు నళినీ-<br>కాంతరావు<br>పీఠిక - విశ్వనాథ -<br>సత్యనారాయణ |

ఇటీవల క్వాలిటీపబ్లిషర్స్, విజయవాడ వారు మరలా తెలుగు ప్రబంధాలను అచ్చు వేయించి కొత్తగా పీఠికలు వ్రాయిస్తున్నారు.

## 4.18 4 శ్రీ కాళహస్తి క్షేత్రం - దైవం - తీర్థం

మాహాత్మ్య కావ్యాలలో ప్రధానంగా గమనింపవలసిన అంశాలు మూడు 1) క్షేత్ర ప్రసిద్ధి 2) దైవ మాహాత్మ్యం 3) తీర్థ ప్రాచుర్యం ఇతర విషయాల్లో అక్కడి పురాతన వృక్షం, అష్ట దిక్కుల అధిష్ఠాన దేవతలు, క్షేత్ర పాలకులు, యిత్యాదులు వస్తాయి.

క్షేత శబ్దానికి నిఘంటువును పరిశీలిస్తే పరిమడి, గణిత శాస్త్రంలో క్షేత గణితం, భార్య, శరీరము, స్థానము, పుణ్యక్షేత్రము యిత్యాది అర్థాలు కనబడుతాయి. దీని కిన్ని అర్థాలు, అర్థ చ్ఛాయలున్నా పుణ్యక్షేత్రమనే మాటయే లోకంలో రూఢికెక్కినది. సి.పి. బ్రౌన్ కూడ క్షేత శబ్దానికి -

A field, A place or spot, The body, a wife, a sacred spot or place of pilgrimage అనే అర్థాలు యిచ్చారు.

### 4.1.8.5 శ్రీ కాళహస్తి - సత్యవత భాస్కర క్షేత్రం

శ్రీ -కాళ-హస్తి అనే నామధేయంలో క్షేత్ర నామౌచిత్యం ఎంతైనా ఉంది. 'శ్రీ' అనగా సాలెపురుగు, లక్ష్మి, అమృతము, విషము ఈ అర్థాలన్నీ శివుని యందు సార్థకములైనవి. ఇక్కడ 'సాలెపురుగు' క్షేత్ర మాహాత్మ్య కథతో సంబంధించినట్టిది.

'కాళ' మనగా సర్పము, 'హస్తి' అనగా ఏనుగు. ఇవి మోక్షం పొందిన చోటు కావడం చేత శ్రీ కాళహస్తి!

[1] ''శ్రీకాళహస్తిలింగం సద్యోజాతాది పంచబ్రహ్మాత్మకంగానూ పంచకృత్య నిర్వాహకంగా, శివ సంపూర్ణ సాన్నిధ్య హేతువుగా, పంచముఖాలతో విలసిల్లుతూ పశ్చిమాభిముఖంగా ఉండడం అపూర్వమైన విషయం. ఈ క్షేత్రం సత్యవతభాస్కర క్షేత్రంగా గణన గాంచడానికిగల పలుకారణాలలో ఇదొక కారణంగా యిచ్చటివారు చెబుతుంటారు. శ్రీ చక్రరాజనిలయంగా జాలంధర పీఠ వాసినిగా అమ్మవారైన శ్రీ జ్ఞానప్రసూనంబ త్రిభంగిమాకృతితో పూర్వాభిముఖంగాను స్వామి వారు పశ్చిమాభిముఖంగాను నెలకొని వుండడం వల్ల లోకబాంధవుడైన సూర్యభగవానుడు అనుదినం తూర్పుదిక్కున ఉదయిస్తూ తన సహస్రకరాలతో తనకు అభిముఖంగా ఉంటున్న అమ్మవారి పాద పద్మాలకు ప్రణమిల్లి ఆమె ఆశీర్వాద బలంతో లోక యాత్ర కొనసాగించి సాయంత్రం పశ్చిమదిశలో అస్తమించునపుడు తనకు

1 *శ్రీకాళహస్తిక్షేత్రవైభవం - విద్వాన్ పూడి వేంకటరామయ్య 1992 పుటలు 6-8*

అభిముఖంగా ఉంటున్న స్వామివారికి పాదాభివందనం చేసి ఆనాటి తన విధ్యుక్తధర్మం సాంతంగా నెరవేర్చానని మనవి చేసుకొని అస్తమిస్తాడనీ, భాస్కరుని చేత యిలా అనుదినం చేయిస్తూ లోకకల్యాణం ప్రసాదింప జేయు నిమిత్తంగానే లోకపితరులైన పార్వతీ పరమేశ్వరులు పూర్వపశ్చిమా భిముఖులుగా (ఎడపెడముఖాలతో) ఇలా ఉంటున్నారని, ఇలాంటి వైశిష్ట్యం ఈ క్షేత్రంలో తప్ప మరేశైవ క్షేత్రంలోను లేదని, మన భారత దేశంలోనే ఇది అపూర్వ దృశ్యం అని చాలమంది చెబుతుంటారు"

''ఇందుకు ఉపోద్బలకంగా స్వామివారి గర్భాలయ ప్రాంగణంలోని మొదటి మంటపంలోనే స్వామివారికి అభిముఖంగా సూర్యనారాయణుని విగ్రహం ఉండడం గమనార్హమైనవిషయం. అందుచేత ఈ క్షేత్రం సత్యవ్రత భాస్కర క్షేత్రంగా చెప్పడానికి గల అనేక కారణాలలో ఇదొక ఐతిహ్యంగా చెబుతుంటారు."

''ఈ కారణం ఒకటే కాక, ఆలయం యొక్క పశ్చిమ గోపురం (అగస్త్యులవారి గోపురం, తిరుమంజనంవారి గోపురం అని కూడా అంటుంటారు) క్రిందుగా సప్తసైంధవాలతోను, సారథి యైన అనూరుని తోను ఉంటున్న శ్రీ సూర్యనారాయణస్వామి ఆలయాన్నీ ప్రక్కనే ఉన్న సూర్య పుష్కరిణినీ కూడా మనం చూడవచ్చు. ఈ పుష్కరిణీ జలాన్నే స్వామి వారి అభిషేకాదులకు, దేవాలయ కైంకర్యాదులకు ఈ నాటికీ కూడా ఉపయోగిస్తుంటారు సత్యవ్రతభాస్కర క్షేత్రంగా గణన గాంచడంలో ఇది మరొక కారణంగా కూడా చెబుతుంటారు"

''పై రెండు దృష్టాంతాలే గాక మరోకారణం కూడా చెబుతుంటారు స్థానికులైన పెద్దలు. తనకు మున్ముందు కలుగబోవు రాహుగ్రహణబాధ నుండి తప్పించుకొనడం కోసం అనుదినం సూర్యుడిలా చేస్తుంటాడని యిచ్చటి వారు చెప్పడంలోని ఆంతర్యం ఇది రాహుక్షేత్రం, కేతుక్షేత్రం గనుక అంటె సత్య వ్రత భాస్కర క్షేత్రమైన శ్రీ కాళహస్తిలో భాస్కరుడిట్లు అనుదినం ఆచరిస్తుండడం వల్ల సత్యవ్రత భాస్కర క్షేత్రం అను పేరునకు నామసార్థక్యం ఏర్పడుతుండడమే గాక ఇది రాహుకేతుక్షేత్రం అని కూడా ఇందులో గూఢార్థం తెలుస్తూ వుంది"

"దక్షిణ భారత దేశంలోని నవగ్రహ క్షేత్రాలలో ఆడుదుర్రై సూర్యునకు, తిరుపతి చంద్రునకు, పళని కుజునకు, మధుర బుధునకు, తిరుచెందూరు బృహస్పతికి, శ్రీరంగం శుక్రునకు, తిరునల్లారు శనైశ్చరునకు, శ్రీకాళహస్తి రాహు కేతువులకు నెలవులని ద్రావిడ పురాణాలు ముక్తకంఠంతో చెబుతున్నాయి. శ్రీకాళహస్తి రాహుకేతుక్షేత్రంగా పేర్కొనబడడంవల్ల రాహువు జ్ఞానమునకు కేతువు మోక్షమునకు అధిపతులు కావడం వల్ల ఈ క్షేత్రం జ్ఞాన దాయకమూ, మోక్ష దాయకమూ ఐన ఉత్తమ క్షేత్రం అని వారి అభిప్రాయంగా తెలుస్తోంది. ఈ కారణంగానే ఆలయ ముఖద్వారం చెంత నిలబడడంతోనే మనకు ఎట్టఎదుటగా శుకసనత్కుమార పరాశరులకు జ్ఞాన మార్గం బోధించిన దక్షిణామూర్తి యొక్క విగ్రహం కనబడుతుండడం ప్రబల నిదర్శనం. ఈ ఒక్క నిదర్శనమే శ్రీకాళహస్తి విజ్ఞాన క్షేత్రం అనటానికి ప్రతీక"

ఈ క్షేత్రంలోని సువర్ణముఖీ నదీతీరంలోను, పలు స్నాన ఘట్టాల లోను, గోపురాలమీదను, వరాహ, ఖడ్గ, సూర్య, చంద్ర ముద్రలు వందలాదిగా ఉండడం అందరం చూస్తూనే ఉన్నాం. ఈ ముద్రలు అసంఖ్యాకంగా ఇలా ఉండడంలో ఆంతర్యం ఉంది. వరాహం అజ్ఞానానికీ, ఖడ్గం జ్ఞానానికీ, సూర్యుడు తేజస్సుకూ, చంద్రుడు శాంతికీ ప్రతీకలు. అందుచేత ఈ క్షేత్రం అజ్ఞానచ్ఛేదక మైనట్టిదనీ, తేజోవంతమైనదనీ, శాంతి ప్రదాయకమైనదనీ, వాటి అంతరార్థం"

"ఈ క్షేత్రంలో తిన్నడు (కన్నప్ప) పందిని చంపి మాంసం స్వామికి నైవేద్యంగా సమర్పించాడు" అంటే అజ్ఞానం అనే పందిని, జ్ఞానం అనే ఖడ్గంతో చంపి, పరమేశ్వరానుగ్రహప్రాప్తిని (ఆచంద్రతారార్కమైన కీర్తి) సూర్యచంద్రులీ భువిపై తిరుగుతున్నంత కాలం పొందాడని అంతరార్థం. అలాగే బ్రహ్మాది దేవతానీకం ఈ క్షేత్రంలో పరమేశ్వరుని ఆరాధించి తాము కోల్పోయిన తేజస్సును సముపార్జించుకొన్నారు. ఇది సూర్య ముద్రకు (తేజస్సు) చిహ్నం. వశిష్ఠాది మహర్షులు ఈ క్షేత్రంలో పరమేశ్వరానుగ్రహంతో శాంతి ప్రదులయ్యారు.(ఇది చంద్రముద్రలకు గుర్తు) భక్తశిఖామణి తిన్నడు (కన్నప్ప)

పందిమాంసం అందులోను ఉచ్ఛిష్టమైన మాంసం పెట్టాడు నిజంగా (ఉత్ + శిష్ట) మైన మాంసం అది అందువల్లనే ఇది ఉచ్ఛిష్ట క్షేత్రంగా (ఉత్ + శిష్ట క్షేత్రం) గా భాసించింది అంటే సదాచార సంపన్నమైన మహా క్షేత్రం శ్రీ కాళహస్తి అని నిగూఢార్థం. ఇలా ఈ క్షేత్ర నామధేయాలు ఒకదానితో మరొకటి ముడిపడి ఉంటుంది. ఈ నామధేయాలన్నీ ఈ క్షేత్రంలో అర్చన రూపంలో ఉంటున్న శతనామాబ్జమాలికలో చోటు చేసుకొన్నవే అనే విషయం మాత్రం మనం విస్మరింపరాదు"

## 4.1.8.6 శ్రీ కాళహస్తి స్థలపురాణకథనం

మహోన్నతంగా సుప్రసిద్ధంగా అకృత్రిమమైన శివలింగంతో ఉన్న క్షేత్రంలో పరమేశ్వరుడు పాదమాత్ర సాన్నిధ్యం చేస్తాడు. అలాగే పై లక్షణాలతో ఉంటూ బ్రహ్మేంద్రాది దేవతానీకంచేత పూజింపబడ్డ శివలింగంగల క్షేత్రంలో సదాశివుడు ద్విపాద సాన్నిధ్యం చేస్తాడు. పుణ్యాదాయకాలైన పర్వతాలలో పుట్టి అత్యుత్తమ పుణ్యవంతాలైన నదీమతల్లులతో ఒప్పారుతూ ఇరువైపుల్లోనూ శైవ వైష్ణవ దేవాలయాలతో విరాజిల్లుతూ ఉత్పత్తిస్థానం మొదలు సంగమస్థానం వరకు ఒకే పేరుతో ప్రవహిస్తున్న నదీమతల్లి కూడా ఉన్న క్షేత్రంలో శివుడు త్రిపాద సాన్నిధ్యం చేస్తాడు వీటితో పాటు సర్వ లోక ప్రసిద్ధంగా సమస్త దేవ ఋష్యాది వందితంగా, సకల పుణ్య తీర్థ సముదాయంగా నానావిధ గైరికాది ధాతు రంజితంగా, చిద్గుహతో ప్రకాశిస్తూ, కేవల దర్శనస్మరణాదుల తోనే పాపసంహారం చేయు సామర్థ్యం గల పర్వత రాజం కూడా ఉన్నటువంటి క్షేత్రంలో పరమేశ్వరుడు సంపూర్ణ సాన్నిధ్యం చేస్తాడని శ్రీ కాళహస్తి స్థల పురాణం నిర్దేశిస్తూ ఉంది కనుక పైన చెప్పబడ్డ నాలుగు లక్షణాలు శ్రీ కాళహస్తి క్షేత్రంలో ఉండడం వల్ల ఈ క్షేత్రంలో పరమ శివుడు సంపూర్ణ సాన్నిధ్యం చేశాడు పరమేశ్వరుని సంపూర్ణ సాన్నిధ్య స్థానం సత్యవ్రతభాస్కరక్షేత్రంగా ఆ స్థలపురాణమే నిర్దేశిస్తుండడం వలన శ్రీకాళహస్తి క్షేత్రం సత్యవ్రత భాస్కర క్షేత్రంగా లోకవిశ్రుతమైంది.

### 4.18.7 నాల్గుయుగాలలో నాల్గు పేర్లు - నాలుగు వర్ణాలు

"ఈ క్షేత్రం కృతయుగంలో విరించిపురం (బ్రహ్మపురం), త్రేతాయుగంలో విష్ణుపురం, ద్వాపరయుగంలో నారదపురం, కలియుగంలో వరగుణపురంగా (వరగుణ పాండ్యుని పేరు మీదుగాను శ్రేష్ఠగుణాలు గల విశిష్ట క్షేత్రం గాను) ఈనాడు అట్టి విశిష్ట గుణాద్యోతకంగా 'శ్రీకాళహస్తి' నామధేయంతో విరాజిల్లుతూ ఉంది. ఈ క్షేత్రంలో యుగ యుగాలుగా బ్రహ్మదేవుడూ, మహావిష్ణువూ, ఆదిగాగల దేవతలు, యక్ష కిన్నర కింపురుషాది దేవజాతులవారు, పుణ్యవంతులైన మహర్షులూ, పలు విధాలైన జీవరాసులూ పరమేశ్వరారాధన చేసి వాంఛితార్థ ప్రదులయ్యారని శ్రీ కాళహస్తి స్థలపురాణం చెబుతుంది"

"ఈ క్షేత్రంలోని శివలింగం స్వయంభూలింగం. పూర్వ కల్పంలో ప్రథమంగా వాయుదేవుని చేత పూజింపబడి వాయుమయమై అనంత గుణోజ్జ్వలంగా సర్వార్థప్రదంగా కర్పూర గౌరవర్ణ సంశోభితంగా రుద్రాక్షాకారంతో శ్రీకాళహస్తి విఖ్యాతంగా (శ్రీ = చెలది; కాళ = సర్పము, హస్తి - ఏనుగు) వెలకొని ఉన్న ఈ లింగాన్ని గూర్చి

*స్వర్ణ వర్ణం కృతే, త్రేతాయుగే రౌప్యసమ ప్రభమ్ ।*
*ద్వాపరే లోహసదృశం, కలౌ ప్రస్తర సన్నిభమ్ ॥*

అని శ్రీకాళహస్తి స్థల పురాణంలో వర్ణింపబడి యుండడం వల్ల ఈ క్షేత్ర నామధేయాలు యుగానుసారంగా ఎలా మారుతూవచ్చాయో అలాగే లింగం యొక్క వర్ణం కూడా కృతయుగంలో స్వర్ణ వర్ణంగాను, త్రేతాయుగంలో రజతసన్నిభవర్ణంగానూ, ద్వాపరంలో లోహవర్ణంగాను, కలియుగంలో శిలాసన్నిభవర్ణంగాను మారుతూ వస్తున్నట్లు తెలుస్తోంది. గర్భాలయంలోని మూల విరాట్ లింగమునకు అభిముఖంగా కూర్చొని స్వామి వారితో పాటు నిత్య నైవేద్యాలందుకొంటూన్న నందీశ్వర విగ్రహం ఏ వర్ణంతో ఉంటున్నదో సరిగా నూటికి నూరుపాళ్లు అదే వర్ణంతో ఈనాడు ఈ మూలస్థాన శివ లింగం ఉండడం ప్రత్యేకించి గమనింపదగింది. ఈ మూలస్థాన లింగాన్ని

ఎవరూ చేతితో తాకరు. అభిషేకాదులు పానవట్టమునకే చేస్తుంటారు. లింగానికి స్వర్ణకవచం ఆచ్ఛాదన చేసి అలంకరించి అర్చిస్తుంటారు. అలంకారాదులు కలిగిన ఈ కవచం నక్షత్రగ్రహ కవచం. ఇది ఈ క్షేత్రంలో అనూచానంగా వస్తున్న ఆచారం.

పృథివ్యప్తేజోవాయురాకాశాలు అనే పంచభూతమయమైన పంచలింగాలలో కాంచీపురంలో పృథివీలింగంగా, జంబుకేశ్వరంలో జలలింగంగా, అరుణాచలం (తిరువణ్ణామలై) లో జ్యోతిర్లింగంగా, పరమేశ్వరుడు వెలకొని యున్నాడని ఆస్తిక జనానీకం యొక్క ప్రగాఢ విశ్వాసం. వీటిలో శ్రీకాళహస్తీశ్వర లింగం వాయులింగం అనడానికి ప్రబల తార్కాణంగా గర్భాలయంలో స్వామి వారికి కుడివైపు నెలకొని ఉన్న దీపకళికలోని జ్యోతి ద్వయంలో పై నుండునది వాయు పంచాలనంతో నిరంతరం రెప రెపలాడు తుండడం, క్రింద గల జ్యోతి నిశ్చలంగా నిర్వికారుడైన యోగి వలె స్తంభీ భూతంగా ఉండడం భక్తులందరూ ప్రత్యక్షంగా చూస్తున్న విషయమే. ఈ జ్యోతిర్ద్వయంలోని పై నున్న జ్యోతిని స్వామి వారి ఆనందతాండవంగాను, క్రింద గల జ్యోతిని అమ్మవారి ఆనందలాస్యం గాను దైవభావంతో చూచి భక్తులు పరవశిస్తుంటారు. పరమానందకరమైన స్వామి వారి సచ్చిదానంద (సత్ + చిత్ + ఆనంద) స్వరూపం చూచి భక్తులు మైమరుస్తుంటారు. ఇందుకు ఉపోద్బలకంగా ఆలయంలో నెలకొని యున్న మూర్తిత్రయంలో (మూలవిరాట్టు సద్రూపం - సత్), దక్షిణామూర్తి శివుడు చిద్రూపం - చిత్, నటరాజమూర్తి ఆనందరూపం గా భావించి ఆనంద పరవశులౌతుంటారు భక్తులు.

4.18.8 అంతర సమన్వయం

"పై సందర్భంలో మరొక సమన్వయాన్ని డా॥ ముదివేడు ప్రభాకరరావుగారిలా సూచించారు. శివునికి గల స్వర్ణ కవచం నక్షత్రగ్రహ సంకేతాత్మకంగా తొమ్మిది పట్టెలు గలిగి యుండడం ఔచితీ వంతమే. అది శ్రీచక్రం లోని నవచక్ర నవావరణ సూచకమైంది ''శివశ్శక్త్యాయుక్తో.." అన్న శ్రీ ఆదిశంకరుల సౌందర్యలహరీ శ్లోకానికది సూచకం. పంచ

భూతములు - పంచ లింగాలుగా ఉన్నాయనడంలో శివునికి గల పంచముఖ ములకది సూచకం. శివుడు పంచముఖుడు. 1) సద్యోజాతము 2) వామదేవము 3) అఘోరము 4) తత్పురుషము 5) ఈశానము అని ఆ ఐదు ముఖములకు పేర్లు. అంతేకాదు శివుడు నాదమే తనువుగా గలవాడు. శ్రీ సద్గురు త్యాగరాజస్వామి వారు - "నాద తనుమనిశం శంకరం " అని చెప్పడమేకాక అదే కీర్తనలో "సద్యోజాతాది పంచ వక్త్రం" అన్నారు. ఈ నాదము "ఓంకార నాదము". యోగులు నిత్యమూ ఓంకార నాదాన్ని వింటూ వుంటారు. ఓంకార నాద స్వరూపుడే, దానినే తనువుగా, శరీరంగా గలవాడే శివుడు. ఈ నాదానుభూతి అంతరం కాని బాహిరం కాదు. అందుకే నీలకంఠదీక్షితులు "యశ్చాభ్యం తర వృత్తిమాత్రరసికో సాక్షాత్ స్వయంభూః పుమాన్" అన్నారు శివోత్కర్ష మంజరిలో. ఆవరణ ఛేదమనేది యోగి కెంత ముఖ్యమో, అనాది మలనాశనం సామాన్య మానవునికి అంతే అవసరం. లోలోపలి పొరల్నీ, ఆవరణాలన్నీ, కంచుకాలన్నీ తొలగించుకుంటూ పోతే తప్ప స్వామి వారి 'స్వయంభూలింగ దర్శనం' కాదు. శ్రీ కాళహస్తి లోని మూలస్థానేశ్వర లింగం అట్టి స్వయంభూ లింగం. తల్లి పార్వతి కఠోర తపస్సు చేత 'అపర్ణ' యై స్వామి యొక్క స్వయంభూమూర్తిమత్త్వాన్ని దర్శించి 'అర్ధనారీశ్వరి' యైనది. ఇది జీవేశ్వరుల ఐక్యత్వాన్ని స్థాపించే అనాది శైవ క్షేత్రం !"

"జీవేశ్వరుల ఐక్యత్వాన్ని స్థాపించే క్షేత్రం అని ఎందుకంటున్నారంటే, శ్రీ కాళహస్తీశ్వరునిలో సాయుజ్యం పొందిన భక్త కోటి కది సంకేతమే కాకుండా స్వామి వారి 'ఓవరి 'లో ('గర్భగుడి') రెప రెప లాడుతున్న దీపం జీవునికీ, నిశ్చలంగా ఉన్న దీపం పరమాత్మకు సంకేతం. రెపరెపలాడడంలో అర్థం జీవుని నిరంతర వేదన, నిత్యవిరహమూ, మోక్షం కోసం పరితపించడం ముఖ్య కారణాలు కాగా, నిశ్చలంగా ఉన్న దీపం భగవద్గీతలో, ఉపనిషత్తుల్లో, బ్రహ్మ సూత్రాల్లో (ప్రస్థాన త్రయం) స్థాపింపబడిన పరమాత్మ. "యథా దీపోనివాతస్థో" - అని గీతలోని శ్లోకం దీనినే చెబుతోంది". అని వివరించారు

### 4.18.9 శ్రీ ధూర్జటి కావ్యంలో ప్రస్తావింపబడిన యితర క్షేత్రాలు నదులు, తీర్థాలు

శ్రీ కాళహస్తిమాహాత్మ్యంలో తెలుగువాడులోని స్థలాలు, నదులు, తీర్థాలు ప్రస్తావించబడినాయి. పొత్తపినాడు, ఉడుమూరు, కాళహస్తి కాళద్వీపం, తిరుకాళహస్తి, దక్షిణాకైలాసం, యమదిక్కైలాసం, శ్రోత్రిష్పద్ధవటం, పీఠికాపురం, మహాకాళేశ్వరం, శికమసింహపురం వేంకటాచలం, శ్రీకూర్మం, శ్రీశైలం, సింహాచలం మొదలగునవి.

నదులలో స్వర్ణముఖరీ, మొగిలేరు, కుంభజ క్షితిధర కన్యక, కృష్ణవేణి, కొండ్లకమ్మ, గౌతమి, పెన్న మొదలగునవి.

తీర్థాలలో - అవిముక్తం, ఇంద్ర తీర్థం, విఘ్నరనాయక తీర్థం, మయూర తీర్థం,మార్కండేయ మునీశ్వర తీర్థం, మోహన తీర్థం, శిఖి తీర్థం, సహ్యేశ తీర్థం, మొదలగునవి.

అరణ్యాలు, కొండలలో అగస్త్య గ్రావం, దక్షిణ కైలాసగిరి/ దక్షిణ రజత గిరి, అవాచీనస్థాణునగరి, దుర్గాంబ కొండ, అంజినాటికొండలు, ఇంద్రకీల శైలం, సదాశివు కొండ మొదలగునవి.

అరణ్యాలలో గజకాననం, పూర్వావని భృత్తటాటవి మొదలైనవి శ్రీ కాళహస్తీశ్వరుని క్షేత్రమహిమ ద్యోతక మయ్యేటట్లు కవి ఆయా క్షేత్ర, పర్వత, నదీ, తీర్థాల పేర్లతో కలిపి ప్రయోగించియున్నాడు.

| | |
|---|---|
| **కాళహస్తి నిలయుడు** (4-39) | కాళహస్తివిభుడు (1-47) |
| **కాళహస్తి సదనుడు** (2-1) | కాళహస్తి దైవము (4-43) |
| **కాళహస్తి నాయకుడు** (1-29) | కాళహస్తిపురదైవము (3-222) |
| **కాళహస్తిపతి** (1-7) | కాళహస్తీశుడు (1-11) |
| **తిరుకాళహస్తిపతి** (2-156) | తిరుకాళహస్తీశుడు (4-203) |
| **కాళహస్తీశ్వరుడు** (1-) | కాళహస్తిగిరిజాధిపుడు (4-119) |
| **కాళహస్తిగౌరీపతి** (4-103) | కాళహస్తి తుహినాంశుధరుడు (4-107) |

కాళహస్తి బాలేందు కళాధరుడు (4-134) కాళహస్తి శశిరేఖుడు (1-61)
శ్రీకాళహస్తి శివుడు (4-103, 117) శ్రీకాళహస్తిమహాదేవుడు(4-109)
శ్రీకాళహస్తిసర్వేశ్వరుడు (4-51) శ్రీకాళ ద్వీపేశుండు (4-68,94)

అని అనేక విధాలుగా శ్రీకాళహస్తీశ్వరస్వామిని కవి కొనియాడినాడు.[1]

దక్షిణ కైలాస పర్వతానికి ధూర్జటి మహాకవి కావ్యంలో ప్రయోగించిన నామాంతరాలివి 1) అవాచీన స్థాణునగం (2-14 9) దక్షిణ కైలాస గోత్రం (2-69), దక్షిణ కైలాసధరం (1-99) కాలదిగ్భాగ కైలాస శైలం (1-46) యామ్యభాగ కైలాస గిరి (1-110) అంతకదిశారజత పర్వతం/ యమాశ వెండిమల (4115) జముని దిక్కు వెండిమల (3-53) దక్షిణకలధౌతగిరి (4-117) దక్షిణ రజతగిరి (4-108) దక్షిణ రజత క్షితిధరం (2-153) దక్షిణ రజత శిఖరి (2-76) దక్షిణరౌప్యధరాధరం (1-134) దక్షిణ రౌప్యశైలం (2-66) శ్రీకాళహస్తీశ్వర స్వామి దక్షిణ కైలాస ధరణీధరావాసుడు (2-110) దక్షిణ రౌప్య శైల శృంగాంతర వాసుడు (2-64) గా పేర్కొనబడినాడు. మేరుగిరి దుర్గాంబకొండ (1-116) గా వెలసింది. స్వామికి దుర్గాధరాధరము విహార స్థలం. అందుకే ''కృత దుర్గా ధరణీధరసాను వినోదవిహార (2-153) అని కవి సంస్తుతించినాడు"

శ్రీకాళహస్తి ఎంతటి పవిత్ర క్షేత్రమో అంతటి పుణ్య తీర్థం స్వర్ణముఖరీ నది. ఆ నదీ తీరంలో మొగలి పొదల విస్తారాన్ని బట్టి మొగిలేరు అనే పేరు, అగస్త్య కొండల్లో పుట్టింది కాబట్టి 'అగస్త్య పర్వత సుత' అనే పేరు వచ్చినాయి.

సువర్ణముఖరీ నదికి ధూర్జటి ఈ కావ్యంలో ప్రయోగించిన నామాంతరాలు యిలా వున్నాయి. అష్టాపదముఖరీ (3- 225) కనకముఖరీ (1-12) కాంచనముఖి (3-87) పొన్మొఖరి (1-64) సువర్ణముఖరీ (1-12) స్వర్ణముఖరీ

---

*1 ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు- డా॥ పి.నరసింహా రెడ్డి 1984 (202 216)*

(1 -107) హేమ ముఖరీ (1-143) కేతకినది (2-110) కేతకీ తటిని (4-150) కేతకీద్వీపవతి (4-114) కేతక్యాపగ (4-1 73) మొగలేరు (2-67, 3-50, 4-117) కలశీ సుత గిరికన్యా శైవలినీ (2-153) కుంభజక్షితిధర కన్యక (2-95) కుంభజ్నగావసుతా (3-52) కుంభసంభవ కుంభినీధర కన్యా (4-108) కుంభ సంభవ ధరాధర కన్యక (4-118) కాళహస్తీశ్వరుని ''కలశీసుత గిరికన్యా శైవలినీ తటకల్ప మహీరుహా !" (2-153) అని కవి ప్రశంసించినాడు.

శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో మనం దర్శించ గల తీర్థాలు అవిముక్తం, ఇంద్ర తీర్థం, నిర్ఝర నాయక తీర్థం, మయూర తీర్థం, మార్కండేయ మునీశ్వర తీర్థం, మోహన తీర్థం, శిఖి తీర్థం, సహస్రేశ తీర్థం, అనేవి కాళహస్తి క్షేత్రంలోని తీర్థాల ప్రశంస 'కాళం' అనే సర్పం, హస్తి చేసిన స్వామి ప్రస్తుతిలో ఉంది. ఆ ప్రస్తుతిలో క్షేత్ర, తీర్థ, దైవతాల ప్రశంస కూడా యిమిడి వుంది.

*॥రగడ॥" జయ జయ కలశీసుత గిరికన్యా శైవలినీ తట కల్ప మహీరుహ!*
*జయ జయ దక్షిణ రజతక్షితిధర సంయమిసేవిత పాదసరోరుహ!*
*జయ జయ పీన జ్ఞాన ప్రసవాచలకన్యాకుచ దృఢ పరిరంభణ!*
*జయ జయ కృత దుర్గా ధరణీ ధరసాను వినోద విహార విజృంభణ!*
*జయ జయ భారద్వాజాశ్రమ వనసరసిజ కేళీవన పరితోషిత!*
*జయ జయ నీలక్ష్మాధర పుణ్య స్థల కాపాలిక భాషిత భూషిత!*
*జయ జయ మోహన తీర్థాలోకన సంభ్రమరత భవ బంధవిమోచన!*
*జయ జయ శిఖి తీర్థాశిత యోగీశ్వర మానస సంవిత్సుఖ మోచన!*
*జయ జయ సహస్ర లింగాలయ దర్శన మాత్ర స్థిర మోదాపాదక!*
*జయ జయ ఘనమార్కండేయ మునీశ్వర తీర్థ నిషిక్త విచ్ఛేదక!*
*జయ జయ నిర్ఝర నాయక తీర్థ స్నాతక జన కలుషేంధన పావక!*
*జయ జయ కరుణేక్షణ రక్షిత నిజ చరణారుణ పంకేరుహ సేవక!*
*దేవా! నిను వర్ణింప రమా వాగ్దేవీ వల్లభులైనను శక్తులె? (2-514)*

## 419.0. ధూర్జటి దృక్పథంలో శ్రీ కాళహస్తి

ప్రతి క్షేత్రానికి దాని ప్రశస్తిని వివరించే సాహిత్యం పురాతనమో, అధునాతనమో కొంత కొంతగా వెలువడడం సహజం. నిజానికి ఆయా క్షేత్రాల ప్రాచీన చరిత్రలు ఆయా కవుల రచనల వల్ల కడు నిండుగా తెలియడం కూడా సహజమే. అట్టి రచనల కోవలోనికి చెందినవే శ్రీ కాళహస్తి మాహాత్మ్యము, శ్రీ కాళహస్తీశ్వర శతకము. వీటిని రచించినది మహాకవి ధూర్జటి. ఆయన శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజములలో నొకడు. స్వతంత్రుడై పోతన వలె భక్తి పరవశుడై ఈ మహాకవి తన గ్రంధములను రాజ పరమేశ్వరుడైన రాయలకు అంకిత మీయక శ్రీ కాళహస్తీశ్వరునికే అంకితము చేసినాడు. శివపరమైన కవితనే వెలయించిన కారణం చేత ధూర్జటి వీర శైవుడని కొందరనుట కలదు. కాని శ్రీనాధాది మహాకవుల వలె ఈ భక్తకవి అద్వైత వేదాంతి మాత్రమేనని చెప్పక తప్పదు. కవితాధారలో కూడా శ్రీనాథుని ధారాశుద్ధి ఈయనలో కానవచ్చుట ప్రత్యక్షానుభవము. 'స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేల కల్గెనో యతులిత మాదురీ మహిమ' అని శ్రీకృష్ణదేవరాయల ప్రశంస నందిన మధుర కవి ధూర్జటి.

శ్రీ కాళహస్తి మాహాత్మ్యమున ధూర్జటి మహాకవి ఆ దేవుని చేసిన వర్ణన మీ తీరున నున్నది.

*శ్రీ విద్యానిధియై మహామహిమచే జెన్నొ వసిష్ఠాది లూ*
*తా వాతశన సామజాటవిక గోత్రా దేవ నత్కీర రా*
*జీవాక్షీ యుగ యాదవాధిపులకున్ శ్రేయస్కరం బైన యా*
*ద్యావామాంగము దివ్యలింగము మదీయాభీష్టముల్ సల్పెడున్*

తాను వర్ణింప దలచిన క్షేత్ర మాహాత్మ్య కథనంతయు ధూర్జటి పై పద్యంలో సూచికగా చెప్పినాడు.

వసిష్ఠుని కథ, చెలది పురుగు, పాముకథ, ఏనుగు కథ, కన్నప్ప కథ, బ్రహ్మ కథ, నత్కీరుని కథ, వేశ్యకుమార్తెల కథ, యాదవ నరసింగరాయల కథ యివన్నీ కావ్యాంతర్గతంగా కవి వర్ణించినాడు.

ధూర్జటి దాదాపు 11 పద్యములలో శ్రీ కాళహస్తిని వర్ణించినాడు మొదటగా కాళహస్తి పట్టణమును కావ్యోచితమైన అలంకారములతో నిట్లు వర్ణించినాడు

*సంసార పారదోచ్చాటనావలకీల*
*కలుష సంచయ శ్యామ గంధకంబు*
*కామలతామూల కంద కుద్దాలంబు*
*సంకల్ప పాషాణటంకముఖము*
*రాగశాలి వనాంకుర కదంగరీయంబు*
*శంకాకళంక భుజంగనకులి*
*నవమనో గోరాజ నాసికారజ్జువు*
*కోపనేక్షణ విశిఖోపలంబు*

*దివ్య దేశిక హంసోపదిష్టమార్గ*
*నిర్గుణ ధ్యాన సంధాన నిరుపమాన*
*సౌఖ్యసంపత్తి సాధక జన నివాస*
*మమృత లింగాకరము కాళహస్తి పురము (1-17)*

కాళహస్తి పురం సంసార మనెడు పాద రసాన్ని యెగుర గొట్టె అగ్ని జ్వాల, పాపమను రాగికి గంధకము, కోర్కెలను తీవ దుంపః త్రవ్వకోల తలపులను రాతికి గడ్డపార మొనవంటిది అనురాగమనే వరిచేనుకు వృషభము సంగీతమను పామునకు ముంగిస మనస్సనే ఎద్దునకు ముక్కుత్రాడు. కోపము గల వారి చూపుల నెడు బాణాలకు రాయి మోక్ష సంపద సాధించు వారికి నిలయము.

ధూర్జటి కాళహస్తి పుర వర్ణన చేసినను అదియు ఆధ్యాత్మికమే

*ఆడం జితము వాడ వాడ ఘను మద్య స్వర్ణ రత్న ద్యుతుల్*
*మాడం జూడగ షణ్ముఖీకరణ రేఖారూఢి (చిత్తేక్షణ*
*(క్రీడా దుస్తర మార్గ సౌఖ్య రసవార్థిం దేల్చు దత్పట్టణ*
*(కోడక్షోణినటున్న నన్య పురిముల్ గొండాట క్షారంబులే ? (1-18)*

ఆ పురము గోడల బంగారు రత్నాల కాంతులు కుమారస్వామి తేజస్సు తో నొప్పును. అందున్న వారు ఆనందరస సాగరమున తేలుచుందురు. అందలి ప్రాణి కోటి మోక్ష మందుటలో ఉత్తమ మధ్యమాధమ భేదములు లేవు. అందరు ఉత్తమగతికే పోదురు. అంతటి ఉత్తమ జ్ఞానము కల్గించు కాళహస్తికి, యితర పురములకు ఏనుగుకు, దోమకున్నంత తేడా యున్నదని ధూర్జటి వర్ణించినాడు. దీనిచే శ్రీకాళహస్తి క్షేత్రమందాతనికి గల భక్తిప్రపత్తులు తెలుస్తున్నాయి.

## 419.1 కావ్య స్వరూపం

ఇది 4 ఆశ్వాసాల ప్రబంధం. దీనిలో మొత్తం 755 గద్యపద్యాలున్నాయి. శివస్తోత్రపరములైన ఒక దండకం, ఒక రగడ ఉన్నాయి. ఆశ్వాసాది పద్యములలో నా యాశ్వాసంలోని కథ సూచితమగుట యీ కావ్యమున కొక విలక్షణ చిహ్నము. అట్లే ఆశ్వాసాంతాల్లో పంచ చామరములను నియతంగా ప్రయోగించడం కూడ క్రొత్త. పంచచామరములతో పంచముఖుడైన శివునికి కైంకర్యము చేయుట యొక పుణ్య హేతువని కవి దీనిచే సూచించుచున్నట్లున్నాడు.

ప్రథమాశ్వాసంలో శివుడు కపట జంగమ రూపంలో వచ్చి యాదవరాజు దాసిని అనుగ్రహించుట, ఆ పై యాదవరాజును అనుగ్రహించడం చెప్పబడింది.

రెండవ ఆశ్వాసంలో బ్రహ్మకు సరస్వతి వలన దుర్మార్గులైన మార్గురు కుమారులు కలుగుట, బ్రహ్మ వారిని ఉగ్రుడను కుమారుని చే చంపించుట, తుదకు యితని కోపంతో ఉగ్రుడును చనిపోవుట, బ్రహ్మ తపస్సు ఈశ్వరుడు ప్రత్యక్షమై బ్రహ్మకు వరాలివ్వడం, రెండవ అంశంగా శ్రీ - కాళము - ఏనుగు శివ సాయుజ్యం పొందుతాయి.

మూడవ ఆశ్వాసంలో కన్నప్ప కథ, తిన్నడు శివ సాయుజ్యము పొందుట, నక్కీరుడు శివసాయుజ్యము పొందుట ప్రధానాంశములు.

వాల్గవ ఆశ్వాసంలో వార కాంతలు వార ధర్మాన్ని రోసి భక్తి పరవశలై పరమేశ్వరుని అనుగ్రహం సంపాదించి శివ సాయుజ్యం పొందుట చెలది, కాళమ్మ హస్తి తిన్నడు వీరి పూర్వ జన్మ వృత్తాంతములు గ్రంథాంతంలో చెప్పబడ్డవి

## 4.19.2 కథా విశేషాలు

ఒక చెట్టుగాని, పుట్టగాని, గుడిగాని, గోపురం గాని, ప్రసిద్ధి పొందడానికి వాటి వెనుక కొన్ని కథలు అల్లుకొని ఉండడం ప్రధాన కారణం. అలాగే వ్యక్తిపట్ల దేవతపట్ల కూడ కథలు ప్రచారంలో ఉండడం గమనింపవచ్చు. శ్రీ కాళహస్తి మాహాత్మ్యాన్ని వర్ణించడానికి ధూర్జటి ఎనిమిది కథల్ని ఎన్నుకున్నాడు. ఈ కథలన్నీ పరమేశ్వరానుగ్రహానికి భక్తి యే ప్రధాన హేతువైనట్లు తెలుస్తుంది. బహుజన్మ పుణ్య ఫలమున గాని నీ భక్తి జనింపదు. ''న మే భక్తః ప్రణశ్యతి" 'నా భక్తునకు నాశనము లేదు' అను భగవద్వాక్యానికి ఈ కథలలో సమన్వయం గోచరిస్తుంది.

## 4.19.3 యాదవ రాజు కథ

ఇతని పూర్తి పేరు వీర నరసింహ యాదవ రాయలు. ఇతని రాజధాని నారాయణ వనము. ఇది నేటి చిత్తూరు జిల్లాలో ఉంది. ఈశ్వరుడా రాజు భక్తిని పరీక్షింప డానికి మనోహరమైన మిండజంగము రూపము ధరించి రాజు యొక్క దాసి యింటికి వెళ్లి ఆమె ఆతిథ్యం స్వీకరించి ఆనందపరవశుడైనాడు. దాసి రాజనర్తకి గావున ఆమె రాజసభకు ఆలస్యంగా రావడం చేత రాజు కోపించి సేవా ధర్మాన్ని మరచినందుకు ఆమె తలగొరిగించి అవమానించాడు. బోడి తల దాసి గోడున నేడ్చుచు జంగమ శివుని పాదాలపై పడి దుఃఖిస్తుంది. జంగమ గురుడు తన చేతిని ఆమె తలపై ఉంచగా ఆమెకు యథాప్రకారం శిరోజాలు వస్తాయి. రాజు తన తప్పిదం తెలుసుకుని జంగమమూర్తి పాదాలపై బడి క్షమాభిక్ష ప్రసాదించమంటాడు. అప్పుడు శివుడు ఓయీ ! నిన్ననుగ్రహించడానికే వచ్చాను. శ్రీ కాళహస్తిలో తనకు ఆలయం కట్టింపుమంటాడు. శివాజ్ఞను

మహా ప్రసాదంగా స్వీకరించి, కాళహస్తి మహిమ యెట్టిదో లోకానికంతా తెలియజేయవలసిందిగా ప్రార్థిస్తాడు. అప్పుడు పరమేశ్వరుడు శ్రీకాళహస్తిమాహాత్మ్యాన్ని వివరిస్తూ వశిష్ఠాదుల కథల్ని చెబుతాడు.

## 419.4 పరమేశ్వరుడు వర్ణించిన శ్రీ కాళహస్తి

*జముదెస వెండికొండ ఘనసాల, మగస్త్యధరాత్మజాలలా*
*మము పరిఖాబ్ధి, రాజ్య గరిమం బపవర్గ సుఖంబు, రాజ ర*
*త్నము పరమేశ్వరుండు, వటునాథుడ కావలివాడు, తన్మహ*
*త్త్వము గొని యాడగా హరిపితామహ శేషులకైన శక్యమే?*

*శమనాశా రజతాద్రి మేను, శిర మా శంభుడు, దుర్గాదినీ*
*ల మహోదు ల్స్తనుచోయి, పొన్ముఖరి లీలావేణి, బాహాంఘ్రులిం*
*ద్రమయూరాఖ్య సహస్ర లింగ పద భారద్వాజ తీర్థంబులై*
*యమరున్ ముక్తి వధూటి, కప్పగర మాహాత్మ్యంబు సామాన్యమే!*

ఓ రాజా! దక్షిణదిక్కునందు వెలసిన కైలాసము యీ కాళహస్తి నగరం పెద్ద పెద్ద ప్రాకారాలతో అగస్త్యపర్వతంనుండి పుట్టిన సువర్ణ ముఖరీనదితోను, మోక్షానందము నిచ్చు యీ పట్టణానికి కావలివాడు వటునాథుడై ఉండగా దీనిని కొనియాడుటకు హరిపితామహశేషులకు కూడా కష్టమే! అంతటి మాహాత్మ్యం గల యీ పట్టణం మోక్షన్నిస్తుంది. ముక్తి అనే కాంతకు దక్షిణ కైలాసగిరి శరీరం, అక్కడ నివసించే ఈశ్వరుడు శిరస్సు, దుర్గాగిరి, నీలగిరులు రెండు స్తనములు సువర్ణముఖరి అందమైన జడ ఇంద్ర, మయూర, సహస్ర లింగ, భరద్వాజాలను తీర్థాలు హస్తాలు, పాదాలు అంటూ కాళహస్తి పుర పరిసర మహారణ్యాన్ని వర్ణించి, "అప్పవాభిధానంబు గజ కాననం, బందు దొల్లి మహామునకుం బరమేశ్వరుండు ప్రసన్నుండైన విధంబు చెప్పెద వినుము" అని 'మహేష్ముని కథ' చెప్పసాగాడు

### 419.5 వశిష్ఠుని కథ

విశ్వామిత్రుని వల్ల వశిష్ఠుని నూర్గురు పుత్రులు చనిపోతారు. అందువలన ఆ ఋషి పుంగవుడు దుఃఖాగ్నిని భరింప జాలక కొండపై నుండి క్రిందికి దూకి ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నిస్తాడు. అపుడు భూదేవి అతనిని పట్టుకొని -

*" ఓ వశిష్ఠ ! సుతులందఱుం దెగిన నయ్యో ! దుఃఖివై యోగతిన్*
*జావం బుట్టువు దీఱునే? మనములో సంసారమున్ రోసినన్*
*దేవోత్తంసుని పార్వతీరమణు భక్తిం గొల్వుమీ చేకుఱున్*
*జీవన్ముక్తి "* (1-69)

అంటుంది. ఆ పిమ్మట వశిష్ఠుడు ఘోర తపస్సు చేస్తాడు. భక్త సులభుడగు పరమశివుడు మునికి ప్రత్యక్షమై ఏదైనా వరాలు కోరుకొమ్మంటాడు. అప్పుడు వశిష్ఠుడు, 'ఆదరంతో నాకిక్కడ ప్రసన్నులైన రీతిగా మీరు శాశ్వతంగా భక్తుల పూజలు స్వీకరించాలని కోరినాడు'

*భక్తవత్సల ! కాలసంభవములగుచు*
*గాలభుక్తంబులయ్యెడి కమలజాది*
*సదవు లే వ్రేల్ల గాలంబు బట్టి మ్రింగ*
*నోపు మీ చిన్మయాకృతి జూపు మీశ !*

*మన్ననతో నాకిచట బ్ర*
*సన్నుడ వైనట్లు ఘోర సంసార గదా*
*పన్నౌషధ ఘుటికా మహి*
*మోన్నతి బూజ గొనుమయ్య యుగముల నెల్లన్*

అందులకు శివు డట్లే అనుగ్రహించాడు.

*చింతాంత స్థలమై, ప్రకాశిత జగచ్చిత క్రియాభోగమై*
*భ్రాంతిప్రాపిత జీవతాపధితమై, పద్మ ప్రసూత్యాదికీ*
*టాంతవ్యాపకమై, మహోవిషయదూరానందమై, సంప్రాతా*
*ద్యంతం బైన రహస్యముం దెలిపి పాశానీకముం గోయుచున్ (1-88)*

*"ఆ క్షణంబ దక్షిణామూర్తియు నంతర్హితుండయ్యె*
*వశిష్ఠుడును నిజప్రతిష్ఠిత దివ్యలింగోపకంఠంబున నకుంఠితా నందంబున*
*నెంతేనియుం దిరుగు చుండె " (1-89)*

ఆ క్షేత్రమే శ్రీ కాళహస్తి పరమేశ్వరుడు యిక్కడ ఉండుట వల్ల పార్వతీ దేవి విమాన మెక్కి ప్రమధులు సేవించుచుండగా అచటికి వచ్చి జ్ఞాన ప్రసూనాంబికగా వెలసింది ఆదిమ దంపతులైన పార్వతీ పరమేశ్వరు లీవిధంగా వశిష్ఠాశ్రమంలో వెలసినారు. ఆ పవిత్ర భూమియే నేటి శ్రీకాళహస్తి ।

మహాకవి ధూర్జటి ఈ కథ చెప్పడంలో గల ప్రధానాశయమేమైవుంటుందని పర్యాలోచించవలసి వుంది.

1) జీవుని యొక్క అజ్ఞానాన్ని పోగొట్టడం అంటే సామాన్యమైన వ్యక్తి కాకుండా వశిష్ఠమహర్షి యంతటి వాడు పుత్రశోకంకల్గడంతో అజ్ఞానివలె ఆత్మహత్యకు పాల్పడడంచేత జీవునిలోని ఈ అజ్ఞానాన్ని ఈశ్వరుడు చిన్మయాకృతి చూపి పాశచ్ఛేదము చేసి సృష్టి రహస్యమును తెలియజేసినాడు. దుఃఖితులైన జీవులు మనశ్శాంతి పొందే మహాక్షేత్రం శ్రీ కాళహస్తి

2) అలా శాశ్వతంగా మన శ్శాంతిని పొందడం తనకే గాక ఆ స్థలాన్ని సందర్శించిన ప్రతి మానవుడికీ కలగాలని మహర్షి వశిష్ఠుడు కోరగా శివుడు దివ్య లింగమై అక్కడ స్థిరపడ్డాడు. అదియే వేదనాదూయమాన జీవులకు తాపోపశమనాన్ని కల్గించే 'శ్రీకాళహస్తి' గా ప్రసిద్ధికెక్కింది. ఈ క్షేత్రం 'అజ్ఞాన ధ్వాంత చండ భాస్కరం' కనుకనే సత్యవ్రత భాస్కర క్షేత్రంగా పేరు పొందింది.

### 4.19.6 బ్రహ్మదేవుని కథ

బ్రహ్మదేవుడొకనాడు కొలువుదీటి యుండగా సరస్వతి అక్కడికి వస్తుంది. ఆమె రూపాన్ని గాంచి బ్రహ్మ కొలువు చాలించి తన ప్రేయసిని సమీపించి 'నీ రూపము చూచిన నాకు తనివి తీరుట లేదు. ఇట్టి రూపాలు నూరు ధరింపు' మని కోరగా ఆమె భర్త కోరిక కాదని లేక నూరు రూపాలను ధరించింది. ఆ ప్రేయసీ శతంతో వాణీశుడు కామాంధుడై దేశకాలాచారముల బాటింపక భోగించినాడు. తత్ఫలతంగా రక్కసులైన నూర్గురు పుత్రులు జన్మిస్తారు. వారు ప్రజలను అనేక రీతుల పీడించుచుండగా భూదేవి బ్రహ్మతో మొరపెట్టుకొంటుంది. అప్పుడు బ్రహ్మకు కల్గిన కోపము వలన ఉగ్రుడను కుమారుడు జన్మిస్తాడు. అతడు తండ్రి కోరికపై తన అన్నలు నూర్వురను వధించి వస్తాడు. ఆ వార్త తెలిసిన బ్రహ్మకు ఉగ్రునిపై ఆగ్రహం కల్గింది. ఆ యాగ్రహం వల్ల ఉగ్రుడు భస్మమై పోతాడు. బ్రహ్మకు కోపం చల్లారగా తనకు పుత్రహత్యా దోషమే కాకుండ, అనపత్యతా దోషం కూడ సంక్రమించిందని ఆ పాప పరిహారార్థం దక్షిణ కైలాసమైన కాళహస్తికి వచ్చి ఘోరతపస్సు చేస్తాడు.

*ఇంతట దేవదేవు, గరుణేక్షణు, దక్షిణ రౌప్య శైల శృం*
*గాంతరవాసు, భక్తజన కామితభూజము, నది కన్యకా*
*కాంతుని గొల్చుకున్న సుత ఘస్మరతాసుతహాసతాఘ దు*
*ర్దాంత పయోధిపాతమున దప్పి . ఇనంబు సుఖంబు నొందమనే*

అంత ఈశ్వరుడు ప్రత్యక్షమై యి కాళహస్తి క్షేత్రాన్ని చూచినంతనే నీ పుత్ర హత్యా దోషం పోయింది. మాఘమాసంలో మఖానక్షత్రంలో ఉషః కాలంలో సువర్ణ ముఖరిలో స్నానం చేసి పంచాక్షరిని జపిస్తూ మహాలింగానికి ప్రదక్షిణలు గావిస్తూ వ్రతం చేస్తే సుపుత్రుడు కల్గుతాడని చెప్పి పరమేశ్వరుడంతర్హితు డౌతాడు. వాణీ హిరణ్యగర్భులా వ్రత మాచరించి ఈశ్వరుని కృపచే బుధుడను కుమారుని పొంది సంతోషిస్తారు. ఈ

రీతిగ బ్రహ్మదేవుడు పుత్రహత్యా దోషాన్ని పోగొట్టుకొనుటయే గాక సుపుత్రుని గూడ శ్రీ కాళహస్తీశ్వరుని కృప వలన పొందినాడు.

*ఉదయించెం బరమార్థరూపమ్ము, మహాయోగీశ్వరోత్తంస, మీ*
*శదయావర్ధిత దివ్యతేజము, సదా శాంతిస్వరూపంబు, దుః*
*ఖద సంసార విదూరమానసమ్ము, లోకం బుత్సవ క్రీడలన్*
*బొదలంగా సుతరత్నమంత జననీ పుణ్య ప్రభావంబునన్*
*పుత్రోదయముగుటయు, శత*
*పుత్రజు డానందలహరి, బరవశు డగుచున్*
*స్తోత్రంబు సేసె ముక్తిక*
*ళత్రుని గౌరీశు నిర్మల ప్రతిపత్తిన్*

*''ఖండపరశువును నఖండ దయామండిత వీక్షణంబుల బ్రత్యక్షంబై కమలజ తనూభవునకు ''ఋభు''వనెడి నామం బొసరింప నను్నగహించి యను్నగహరహితంబును, గలుషారహితంబున్నునైన బ్రహ్మోపదేశంబు సేసి యంతర్హితుండయ్యె''* *(2-88)*

వశిష్ఠునికథతో పోలిస్తే బ్రహ్మకథలోను వంద కొడుకుల సంఖ్య సమానం. వారు మంచివారైనా, చెడ్డవారైనా పుత్ర దుఃఖం ఒక్క విధంగానే ఉంటుంది. చేసిన తప్పు దిద్దబోతూ మరింత దోషాన్ని తెచ్చిపెట్టుకొన్నాడు బ్రహ్మ. గీతలో చెప్పినట్లు అజ్ఞానం నుండి కామం, కామం నుండి క్రోధం క్రోధం వలన సర్వనాశనం అనే వివేకభ్రష్టసంపాతము బ్రహ్మ కథలో తీర్చిదిద్దాడు ధూర్జటి. కామాన్ని జయించి నిగ్రహంతో, తపస్సు తోనే తప్పు సత్సంతానం కల్గదని, దానికి శివానుగ్రహం సంపూర్ణంగా ఉండాలని ఈ కథ ప్రతిపాదిస్తోంది. మరో విధంగా చూస్తే కథలో శివుని వలన సృష్టి కర్తమైన బ్రహ్మకు పుత్రప్రాప్తి కల్గుటచే శివాధిక్యత నిరూపింపబడిందని చెప్పవచ్చు.

### 4.19 7 సాలె పురుగు కథ

అది కృతయుగం నాటి మాట. ఊర్ణనాభుడను బ్రహ్మ కుమారుడు శాపగ్రస్తుడై 'సాలెపురుగు'గా జన్మిస్తాడు. ఆ చెలది పురుగు దక్షిణ కాశి

అయిన కాళహస్తిని చేరి పూర్వవాసనాబలంచేత శివపూజ చేస్తుంది. అంతేగాక శివునికి తన నూలు దారంతో ప్రాకారాలు, సభామంటపాలు, గోపురాలు, కల్యాణమంటపాలు, పరివార దేవాలయాలు మిక్కిలి నిష్ఠతో కట్టింది. దీని నిష్ఠను పరీక్షింపదలచి పరమేశ్వరుడు ఆ గృహములు మొదలైనవి దీప శిఖచే మండిపోయేటట్లు చేశాడు. కష్టపడి తాను కట్టిన భవనములు కాలిపోవుటకు యీ దీప శిఖే కారణమని ఆ దీపశిఖను మ్రింగ బోయింది. భక్త వత్సలుడైన శివుడు దాని భక్తికి మెచ్చి ఏదైన వరం కోరుకొమ్మంటాడు. సాలెది కైవల్య పదం కోరుకొంటుంది. పరమేశ్వరుడు దానికి కైవల్య మొసగి తనలో నిలుపుకొంటాడు

*ప్రాతఃకాల తుషారశీకరచయప్రాప్తిన్ లసన్మౌక్తికో*
*పేతాగారము లట్లు వెల్గొన గ్రాగి తద్బిందుచ్ఛటాజాల శో*
*ద్యోతచ్ఛాయల కొంతసేపు బహురత్నోద్దీర్ణ గేహంబులై*
*లూతా కల్పిత తంతు సద్మములు వొల్పుం జెప్ప శోభితంబులై (2-97)*

*ఇది పెక్కేడులు పట్టిన్*
*సదనంబులు గట్టి నాకు శంభుని కొలుకున్*
*దుది గుమ్మరి కొక యేడును*
*గుదె కొక పెట్టన్న మాటకుప్పరి వచ్చెన్ (2-100)*

*నాకిభవ దుఃఖంబులు*
*లేక, మహాజ్ఞానరసవిలీనుడ నగుచున్*
*లోకం బెన్నడు నెఱు గని*
*యా కైవల్యమె యభీష్ట మని ప్రార్థింపన్ (2-105)*

*దిక్కులు ముంచుకున్న తన తేజము లోపల నూర్ణనాభమున్*
*గ్రక్కున గూర్చి, తన్మయముగా శివలింగము భక్తలోలతన్ (2-107)*

419.8 పాము - ఏనుగుల కథ

*త్రేతాంతంబున నొక్క కాలఫణి, భక్తిన్దివ్య మాణిక్యముల్*
*పాతాళంబున నుండి తెచ్చి, దినముం బాలేందు చూడార్చనల్*

*ప్రాతర్వేళల జేయు, ద్వాపర యుగ ప్రారంభ మైన స్తుగా*
*తీతు వ్వంకరు । గొల్వ వచ్చె నొక హస్తి శ్రేష్ఠముచ్ఛ్రేటకిన్ (2-109)*

త్రేతాయుగం కడపట జరిగిన సంగతి కాళము నాగేంద్రుడు తక్కిన పన్నగ రాజుల వలె మహేశ్వరుని సన్నిధికి రాకుండ తన ప్రియవధూటిని విడిచి వెళ్లలేక పాతాళముననే వుండిపోయింది. దాని యవిధేయతకు, కాముకతకు ముక్కంటి కోపించి నీవు మర్త్యానికి పొమ్ము కైలాసానికి రావలదని శపించాడు. కైలాసదర్శనము, శివసేవయు లేక జీవింప జాలనని కాళము మొఱపెట్టుకొనగా ఈశ్వరుడు అట్లైన నీవు దక్షిణ కైలాసాన నన్ను పూజిస్తూ, ఒక ఏనుగుతో యుద్ధము చేసి మరణించి నన్ను చేరగలవని శాపాంతం చెప్పాడు. ఆ నాగేంద్రము దక్షిణ కైలాసం చేరి భక్తి తాత్పర్యంతో మణులతో శివలింగ పూజ చేస్తుంటుంది.

ఆ పర్వతారణ్యం లోనే ఒక గజరాజు నివసిస్తుంటాడు. ఆ గజం పూర్వ జన్మలో శివుని పరివారంలో 'హస్తి' యను పేరు గల్గిన ప్రమథుడు. అత డొకసారి ఉన్మత్తుడై గౌరీమహేశు లేకాంతమున నున్న చోటికి వస్తాడు. అది చూచి భవాని కోపించి హస్తివై పుట్టుమని శపించింది. అతడు శాపాంత మనుగ్రహింపమని దేవి కాళ్లపైబడగా ఏనుగుగా పుట్టే నీకు ఈశ్వరానుగ్రహం వల్లనే శాపాంత మవుతుందని జగజ్జనని కరుణ చూపిస్తుంది. ఆ రీతిగా ప్రమథుడు గజమై పుట్టి పూర్వ జన్మ వాసనాబలంచే శివపూజచేస్తుంటాడు. సర్పం పూజించిన లింగాన్నే గజరాజు పూజిస్తుంటాడు. కాని సర్పం పూజించిన ఆ మణులను చూచి యిలా శివునితో అంటాడు.

*అచ్చపు నీలవర్ణ దృషదావళి నల్లనికల్లలో? కడుం*
*బచ్చని జాలు బిల్వనవపత్రములో? యరుణాశ్మభంగముల్*
*విచ్చిన యెఱ్ఱదామరలొ? విశ్వపితా! విరసోపలంబు లె*
*ట్లు మృదులయ్యె నీకు? ఎవి యందునె గంధ మృమత్వ శైత్యముల్*
*(2-121)*

*ఉనికి శిలోచ్చయంబు, నిజయోష శిలోచ్చయరాజపుత్రి, నీ*
*ధనువు శిలోచ్చయంబు పురదాహ! రథీకృత రత్నగర్భ! నీ*
*మనమున కీ శిలాశకలమండన మెట్లు ప్రియంబు సేసె? నే*
*మన గలవాడ నిన్ను? వ్రతహాని యొనర్చు దురాత్ముడుండగన్*
*(2-122)*

ఇవి యేటి రాళ్లు? అని తన తొండముతో తోసివైచి మారేడు పత్రి, కలువ పూలు మొదలగు వానిచే శివుని పూజిస్తుంటుంది. కాలం వచ్చి పూలను తొలగించి మణులతో శివపూజ చేస్తుంటుంది. ఈ విధంగా ఒకరికి తెలియకుండా మరొకరు శివపూజ చేస్తుంటారు.

ఒకనాడు పాము కోపించి యెవ్వడీ స్వామి ద్రోహి? అతడెవ్వరో తెలుసుకోవాలని శివలింగం పానవట్టం పై వున్న పత్రిలో దాగి యుంటుంది. యథా ప్రకారం ఏనుగు వచ్చి పత్రి క్రింద పడనందులకు మిక్కిలి సంతోషించి పూజ చేయడానికి తొండము చాచి చాపగానే సర్పం వెంటనే ''ఓహో ! నీవా దొంగా ! ఈ రోజు నా చేతిలో దొరికిపోయావు. అని కరి తుండము రంధ్రంలో దూరి కుంభ స్థలంలో పీట పెట్టుకుని కూర్చుంది. ఏనుగు తన తొండంతో ఎన్నో సార్లు నీళ్లు లాగి పాము క్రిందికి పడి పోవాలని ఊదినా ఆ పాము బెసక లేదు. సరి కదా, ఏనుగును కుంభస్థలంలో వేధించ సాగింది. అప్పుడు గజరాజు యిలా అనుకొంది.

*''ఏనా చచ్చుట తప్పదిప్పుడు, మమాధీశోపకంఠంబునన్*
*దామంజాలక చచ్చెనో పనుచు, దుర్గోద్రద, బెక్కు డీదుఃఖమే*
*లా నాకు? న్హరి చంపిచచ్చుట జనాహ్లాదంబు గాదా ? యనా*
*నీమస్థానమునందె వధ్యశిలగా సేవింతుగా కింతటన్" (2-149)*

*''అని మత్తేభము చిత్తజాహితుని దృష్టి మ్రొక్కి ''యుక్కాళ మే*
*కమునం బోవునా? " యనుచు దుండ మిడియంగా జట్టి, వక్షస్థలం*
*బున నీరించి పిడిందికం బడి శిరంబు న్వంచి యక్కొండ భ*
*గ్గున దాకె న్వడి గుంభము ద్రగుల నత్యుత్కటంబు బ్రాణానిలన్ (2-150)*

*కొండ కొండ తోడ గుదులు గూలంగ*
*దాకినట్లు దోకు దళితకుంభ*
*సీమనున్న పాము విదిసె, నేనుంగును*
*బడియె, నెత్తు రచట బడియ కట్టె (2-151)*

చివరకు తనకు చావు నిశ్చయమనుకొని చనిపోతూ ఈ సర్వాన్ని మ్రాతం తానెందుకు వదలవలెననుకొని ఆకొండను భగ్గున ఢీ కొనింది. వెంటనే ఏనుగు కుంభస్థలంలోని పాము కూడ చితికిపోయి రెండూ ఒకేసారి మరణిస్తాయి. ఏనుగు-పాము స్మరణతో మరణించి శివ సాయుజ్యాన్ని పొందుతాయి.

ఈ విధంగా చెలది పురుగైన 'శ్రీ' యును, సర్పమైన 'కాళము' ను, గజ రాజైన 'హస్తి' యును నిర్యాణము చెందిన దివ్యస్థలం కావడం చేత వాటి నుండి దక్షిణ కైలాసానికి ''శ్రీకాళహస్తి" అనే పేరు ప్రసిద్ధి లోనికి వచ్చింది.

## 4.19.9 కన్నప్ప కథ

*''పొత్తపినా టిలో విపినభూమి గిరాతుల కాటపట్టు, లో*
*కోత్తర వన్యవస్తు 'వుడుమూ ' రను పక్కణ మొప్పు, ధరమో*
*దాత్త మహత్త్వ మద్భుతరసావహమూహ యొయుర్వి మేదినీ*
*భృత్తటనిర్ఝరాంబురుహ బృందమరందసుగంధవాహమై'(3-3)*

ఇది కలియుగంలో జరిగిన కథ. 'ఉడుమూరు' పొత్తపినాడు లోనిది. అది కిరాతులకు ఆటపట్టు. ఆ కిరాతకులంలో తిన్నడు జన్మించినాడు. అతడెవరో కాదు, ద్వాపర యుగంలోని అర్జునుడే ' అతడు ఈశ్వరుని గూర్చి తపస్సు చేయు చున్నప్పుడు తన్ను పరీక్షింప వచ్చిన శివుడే యా కిరాతుడని తెలియక అతనితో యుద్ధం చేసి అతని మెప్పు పొంది పాశుపతాస్త్రం సంపాదించాడు. అప్పుడు అజ్ఞానంతో శివుని తలపై మోదిన దానికి పరిహారంగా ఈ జన్మలో కిరాతుడుగా పుట్టి శివభక్తిని నిరూపించుకొని ముక్తి పొందినాడు. ఈశ్వరాదేశం వల్ల కిరాత నాయకుని కుటుంబంలో పుట్టినాడు. అతని పేరు తిన్నడు. తల్లి తంద్రి తండ్రి నాథనాథుడు. తిన్నడు తల్లి గర్భ మందుండగా కావ్యంలో కవి చేసిన వర్ణన యిట్లున్నది -

*భసితాంగరాగ శోభావిలాసంబులో*
*ప్రతివచ్చు నానన పాండు గరిమ*
*కంఠ హాలాహల కాళిమచ్ఛవి తోడ*
*నెనవచ్చు గుబ్బ చన్మొనల వలుపు*

*వరశివాకృతితోడ వరివచ్చు వను తరం*
*బన బాలి ఘనతరంబైన నడుము*
*స్వస్వరూపవిచార సత్ప్రాప్తకాంతితో*
*మార్పడు జిత్తైధమాన జడిమ*

*సరభసానంగసత్కేళి జరుగనీక*
*దాన్పాదము 'గర్భమునున్న తనయు డీశు*
*డై ప్రకాశింప గలం' డని యపుడు దెలుపు*

తిన్నడు పెరిగి పెద్దవాడై విలువిద్యలో ఆరి తేరినవాడు కాగా, కవి ఆ ఘట్టంలో యిలా వర్ణిస్తున్నాడు.

*కొంచెపు వింటిబద్ద బరి గోలలు గైకొని చాపవిద్య సా*
*ధించు నెడన్ పలంఘున గతిం జను లేడిని నింగి నిచ్చ వ*
*ర్తించు ఖగంబు నేయగని ''తిన్నడు దేవుని పాలు గాక పి*
*ద్దించునె తల్లి దండ్రులకు దృష్టి గుణంబున" న్నదు లుబ్ధకుల్* (3-34)

*విల్లు పట్టిన వెల పదివ్రేళ్లలోన*
*వ్రేక గలిగిన తడ విల్లు, వెదురువిల్లు*
*పెలుసువిల్లును మొదలైన వేగవిండ్లు*
*ములుకగా దీషి, శబరేంద్రసూను డేయు* (3-35)

కిరాతరాజ తనయుని విలు విద్యాభ్యాసం పలువురు ప్రశంసింపగా విని ఉప్పొంగి పోయి కాటేని జాతరకు ఆజ్ఞాపించాడు. ఆ జాతరలో పరిజనములతో వేటకు వెళ్లిన తిన్ననికి వేటలో అలసట వలన కాసేపు కునుకు తీయగా స్వప్నము వచ్చినది. ఆ స్వప్నంలో -

*ఒడలం దెల్ల విభూతి పూ(త, పులితో లొడ్డాణ, మల్లాడు కెం*
*జడ, లాత్మైక విచార నిశ్చల దృగ బ్జాతంబు, లచ్చైన క*
*ప్పడ మంపంబున రుండమాల గళదేశస్థాణువుం (గాల (గా*
*వొడయుం డొక్క రు( డక్కుమారు కలలో నుద్యత్కృపామూర్తియై*
(3-55)

*బాలక! యిచట శిలాపటు*
*మూలంబున గొండ దండ మొగలేటి దరిన్*
*శైల సుతాపతి, భక్తుల*
*పాలిటి పెన్నిధి వసించు, భక్తిం గొలుమీ!*

అని స్వప్నపురుషుడు ప్రబోధించి వెట్లయ్యెను. తిన్నని కంతటితో కనువిప్పు కల్గెను. అతడు ఉద్విగ్నమైన మనస్సుతో స్వామి కోసం వెదికాడు. అతని పుణ్యపరిపాకంచే ఒకచోట దివ్యలింగం కనబడింది. అదిలా ఉన్నది -

*సంతోషంబున గాంచె దిన్నడు, సమస్త వ్యాపకానంత వే*
*దాంత స్థాపిత చిన్మయాంగము, నవిద్యాధ్వాంతసంతాన సం*
*క్రాంత స్వాంత నిశాంత జంతుసుఖమార్గ ప్రాపకాభంగ రు*
*క్కాంతాపాంగము, దివ్యలింగము, వివిక్తధ్యేయ నిర్లింగమున్*

పెన్నిధి దొరికిన పేదవలె ఆశ్చర్యచకితుడై ఆనందబాష్పములు అతిశయిల్లగా, ఆ మహాలింగానికి సాష్టాంగనమస్కారము చేసి చేతులు జోడించి దగ్గరగా పోయి యిట్లంటున్నాడు.

*ఓసామీ! యిటువంటి కొండదరిలో, నొంటిం బులుల్ సింగముల్*
*గాసింబెట్టెడు కాట నట్టడవిలో, గల్పుష్టి క్రీనీడ, నే*
*యూసం గట్టితి వేటగడ్డ నిలు? నీ వా కొన్నచో గూడు నీ*
*ళ్లే సుట్టంబులు దెచ్చిపెట్టెదరు? నీ కిందేటికే లింగమా!*

*(3-65)*

*కొండల గానలం దిరిగి, క్రొవ్విన పందుల లేళ్ల దుప్పులన్*
*జెండిన లెక్కు చందముల జిన్నక పెద్దక గార్మకమ్ము గా*
*వండుదు వట్ల, పిట్టలను వండుదు, రిచ్చట నుండ నేల? నా*
*కొండొక టాన తీక, యుదుమూరికి రా, గదవయ్య! లింగమా!*

*(3-66)*

తిన్నడు స్వామికి తానివ్వ బోయే రకరకాల వస్తువుల పేర్లను ఏకరువు పెడతాడు. నివ్వరి బ్రాలు, ఒడిపిళ్లు, గునుకు బ్రాలు, వెదురుబ్రాలు, సవరపు మెకముల పాలు, పుట్టతేనియ, పెరతేనె, పుట్టజున్ను, తొట్టితేనియ, యుంజెట్లు, అడవిలో దొరికే అన్ని రకాలైన పండ్లు నైవేద్యంగా సమర్పిస్తాను, ఉడుమూరికి రమ్మని ప్రాధేయపడతాడు. ఇంకా యిలా అంటాడు -

*ఇల్లో, ముంగిలియో, యనుంగు జెలులో, యాడైన చుట్టంబులో,*
*యిల్లాలో, కొడుకో, తరింపవశమే, యే పోదుముల్లేక ! మా*
*పల్లెం గోరిన వెల్లనుం గలవు తెప్పల్గా గ నీ కిచ్చెదన్*
*జెల్లం బో ! యిట నొంటి నుండ కటు విచ్చే యంగదే లింగమా !*

*(3-70)*

అందమైన ఎటుకతెలను నీ సేవకు నియోగిస్తాను రమ్మని శివునికి ఆశపెట్టి చూపుతాడు.

శివుడు మారుమాటాడక యుండగా ఈ సామికి యిక్కడనే మనసు కాబోలు ననుకొని తిన్నడును అక్కడనే యుండి స్వామికి సేవలు చేయ సాగాడు. దొప్పలతో కాల్చిన మాంస ఖండాలు, పుక్కిళ్లి నీటితో అభిషేకము చేసే తిన్నని మూఢభక్తికి సంతోషించి భక్తవశంవదుడగు శివుడు దానిని స్వీకరించ సాగాడు.

అదే లింగమునకు శివద్విజుడు ఒకడు పూర్వం నుండి పూజ చేస్తూ వస్తున్నాడు. ఆయన శివలింగము దగ్గర పడివున్న మాంసపు దొప్పలు చూచి ఈ యెటుక వాని ప్రభావం తెలియని ఆ శివద్విజుడు మనసులో ఏవగించుకొని, ఆ దేవసన్నిధిని బాగుచేసి తిరిగి పవిత్రంగా పూజచేసి పోయినాడు. ప్రతిరోజు యిట్లే జరగడం, అతడు ఈశ్వరునితో యిదేమి కసుమాలమని మొఱపెట్టినాడు. ఈశ్వరుడాతనికి తిన్నని అకుంఠితభక్తి భావాన్ని ప్రదర్శింప జేయడాని కొక యుక్తి పన్నాడు. తిన్నడు వచ్చేటప్పటికే ఆరోజు ముక్కంటి ఒక కన్నునుండి నెత్తురుకారసాగింది. అది చూచి తహ తహపడి తిన్నడు తన సామి కంటి జబ్బు మాన్పడానికి పడ రానిపాట్లు పడ్డాడు. ఆ సందర్భంలో ధూర్జటి వ్రాసిన సీసపద్యం యిలా వుంది.

కోకపొట్లంబావి గొన నూఁది యొత్తుమ
గషణోష్ణకరభ భాగమున గాచి
నెత్తి తంగేడాకు మెత్తి, రేవకి నిమ్మ
పంటి నీరున నూఱి పట్టు వెట్టి
తెల్ల దింటెన పువ్వు దెచ్చి తదసమిడి
కలివె పువ్వులు గోసి నలఁచి పిడిచి
పేరిన నెయి వెట్టి, పెరుగుం వత్తులు వైచి
చను బాలతో రాచి, సంకు చమిరి

విన్న మందులు, తా సరి కన్నమందు
లడిగి తెచ్చిన మందులు, నడవి మందు
లెన్ని చేసిన మానక, యిందుమౌళి
కన్ను తొఱఁ బడి నెత్తురు గాఱుటయును

మాటి మాటికి జేసిన మందులెల్ల
జెల్లఁబో! వెల్లిఁ గలిపిన చింతపండు
నీట వ్రాసిన వ్రాలుష్షై నెఱయ వఱద
బోవుఁ, గాకేమి, నెత్తురు పుట్టనేల ? (3- 110, 111)

ఎన్ని విధాలైన వైద్యాలు చేసినా బూడిదలో పోసిన పన్నీరయ్యింది. కంటికి కన్నే మందని తుదకాతనికి తోచింది. 'నా సామి కంటినా'! యని అమ్ముటంచుతో చివుక్కున బొడుచుకొని ఆ అమాయక భక్తుడు శివుని కంట బెట్టాడు. ఈ ఘట్టాన్ని ధూర్జటి మాటల్లోనే చదవాలి

వేఁకి వెప్ప యైన వెప్పటి మందుల
గాదె మాను, నట్లు గంటి కింక
గంటి కంటె మందు గలదె ముక్కంటికి ?
గంటి" ననుచు, బోయ గదియ బోయి
ప్రాణము వోవునో, తనువు భంగము నొందునో నాక, తలఁగకా

*బాణము జిఱ్ఱునం దిగిచి, భల్ల ముఖాగ్రము రక్త పద్మ దృ*
*క్కోణము జేర్చి గ్రుచ్చి, యొక గ్రుడ్డు వడిం బెకలించి, శోణిత*
*ద్రోణిక యైన దైవత శిరోమణి కంట నమర్చె నంతటన్*

*(3-114 , 115)*

ఆ కంటి జబ్బు నయమయింది. కాని, రెండవ కంట ధార పాడమసాగింది. అయ్యో నా దేవరా ! యని తిన్నడు వెంటనె తన రెండవ కంటి గ్రుడ్డు పెకలించుకొనబోగా 'నిలు' మని శివుడు ప్రత్యక్షమయ్యాడు. ఇక్కడ ధూర్జటి వ్రాసిన రెండు పద్యాలు తిన్నని వీరమాహేశ్వరాచార వ్రతాన్ని తెలుపుతున్నాయి.

*మున్నిటి కంటి కంటె గడు మోహనమై తన కన్ను వచ్చిన*
*న్నన్నన జూచి మెచ్చక, యుమాపతి రెండవ కంట శోణిత*
*క్లిన్నత జూపిన, న్నగి పుళిందుడు ''నీ కృప చేత గన్న మం*
*దున్నది దీనికి న్వెఱచు నొక్కటి నా వ్రత మింక శంకరా ' "* *(3-116)*

*లాలాటలోచనంబున*
*కీలాలము దొరఁగ నేని, కేవలభక్తిన్*
*గీలించి, మనోదృష్టికి*
*మూలంబగు నాదు ప్రాణములు నీ కిత్తున్*
*అని చెప్పఁ గాల నిటలా*
*క్షుని కన్గొనఁ దన్ని పట్టి, సునిశిత బాణం*
*బునఁ దన రెండవ కన్నుగ్రు*
*డ్డును బెకలింపఁగ బూనుడును సదయుండై*

*(3-117, 118)*

ఇలా కన్ను తీయడానికుద్యుక్తుడైన కన్నప్ప తీవ్రత్వం కంటె ముందుగా శివుడు, కన్నప్ప చేతి బాణాన్ని చటుక్కున లాగి వేసి 'నిలువవయ్యా ! కన్నప్పా ! నీ వీర మాహేశ్వరాచార వ్రతం నాకు తెలిసింది లే అని ప్రత్యక్ష

మయ్యాడు'. శివద్విజుడు ఆ భక్తవరేణ్యుని భక్తికి ఆశ్చర్య చకితుడైనాడు కన్ను లర్పించిన భక్తుడు తిన్నడు కన్నప్ప అయ్యాడు. శివాజ్ఞతోంతో కన్నప్ప , శివద్విజుడు యిద్దరూ ముక్తి పొందారు.

4.19.10 నత్కీరుని కథ

*శ్రీ కంఠ ! కంఠభూషిత*
*కాకోదరవర ! వరాక ఖండమత వ్యా*
*ఖ్యాకోలాహలదూర ! చి*
*దాకృతి ! జితకాల ! కాళహస్తీశ ! శివా !*

ఇది కలియుగంలో జరిగిన కథయే. మధురాపురాన్ని పరిపాలించే పాండ్యరాజు ఆస్థానకవి నత్కీరుడు. పాండ్యరాజు పండితపోషకుడు. అతని కొలువులో అగస్త్య దత్తమైన శంఖ ఫలక ముండెడిది. అది 'సంగప్పలకై' అనబడే పీఠం. కవులు దాని నధిష్ఠించేవారు. ఆ స్థానంలో ఎందరో కవులు పండితులు ఉండేవారు. నత్కీరుడు వారిలో మేటి.

ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యంలో నత్కీరుని కథా ప్రారంభ పద్యం యిది

*శ్రీధర నయనాబ్జ సమా*
*రాధిత దివ్యాంఘ్రి శోణరాజీవ ! మనో*
*బాధాపహ సంసార*
*వ్యాధి వ్రజ వైద్య ! కాళహస్తీశ ! శివా ! (3 -1)*

విష్ణువు నేత్ర పద్మములచే పూజింప బడిన పాదము గలవాడు శివుడు. సంసారము మనోబాధలను కల్గిస్తుంది. సంసార సంబంధమైన వ్యాధుల సమూహానికి వైద్యుడు పరమ శివుడు.

పై రెండు సంబోధనలు ఈ ఆశ్వాసంలోని రెండు కథల్ని సూచిస్తున్నాయి. మొదటిది తిన్నని కథ. రెండవది నత్కీరుని కథ సూచిస్తుంది. నత్కీరుడు వృథాకవితాభిమానంతో ఋషుల శాపానికి

ఎరయైనవాడు. కావున కుష్ఠువ్యాధిని బొందినాడు చివరకు సదాశివునను(గహానికి పాత్రుడై -

*ఈ సంసారము దుఃఖా*
*వాసానందంబు దీని వర్తింపంగా*
*నే సుఖముగల్గు దయు న*
*న్నా సుఖమున గూర్పవే కృతార్థుడనగుదున్ (3-221)*

ఈ పద్యమందలి భావమే తృతీయాశ్వాసం లోని పై రెండవ సంబోధన సూచిస్తుంది. దీన్ని బట్టి ధూర్జటి శిల్పవేత్త యని చెప్పవచ్చు.

ఇట్లుండగా, పాండ్యరాజు కొలువులో కవిత చెప్పి మెప్పించిన కవులకు రాజు వేయిమాడలిచ్చి గౌరవించెడివాడట! ఒకసారి ఆ దేశంలో భయంకరమైన క్షామం ఏర్పడింది. ప్రజలు తిండి లేక గిజగిజలాడారు. ఒక పేద బ్రాహ్మణుని పరిస్థితి చూసి పరమేశ్వరుడు జాలిపడి ఒక పద్యం వ్రాసి యిచ్చి 'దీనిని పాండ్యరాజు సభలో చదివితే నీ దారిద్ర్యం తీరుతుందని' చెప్పినాడు. ఆ బ్రాహ్మణుడు చాల సంతోషంతో పాండ్యరాజు ఆ స్థానానికి వెళ్లి ఆ పద్యాన్ని చదివినాడు. దాని భావమిది- 'సింధుర రాజగమనా ధమ్మిల్ల బంధంబు సహజ గంధంబు' అప్పుడా సభ లోని మేటికవి నత్కీరుడిలా దాన్ని ఆక్షేపించినాడు.

*దానికి నవ్వుచు నృపసభ*
*లో నత్కీరుండు పలికె ''లోకము నగదే !*
*పూనుకొని సహజగంధము*
*మేలికిం గలదటన్న వేయు దెఱగులన్'' (3-158)*

*''తప్పేది చెప్పరాదు కవితాసమయంబున కొప్పుగాదు, నీ*
*వ్వుగిదిన్ రచింప దగునే? ''యన శివుడు చిన్నబోయి, ''నా*
*కప్పురమేశ్వరుండు వసుధాధిపు పై రచియించి యిచ్చినా,*
*డొప్పున దప్పు నేలొగ నుత్తము లార !''' యటంచు గ్రమ్మఱన్*

**అంతనా బ్రాహ్మణుడు వెనుదిరిగి ఈశ్వరుని దగ్గరకు వెళ్లి, ఈశ్వరా!**

నిన్ను నమ్మి నవ్వుల పాలైతిని. నా ఖర్మ ఇట్లుండగా నిన్ను ఆ నక్కీరుని అని ఏ ప్రయోజనం ? అంటాడు. ఈ ఘట్టంలో ధూర్జటి చెప్పిన తీరు ప్రశంసాపహంగా ఉంది. అందు లోకనీతి నిక్షిప్తమైనది.

కం ॥ తానెఱిగిన విద్య ప్రపా
స్థానములో నెఱప కీర్తి సమకూరుంగా
కే నరునకు, పరవిద్యా
ధీనత భూపాల సభల తేజము గలదే !

కం ॥ నీ మాట నమ్మి పోయిన
నా మోసము చెప్పనేల ? నక్కీరునిచే
నా మాటపడ్డ దుఃఖము
క్షామవ్యధ కొలది గాదు సద్భక్త నిధీ !

(3 - 162, 163)

నేనెక్కడికైన వెళ్ళి భిక్షమడిగికొని పొట్ట పోసుకొంటాను. శివా ! నీకు భద్రమగు గాక ! నాకు వెళ్ళడానికి అనుమతి నిమ్ము" అంటాడు. దానితో శివునికి ఎక్కడ లేని కోపం వచ్చి వెంటనె పాండ్యరాజ సభకు వచ్చి -

'ఈ రాజన్యుని మీద నే గవిత సాహిత్య స్ఫురన్మాధురీ
చాటు ప్రౌఢిమ చెప్పి పంప, విని మాత్సర్యంబు పాటించి న
క్కీరుం డూరక తప్పువట్టెనట ! యే దీ లక్షణంబో, యలం
కారంబో, పదబంధమో, రసమో ? యెక్కం జెప్పరా తప్పును"

దానికి నక్కీరుడు వెంటనే లేచి, "గంతనయా ఘన కచభారంబు సహజగంధంబను" మాట తప్పు అన్నాడు.

కం ॥ అగజకునైనం దనకు, నల
మగువలకుం దగదు, మాను మత్సరమింకన్
గగన ప్రసూనవాదము
జగతిం బ్రత్యక్షమునకు సరి యగునె ? దగునే !

ఈ సహజగంధత్వ మన్నది పార్వతీదేవి విషయంలో సరియైనదే కావచ్చును. కాని మర్త్యలోకపు దృష్టిలో చెల్లదు. ఎందుకనగా కవిత్వము ఈ లోకములోని వారి కోసం వ్రాస్తూ అనుభవానికి దూరమైన అతి లోక విషయాలు చెప్పి పాఠకులను మోసం చేయకూడదు. అని నత్కీరుడంటాడు. దానికి శివుడు 'అది తాను వ్రాసింది కాబట్టి అలాగే అంగీకరించాలి' అంటాడు. 'అది నీ అనుభవం లోని విషయం. ఒక కవిగా నీవు ఈ లోకంలోని వారి కోసం వ్రాసిన కవిత్వంలో నీ స్వీయానుభవాన్ని జోడించడం తప్ప అని నత్కీరుడు. సహృదయునికి సమానానుభవం కల్గించేదే నిజమైన కవిత్వం. తాను వేరుగా, కవి వేరుగా సహృదయుడెప్పుడూ భావించడు. కవితో తనకు గల సమానానుభవాన్ని జోడించి సహృదయుడు రసానుభూతిని పొందుచుండగా అనుభవానికి దూరమైన విషయం చెప్పి అది నేను వ్రాసిన కవిత్వం కాబట్టి శివుడుగా ఆజ్ఞాపిస్తున్నాను. అందరూ శిరసావహించండి అనడం సాహిత్య రసానుభూతికి విరుద్ధం అని నత్కీరునివాదం. ఇక్కడ నత్కీరుని వాదమే సరియైనది. కాని శివుడు తన ఆధిక్యాన్ని నిరూపించుకోవడానికి దైవ దూషణ చేసిన నత్కీరుని శిక్షించే శక్తి గలవాడు కాబట్టి వెంటనే శపించాడు. కాని నత్కీరుడు శివుని వాదాన్ని చివరిదాకా అంగీకరించనే లేదు. శివునికి తన వాదంలోని బలహీనత తెలుసు. ఇక్కడ వాదబలం కంటే వాదిబలం ఎక్కువగా వుంది. పైగా శివుడు తన ఆధిక్యతను, శాపానుగ్రహ శక్తి యుక్తుడు కాబట్టి నత్కీరుని లోని సాహిత్యాహంకారాన్ని చక్కదిద్ది వినీతుడైన భక్తునిగా చేయదలిచాడు. దానితో నీలగ్రీవుడు నిటల నేత్రం చూపాడు. అప్పుడు నత్కీరుడంటాడు -

*"తలచుట్టువాఱ గన్నులు*
*గలిగిన బద్ధంబు, దప్పు గాదన వశమే ?*
*వలదిప్పుడు నీ మాయా*
*విలసనములు నవికి రావు విడువు" మటన్నన్ (3-171)*

ఈ అధిక్షేపణతో గింజుకొన్న శివునికి కోపం మిన్ను ముట్టి నత్కీరునిలా శపించాడు

కం॥ శపియించెం బ్రతిభాషల
గుపితుండై రుద్రు డతని ''గుష్ఠవ్యాధిం
దపియింపు" మనుచు దానికి
నపరిమిత భయమ్మునంది, యతఁ డిట్లనియెన్

''స్వామీ! ద్రోహము జేసితిం, దెలుపవే శాపాంత ముద్యత్కృపా
ధామా! నా" కనుచుం బదాబ్జముల మీదం బడ్డ, నా భక్తరక్షా
మందారుడు శాంతిం బొంది, యనియెం ''గైలాస శైలంబు గం
టే మానుం, బద" మన్న, నందులకు దా డెందంబునం గుందుచున్

''కైలాసపర్వతాన్ని చూస్తే నీకు వచ్చిన కుష్ఠ వ్యాధి పోతుంది అంతవరకు ఈ మహావ్యాధితో తపించు పొమ్మన్నాడు" శివుడు అది నత్కీరుని విషయంలో అన్యాయమే కాని లోకంలో దేని మీదా పృథాభిమానం, అహంకారం కూడదు పట్టు విడుపులుండాలి ఎంతో నత్కీరునిస్వభావం లోని పట్టుదల యే కారణం అహంకారం ఏ రూపంలోనైనా ఉండవచ్చు ఆభిజాత్యాహంకారం, రూప-యౌవనాహంకారం, ధనాహంకారం, విద్యాగతమైన అహంకారం నత్కీరుడు విద్యాగతమైన కవితాహంకారాన్ని శివుని ముందే ప్రదర్శించాడు అదే అతడు చేసిన తప్పు శివుని కవిత్వంలో లోకరీతికి, నీతికి విరుద్ధమైన అంశం ఉంది అది తప్పే కాని, తానెవరితో వాదిస్తున్నాడన్న సంగతి మరచి దైవాన్నే వెక్కిరించడం వల్ల కవితాహంకారం వెఱ్ఱితలలు వేసి శాపానికి గురియయ్యాడు

నత్కీరుని ముఖతః దీనినే యిలా చెప్పించాడు ధూర్జటి -

ఈ కవితాభిమానము వహించితి నేటికి? శంఖ పీఠి పై
నీ కవులున్నయట్లు వసియింపక దేవుని తోడ నేల వా
ర్వాక మొనర్చితిం? గడు భరం బగు కుష్ఠరుజావిషాదమే
నే కరణిం ధరింతు ? నిక నెన్నడు చూచెద వెండిగుబ్బలిన్
(3-174)

"......... ........... 'సదాశివ ! యేమిసేయుదునో
"కరుణాసాగర ! భక్తవత్సల ! శివా ! గౌరీశ !యెట్లోగదే?"

అన్న సంబోధనలచేత నత్కీరునిలోని అహంకారమంతా మటుమాయమై సాత్త్వికమైన తేటదనము, ప్రశాంత చిత్తవృత్తి పైకుబికిందని తెలుస్తోంది. అంతకు ముందు ఉద్విగ్నమైన చిత్త వృత్తి గలవాడు నత్కీరుడు. ఇప్పుడు తద్విరుద్ధమైన ప్రశాంతత అతనిలో చోటు చేసికొంది. దీనికి కారణం శివుడు. శివానుగ్రహం వల్లనే నత్కీరుని ప్రవృత్తిలో మార్పు వచ్చి అది భగవన్ముఖమైనదిగా మలచబడి, ఈ సాంసారిక ప్రవృత్తికి దూరమైన నివృత్తి నుండి నత్కీరునిలో దైవసంబంధమైన 'తిరుమురుగాటుప్పడై' వంటి స్తోత్రజాలం భక్తలోకానికి లభించింది శివుడే అతణ్ణి శపించక పోతే నత్కీరుడీ రచన చేసేవాడేకాదు. నత్కీరుని అహంకారం తొలగించి అతనిని భక్త కవిగా శివుడు తీర్చిదిద్దినాడని, శివానుగ్రహమింత విచిత్రంగా ఉంటుందని ధూర్జటి కథాంతర్గతంగా తత్త్వాన్ని నిక్షేపించినాడు

ఇలా అనేకానేక తీర్థాలను, క్షేత్రాలను సేవిస్తూ నత్కీరుడు కైలాసానికి చేరడానికి నానా ప్రయాసపడుచున్నాడు. గోరుచుట్టు పై రోకటి పోటన్నట్లు, అసలే కుష్ఠవ్యాధి పీడితుడు, మార్గాయాసంచే డస్సిన వాడు, మనోవేదనచే నిస్పృహుడైన వానిని ఒక భూతం పట్టుకొంది

*కం ॥ పట్టికొని తనదు గుహకుం*
*బెట్టిదముగ దెచ్చి, మునుపు పెట్టిన మనుజుల్*
*దట్టి బడిన పులుగుల గతి*
*నిట్టట్టుపడంగ ముని వి, యెంతయు వేడ్కన్*

అక్కడ పూర్వమే బందీకృతులైనవారు నత్కీరునితో, "నీతో నూటొకండి మైనాము, మనకు నూరేళ్లు నిండాయి. ఇక రక్కసుడు తినడమే తరువాయి" అన్నారు. నత్కీరుడు ఆపంత్తైన చలింపక, తారకాసురుణ్ణి సంహరించిన దేవసేనాపతి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని సంస్మరించాడు అంతే, స్వామి వారా భూతాన్ని చంపి, వారందరిని గుహ నుండి విముక్తులను

గావించాడు. ఆ సందర్భంలో నక్కీరుడు చేసిన సుబ్రహ్మణ్య స్వామి స్తోత్రమే తమిళ భాషలో "తిరుమురుగ్గాటుప్పడై" అనే పేరుతో ప్రసిద్ధి కెక్కినది.

అప్పుడు సుబ్రహ్మణ్యుడు నక్కీరునితో ఈ దురవస్థ ఎట్లు తటస్థించినదని ప్రశ్నింపగా -

*ఏనొక తప్పు జేసిన మహేశు,డు నన్ను శపించె గుష్ఠరో*
*గానుపమవ్యథం బడు మటంచును, దానికి శాపమోక్ష మి*
*ట్లానతిచ్చె, 'నాత్మ నిలయం బగు రౌప్యనగంబు జూచినన్*
*మాను' నటంచు, నక్కుధరమార్గము దుర్గమ మేమి సేయుదున్*

*ఏలా ఘన దర్శింతుం*
*గైలాసం బెపుడు గాని కనన్ జేటో*
*త్కోటిల్లె రోగజలనిధి*
*వేల!" యనుచు విన్నవింప విని గుహుం,డు వినయన్*

*(3-212)*

అప్పుడు సుబ్రహ్మణ్య స్వామి నక్కీరుని పై దయతో మార్గాంతరాన్ని యిలా చమత్కారంగా సూచించి, తండ్రి మాటను తేలికగా నవరించాడు

*కైలాసం బెగాని యుత్తరదిశా కైలాసమం చాడడా*
*కాళ్లగిర్వు, పితండు దక్షిణదిశా కైలాసముం జూచినన్*
*జాలుం, గుష్ఠము, మాను"నంచు మదిలో చర్చించి, యాపర్వతం*
*బాలోకింపగ నాశనంబగు నుపాయం బాత్మ జింతించుమన్*

*(3 - 213)*

'ఆడబోయిన తీర్థమెదురైంద'ని నక్కీరుడు సంతోషించి, దక్షిణ కైలాస పర్వతాన్ని వీక్షించి, సువర్ణముఖిలో అత్యంత నిష్ఠతో స్నానం చేయగానే కుష్ఠ వ్యాధి పోయినది.

కుష్ఠవ్యాధియు మాన్చె హేమముఖరీ కూలస్థ కైలాసమున్
నిష్ఠాధీన మనస్కుడై కదిసి, తన్నీరాఢ్య కల్లోల భూ
యిష్ఠౌఘంబున దీర్థమాడి, గిరిజాధీశున్ శివు న్దేవతా
శ్రేష్ఠున్, సంస్తుతి మూఁడు పద్యముల జేసెన్ ద్రావిడోక్తిం దగన్

కం ॥ ఆమూఁడు పద్యములకున్
సేనానీజనకు డార్తచింతామణి, వి
ద్యానిధి, జ్ఞానప్రసవాం
బానాధుఁడు, కాళహస్తిపతి ప్రీతుండై [1]

నక్కీరుడిలా సుబ్రహ్మణ్యుని, శివుని ద్రావిడ భాషలో స్తుతించిన పద్యాలు నేటికీ నిలిచివున్నాయి. ఆయన కవితా కీర్తి, మూర్తిమత్త్వం, వ్యక్తిత్వం మాత్రం సాహితీలోకంలో చిరస్మరణీయంగా ఉంటాయి. అందుకే శివుడంతటివాడే చివరికి, తన వాదంలో గెలిచిన నక్కీరుని ''సాహిత్య శ్రీవర !'' అని సంబోధించినాడు. ఇది నక్కీరునికి శివుడిచ్చిన బిరుదు.

ప్రత్యక్షంబగుమన్ ''భవద్భవము సాఫల్యంబునుం బొందె, సా
హిత్య శ్రీవర ! నీకు నింపగు వరం బే నిచ్చెదన్ వేడు, భీ
తి త్యాగం బొనరించినాఁడ" వన, నక్కీరుం డుమాజానికిన్
బ్రత్యగ్జ్యోతికి మ్రొక్కి మ్రొక్కి ప్రమద ప్రాయాంతరంగంబుతోన్

భీతి త్యాగ మనగా నేమి? సర్వ జీవులకు ఆహార నిద్రాభయమైథునములు సహజ లక్షణాలు. ఆహార, నిద్రా, మైథునాలనైనా త్యాగం చేయవచ్చునేమోగాని జీవగతమైన భయాన్ని ఎవ్వరూ దాటిపోలేరు. ఈ భయం సాంఘిక మర్యాదోల్లంఘనం, జీవగతమైన మరణభయం అని రెండు విధాలుగా ఉంటుంది. నక్కీరుడు తన ఎదుట వాదించేవాడు శివుడని తెలిసినా సాంఘిక భయాన్ని దాటి, మరణ భయాన్ని కూడా లక్ష్యం చేయకుండా తన వాదాన్ని మరల మరల నొక్కి చెప్పడం వలన

1 తైరో ప్పాధి, కాలత్తి పాది, అంతాది అని తమిళంలో ఆ స్తోత్రాలకు పేర్లు.

శివుడు ''భీతి త్యాగం చేసి దొవరించిన వాడ" వని, ఉత్కృష్టసాహితీ ప్రపంచంలో శ్రేష్ఠుడవని కీర్తించినాడు. తాను నమ్మిన సత్యాన్ని నిర్భయంగా చెప్పగల్గడం కూడా కవులలో ఒక విశిష్ట గుణమని శివుడే అంగీకరించినాడు. అందుకే నత్కీరుని శపించినా చివరికి అతనిని మెచ్చుకొన్నాడు. ఇలా, కవితా సంప్రదాయ పరిరక్షణలో శాపభీతి, మరణభీతి లేనివాడు నత్కీరుడని ధూర్జటి మహాకవి నిరూపించాడు.

నత్కీరుడు చరమదశలో అహంకారాన్ని కూడా త్యాగం చేసి ఆత్మ తత్త్వాన్వేషణలో ఉన్నాడు. అటువంటి పరిపక్వమైన మహా స్థితిలోనే పై రెండు స్తోత్రాలు చెప్పాడు. ఇక తనకు కావలసిందేమీ లేదు. భగవంతుడు తనంతట తానే ప్రత్యక్షమై శారీరక రుగ్మతను తొలగించి యింకేం వరం కావాలో కోరుకోమంటున్నాడు. ఆ స్థితిలో తానింక కోరదగినది ఒక్కటే ! శివసాయుజ్యం ! సరిగ్గా దానినే కోరాడు నత్కీరుడు -

*ఈసంసారము దుఃఖా*
*వాసా నందంబు చీని వర్జింపంగా*
*నేసుఖము గలుగు దయ ని*
*న్నా సుఖమున గూర్పవే ! కృతార్థుడనగుదున్*

*అని ప్రార్థింపగ భక్త కల్పక, మవిద్యా సూత్రదాత్రంబు, జీ*
*వన ఖేదాంబర కర్తరీ ముఖము, కైవల్యార్థ దానామృ లా*
*లస రత్నంబు, తుషార శైల తనయా జాంపత్య సంపన్న సా*
*వన గార్హస్థ్యము, కాళహస్తిపుర దైవం బిచ్చె సాయుజ్యమున్*

*(3-221, 222)*

ఇలా నత్కీరుడు చివరికి శివానుగ్రహాన్ని సంపాదించి శివసాయుజ్యం పొందాడు. ధూర్జటి ఈ కథమూలాపి భవబంధాలను ఛేదించుకొని సాహితీలోకంలో సుప్రతిష్ఠుడయ్యాడు. ఒక్క మాటలో చెప్పాలంటే, శ్రీ

*1 నత్కీరుని కథలోని ఈ శిల్పరహస్య వ్యాఖ్యాన మంతా డా॥ ముదివేడు ప్రభాకరరావు గారు చెప్పగా వ్రాసుకొన్నాము. వారికి నేనెంతో కృతజ్ఞుడను.*

కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలో 'మాలదాసరికథ' ఎంత ఉత్కృష్టమైన శిల్ప లక్షణ సమన్వితమైనదో, ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యంలో 'వేశ్యాకుమార్తెల కథ' అంతటి లోతైన అర్థసంపద గల్గినది.

## 4.19.11 వేశ్యా కుమార్తెల కథ

ఇది కూడ మధురలో జరిగిన కథ. మధురాపురిలో మాణిక్యవల్లి అనే వేశ్య వుండేది. ఆమె కిద్దరు కుమార్తెలు. వారు పుట్టుకతోనే శివభక్తు రాండ్రు. వారి ఆటలు, పాటలు అన్నీ శివలీలలే. వారి బొమ్మరిండ్లు శివాలయాలు. వారి బొమ్మలు శివమూర్తులు. ఇతర కన్యలందరు రతీ మన్మథుల నోములు నోచగా, తాము పార్వతీ పరమేశ్వరుల పూజచేసి లోకంలో సామాన్యంగా పాడే పెండ్లి పాటల్ని పార్వతీ పరమేశ్వరుల స్తోత్రంగా పాడసాగారు.

సీ॥ *శివ పూజనాసక్తి శిష్ని చన్నుల పెక్కు*
*నయము బ్రత్యహంబును నయము జూప*
*శైవాగమాంతరజ్ఞానంబు దమలతా*
*ప్రభయు నంతంతకు నభినవముగ*
*బార్వతీ ప్రాణేశభక్తియు గూకట్లు*
*వెలసి నానాటికి వృద్ధి బొంద*
*నారకులాచార నాసనా బాల్యంబు*
*లొక పూట కొక పూట కుడిగిపోవ*
*శాంభవం బైన తేజంబు శైవాస*
*గమ వయో గణ్యలావణ్యగౌరవంబు*
*హృదయమున నంగకంబుల నుదయ మొదవ*
*జదువ బోవుదు రిరువురు సుదతులును*

''ఆ సమయంబున నియమంబున శ్రీ కాళహస్తీశ్వరునకు సవితా
చమత్కారంబు మీఱ నక్కీరుండు చెప్పిన మూఱు పద్యంబులు
పారంబు చేసి, నిత్యవ్రతంబుగా పఠించుచు గడప కమల సుముఖంబులు
శంభుడే తమకు పరమపురుషుండని యుండ..."

(4-23, 24)

శివపూజ యందాసక్తి వయసుకు తగ్గట్లు పెరుగుతూ తమకు శ్రీ కాళహస్తీశ్వరుడే భర్తయనిభావించిరి. వారి తల్లి వారి ధర్మాన్ని బోధించినను వారు వినక యెల్లప్పుడు ఈశ్వరుని యందే తమ ధ్యానాన్ని నిల్పారు. తల్లితో శ్రీ కాళహస్తీశ్వరుని గొప్పతనాన్ని గూర్చి వారిలా చెప్పారు.

శ్రీ కాళహస్తి పతి పద
కోకనదారాధనంబె కులధర్మము త
ల్లోల వ్యాపక చిద్వి
ద్యాకార స్మృతియె కాయింపి మదంబా ! (4-37)

మణిమంత్రౌషధశక్తిచే విటుల బ్రేమ్యగస్థలం జేసి త
స్మణి భూషాదులు పుచ్చుకో గొలుపదిమ్మా ! బుద్ధి, ఝదాక్షమే
మణి, పంచాక్షరి మంత్ర, మౌషధము భస్మంబ, చాత్మనాథుండు ద
క్షోన్మత్తైలాస విభుండు బ్రోచు మముక్ శ్రీ వాడ మింకేటికిన్ (4-38)

వారు పదే పదే శ్రీ కాళహస్తి ఎప్పుడెప్పుడు పోదాము అక్కడికి మనలను చేర్పగల పుణ్యాత్ము లెవరని అనుకోవడం, కొందరు దొంగలువచ్చి శివభక్తులవలె నటించి, వారు తీర్థయాత్రకై శ్రీ కాళహస్తి వెళ్లుచున్నట్లు నమ్మించి ఆ బాలికలను తమతో తీసికొని పోతారు. మార్గమధ్యంలో వారిని చంపి ఆభరణాలు తీసికొని పోవాలని ప్రయత్నిస్తారు. అప్పుడు జంగములు చాలమంది అక్కడకు రాగా దొంగలు పారిపోతారు. జంగములు వీరిని కాళహస్తికి చేర్చి మాయమౌతారు. అప్పుడే బాలికలు అది పరమ శివుని లీల యని తెలుసుకొని శ్రీ కాళహస్తీశుని మిక్కిలి భక్తి శ్రద్ధలతో

పూజించారు. వారి అపార భక్తికి పరమేశ్వరుడు మెచ్చి జ్ఞానప్రసూనాంబికాసహితుడై తేజోమహితమైన తన మూర్తితో ప్రత్యక్షమై వారికి సాయుజ్యాన్ని అనుగ్రహించాడు.

*క॥ జ్ఞానప్రసూనకలికయు*
*దానును గన్యకల జన్మదైన్యంబుడుపన్*
*బూని యొక దేహమై యెదు*
*రై నిల్చె శివుండు భాగ్య మది పో! తలపన్*

*(4-127)*

ఈ కథ వ్రాయడంలో ధూర్జటి ప్రధానోద్దేశం భక్తికి అనర్హులైన వారెవరూ లేరని, కేవలం నిష్ఠా గరిష్ఠులకే భగవంతుడు అనుగ్రహిస్తాడనుకోవడం భ్రమ యనీ, భక్తిపరులైన వారకాంతలకు సైతం శివానుగ్రహించే సాయుజ్యం లభించిందని నిరూపించినాడు.

## 4.20 ధూర్జటి మహాకవి - మాధురీ మహిమ

మహాకవి ధూర్జటి కవిత్వం ``సాహిత్య స్ఫురన్మాధురీ చారు ప్రౌఢిమ"కలది, కావుననే శ్రీకృష్ణదేవరాయలు ``స్తుతమతి యైన యాంధ్ర కవి ధూర్జటి పల్కుల కేల కల్గె నీ యతులిత మాధురీ మహిమ" అని ఆశ్చర్యం వ్యక్తం చేశాడు. నత్కీరుని, శివుడు `సాహిత్య శ్రీవర!' అని సంబోధించిన మాట ధూర్జటికిని వర్తిస్తుంది.

'ధూర్జటి కవిత్వము మధురసుకుమార' మనుచు ఆయన కవితా వ్యక్తిత్వాన్ని గూర్చి కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారిలా వ్రాసి యున్నారు. ``మొగలేటి మడుగున.. అను సీసపద్యము కాళహస్తుల కథలో వచ్చినది. దానిని విశ్వనాథ వారిట్లు వ్యాఖ్యానించినారు."

``ఈ పద్యమొక యాశ్చర్యము. ఇది యెవ్వడును వ్రాయలేడు. ధూర్జటియే వ్రాయవలయును. ఆ ధూర్జటి మహాభక్తుడు. గనుక తాను పోయి యా యేనుగులో దూరి యా పాము తన మెదడులో నెక్కిన

దనుకొని తానేమేమి చేయునో యూహించుకొని వ్రాసినట్లున్నది మహాకవిత్వమని చెప్పుకొనదగిన లక్షణములలో నిది యొకటి. అందరు కవులు తాము రచించు పాత్రలతో నంతో యింతో యేకీ భావమును పొంది వ్రాయుదురు. వారంతో యింతో కవులు. ఇట్టి యొక మహా భయంకరమైన పరిస్థితిలో నందులోనొక యేనుగు వంటి జంతువుతో తాను తన్మయీభావమును పొందుట యిది మాత్ర మాశ్చర్యము."[1]

ధూర్జటి శబ్ద ప్రయోగాన్ని గురించి విశ్వనాథ వారి మాటల్లోనే విందాం.
''దళిత కుంభ సీమ నున్న పాము చిదిసె" (2-151)

[2] ఈ పద్యములో నున్న సొగసేమనగా దళిత = చీల్చబడిన కుంభసీమలో నున్న పాము, చిదిసెన్ - చిదియు అన్న ధాతువును వాడుట. మనమొక రాతి మీద నొక సన్నని వస్తువు పెట్టి మరి యొక రాతితో కొట్టినచో నా వస్తు వేమగును? చిదియును. ఆ వస్తు వప్పచ్చి వలెనై పోయి దానిలోని నీరు మొదలైన వటు నిటు వ్యాపించి తొక్కు కూడ మిగుల కుండ చెప్పుటకు వీలు లేనంత చీకాకైన లక్షణము కనిపించును. తెలుగు జాతి యీ 'చిదియు' ధాతువు నట్టి యర్థము నందుపయోగించును. ఈ కవి యిచట పామే మైనదో యెట్టి స్థితిని పొందినదో చెప్పుట కాశబ్దమును వాడెను. ఇది యొక యాశ్చర్యము."

## 4.21 కృష్ణరాయ విజయంలో శ్రీ కాళహస్తి ప్రశంస

'కృష్ణరాయ విజయము' కుమార ధూర్జటి రచించిన చారిత్రక కావ్యం. విశ్వనాథ నాయని స్థానాపతి రచించిన రాయవాచకాని కిది పద్యానుసరణ. ఈ గ్రంథ రచనాకాలం క్రీ.శ. 1705-10 ల మధ్య జరిగివుంటుందని చరిత్ర పరిశోధకులచే నిర్ణయింపబడింది.

కృష్ణరాయ విజయంలో రాయవాచకంలో చెప్పబడిన తెలుగునాడు

---

*1,2 కావ్య పరిమళము - విశ్వనాథ సత్యనారాయణ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, హైదరాబాదు, 1970, పుటలు (168-169)*

ప్రదేశాలే ఉన్నాయి అందులో శ్రీ కాళహస్తి ఒకటి కుమార ధూర్జటి 'పాకనాటార్వేల వంశప్రసిద్ధుడు' ధూర్జటి పౌత్రుడు శ్రీకాళహస్తి నిలయ చిత్ప్రసూనాంబికా శ్రీకరానుగ్రహోపాంత కవితా రసజ్ఞ హృదయుడు (1-23)

తమ వంశీయులకు ''సద్విద్యా మహిమ'' నిచ్చే ''సంపద్వైభవు గాళహస్తిపతి నుతియింతున్ ''(1-5) ''అమ్మా! జ్ఞానమ్మ! శ్రీ కాళహస్తి విభుని కొమ్మ నితాంత సాహిత్య నియతి నొసగు '' (1-6) అని క. శ్రీ కాళహస్తీశ్వరుని జ్ఞాన ప్రసూనాంబికను కొలిచినాడు. రాయలవారు అడుగగా ''కాళహస్తీశ్వరునకు నల చిదంబరునకు వేడ్కలచునెనుచు'' శివభక్తులు నివేదించినారు.

## 4.22 'హంస వింశతి' లో కాళహస్తి

అయ్యలరాజు నారాయణామాత్యున కావ్యమిది ఇందులో లెక్క లేనన్ని ఊర్ల పేర్లున్నాయి 108 దివ్యతిరుపతులున్నాయి ఇందులో 'శ్రీ కాళహస్తి' ప్రశంస వచ్చింది.

*తిరుతని కాళహస్తి సిమాదు మధ్యార్జు*

*నము తిరునామలనాముకొండ (5-350)*

## 4.23 భానుమద్విజయం' లో కాళహస్తి

ఇది వెలగపూడి కృష్ణయామాత్యుని రచన క్రీ.శ 1740-60 మధ్య జీవించినవాడితడు. ఈ కావ్యంలో కాళహస్తి ప్రశంస వచ్చింది దండకంలో భానుమంతుడు దర్శించిన క్షేత్రాలు తీర్థాలను ప్రశంసిస్తూ - దయావేశు శ్రీవేంకటేశుం ప్రసన్నాత్మ పద్మ ప్రకాశున్ నుతుల్ జేసి జ్ఞాన ప్రసూనాంబికా ధీశ్వరుం గాళహస్తీశ్వరున్ గొల్చి యాపిమ్మటన్ కంచి ద్వారా తమిళ దేశం లోనికి ప్రవేశించాడు భానుమంతుడు. తృతీయాశ్వాసంలో ఈ దండకం ఉంది

## 4.24 కూచిమంచి తిమ్మకవి కావ్యాల్లో శ్రీ కాళహస్తి

కూచిమంచి తిమ్మకవి బహుకావ్యకర్త. ఇతని కుక్కుటేశ్వర శతకంలో శ్రీకాళహస్తి ప్రసక్తి వచ్చింది. పురుషోత్తమము, భద్రగిరి, యహోబలము, శ్రీశైలంబు, వేంకటాచలము, కాంచి, సింహాచలంబును, శ్రీరంగమును ప్రయాగంబు కేదారంబు, <u>కాళహస్తి</u> (పద్యం 77)

## 4.25 విజయవిలాపం - శ్రీ కాళహస్తి

దక్షిణాంధ్రయుగంలో పేరెన్నికగన్న కవి చేమకూర వేంకటకవి. రఘునాధనాయకుని ఆస్థానకవి. విజయవిలాపం ఈతని కృతుల్లో ప్రసిద్ధమైంది. ఇందులో శ్రీ కాళహస్తి ప్రశంస వచ్చింది. శ్రీకాళహస్తి, సాగర సంగమం అవే తీర్థాలు, కృతిభర్త యైన రఘునాధుని శృంగార రసాబ్ధి వేంకట నగ స్థిరవాసుడు పూర్ణ దృష్టి రక్షిస్తాడు (1-3) అని కవి ఆశంస.

అర్జునుడు తీర్థయాత్రా ఘట్టంలో -

*శ్రీ వేంకటేశ్వరునికి నమస్కరించినాడు <u>కాళహస్తి లింగాన్ని దర్శించినాడు</u>*
*దుస్తరాంభస్తూలికా సందోహ దాహ దోహల నిజాహ్వాయస్మరణ*
*విస్ఫులింగంబగు <u>శ్రీ కాళహస్తీ లింగంబు</u> నంతరంగంబున*
*హర్ష తరంగంబు లుప్పొంగం గాంచి .. (1-128) నాడు*

## 4.26 పెదకాళహస్తి మాహాత్మ్యము - ధూర్జటి లింగరాజకవి

ఇది కుమారధూర్జటి తనయుడు ధూర్జటి లింగరాజకవి రచించినాడు పెదకాళహస్తిమాహాత్మ్యములో 12 ఆశ్వాసములున్నాయి. అందులోని ధూర్జటి ప్రశంస

*శ్రీ కాళహస్తి గౌరీనాథ పదపద్మ*
*పద్భక్తి యుక్తి నిశ్చలత గాంచి*

సారసుధాసార సరసోక్తి గుంభన
గాళహస్తిమహత్త్వకథ నొనర్చి
కృష్ణరాయ కిరీటకీలితమణిగణా
శ్రిత పదాబ్జద్వయశ్రీ వహించి
యాసేతు కాశీతటావనీ విఖ్యాత
సత్కీర్తి విస్ఫూర్తి (జాల వెలసి

ధరణి (జెలు వొందె నే కవీశ్వరవతంస
రత్నమమ్మహనీయు ధూర్జటి సుధీంద్రు
దల (తు జలనిధివీచికాకలకలాను
కారి భూరికవిత్వ వాక్పటిమ (గులుక

దీనిని బట్టి ధూర్జటి కాళహస్తి మాహాత్మ్య రచనముచే ఉత్తమకవిగా ఎన్నె కెక్కి కృష్ణరాయల మన్ననల పొందినట్లు తెలుస్తుంది అంతేగాక క్రింది పద్యము వల్ల ధూర్జటి వంశాదికము పూర్వోక్తమే అని స్పష్టమౌతుంది

శ్రీకాళహస్తీశ సేవనాన్వితచిత్త
విత్తజాకార లక్ష్మీవిహార
రమణీయశీల భారద్వాజగోత్ర ప
విత్ర యాపస్తంబ సూత్రమహిత
ధూర్జటి వంశపాదోధి చంద్రకుమార
ధూర్జటి నామ విస్ఫూర్తితాంక
స్తుతమతి వేంకటపతి తనూభవ లింగ
రాజకులేంద్ర ధైర్యాచలేంద్ర

తాత, మనుమడు యిద్దరు శ్రీకాళహస్తి మాహాత్మ్యమును ప్రబంధముగా రచియించుటచే ధూర్జటివంశసంజాతులందరకు శ్రీకాళహస్తీశ్వర భక్తి తత్పరత అధికమని తెలుస్తుంది కుమారధూర్జటియు తాను రచించిన

కవితాచమత్కారుడనని తన్ను గూర్చి యాశ్వాసాంత గద్యములందు దెలిపి యుండుటచే పై విషయము ధ్రువమగుచున్నది.

ధూర్జటియు, లింగరాజ కవియు రచించిన 'శ్రీ కాళహస్తి మాహాత్మ్యము' లను ప్రబంధములకు సంస్కృతమూలములు భిన్నములని యీ క్రింది పద్యముల వలన తెలియుచున్నది.

కం॥ విను కాళహస్తి మహిమం
బనుపమమై వెలయు మును షడధ్యాయికగన్
దెను ... గావ్యముగ నొసఁగ
త్రైసు బట ధూర్జటి ... శేఖరు ...

దీనిని బట్టి లింగనార్యుని ధూర్జటి విరచితమైన శ్రీ కాళహస్తి మాహాత్మ్యమునకు మూలమైన సంస్కృత గ్రంథము ఆరు అధ్యాయములు గలదనియు, అదియే 'షడధ్యాయి' యను పేరుచే నిట్టును తెలియుచున్నది.

ఈ ఆరు అధ్యాయముల గ్రంథము, స్కాంద పురాణాంతర్గతమైన వైష్ణవఖండమునందలి శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్య ప్రతిపాదక విషయము నందలిది యని, విమర్శకు లూహించియున్నారు. అచటనుండెడి యా అధ్యాయములలో స్వర్ణముఖరీ నదీ మాహాత్మ్యమును శ్రీ కాళహస్తీశ్వర నామ ప్రసక్తి మాత్రమే గలదు కాని మిగిలిన కథాంశములు కానరావు

గీ॥ బహుపురాణముధిత భవ్యార్థ శివకథా
సార మెల్ల నైక్య పరచి బొదలి
జగతి శివరహస్యసద్గ్రహమను నితి
హాస మొసఁరు విబుధు లభినుతింప

సీ॥ ఆ యితిహాసంబునందలి యుత్తర
భాగంబునందు భాస్వన్నిరూఢి
గాళహస్తిమహత్త్వకథ మూట యిర్వది
యాధ్యాయముల జెలు వమరుచుండు

*దత్కృత దెమగువ ద్రాక్ష రసోర్మికా*
*పరిపాక విస్ఫూర్తి బరిధవిల్ల*
*గృతి యొనర్తుము మదంకితముగ శబ్ద చ*
*మత్కృతి పండితు ల్మదీగణింప*

[1] ఈ పద్యములమబట్టి లింగరాజకవి కృతమైన ప్రబంధమునకు శివరహస్యసంగ్రహాము గ్రంథమునందలి యుత్తరభాగము నూటయిరువది యధ్యాయముల గ్రంథముమూలమని తెలుస్తున్నది. లింగరాజకవికృత ప్రబంధము నత్కీరుని కథ లేదనియు, హేసృాదుల చరితము నందును భేదము కలదనియు కొ. పద్మనాభ శాస్త్రిగారు (1895) తొలుతటి పీఠిక యందే తెలిపి యున్నారు".

**427 ధూర్జటి తర్వాత నత్కీరునికథ వ్రాసిన మరి నల్గురు తెలుగు కవులు**

a) కటవె వంజరాజు (క్రీ.శ.1720) - హాలాస్యమాహాత్మ్యము, గద్యము (?)

b) తిరుమలసెట్టి జగన్నాథదాసు (క్రీ.శ. 1888)- హాలాస్య మాహాత్మ్యము (ప్రబంధము)

c) శ్రీ మదాంధ్ర హాలాస్య మాహాత్మ్యము - జనమంచి శేషాద్రిశర్మ (క్రీ.శ.1906) (ప్రబంధము)

d) హాలాస్య మాహాత్మ్యము (క్రీ.శ. 1917) - మల్లమపల్లి బుచ్చికవి

పై నాల్గు గ్రంథములు తమిళమున తిరువిళైయాడల్ పురాణము, సంస్కృతమున దానిననుసరించి నీలకంఠదీక్షితుడు క్రీ.శ. 17 వ శతాబ్దిలో వ్రాసిన శివలీలార్ణవము ననుసరించి యుండుటచే ధూర్జటి కథానిర్మాణమందు కనబడదు. అది మధురలో వెలసిన సుందరేశ్వరుని 64 లీలలు

*1. లింగరాజకవి విషయమంతయు శ్రీ కాళహస్తి మాహాత్మ్యము (వేంకట్రామా అండ్ కో, విజయవాడ 1961) 'పీఠిక' - విలుకూరి పాపయ్య శాస్త్రిగారి నుండి గ్రహింపబడినది*

వర్ణించు కావ్యము కావున 'నత్కీరుడు' మధుర పాండ్యరాజు ఆస్థానమందలి కవీశ్వరుడగుటచే అతని వృత్తాంతము తప్పక చెప్పబడినది. అన్ని గ్రంధములందును ఒకటే తీరుగా సుందరేశ్వరునితో వివాదము, ఆతడు వేనలి సహజ గంధము కాదనుట, దానితో సుందరేశ్వరుడు కోపించి మూడవ నేత్రము చూపగా ఆ అగ్ని సెగకు తట్టుకొనలేక నత్కీరుడు పుష్కరిణిలో పడుట, తాపము చల్లారిన వెనుక సుందరేశ్వరుడతని అనుగ్రహించుట, నత్కీరుని శివస్తోత్రము చెప్పబడినది. ఈ రేఖా చిత్రాన్ని ధూర్జటి తైల వర్ణ చిత్రంగా మార్చి నత్కీరుని మధురనుండి కైలాసానికిపోవునట్లుచేస్తూ చివరికి దక్షిణ కైలాసమైన శ్రీకాళహస్తిలో ముక్తిని ప్రసాదింప జేశాడు.

## 4.28 శ్రీ మద్దక్షిణకైలాస గిరిప్రదక్షిణ మహాకావ్యము

"[1]అద్యతనాంధ్ర సాహిత్యంలో అన్ని ప్రక్రియల్లోను అందెవేసిన చేయి శ్రీ జమదగ్ని గారిది. గేయం మొదలుకొని మహాకావ్యనిర్మాణందాకా వారి కలం పరవళ్లు త్రొక్కుతూ ముందుకు సాగింది. 'మహోదయం' అనే గేయ రూపకం, అన్నదమ్ములనే కథానికా సంపుటి, స్వయంవర మనే నవల, జ్ఞాన ప్రసూనాంబికా త్రిశతి, వైరభక్తి అనే కావ్యం, శ్రీరామరాజ్యమనే శ్రీమద్రామాయణ కల్పవృక్షానికి శేషపూరణం, గిరిప్రదక్షిణ మనే శ్రీకాళహస్తి క్షేత్ర మహాత్మ్య కావ్యం ఇంకా అనేక ఖండ కావ్య కవితలు, సాహిత్య వ్యాసాలు, సంకలింపబడని కథానికలు, అనువాద గ్రంధాలు, పుస్తక సమీక్షలు, పీఠికలు, ఎన్నో వీరి నిర్విరామ సాహితీ సృష్టికి నిదర్శనాలు"

"తెలుగునాట తొలినాటి కథారచయితగా మొదట పేరుపొంది క్రమంగా ఖండకావ్యకవిగా, పిదప విమర్శకుడుగా, గేయరూపకకర్తగా శతకకారుడుగా, కావ్యకర్తగా, చివరకు మహాకావ్యనిర్మాతగా స్థిరపడ్డారు వీరు"

---

*1 శ్రీ విద్యానిధి - శ్రీ జమదగ్ని ——— ముదివేడు ప్రభాకరరావు , స్రవంతి, హైదరాబాదు అక్టోబరు 1980 పుటలు 21 - 30*

## 4.28.1 జనవాదికం

''కవిగారి పూర్తిపేరు శ్రీచెలుకుపల్లి జమదగ్నిశర్మ కాని, పాఠకలోకానికి 'జమదగ్ని' అన్న పేరుతోనే సుపరిచితులయ్యారు. వీరు రౌద్రి నామ సంవత్సరం 1920, జూన్ నెల గొల్లపల్లిలో జన్మించారు. ఇది నూజివీడు తాలూకా, కృష్ణాజిల్లాలో వుంది. 1980 జూన్ నెలలో వీరి షష్టిపూర్తి మహోత్సవం శ్రీకాళహస్తిలో ఘనంగా జరిగింది. వీరి జననీ జనకులు శ్రీ రామేశ్వర లక్ష్మీనరసింహాంబలు. వీరి తండ్రిని బుచ్చిరామయ్య గారని కూడా అంటారు. ఆయన భగవద్గీత పై 'కల్యాణి' అనే పేరుతో వ్యాఖ్య రచించినారు. పెంచి పెద్ద చేసి విద్యాబుద్ధులు నేర్పించినది అన్నగారు వెంకటప్పయ్య. ఆయన అకాల మరణం (1950 లో) చెందగా కవిగారు అన్నదమ్ములనే కథానికా సంపుటిని అన్నగారికి అంకితం చేశారు. వేదాంత విద్యాగురువు - లంకా నరసింహ శాస్త్రిగారు, సాహిత్య విద్యా గురువు - కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు. శ్రీ విద్యలో ప్రవేశం కల్గించింది కల్యాణానంద భారతీ శాంతాచార్యులవారు. పూర్ణదీక్ష అనుగ్రహించింది. వియోగ్నిరంగనాథ దీక్షానాములైన ఆయన తండ్రి గారే''

''ఒకనాడు శ్రీకాళహస్తి క్షేత్ర నివాసియై ఆ స్వామి పై ఒక శతకాన్ని, ఒక కావ్యాన్ని రచించిన ధూర్జటి మహాకవి నివసించిన క్షేత్రంలో స్థిరనివాసంగా వుండటానికి సంకల్పించిన అపరధూర్జటి శ్రీ జమదగ్ని గారు. అటువంటి ధూర్జటి ఈయన అభిమాన కవి కావడంలో ఆశ్చర్యమేమీ లేదు''

''వీరు ఔద్యోగిక జీవనంలో శ్రీకాళహస్తి గవర్నమెంట్ డిగ్రీ కళాశాలలో తెలుగు లెక్చరర్, హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్‌గా 1980 లో రిటైరయ్యారు. 1984 లో శివైక్యమయ్యారు. వీరి మేనల్లుడు డా॥ శలాక రఘునాథ శర్మ గారు. అనంతపురం, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో తెలుగు ఆచార్యులుగా ఉంటున్నారు''

## 4.28.2 శ్రీ రామరాజ్యము - శ్రీ కాళహస్తీశుడు

శ్రీజమదగ్ని గారు శివభక్తి పరులు. కావుననే కల్పవృక్ష శేషపూరణమైన శ్రీరామ రాజ్య మనే కావ్యం రచిస్తూ వారి గురుపాదులు విశ్వనాథ వారు

కల్ప వృక్షాన్ని శివాంకితం చేశారు కాబట్టి తనూ అలాగే కావ్యాన్ని శివాంకితం చేస్తూ కావ్యాన్ని ఐదు ఖండాలుగా విడదీసి ఒక్కొక్క ఖండానికి పంచముఖుడైన శివుని ముఖాలలో ఒక్కొక్క పేరు పెట్టారు అది యిలా వుంది.

1) ప్రతిజ్ఞా ఖండము - సద్యో జాతము
2) సమజ్ఞా ఖండము - వామదేవము
3) ప్రతిష్ఠా ఖండము - అఘోరము
4) ప్రత్యభిజ్ఞా ఖండము - తత్పురుషము
5) ప్రత్యాయన ఖండము - ఈశానము

ఖండాదిరోను, ఖండాంత పద్యాలలోను శ్రీకాళహస్తీశ్వరుని, శ్రీ జ్ఞాన ప్రసూనాంబను ప్రస్తుతించారు

*శ్రీ [illegible] !*
*[illegible]*
*కేనోపనిష ప్రకటిం*
*నానార్థ [illegible] !*
*|| శిఖరిణి || విరించి శ్రీ వాణీద్విదముఖ భక్తార్తిహరణా !*
*పరా ప్రేమైక ప్రాప్త హృదయ మణిస్ఫాట సుషమా !*
*అవిద్యా ప్రధ్వంసద్యుమణియుమ రూపాధ్వసుగమా !*
*నిరాకారాకారా ! నిఖిల జగతీ నేత్ర నిగమా !*

428.3 గిరిప్రదక్షిణ మహాకావ్యాను శీలనము

శ్రీ చెఱుకుపల్లి జమదగ్ని శర్మ గారిచే విరచితమైన శ్రీమద్దక్షిణ కైలాస గిరి ప్రదక్షిణ మనే మహాకావ్యములో శ్రీకాళహస్తి క్షేత్ర మహిమ మహోన్నతంగా వర్ణింప బడినది. ఇందు శ్రీకాళహస్తి క్షేత్రము లోని వివిధ స్థలాల మహిమ,

కాళహస్తిని సందర్శించిన భక్తుల చరిత్ర వర్ణించడం, ఈ మహాకావ్యానికి మహోన్నతను చేకూర్చినాయి. సుదీర్ఘమైన వర్ణనలుండడం యిందు ప్రత్యేకత భక్తుల జీవిత విశేషాలను వర్ణించి కవి తన ప్రతిభా విశేషాన్ని ప్రకటించాడు. సుమారు 400 పుటలలో నిర్వచన కావ్యమై ఒప్పుచున్నదీ గ్రంథం. ఇందు 'పదము'లతో ప్రకరణ విభాగం చేయడం, అందులోను "ఓం నమశ్శివాయ" అనే ఆరు అక్షరాలను దృష్టిలో పెట్టుకొని నామకరణం చేయడం వల్ల కవికి గల అపార శివభక్తి ద్యోతకమగుచున్నది. పద్య రచన అలతి అలతి పదాలతో మనోహరమై ఒప్పారుచున్నది. ఇందు కావ్య విభాగ మిట్లున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| 1) ప్రథమ పదము | - | ఓంకార పదము | 402 | పద్యములు |
| 2) ద్వితీయ పదము | - | నకార పదము | 401 | పద్యములు |
| 3) తృతీయ పదము | - | మకార పదము | 400 | పద్యములు |
| 4) చతుర్థ పదము | - | శికార పదము | 400 | పద్యములు |
| 5) పంచమ పదము | - | వాకార పదము | 401 | పద్యములు |
| 6) షష్ఠ పదము | - | యకార పదము | 400 | పద్యములు |
| | | మొత్తం | 2404 | పద్యములు |

వీరు షష్టివర్షప్రాయమున శృంగేరీ మఠాధిపతుల యనుగ్రహంచే దీక్షితులై 'వివేకనందనాథుడనే దీక్షా నామం వహించారు' ఈ కావ్య ప్రేరణను గూర్చి వారే యిలా కావ్యాంతంలో చెప్పి కొన్నారు.

*అవివేకిన్ గురుసత్కృపం గొని వివేకానందనాధాఖ్య నా*
*శివు ( డే సర్వమటంచు నమ్మిమి నతిన్ శ్రీ కాళహస్తీశ్వరున్*
*భవ మీద్యం దయ జూపు మంచు వినమున్ బ్రార్థింపగా స్వామి సం*
*భవమై కావ్య మిటుల్ ప్రపూర్ణ మతి మొల్వం జేసె ( జిత్తమ్మునన్*

*అమలోదాత్తమనీషి మత్కృత వివేకానందనాధుండు , బ్ర*
*హ్మమె రూపందె జగద్గురూత్తమత విద్యారణ్యాఖ్య సద్దేశిక*
*ప్రముఖుండై సరి నిర్గురున్ నను దయన్ బాలింప నవ్వారి ని*
*త్యము ధ్యానించుచు నిల్తు నిప్పట వివేకానందనాథుండనై*

దక్షిణకైలాస మనదగిన శ్రీకాళహస్తి , సాధకులకు నిలయమైనదని కవి చెప్పిన పద్యం గమనింపదగింది.

*ఇది దక్షిణ కైలాసం*
*బిది సద్యోముక్తి నొస । గు నిచ్చట మనుచున్*
*మదినటు నిటు మసలింతురె*
*సదమల పరమార్థమెఱుగు సాధకులెందున్ (1-15)*

మోక్షకాంక్షతో అచ్చటి క్షేత్రములో స్నాన మాచరించిన భక్తులు తరింతురు. శ్రీకాళహస్తిలో శివుడు పంచభూతమహాలింగములలో వాయు లింగమై వెలిశాడు. అగ్ని, భూమి, నీరు, వాయువు, ఆకాశం ఇవి పంచ భూతాలు. ఇవి మానవ జీవితానికి ముఖ్యం. ఇందులో ఏ ఒక్కటి లేక పోయినా మానవుడు జీవించ లేడు. మానవ జీవితం శివమయం, అనే దానికి నిదర్శనంగా వాయులింగంగా ఆవిర్భవించాడు శివుడు శ్రీకాళహస్తిలో. దీనినే స్వయంభూలింగ మంటారు.

ఈ కావ్యంలో ధూర్జటి మహాకవి కావ్యంలోని నాల్గైదు కధలు మరలా చెప్పబడినవి. అవి

1) సాలెపురుగు వృత్తాంతము
2) ఏనుగు, పాము స్వామిలో లీనమగుట
3) సిద్ధులయ్య (నత్కీరుడు) వృత్తాంతము
4) కన్నప్ప కధ
5) వశిష్ఠుని తపస్సు - వాయులింగావిర్భావము

కావ్యారంభంలోని రెండు పద్యాలు

*ఓంకారవాచ్యునకు, నిర*
*హంకార శివైకతాన హంసోన్మజ్జత్*
*సంకల్ప రహిత హృదయా*
*లంకార మహాప్రకాశ లలితే శునకున్*

*శ్రీకాళేభ కిరాతవిప్రములువాపించార్చి రుద్రాక్ష లిం*
*గాకారమ్మున స్వాత్మభూధరము నొయ్యం గూడ జ్ఞానాంబతో*
*శ్రీకస్తూర్ల ముఖీ పురోపతి ।గూర్మిం దో।చ నా స్వామి లో*
*కైక త్రాణ మహోద్యమ ప్రథితు ।డై యార్తాళి రక్షించెడిన్*

పై కథలను చెప్పటలో జమదగ్ని గారు సర్వేసర్వత్ర ధూర్జటి కావ్యాన్నే అనుసరించారు కాని ధూర్జటి శైలి వేరు, వీరి శైలి వేరు. వీరి శైలి అత్యంత సరళమైనది

సాలెపురుగు వృత్తాంతం సుదీర్ఘంగా 23 పద్యాలలో వర్ణింపబడినవి ఏనుగు, పాము వృత్తాంతాలు 25 పద్యాలలో వర్ణిరాలు ఆలయ విశేషాలను వర్ణించిన కవి తీరు గమనింపవలసి ఉంది

*స్వామి పశ్చిమముఖు ।డంయ సోమముఖము*
*ముదమునం గ ౦ చొప్పు ప్రాఙ్ముఖ సన్నితి*
*తల్లిదండ్రులు వారి ।బదక్షిణించి*
*భక్తవరు ల్లెల్ల ధన్యత బడయుచుండ్రు*

*ఆలయము చొర నుత్తరాభిముఖత*
*దక్షిణామూర్తిగాంచి తత్పురులమగుచు*
*స్వామి సేవించుకొని జగజ్జనని ।గొలిచి*
*మోదమున।దేలి దక్షిణామూర్తుల మయి ( 1-175, 176)*

ఆది భిక్షువే ఆర్తుల భయాన్ని పోగొట్టగలడని కవి మనోహరంగా వర్ణించాడు

*మహిత భారతి వేద ధర్మం బొకింత*
*నేటికిన్ నిల్చెనన్న నా మేటి భిక్ష*
*ఆదిభిక్షువె యగుచు భయార్థితులకు*
*భీతి ।దొలగించె సుజ్ఞాన భిక్ష నొస గి (1-193)*

కవికి గల సరళ శైలికి నిదర్శనంగా నత్కీరునిచే అవమానింప బడిన హరద్విజుని సంజాయిషీ చూడవచ్చు

''నేను కవి గాను నన్ను నిందింప వలదు
ద్రవ్య మాశించి స్వామి ప్రార్థనము సేయ
బద్యముల్ వ్రాసి యిచ్చి నటుల్ పఠింపు
మనుచు బంపించె బోయ యూరికి యుత్తు''(1-233)

ఈ పద్యంలో లౌక్యం తెలియని హరద్విజుని అమాయకత్వం సహజంగా వర్ణించి తన కవితా ప్రతిభను ప్రకటించు కొన్నాడు. మార్కండేయ తీర్థమును గూర్చి చెప్పుచు కవి -

జ్ఞాన దాత శివుండు విజ్ఞానమూర్తి
జ్ఞాన సూనాంబ తోడ సాక్షాత్కరించి
ఆశితాళికి జ్ఞాన సాధ్యా భయమ్ము
నొసగ గా స్వయంభు వెలుగు చుండునచట (2-245)

శివుడు తన సతి జ్ఞాన ప్రసూనాంబ తోడ ఆశితులను ఆదరించి కాపాడునను ప్రబోధమును కవి మనోహరంగా వర్ణించాడు.

ఈ విధంగా 'జమదగ్ని' కవి ''ప్రాయము క్రొవాలిన దశలో ప్రశాంతమైన జీవితము గడుపుచు, చల్లని చక్కని మాటల సోహళింపులో, సరళమైన శైలితో, ధారాశుద్ధి గల్గిన రీతితో మహత్తర కథావస్తువు గల్గిన కావ్యాన్ని ఆంధ్ర ప్రజానీకానికి అందించి చరితార్థులయ్యారు.

# పంచమాధ్యాయం

## శతక వాఙ్మయంలో శ్రీ కాళహస్తి

5.0 సంస్కృతంలో శ్రీ ఆది శంకరుల సౌందర్యలహరి, శివానందలహరులు రెండూ శతకసాహిత్యంలో అతి ప్రాచీనమైన శతకశాఖకు చెందిన వాఙ్మయం. భగవంతుని స్తుతించడం అనేది ఋగ్వేదకాలం నుండి పరం పరగా వస్తున్న సంప్రదాయం. అది ఏ భాషలో వ్రాయబడితే ఆభాషలోనిదని, ఏ ప్రక్రియలో వ్రాయబడితే ఆ ప్రక్రియా దృష్ట్యా పరిశీలించడం అనేది సాహిత్య విమర్శకుల కర్తవ్యమై వుంది. సంస్కృతంలోని 'శివపంచస్తవి' ని గురించి మూడవ అధ్యాయంలో పరిశీలించాము.

ఆంధ్ర సాహిత్య సంపన్నతకు శతకవాఙ్మయం ఒక సాక్ష్యం. సంస్కృత వాఙ్మయంలోని శతకరచన తెలుగుశతకరచనకు మార్గదర్శకమైనా సంస్కృతం కంటె తెలుగులో నేటికిని శతక ప్రక్రియ విస్తారంగాను, సజీవంగాను ఉంది. తెలుగులో ఉదాహరణాది దేశి ప్రక్రియల్ని కూడ వ్రాయడానికి నడుం బిగించారు. మనకు లభించిన శతకాలలో యథావాక్కుల అన్నమయ్య వ్రాసిన సర్వేశ్వర శతకం కంటె ముందుగా చెప్పదగినది. పాల్కురికి సోమనాథుడు (క్రీ.శ.1160-1240) వ్రాసిన వృషాధిప శతకము.

మతాల్లో శైవం ఎంతటి అనాదియో, శతకాల్లోను వీరశైవశతకాలే ఆద్యమని చెప్పవలసి వుంది. మల్లికార్జునపండితారాధ్యుల (క్రీ.శ 1160) శివతత్త్వసారాన్ని గురించి ముందే కొంత తెలుసుకొన్నాం. ఇందులో 489 వంద పద్యాలున్నాయి. శతక లక్షణాలన్నీ యిందులో సమగ్రం గాలేవు. అజా రుద్ర, శివా అనే మకుటాలున్నా పరమత నిరసనం ఎక్కువగా కన్పడే శైవ స్మృతి గ్రంధంగా దీన్ని పరిగణించవచ్చు. కాబట్టి తెలుగులో వెలసిన మొట్టమొదటి శతకం పాల్కురికి వృషాధిప శతకమని నిర్వివాదంగా చెప్పవచ్చు. "బసవా బసవా బసవా వృషాధిపా !" అనే మకుటంతో గల ఈ శతకం సర్వోత్కృష్టమైంది. ''బలుపొడ తోలుసీరయును (బాపసరుల్ గిలుపారుకన్ను " యిత్యాదిగా శివుని సంస్తుతించిన పాల్కురికిని 'శతక

వాఙ్మయ బ్రహ్మ' గా కీర్తింపవచ్చు. ఈయన చెన్నమల్లు సీసములు, (32 సీసపద్యాలు), చతుర్వేదసారములో 'బసవలింగ' అనే మకుటంతో 300 పద్యాలు వ్రాశాడు. తెలుగులో 'త్రిశతి' రచనకు కూడ పాల్కురికియే ఆద్యుడని చెప్పవలసి ఉంది. యథావాక్కులఅన్నమయ్య (క్రీ.శ. 1242) లో వ్రాసిన సర్వేశ్వర శతకములో 140 పద్యాలున్నాయి.

## 5.1 ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వర శతకము

శైవభక్తి శతకాలలో ధూర్జటి వ్రాసిన శ్రీకాళహస్తీశ్వరశతకము అగ్రగణ్యమైనది. నిర్వ్యాజ భక్తి, ఆత్మ విమర్శనము, ధారాశుద్ధి, భావనాశక్తి అనే గుణాలు ఈ శతకానికి విశిష్టతను చేకూర్చినవి. ఇందు ధూర్జటి పలుమార్లు తన దోషాలను నివేదించుకొని ఆత్మ ప్రక్షాళనం చేసికొన్నాడు. ''రాజుల్ మత్తులు వారిసేవ నరకప్రాయంబు'' అని నిర్భయంగా రాజుల్ని తీవ్రంగా నిరసించాడు. సాంసారిక జీవితంపట్ల వైముఖ్యాన్ని ప్రకటించాడు. ఇందలి ప్రతి పద్యము ధూర్జటి లోకానుభవాన్ని, అనుభూతిని చక్కగా వ్యక్తం చేస్తున్నాయి. తన హృదయాన్ని పరమేశ్వరునికి నివేదించు కొనుటలో మోమోటము గాని, చాటుమాటులు గాని, భయముగాని, సిగ్గుగాని ధూర్జటి యెఱుగడు. ఎచ్చటను రేఖామాత్రముగనైన ఆత్మ వంచనము కన్పట్టదు. లోకవంచనము చేయవలసిన అక్కర అతనికి మొదలే లేదు. చిత్త శుద్ధి అనేది మహాకవులందు అపురూపంగా కానవచ్చేగుణం. ఈ గుణమే ధూర్జటి కవితకు అసాధారణమైన తేజమును, శక్తిని ప్రసాదించినది.

### 5.1.1 శతకంలో ధూర్జటి వ్యక్తిత్వం

ధూర్జటి శివభక్తుడు. శుద్ధ శైవుడు. ఒకనొక శివశతక కర్త అతని శివభక్తి మహిమను యిలా కీర్తించినాడు.

*కం ॥ చెలి వంటిమీద ,జేయిడి*
*చెలువొప్ప 'శివా'! యటన్న ,జేడియ నవ్వన్*
*జలపట్టి శివుని ,బాసిన*
*చెలువుని ధూర్జటిని ,దలతు ,జిన్నొంద శివా !*

దీనిని బట్టి ధూర్జటి అపార మహిమాన్వితుడగు శివభక్తుడనుట తెల్లము. ఈ పద్యమందలి కథకు శ్రీకాళహస్తీశ్వరశతకములోని ఈ క్రింది పద్య పేర్కొనబడినది మందలి "స్త్రీ చన్నే!" అను సందేహమునకు కొంత సంబంధమున్నదేమో అనిపించుచున్నది.

*నిన్నే రూపముగా భజింతు మదిలో నీ రూపు మోఁకాలొ, స్త్రీ*
*చన్నో కుంచెమొ, మేఁకపెంటికయొ యీ సందేహముల్మాన్పి నా*
*కన్నారన్ భవదీయమూర్తి సగుణాకారంబుగాఁ జూపవే*
*చిన్నీరేజ విహారమత్త మధుపా శ్రీ కాళహస్తీశ్వరా! (ప.15)*

శ్రీ కాళహస్తీశ్వర శతకములో ధూర్జటి ఆత్మ పరీక్షను (self-introspection) నిశితంగ చేసి యున్నాడు. అందు ఆత్మీయత, నిరంతర శివభక్తి పర తంత్రత, అనుభూతి సాంద్రత యిత్యాది గుణాలు గోచరిస్తాయి.

*కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు వక్షోజముల్*
*రాయన్ రాపడె ఱొమ్ము మన్మథ విహార క్లేశ విభ్రాంతిచేఁ*
*బ్రాయం బాయెను బట్టఁ గట్టెఁ దల చెప్పన్ రోఁత సంసారమే*
*జేయం జాల విరక్తుఁ జేయఁ గదవే శ్రీ కాళహస్తీశ్వరా! (ప.14)*

ఇత్యాది పద్యాలనుబట్టి ధూర్జటి తొలుత స్త్రీ లోలుడని, పిదప స్త్రీ విముఖుడని తెలుస్తోంది. 'అంభోజాక్షి చతురంతయాన తురగీభూషాది' (ప- 18) భోగాలను అతడనుభవించి "వెనుకం జెందిన ఘోర దుర్దశలు భావింపంగ రోతయ్యెడున్ (ప- 76) అనుటచే తుదకు వైరాగ్యము చెందెను. ధూర్జటి రాజాస్థానమున ప్రవేశించియు మనశ్శాంతి నందక "భవదుఃఖంబులు రాజకీటములచే బ్రార్థించిన బాయునే (ప -44) అని తలచినాడు"[2] "రాజన్మత్తులు వారిసేవ నరక ప్రాయంబు (ప-18) అనియు", "రాజశ్రేణికి దాసులై సిరుల గోరం జేరగా సౌఖ్యమో"(ప-88) అనియు పెక్కువిధాలుగా రాజుభావైముఖ్యాన్ని, రాజుల దుష్టప్రవృత్తులను నిశితంగా, నిరంకుశంగా విమర్శించినాడు. ఈ రాజదూషణమును బట్టియు, "కాయల్గాచె..." యిత్యాది పద్యభావాలను బట్టియు ధూర్జటి విరక్తుడై కాళహస్తీశ్వర శతకమును రచించెనని చెప్పవచ్చును".

### 5.1.2 తిన్ననికథ

''శ్రీ కాళహస్తీశ్వర శతకంలో, తిన్నని కథ రెండుమూడు చోట్ల పేర్కొనబడినది.

*యెంగిలిచ్చి తిను తింటే గాని కాదంటివో (ప16)*

*''నేతముద్దివియగా శక్తుండ నే గాను" (ప17)*

*నీకు న్మాంసము వాంఛయేని కఱవా నీ చేత లేడుండగా*
*జోకైనట్టి కుఠార ముండ, ననల జ్యోతుండ, నీరుండగా*
*బాకం బొప్ప ఘటించి చేతి పునుకన్ భక్షింప కా బోయచే*
*జేకొంటెంగిలి మాంస మిట్లు దగునా శ్రీ కాళహస్తీశ్వరా ! (ప -20)*

*దొప్పం డెంగిలి దెచ్చి యిచ్చినను గండూషాంబు ధారావలిన్*
*దొప్పం దోగిన చెప్పుగాల తలపై ద్రొక్కంగ నట్లుండగా*
*న్నప్పం బ్రాతుని జేసి తింటికి సన్మానంబు దీపింపగా*
*చెప్పన్నేరము నీ విహార మహిమల్ శ్రీ కాళహస్తీశ్వరా ! (ప 118)"*

### 5 1 3 శ్రీ కాళహస్తి ప్రశంస

*ఏ వేదంబు పఠించె లూత, భుజగంబే శాస్త్రము ల్చూచె దా,*
*నే విద్యాభ్యసనం బొనర్చె గరి, చెంచే మంత్ర మూహించె, బో*
*ధా విర్భావ నిధానముల్ చదువులయ్యా ! కావు ! మీ పాద సం*
*సేవాసక్తియె కాక, జంతుతతికిన్ శ్రీ కాళహస్తీశ్వరా ! (ప -13)*

శ్రీకాళహస్తిమాహాత్మ్యములో నత్కీరుడు శివుని ద్రావిడోక్తిచె నూరుపద్యాలలో సంస్తుతించెనని, వేశ్యాకుమార్తెలు ఆ నత్కీరుని శివ స్తుతిని పారం చేశారని ధూర్జటి పేర్కొన్నాడు సాధారణంగా కవులు ప్రాథమిక దశలో శతక రచనతో కవిత్వం వ్రాయడం ప్రారంభిస్తారు ధూర్జటి విషయంలో ఇది వ్యత్యస్తమైనది. శ్రీకాళహస్తీశ్వర శతకము ధూర్జటి ప్రథమరచన యగునని కొందరు తలంచారు కాని శ్రీకాళహస్తి మాహాత్మ్య

రచనాకాలముకంటె శతకరచనాకాలంనాటికి ధూర్జటి పరిణత మనస్కుడైనట్లుకన్పట్టును. ఐహికముల రోసి ఈ శతకము రచించి ధూర్జటి కాళహస్తీశ్వరుని సన్నిధిలో చేరెనని కొందరందురు. కనుక శతకము, మాహాత్మ్యము తరువాత వెలుఎడిన చరమదశలోనిపరిణతరచనగా పేర్కొనవచ్చును.

5 1 4. ధూర్జటి జీవునివేదన

*అంతామిధ్య తలంచి చూచిన నరుండటౌటెఱింగిన్ సదా*
*కాంతల్పుత్రులు నర్థముల్ తనువు నిక్కంబంచు మోహార్ణవ*
*భ్రాంతింజెంది చరించు గాని పరమార్థంబైన నీయందు దా*
*జింతాకంతయు జింత నిల్పడు గదా శ్రీకాళహస్తీశ్వరా! (ప.3)*

*లేవో కానల గందమూల ఫలముల్ లేవో గుహల్ తోయముల్*
*లేవో యేఱుల బల్లవాస్తరణముల్ లేవో సదా యాత్మలో*
*లేవో నీవు విరక్తుల న్మనుప జాలిం బొంది భూపాలురన్*
*సేవ ల్సేయ గ బోదు రేలొకొ జనుల్ శ్రీ కాళహస్తీశ్వరా! (ప. 46)*

5.15 ధూర్జటి అచంచల శివభక్తి

*నీకుం గాని కవిత్వ మెవ్వరికి నే నీ నంచు మీదెత్తితిన్*
*జేకొంటిన్ బిరుదంబు కంకణము ముంజే గట్టితిన్ బట్టితిన్*
*లోకుల్ మెచ్చ వ్రతంబు నా తనువు కీలున్ నేర్పులుం గావుఛీ*
*ఛీ కాలంబుల రీతి దప్పడు జుమీ శ్రీ కాళహస్తీశ్వరా! (ప.114)*

*ఏ లీల న్నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షా ధ్వని వ్యంగ్య శ*
*బ్దాలంకార విశేష భాషల కలభ్యంబైన నీ రూపమున్*
*జాలుంజాలు గవిత్వమున్నిలుచునే సత్యంబు వర్ణించుచో*
*ఛీ! లజ్జింపరు గాక మాదృశ కవుల్ శ్రీ కాళహస్తీశ్వరా! (ప.51)*

## 5.1.6 ధూర్జటి ఆత్మనివేదనం

ధూర్జటి ఆత్మదైవం శ్రీకాళహస్తీశ్వరుడు. ఉపాసనా దైవాలు భైరవ, దుర్గా, గణపతులు. అతడు శ్రీవిద్యోపాసకుడు "శైవ సంవిత్సాసార మరాళరత్నము".

*పరిశీలించితి మంత్ర తంత్రములు చెప్పించంటి సాంఖ్యాది యో*
*గ రహస్యంబులు వేద శాస్త్రములు వక్కాణించితిన్ శంక పో*
*దరయన్ గుమ్మడి కాయలోన నావగింజంతైన నమ్మించి ను*
*స్థిరవిజ్ఞానము త్రోవ చెప్పగదవే శ్రీ కాళహస్తీశ్వరా ! (ప-77)*

ఈ పద్యమును బట్టి ధూర్జటి మంత్ర తంత్ర శాస్త్రాలను పరిశీలించిన వాడని, సాంఖ్యాదియోగరహస్యవేత్త యని, స్వాధ్యాయ సంపన్నుడని, శాస్త్రవైదుష్యశాలి యని, లోకజ్ఞుడని తెలుస్తోంది.

*దంతంబుల్ పడనప్పుడే తనువునం దారూఢి యున్నప్పుడే*
*కాంతాసంఘము రోయనప్పుడె జరా క్రాంతంబు గానప్పుడే*
*వింత ల్మేన చరించ నప్పుడె కురుల్వెల్లెల్ల గానప్పుడే*
*చింతింపన్ వలె నీ పదాంబుజములన్ శ్రీ కాళహస్తీశ్వరా!*
*(ప -116)*

ఈ పద్యంలో ధూర్జటి ఆత్మ పరిపక్వత, వైరాగ్య నిష్ఠ వ్యక్తమగుచున్నది. అందుకే తనను గూర్చి ధూర్జటి శ్రీ కాళహస్తిమాహాత్మ్యంలో ప్రతి ఆశ్వాసాంత గద్యలోను "భవపరాఙ్ముఖు" డని చెప్పుకోవడం ఆయనకు బిరుదంగా మనం స్వీకరింపవచ్చును.

శ్రీ కాళహస్తి మాహాత్మ్యంలోని ఈ పద్యం ధూర్జటి జీవిత 'ఫలశ్రుతి' గా గ్రహింప వచ్చును. శతకంలోని పై పద్యానికిది విస్తృతి.

*తివిరి యంగమ్ముల తిమ్మిరెత్తకమున్న*
*యొడలెల్ల ముడుత బడకమున్న*
*దళమెక్కి గాత్రంబు తెలుపు దప్పక మున్న*
*బుడువులు మేన పేర్పడకమున్న*

*యలత శిగహాముస నంకురింపకమున్న*
*కాయంబువెడరూపు గాకమున్న*
*తనువు జీము రక్తములు గాఱకమున్న*
*దేహ మీగలు మూ గ్రి తినకమున్న*
*భైక్ష్య మడుగంగి బోయిన పట్ల జనులు*
*చూడ రోయక మున్న, కాలాడినపుడు*
*నడువవలెగాక కైలాసనగము జూడ*
*హరుని వాక్యము శక్య మే హరింప (3-177)*

## 52 తిరుకాళహస్తిలింగ శతకం

ప్రాచీనశతకవాఙ్మయంలో శ్రీకాళహస్తి పై అనేకశతకాలు వెలిశాయి వానిలో కాళహస్తిలింగ శతకమొకటి ఇది తిరుకాళహస్తి లింగ శతకంగా ప్రసిద్ధి కెక్కింది దీని కర్త బొడ్డపాటి కొండయ్య "అంగ భవభంగ తిరుకాళహస్తిలింగ !" అనేది దీని యందున్న మకుటం ఇందులో 3 పద్యాలు మాత్రం దొరికినవి వాటిని పెదపాటి జక్కన తన సంకలన గ్రంథమైన "ప్రబంధ రత్నాకరము" లో ఉదాహరించినాడు ఈ కవి కాలం క్రీ.శ 1580 బొడ్డపాడు బెజవాడకు 15 మైళ్ల దూరంలో ఉన్నది కొండయ్య కవి ఆ వూరివాడు కావచ్చునని ఆరుద్ర, 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' లో ఊహించారు [1]

## 53 జ్ఞానప్రసూనాంబికా శతకం

శిష్టు సర్వశాస్త్రి చే రచింపబడిన ఈ శతకం ఆంధ్ర సాహిత్య పరిషత్ షష్ఠిక వారిచే ప్రకటింపబడింది ఇందులోని పద్యాల సంఖ్య 101 "జ్ఞాన ప్రసూనాంబికా ! " అనే మకుటంతో ఈ శతక నిర్మాణం జరిగింది సర్వ శాస్త్రి సుప్రసిద్ధ విద్వత్కవులైన శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి గారి పుత్రుడు

*1 సమగ్ర ఆంధ్ర సాహిత్యం - ఆరుద్ర, సంపుటం-9, పుట-97*

వీరు కాపలవాటి బ్రాహ్మణులు. వీరు సంస్కృతాంధ్రాల్లో మంచి ప్రజ్ఞ కలిగి ఉభయ భాషల్లో కూడ కవిత్వము చెప్పుచుండెడివారు. వీరు బహుశ క్రీ.శ. 1800 ప్రాంతములో పుట్టి క్రీ.శ. 1855 ప్రాంతములో మరణించి వుంటారని వూహింపవచ్చు. వీరి తండ్రిగారు శ్రీ కాళహస్తిలో కొంత కాలముండి యుండుటచే వీరును తండ్రి మరణానంతరం రెండేండ్లు కాళహస్తిలోనే వుండి అనేక అవధానాలుచేసి పేరు ప్రతిష్ఠలు గడించుకొన్నారు. వీరు అమరుకాన్ని తెలుగు చేశారు. తండ్రిగారు గతించిన రెండేండ్లకే వీరు పరమపదించారు.

*శ్రీమాన్యం బగు కాళహస్తి నగరీపీఠంబున న్సజ్జన*
*క్షేమ ప్రక్రియ గూర్చుచున్నకల శక్తి స్తోమము ల్గొల్చి గొ*
*ల్పై మాన్యస్థితినున్న నిన్నెడిచి నే నన్యాశయం బొల్ల నన్*
*సామాన్యంబుగ జూడకమ్మ పుడమిన్ జ్ఞానప్రసూనాంబికా !*

*తరమే నీ మహిమంబు లెన్న గ నపధ్యానంబు లేకుండ న*
*ప్పర మామ్నాయము లాజుమం గని తలంపన్ దుస్తరప్రక్రియన్*
*దిరమై మించు పథంబునందగు వశీతివ్యాపము ల్సేయు భా*
*స్వర మంత్రజ్ఞుల ప్రోచి తీవ కదవే జ్ఞాన ప్రసూనాంబికా !*

*ఆహా ! మిక్కిలి గ్గలి యున్నది, మహాహంకారమా మెందు, వి*
*శ్వాసం బెందును లేదు, పూర్ణము న్నశంసత్వంబు, పత్యార్థవి*
*న్యాసం బన్నది వాషె, నిట్టి జడుని న్సన్ బ్రోవగా దృత్క్రపా*
*శ్వాసం బొక్కటి దక్క వేఱుగలదే జ్ఞాన ప్రసూనాంబికా ! (వ -41)*

---

*1 జ్ఞాన ప్రసూనాంబికా శతకము - (పీఠిక) జయంతి రామయ్య పంతులు ముద్రణ- శ్రీ నివాస వరదాచారి అండ్ కంపెనీ, ఆంధ్ర సాహిత్య పరిషత్తు చెన్నపురి. 1918.*

*చింతారత్ననివాసవాస రసికా! శ్రీ పుర్యుదారాసికా !*
*శాంతాత్మాంతర సీమ సాధువసతీ ! శ్యామాభిరామద్యుతీ !*
*సంతాపాపహృతి ప్రవీణ చరణా ! శత్రుచ్ఛిదా క్షరణా !*
*స్వాంతాంతర్విలగజ్జగత్పుటలికా ! జ్ఞాన ప్రసూనాంబికా! (ప 86)*

## 5.4 శ్రీ కాళహస్తిలింగ శతకం

దీని కర్త శ్రీగిరి విరూపాక్ష కవి. ఇది బ్రౌన్ దొరగారి కాలమునందే ముద్రింపబడినది. కాని ముద్రిత ప్రతుల్లో యీతని పేరున్న కడపటి పద్యమే లేదు. ఈ కడపటి పద్యం అడయారు పుస్తకభాండాగారంలో 82-8-9 ప్రతిలోను, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారం లో 15-7-77 లోనూ 11-2-26 సంఖ్యలు గల్గు ప్రతులలో మాత్రమున్నట్లు తర్వాత గుర్తింపబడింది. ఈ శతక కర్త తండ్రి పేరు పాపయ్య ఆ పద్యమిది-

*సీ॥ శంకర త్రైలోక్య శంకర యోంకార !*
*కేశవప్రియ వినమత్సురేశ !*
*భూతేశ ! నిఖిల విభూతేశ ! గౌరీశ !*
*యఖిలసమగ్రాగ యమసమగ్ర !*
*పురవైరిసన్నుత ! గిరివైరి మదహారి !*
*శూలి దయాశాలి ! సుప్రశీల !*
*దేవ ప్రల్లవనాధ ! దేవ మహాదేవ !*
*పావన శ్రీ గిరి పాపవిభుని*

*తే॥ గీ॥ యాత్మజాతుండ విరూపాక్షాహ్వాయుండ*
*వెలిగి చెప్పితి గైకొమ్ము నీకు శతక*
*ప్రణుత ధవళాంగ ! మౌని హృత్పద్మ భృంగ !!*
*అమితభవభంగ ! శ్రీ కాళహస్తిలింగ !!*

ఇందు మూరుపద్యాలున్నాయి. దీనిలో లోకనీతి, శివస్తుతి చేయబడింది. కవి వీర శైవాచారాలను యిందు గ్గడించాడు. శివభక్తిప్రాశస్త్యం తెలిపినాడు. కాని, ఎంత శైవుడైనా విష్ణువు పేరు తలపెట్టక పోలేదు. శైలి రమ్యమై రసవత్తరంగా ఉన్నది. కవిత హృద్యం. శతకంలో ఉత్తమాధమ క్షితియుల గుణాలు వివరించబడినవి. ఈ పద్యాలలో కొన్ని వేమన, వేణుగోపాల, నరసింహ, కుక్కుటేశ్వర శతకాల పద్యాలను పోలివున్నాయి. పోతన పద్యాల పోలిక కూడా అక్కడక్కడ కనబడు చున్నవి. ఈ కవి కాలం స్పష్టంగా తెలియదు. దీని తాళపత్ర ప్రతులు 200 సంవత్సరాలు ప్రాచీనమైనవిగా కనబడడం చేత ఈ కవి క్రీ.శ. 1700 సంవత్సరానికి ముందువాడుగా తోచును. ఇతడు కవిత్వంలో ''కులము గోదావరి పాల జేయు' అనే సామెత వాడినందువ ఈ కవి గోదావరీ మండలం వాడేమోనని శిష్టా రామకృష్ణ శాస్త్రి గారూహించు చున్నారు.[1]

*సీ ॥ కొంతకాలము తల్లికుక్షిలోపిండమై*
*మలమూత్రముల యందు మ్రగ్గి యుండు*
*జనియించి యొక కొన్ని సంవత్సరంబులు*
*బాలుడై యవివేకలీలనుండు*
*మదనభూతముసోకి మరికొన్ని దినములు*
*సతులతో రతికేళి సల్పుచుండు*
*పుత్రేషణంబున బోరి పోరి కొన్నాళ్లు*
*కదలేని భ్రాంతిచే గడు మునింగి*

వార్ధకంబున గడు డస్సి వడుకుచుండు
నిట్లు విహరించునరు డు మిమ్మెట్లు దెలియు
ప్రణుత ధవళాంగ మౌని హృత్పద్మభృంగ!
అమితభవభంగ! శ్రీ కాళహస్తిలింగ॥

*1 వీర శైవాంధ్ర వాఙ్మయము - 1952 (తి.తి.దే. ప్రచురణ)*

సీ॥ సర్వ సర్వంసహా చక్రమేలిన హరి
శ్చంద్ర భూవిభుఁ గూడి చనదు వసుధ
చోర నిగ్రహ దురాచారవారితుఁ డైన
పురుకుత్సుతో గూడి పోదుసేన
శత్రు దానవలోకసంహారుఁ డైనట్టి
రాముతో బోదాక రత్నమైన
నీతి ధర్మ జ్ఞాన నిపుణుఁ డై యిలనేలు
ధర్మజాతోఁ గొంత ధనము వోదు

తాను జేసిన ధర్మంబు తగిలి వెంట
పయనమై వచ్చుఁ దక్కువి పనికిరావు
ప్రణుత ధవళాంగమౌని! హృత్పద్మభృంగ!
అమితభవభంగ! శ్రీకాళహస్తిలింగ!!

సీ॥ వెన్నిచ్చి రణరంగ విముఖుఁ డై చనువాని
నిర్విణ్ణుఁ డై మ్రోల నిలుచువాని
భ్రమసి కైదువు చేత బట్టుకుండెడివాని
జెట్టెక్కి భయమునఁ జిక్కువాని
పాదలిన భీతిమై పుట్ట యెక్కినవాని
స్రుక్కు జలంబులోఁ జిక్కువాని
క్రిందుగా శవముల క్రింద దాగినవాని
నుర్వి పైఁ బ్రణమిల్లి యున్నవాని

భయము వారించి రక్షింపఁ బాడిగాక!
చంపఁ జెల్లదు శూరులు సమరమునను
ప్రణుత ధవళాంగమౌని! హృత్పద్మభృంగ!
అమితభవభంగ! శ్రీకాళహస్తిలింగ!!

సీ॥ బలవంతుడై వైరి బలముల సాధించి
గడి దుర్గముల నెల్ల ఘనుల నునిచి
జార తస్కర దురాచారుల శిక్షించి
మహి గ్రుటమన్నీల మట్టు పరచి
ఘోటక భటు వీర కుంజరంబుల గూర్చి
బలిమి నానాటికి ప్రబల జేసి
మున్ను జేసిన ధర్మముల వృద్ధి బొందించి
పేద సాదల నెల్ల నాదరించి

జగతి పాలించు నుత్తమక్షత్రియుండు
విపుల విఖ్యాత కీర్తిచే వెలయు దిశల
ప్రణుత ధవళాంగమౌని! హృత్పద్మభృంగ!
అమితభవభంగ! శ్రీకాళహస్తిలింగ॥

శ్రీ ధరార్చితభర్గ! చిత్తజాంతక యీశ!
నిర్జిత గజదైత్య నీలకంఠ!
నతదివ్యకోటీర నవ్యరత్నప్రభా
భాను కరోత్ఫుల్ల పాదపద్మ!
ధాత్రీధరేంద్ర కోదండమండితహస్త
దహనతారాధిప తరణినేత్ర
సకలలోకాధార శాశ్వత సర్వజ్ఞ
సచరా చరాకార శైలభర్త!

యవధరింపుము నానేర్చినట్లు నీకు
విన్నవించెద శతకంబు వేడ్కలలర
ప్రణుత ధవళాంగమౌని! హృత్పద్మభృంగ!
అమితభవభంగ! శ్రీ కాళహస్తిలింగ॥

సీ॥ ధనవంతుడై యుక్త దానహీనుండైన
నరుని వర్తన, జూచి నగును ధనము
తనయుని ప్రేమతో తండ్రి ముద్దాడంగ,
జూచి నవ్వును జార సుదతి మదిని
'అవని నాది' యని యనిశంబు గర్వించు
ధరణీపతిని, జూచి ధరణి నగును
వెన్నిచ్చి రణరంగ విముఖుడై చనువాని
నలి మృత్యు వెంతయు నవ్వు గాన

లోభితనమున నిందకు లోనుగాక
మెలగ నేర్చిన నరునకు గలుగు సుఖము
ప్రణుత ధవళాంగమౌని! హృత్పద్మభృంగ
అమితభవభంగ! శ్రీ కాళహస్తిలింగ!!

సీ॥ తనయుపై గల ప్రేమ తల్లిదండ్రులమీద,
గలుగ నేర దదేమి కారణంబొ!
ఇంతిపై గల ప్రేమ యిష్టదైవముమీద
లేదు నరుల కెట్టి లిఖిత ఫలమొ!
ధనముపై గలబాళి ధర్మమార్గములందు,
దలపకూడదదెట్టి దైవ ఫలమొ!
తన ప్రాణముల మాడ్కి ధరణి జీవుల నెల్ల
కలయ, జూడరదేమి కర్మఫలమొ!

సరసిజాసను, డీరీతి సర్వజనుల
మోహజల రాశిలో సదా మునుగ, జేయు
ప్రణుతధవళాంగమౌని! హృత్పద్మభృంగ!
అమితభవభంగ! శ్రీ కాళహస్తిలింగ!!

పై పద్యములను బట్టి కవి కెట్టి సూక్ష్మ జ్ఞానము, లోక వ్యవహారము లందు కలవో స్పష్టమగుచున్నది. ఈ కవి సోమవార వ్రత మాహాత్మ్యము ను ద్విపదలో రచించిన శ్రీగిరి మల్లికార్జున కవి బంధువేమో ! [1]

## 55 సాంబశివామహాప్రభో శతకము

దీనికర్త బాణాల వీరశరభేంద్రుడు. ఇతడు అగసాలి కులానికి చెందినవాడు. బాణాల వంశ దీపిక సనాతన గోత్రం వాడనని చెప్పినాడు ప్రశస్త భూపతీపాలకుడైన వీరశరభేంద్రుడట నిత్యం కోటి లింగాలను పూజ చేసి శతకాన్ని రచించాడు. ప్రథమ కబళంలోనే మక్షిక పాతము వలె మొదటి పద్యంలోనే యతి తప్పినది.

''రాజిత కాళహస్తి మణిగోపుర ! సాంబశివా ! మహాప్రభో !'' అన్నది మకుటం ఇతని కవిత్వం నిర్దుష్ట భాషలో లేదు దుష్ట సమాసాలు, ధూర్జటి అభిప్రాయ చౌర్యాలు, గ్రామ్యోక్తులు కన్పట్టు చున్నది. భక్తున కుండవలసిన యావేశము గాని నూతనాభిప్రాయ ప్రకటన గాని కన్పట్టుట లేదు. ఇటీవల పాడైన శతకాల కంటె మిన్నగా వున్నది. ఇతడు భద్రయ పుత్రుడు, కాళహస్తి వాసుడై యుండును సువర్ణముఖీనది పేరెత్తినాడు. ఇతని పద్యాలు అన్నీ విశ్వకర్మకుల భూషణుడు గాన పంచపాదులుగా దింపినాడు.

*ఉ॥ పిత్తళి హేమమౌనె ! యది నెన్ని పుటంబులు చేసి చూచినన్*
*ఇత్తడి యిత్తడేని నిది యెక్కువ సొమ్ముకు నష్టి చేటు, నా*
*యిత్తడి పైడి యౌనె ! యిది యన్యమెఱుంగక రిత్త వేల్పులన్*
*సత్తుగ పూజ చేసినను సద్గురు పాదము నమ్మకుండినా*
*ఉత్తరి కాళహస్తి వృషభేశ్వర ! సాంబశివా ! మహాప్రభో !*

చచ్చి చెడి పద్యమగుచున్నదే కాని సాఫు లేదు సత్యం లేదు.

---

*1 వీరశైవాంధ్ర వాఙ్మయము - శిష్టా రామకృష్ణ శాస్త్రి, 1952 మరియు మా ॥ శతక కవుల చరిత్ర - వంగూరు సుబ్బారావు , పుట- 306*

ఉ॥ *నెత్తిన గంగయుండ శశిశ్వేతమునుం దనిలుండునుండ నీ*
*యెత్తున ధాన్యముండ మరి యెత్తుగ చేతను పాత్రయుండ నీ*
*పొత్తున గూడునుండుకొని చోద్యముగా భుజియింపరావె యీ*
*పిత్తమదేమి బోగివలె భిక్షకు బోవగనేమి వట్టిదే*
*దిట్టవు కాళహస్తి మత దిక్పతి సాంబశివా మహాశివా !*

ఈ పద్యం ధూర్జటి వ్రాసిన ''నీకున్ మాంసము వాంఛ యేని కలవా? నీ చేత లేడుండగా " (ప.20) అన్ని పద్యానికి అనుకరణ కన్నప్ప స్థానంలో 'భిక్షాటన' విషయాన్ని ప్రవేశ పెట్టాడు. శివునిభిక్షాటన లోని అంతరార్థం తెలియలేదు కాబోలు !

## 5.6 శ్రీకాళహస్తీశ్వరశతకము

దీనికర్త శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు. వీరు చిత్తూరు నివాసులు కొంతకాలము తిరుపతిలో కూడ నివసించారు. పారిజాతాపహరణమునకు పరిమళోల్లాసమనే వ్యాఖ్య రచించారు. 'శ్రీ కాళహస్తీశ్వరా !' అనే మకుటంతో వీరి శతక రచన సాగింది వీరు క్రీ.శ. 1860 ప్రాంతములలో జీవించినారు

*నీవే తల్లియు, దండ్రియుం దలప, గా నీవే మదీయాప్తుడు*
*న్నీవే నాకు సహోదరుండు గురుడు న్నీవే భయత్రాత యు*
*న్నీవే కోరిన విచ్చు దాతయునుగా నిక్కంబుగా నెంచుచున్*
*సేవింతున్ సతతంబు నెమ్మది నినున్ శ్రీ కాళహస్తీశ్వరా! (ప-81)*

*నీవే సర్గ మొనర్తు లోకముల నున్నిద్రుండవై బ్రహ్మ నా*
*నీవే వీనిని గాంచుచుందు కరుణ న్నీ రేరుహాక్షుండు నా*
*నీవే సంహరణంబు సేయుదువు వీనిన్ వ్యోమకేశుండునా*
*నీవే సర్వనియంత వౌదు వరయన్ శ్రీ కాళహస్తీశ్వరా ! (ప-89)*

*శివ ! నారాయణ ! పార్వతీరమణ ! లక్ష్మీనాథ ! శ్రీకంఠ ! కే*
*శవ ! గంగాధర ! శౌరి ! శూలి ! కమలాక్షా ! యంచు నీ రీతి మా*
*నవ దేవాదులు సేయుస్తోత్ర తతి యెన్న న్విన్న వెందుం*
*శివ విష్ణ్వాది పదాళి విన్న తెలుపున్ శ్రీ కాళహస్తీశ్వరా ! (ప -86)*

## 5.7 విశ్వనాథ మధ్యాక్కఱలు [1]

విశ్వనాథ సత్యనారాయణ (1895-1976) 'కవిసమ్రాట్టు'గా ప్రఖ్యాతి గాంచిన కవీశ్వరులు. వీరు 'మాస్వామి' అనే విశ్వేశ్వర శతకాన్ని చిన్ననాడే రచించారు. తర్వాత 1956-60 ప్రాంతాలలో 'మధ్యాక్కఱ' ను చేపట్టి తెలుగుదేశంలోని పది దేవతల్ని స్తుతిస్తూ వంద పద్యాల చొప్పున వేయి పద్యాలను మధ్యాక్కఱల్లో వ్రాశారు.

"ఈ పుస్తకము విల్వవమ్ము వృత్తవైశిష్ట్యంబు మహిమ" అని వారే అంకితపత్రంలో పేర్కొన్నారు. ఈ మధ్యాక్కఱల్లోని పది శతకాల పేర్లివి.

1) శ్రీగిరి శతకము
2) శ్రీకాళహస్తి శతకము
3) భద్రగిరి శతకము
4) విశ్వేశ్వర కులస్వామి శతకము
5) శేషాద్రి శతకము
6) దాక్షారామ శతకము
7) నందమూరు శతకము
8) వెకరుకల్ శతకము
9) మున్నంగి శతకము
10) వేములవాడ శతకము

ఇందులో రెండవది శ్రీకాళహస్తి శతకము. నన్నయ తర్వాత తెలుగు సాహిత్యంలో 'మధ్యాక్కఱ' అనే దేశీయ ఛందస్సును చే పట్టి దానిలో లో వేయి పద్యాలను వ్రాసిన ఘనత దాదాపు వేయి సంవత్సరాల తర్వాత ఆధునిక శతాబ్దంలో కవి సమ్రాట్ విశ్వనాథ వారికే దక్కింది. ఇది అందరూ ఏక గ్రీవంగా అంగీకరించిన విషయం. ఆధునిక వచన కవిత్వానికి సన్నిహితంగా ఉన్న ఈ ఛందస్సును నేటి పాఠకలోకానికి విశ్వనాథ ప్రసాదించిన గొప్ప ప్రయోగాత్మక, ప్రయోజనాత్మక వరంగా పరిగణింపవలసి వుంది.

---

*1 బ్రహ్మమయమూర్తి- విశ్వనాథ సాహితీ దర్శనం -ముదివేడు ప్రభాకరరావు తాటికొండ వేంకట కృష్ణయ్య, 1976.*

మహాకవి ధూర్జటి తర్వాత అంతటి గాఢమైన స్వీయ కవితాముద్రతో శతక, కావ్యరచన చేసినవారు విశ్వనాథ ఒక్కరే. అందుకే కాళహస్తి శతకాన్ని మళ్లీ వ్రాశారా అనిపిస్తుంది. 'మాస్వామి' అనే విశ్వేశ్వర శతకంలో ''ఏ యెడ ఁజూచినన్ పూర్వకవి పాదాంకంబులే తోచింది.'' ''తేనెల్ త్రావిన నోటికిన్ జలములందిపయ్యె విశ్వేశ్వరా!'' అంటారు. ఈ 'పూర్వకవి పాదాంకంబుల' లో మహాకవి ధూర్జటి అడుగుజాడలున్నా యని వేరుగా చెప్పనవసరము లేదు. ధూర్జటి కవితా ముద్ర కూడా వీరి కవిత్వం పై పుష్కలంగా పని చేసింది, అనడానికి మధ్యాక్కరల్లోని రెండవ పద్యంలో ధూర్జటిని యిలా స్మరించారు.

*తొలివాడు కలకండ పలుకులం బోని ధూర్జటి సుకవి*
*పలుకులం బోని దాహమ్ము, చూచెడు వట కాగరాని*
*యెంపట్ల నిను ఎవ్వి హావి యప్పటి కాటియు మెఱల*
*నలసట యగుమ శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ!! (2)*

తిరుపతిలోని స్వామికి, ఆయన ప్రక్క ఊరిలోనే యున్న శ్రీ మహాదేవునికి భేదాన్ని భక్తులే చూపిస్తున్నారట!

*తిరుపతికిం బోయి యొదలి నగల్లఁదీసి యిచ్చెదరు*
*హర! వచ్చి నినుఁజూచి యొక నమస్కార మాచరించెదరు*
*వెటపించుటకు మరపించుటకు గల భేద మిద్ది హర హర*
*మహాదేవ! శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ! (3)*

హరి హరుల మధ్య గల తారతమ్యం పైకి కన్పడినను వారిలో అభేద లక్షణమే విస్ఫుటంగా వుందని అంటూ,

*ఆయన యహిరాజు శయ్య నిదించె, నా యహిరాజె*
*నీ యెడ భూషణం బయ్యె, గొడుకయ్యె నీ వాని యొకటి*
*యైయున్న తత్త్వంబొ మీర లిద్దఱా! యధికమా! యేదొ*
*యై యున్కి తోచ శ్రీ కాళహస్తీశ్వరా! మహాదేవ! (7)*

శ్రీ కాళహస్తి క్షేత్రంలో ముక్తి పొందిన తొలి యుగాలలోని భక్తులను స్మరించినారు విశ్వనాథ

*పొత్తపివాటి దైవంబ ! మై మైల పోగుల చెదలు*
*చెత్త రాళ్లలు చేర్చు నేగ్గు పాములు, చెప్పొత్తు బోయ,*
*చిత్రమ్ముగను వచ్చి మల్లె పూ దేవి చిన్కుల కైత*
*హత్తదా నీకు శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ !* (ప-10)

మరొక పద్యంలో ''ప్రామిమ్కుదినుప !" అని సంబోధిస్తారు శివుణ్ణి. 'పొత్తపివాటి ప్రామిమ్కుదినుసు' శ్రీకాళహస్తీశ్వరుడని మనం అన్వయం చేసికోవాలి !

అలాగే మొదట ధూర్జటిని స్తుతించిన తర్వాత పూర్వ కవుల్ని యిలా తనతో చేర్చి పలుకుతున్నాడు స్వామితో.

*పాము ప్రా(త యుగంబుదాని (దమవు లోపల (జేర్చి కొంటి*
*సోమిత దురితంబు మల్లికార్జునుండును, బసవన్న ,*
*సోమన యన్నమయ్యయును నేను, నీ స్తుతి పతంజలుల*
*మై మేము కామె శ్రీకాళహస్తీశ్వరా ! మహాదేవ !*

ఈ పద్యంలో శివ తత్త్వసారము వ్రాసిన మల్లికార్జున పండితారాధ్యులు వారు, బసవేశ్వర వచనాలు వ్రాసిన వీర శైవ మతోద్ధారకుడు బసవేశ్వరుడు (ఇతడు నంది యొక్క అవతారం) పాల్కురికి సోమనాథుడు వీరశైవ సాహిత్య స్రష్ట, యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతక కర్త వీరితో బాటు తానూ ఒక స్తుతికర్త, బహుగ్రంథకర్త, అని చెప్పకొన్నాడు ఎలా? వీరు భాషాపర శేష భోగులు ! పతంజలి ఆదిశేషుని అపరావతారంగా చెబుతారు. పతంజలి వ్యాకరణ మహాభాష్య పార ప్రవచనం చేస్తుంటే ఒక మహాసర్పం వచ్చి వినేదట ! అలా ఈ కవులందరూ భాషాపర శేషభోగులై శివస్తుతి చేయగా ఆ స్వామి చెవులు దోర బెట్టుకొని కండ్లు పెద్దవి చేసి

విన్నాడు కాబోలు ! ఆయన మెడలోని అహిరాజు విన్నాడు ! అదే కవుల పాలిటికి మోక్షం ! కావ్య పాఠకులకు సూక్ష్మంలో మోక్షం !!

కవి ఆత్మ నివేదన, జీవుని వేదన ఈ క్రింది పద్యంలో స్పష్టమౌతుంది.

*ఈ కోప , మీ యహంకార, మీ కామ మివి యెల్ల స్వామి*
*నీ కృప కలుగక వెక్కుచుం బయనించుచుట్లుగను*
*లేకున్నవయ్య ! యుషర్బుధ విలోక ! లేలిహానాంగ*
*దా ! కాలకంఠ ! శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ !! (42)*

సార్వకాలిక నివేదనంగా, సర్వ జీవులకు ప్రాతినిధ్యం వహించి కవి దేవునికిలా విన్నవించుకొంటున్నాడు

*అన్నాను, నీ భక్తుఁడ నని పైకి నీ యడుగుల నందు*
*కొన్నానా? అది లేదు ! గుడ్డి గుడ్లాలకుం బండ్లు తోము*
*మన్నాను ! యమ నియమములు ధ్యానంబు నొకయింత లేవ*
*యన్న ఖాదినదు శ్రీకాళహస్తీశ్వరా ! మహాదేవ ! (ప - 64)*

తన కవితనే శివునికి నీరాజనంగా చేసి సమర్పించినాడు కవి సమ్రాట్ విశ్వనాథ-

*వెసనావు పాల్పోని నాదు కైత నైవేద్య మిచ్చెదన ,*
*రస గప్పురము వోని నా శరీర మార్గాతిక నిత్తు ,*
*కసటు నా యూ బ్రదు కగురు ధూపంబుగా నిత్తుస్వామి ,*
*హసియుంపు మివట, శ్రీ కాళహస్తీశ్వరా ! మహాదేవ ! (ప -98)*

5.8 శివానుగ్రహము [1]

''తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారు బహు గ్రంధకర్తలు. సాహిత్య విద్యలో కవిసమ్రాట్ విశ్వనాధ వారికి శిష్యులు. శతకాలు, కావ్యాలు, నవలలు, ఎలిజీలు, ఖండకావ్యాలు వ్యాసాలు, ఉపన్యాసాలు, వేదాంత గ్రంధాలు,

*1 శివానుగ్రహ శతకాన్ని గూర్చి నాకు తెలియజేసి వివరణలు చెప్పిన డా ॥ ముదివేడు ప్రభాకరరావు గారికి మిక్కిలి కృతజ్ఞుడను*

అనువాదాలు, ఆంగ్లరచనలు వీరివి కోకొల్లలు. 'శివానుగ్రహము' 'శివా' అనే మకుటంతో గల శతకం శివానుగ్రహం కోసం వ్రాయబడింది. దీనితో పితృయజ్ఞ మనే స్మృతి కావ్యము లో శ్రీరాముని కథ చెప్పబడింది" .

రామలింగేశ్వరరావు సర్వ స్వతంత్రుడు. మహామేధావి గొప్ప కవి ఈయన గుడివాడలో క్రీ.శ. 1920 లో జన్మించారు. మంత్ర ద్రష్టలై పాదుకాంతదీక్షను కూడా గ్రహించి తురీయాశ్రమంలో అద్వయానంద భారతీస్వామిగా స్థిరపడ్డారు. వీరు శ్రీ శృంగేరీ దక్షిణామ్నాయ పీఠానికి చెందినవారు. ఆ పీఠం వారు నిర్వహించే 'శ్రీ శంకరకృప' అనే పత్రికకు దాదాపు 35 సంవత్సరాలు సంపాదకులుగా పని చేశారు. ఇటీవలనే హైదరాబాదులో 1991 లో శివైక్యం పొందారు.

శివానుగ్రహము 1957 లో ప్రచురింపబడినది.

*కవితా సాధన యోగసాధనముగా కల్పించి సద్యోగ సం*
*భవ మానందము పొందనెంచితి రసబ్రహ్మావతారా ! రసో*
*ద్భవ సాహిత్య సదబ్జయోని ! పృథు శబ్దబ్రహ్మ నిర్మాత్రి ! నా*
*కవితా యత్నము లర్థవంతములుగా కల్పింపనీవే ! శివా ! (2)*

పూర్వకవుల అడుగు జాడల్లో తాను పయనించుచున్నానని చెబుతూ -

*ఇది యొక సాధనాపథము నెందఱో పూర్వ ఋషుల్ గమించి ఎ*
*న్నవి ! మహనీయులా పురుషులందఱు, తత్పద పంకజాతముల్*
*కదలిన గుర్తులం బడి ప్రకామ గతిన్ పయనింతు నేను, వా*
*రిదె యనుభూతి నన్నును వరించు సనాతనభావమై శివా !*

ఆ పూర్వ కవుల్లో వేములవాడ భీమకవి తర్వాత తానంతటి మహత్తర వ్యక్తినని, శక్తినని ఉద్ఘాటిస్తున్నాడు.

*ఘను డై వేములవాడ వంశజు డు ద్రాక్షారామ భీమేశ నం*
*దను డై పాడిన వెల్ల పాటలుగ విద్యాస్నాతునిన్ జేయగా*
*దినముల్ చన్నవి, నేడు వీడొక డు భక్తిద్యోత పద్యాంబు మ*
*జ్జనముల్ గూర్చెడు నీకు దైవతధునీజాట్యాగవీధీ ! శివా! (ప-62)*

ఇట్టి కవికికూడ లోకములో కష్టాలు తప్పలేదు. దానినే శివునికి నివేదించుకొంటున్నాడు.

*ధనమూ లేదు, కుటుంబమూ ! మిగుల పెద్దపోయె లోకంబులో*
*మనుజ స్నేహితులన్నవారు కనుపింపన్ రారు, కార్యంబు చే*
*సిన దేయొక్కటి లాభమందదు, నుదాసీనంబుగా జాతురా*
*యెను ధర్మంబును, మాదృశుల్ జగతిలో నెట్లింక నౌరా ! శివా !*
*(ప- 58)*

కవి యొక్క ఆత్మవిశ్వాసాని కీ క్రింది పద్యం ఉదాహరణగా చెప్పవచ్చు.

*ఏనాడో యొక భక్తు గాచినది లెక్కే లేదు పోవయ్య ! నీ*
*వీ నాడున్ నునువంటి వాని గనుగొంటే గాని లాభంబు లే*
*దో నీహారనగాత్మజాధిప ! దయాద్యోగాంగజాట్యాగ సు*
*శ్రీవిద్యాకృతి ! సర్వమంగళమునస్సేమాధినేతా ! శివా ! (ప -102)*

## 5.9 శ్రీకాళహస్తీశ్వర త్రిశతి [1]

శ్రీ చెఱుకుపల్లి జమదగ్ని శర్మగారిని గూర్చి ముందే తెలుసుకున్నాము. ఈ 'త్రిశతి' రచన కూడా వారి రచనల్లో ఒకటి. 'శ్రీ కాళహస్తీశ్వరా' అను మకుటంతో మూడువందలపద్యాలు త్రిశతి రచనలో చోటుచేసు కొన్నాయి. పాల్కురికి సోమనాథుడు తెలుగులో 'త్రిశతి' రచన కు కూడా ఆద్యుడు.

''ధూర్జటి శ్రీ విద్యానిధి. ఆయన శ్రీ కాళహస్తి మాహాత్మ్యం'' 'శ్రీ విద్యానిధియై " అనే మాటతోనే ప్రారంభమవుతూ ఉంది. అలాంటి మహాకవిని 'జమదగ్ని' శ్రీ కాళహస్తిక్షేత్ర నివాసియై స్మరింపకుంటారా! ఆస్మరణ ఎంతగా ధూర్జటితో సామ్యాన్ని స్థాపిస్తున్నదో చూడండి ! "

---

*1 శ్రీ విద్యానిధి - శ్రీ జమదగ్ని ——— ముదివేడు ప్రభాకరరావు*
*స్రవంతి, హైదరాబాదు, 1980, పుటలు 21-30*

*శ్రీవిద్యా పరమార్థభూతమగు నీ శ్రీమంత్రరాజంబు ద్ర*
*ష్టౌ విద్యానిధి ధూర్జటి ప్రభువు నాయందుండి నాచే భవత్*
*సేవర్ణాఖిల విశ్వమోహన తనూ సౌందర్య మాహాత్మ్యమున్*
*సేవార్థం బుదయింప జేసె నభవా ! శ్రీ కాళహస్తీశ్వరా !*

''ధూర్జటి శ్రీ మంత్రరాజ విద్యానిధి ! ద్రష్ట ! అంటున్నాడు కవి అందే ఋషి వంటి వాడని అర్థం. అటువంటి ఆయన తన గుండెలో కూర్చొని (భంగ్యంతరంగా 'ధూర్జటి' యైన శివుడే తన గుండెలో కూర్చొని) చెప్పగా తానీ 'త్రిశతి' వ్రాశాడంటే తాను కూడా ధూర్జటి అంతటివాడే నన్నమాట !'' 'శివోఽహం' అన్న మాట కర్థ మిదే !

5 9 1 సార్థక నామధేయులు

'త్రిశతి' లోనే వీరు శ్రీవిద్యారహస్యాలెన్నో నిక్షేపించారు లలితాసహస్రనామావళిలోని ''హరనే త్రాగ్ని సందగ్ధ కామ సంజీవ నౌషధిః'' అన్న నామాన్ని, తన పేరుకు ముడి బెట్టి చమత్కారంగా తత్త్వ స్ఫోరకంగా అల్లిన ఈ క్రింది పద్యం చూడండి.

*అపలాపం బగుగాక నీకయిన భార్యం గూర్చు తియ్యవి ల్తుని*
*ప్రపతన్ గాల్చితి, వమ్మ కాచికొనె నాథన్యాత్మ , నన్నిక్షుప*
*ల్లిపనామున్, జమదగ్ని మాతృపద భక్త్యుద్విగ్నచేతస్కునిగా*
*వి పరీక్షించెద వోర్చి కొందు నెటులో శ్రీ కాళహస్తీశ్వరా ! (పద్యం -33)*

ఇది చాల గొప్ప పద్యం. పద్య రచనా శిల్పం, చమత్కారం, తాత్త్వికార్థం మూడూ పెన వేసుకొన్న పద్యమిది. శివుడు చెఱకు విలుకాడైన మన్మథుని నిర్దాక్షిణ్యంగా భస్మం చేసినాడు. కాని పార్వతీ పరిణయానంతరం మన్మథుడు తిరిగి బ్రతికినాడు. అదీ తల్లి దయవల్లే 'ఇక్షుపల్లి' ఉపనాముడైన అంటే 'చెఱకుపల్లి' అనే యింటి పేరు గల ఈ జమదగ్ని మాతృపదభక్తిలో ఉద్విగ్నమైన చేతస్సు గలవాడు. వానిని మాత్రం నీవు ఉడికించి పరీక్షిస్తున్నావు. ఎలా

ఓర్చుకోగలనో? అని కవి చమత్కరిస్తున్నాడు. ఆ చమత్కారంలో ధ్వని ఎంతో యిమిడ్చాడు. ఓర్చి కొందు నెటులో ? ఎలా ఓర్చుకో గలనో? అని ప్రశ్నార్థకంగానూ ఉంది. ''ఏలాగో ఒకలాగు ఓర్చికొంటానులె'' అని సర్దుబాటు ధోరణీ వుంది.

పై పద్యం చివరి పాదంలో కవి జీవుని వేదన వ్యక్తమౌతోంది. లలితా సహస్ర నామావళిలో ''హరనేత్రాగ్నిసందగ్ధ కామసంజీవనౌషధిః'' అని చెప్పబడింది. శివుడు కామాన్ని జయించాడు ఎలా? కామదహనం వలన ఆ కామ దేవతను సంజీవింప జేయడంలో ఔషధంగా పని చేసిందెవరు? దేవి అంటే నశించిన కామం తిరిగి పుట్టిందన్నమాట ! దాని కప్పుడు బలమెక్కువ రెట్టింపు శక్తితో అది తన ప్రభావం చూపిస్తుంది. అరిషడ్వర్గాలు అంతః శత్రువులు. అందులో కామం మొట్ట మొదటిది. కామనాశనం చేతనే మోక్షం అంటే మోక్ష మార్గానికి కామం అడ్డు తగులుతోంది. తల్లి బాహ్యంగా సంజీవింప జేసిన కామాన్ని సాధకుడు ఆంతరంగా జయించాలన్నమాట ! దానికి శివానుగ్రహం కావాలి ! కాబట్టి దేవీ భక్తుడైన కవి ఇంద్రియనిగ్రహం శమదమాలు అనుగ్రహించమని శ్రీ కాళహస్తీశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాడు.

## 5 9 2 దేవీ భక్తుడు

''ఇక్కడి చమత్కారం అటుండనిచ్చి 'జమదగ్ని మాతృపద భక్త్యుద్విగ్న చేతస్కు'' డనేది ప్రస్తుతాంశం. మరి యింతటి భక్తుడు విశ్వనాథ వలె 'దేవీ త్రిశతి' చెప్పకుండా శ్రీకాళహస్తీశ్వర త్రిశతి ఎందుకు వ్రాశాడు అని ప్రశ్న రావచ్చు. దాని కాయనే యిలా సమాధానం చెప్పి వున్నారు.

''శతకము తల్లి పేర వచ్చుట లేదే అను చింత కలుగ లేదు. తల్లి నుపాసించు చుండగా తండ్రి పేర వచ్చుట స్థూల దృష్టికి వింతగా తోపవచ్చును గాని తత్త్వదృష్టి కందులో వైరుధ్య మేమియు లేదు. తల్లి వేఱు తండ్రి వేఱు అయిన కదా వైరుధ్యము. వారిరువురు అభిన్నులు. ఒకే పరతత్త్వము స్త్రీపుం రూపములుగా విభక్తమైనట్లు తోచుచున్నది. శివుని విషయమున నా ఆభాస కూడ లేదు. ఆయన అర్ధనారీశ్వరుడు'' ('త్రిశతి'- మనవి, పుట IV)

''తత్త్వతః దేవికీ శివునికీ అభేదప్రతిపత్తి. కాబట్టే 'తల్లికి వచ్చిన బిడ్డ' అయిన కవి యిట్లంటున్నారు

*పుట్టంగా ప్రతిబిడ్డయున్ జననినే ముమ్మందు తా గాంచు*
*బొట్టిన్ పట్టిని డెంద మం దదిమి సంపూర్ణామలానంద మం*
*చిట్టే ట్టౌందగ దల్లి, తండ్రి యిదుగో, యిందయ్య మీ బిడ్డ, మీ*
*రెట్టే వొక్కటి యంచు జెప్ప దెలియున్ శ్రీ కాళహస్తీశ్వరా ! "*

''తల్లి కంటె తండ్రి నూహన చేసికొనుట కష్టసాధ్యమని దీని కర్థం. తల్లి సులభగమ్య తండ్రి క్లిష్టసాధ్యుడు అటువంటి తండ్రి నే సంబోధించుటచే తల్లి తండ్రిలో అంతర్భవిస్తూ వుంది. కాబట్టి తల్లి తండ్రుల్లో ఎవరిని కీర్తి చేస్తూవా ఇద్దరినీ చేస్తునట్లవుతుంది. దీనికి వాల్మీకి మహర్షి యే మనకు పరమ ప్రమాణం. శ్రీమద్రామాయణం వ్రాస్తూ మహర్షి 'సీతాయాశ్చరితం మహత్' అన్నారు. సీతమ్మ మాయమ్మ, శ్రీరాముడు మాకు తండ్రి అన్ని త్యాగరాజుల వారు చేస్తునట్లు 'రామ' శబ్దు మందే సీతారాము లిద్దరూ వున్నారని అంతరార్థం (రామ + అయనం = రామాయణం, రామా + అయనం = రామాయణం) 'రామా' అనా 'దేవి' 'సీత' కాబట్టే జమదగ్ని కవి, ఉత్తర రామాయణానికి 'శ్రీరామరాజ్యము' అని పేరు పెట్టడంలో పరమౌచిత్యం యిమిడి వుంది. అది 'శ్రీరామ రాజ్యం' 'శ్రీ రమా రాజ్యము' కూడ అవుతున్నది. 'రమ' - లక్ష్మీదేవి, యిక్కడ 'సీత'. వాల్మీకి లోను అంతే రామాయణం నిజంగా సీతాయనమే ! కాబట్టి 'శ్రీదేవీ రాజ్యం' శ్రీ విద్యా రాజ్యం లేక 'శ్రీ విద్యాసామ్రాజ్యం' అని తేట తెల్లమవుతోంది !''

ఇదీ 'త్రిశతి' లో జమదగ్ని కవితావైశిష్ట్యం !

## 5.10 శ్రీజ్ఞానప్రసూనాంబికా శతకము

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ ఈ శతకకర్త్రి! ఈమె అనంతపురం జిల్లా, తాడిమర్రి గ్రామంలో 20-12-1910 వ సంవత్సరం జన్మించింది.

తల్లి తండ్రులు శ్రీరా సుబ్బలక్ష్మమ్మ శ్రీ రామ శర్మ కడప జిల్లాలో ప్రొద్దుటూరు తాలుకా ఎరగుంట పల్లె శ్రోత్రియుందారు గంటి సుబ్రహ్మణ్యము గారి జ్యేష్ట కుమారులు గంటి వెంకట సుబ్బయ్య గారి ధర్మపత్ని అయినది.

*మునునా యిందిర కోడలైన రతియుం బూతాత్మ సావిత్రియున్*
*ఘనమౌ దీర్ఘ సుమంగలీత్వమును నీ కారుణ్య భాగ్యంబునన్*
*దనియం గల్గిరి నాకు నట్టి వర మత్యంతాను కంపామతిన్*
*జననీ ! యిమ్ము నినున్ భజింతు నెపుడున్ జ్ఞాన ప్రసూనాంబికా !*

అని యంబికను ప్రార్థించి యున్నను వాదేవి యామె ప్రార్థన మాలింపక 1940 వ సంవత్సరమున భర్తను, 42 వ సంవత్సరమున తల్లిని, అక్కగారిని మ్రింగివైచెను. తండ్రి సన్యసించి విమలానందతీర్థుడయ్యెను.

భర్త వ్రాయుచు విడిచిన కౌలుట్లాధిప చెన్నకేశవ శతకాన్ని పూర్తి చేసి, అక్కగారి జ్ఞాపకార్థము జ్ఞాన ప్రసూనాంబికా శతకమును రచించినది.

ఈ శతకము కాంత్యుజ్జ్వల సమంచిత శైలీ సమలంకృతమై యున్నది.

*కైలాసాచలవాసినీ ! గిరిసుతా ! కల్యాణ సంధాయినీ !*
*కాళీ తాండవ లాస్య కేళిరసికా ! కౌమారి ! కాత్యాయనీ !*
*హేలాలోల కురంగశాబకధరీ ! హ్రీంకారబీజావృతా !*
*కాలాంభోధర నీలదేహలతికా ! జ్ఞాన ప్రసూనాంబికా !*

ఈ సంబోధనలు కవయిత్రి హృదయాంతర్గత వేదనను, ఆర్తిని వ్యక్తీకరించుచున్నాయి.

*అరయన్ బార్థునిపై మృకండు సుతుపై, నబ్జారిపై, బాణుపై*
*గరిపై, శ్రీ పయి, భిల్లవంశపతియౌ కన్నప్పపై, కాముపై*
*బరగం గల్గు కృపారసం బిపుడు నాపై జూప నీ నాథుతో*
*కరుణా వార్నిధి ! తెల్పరాదె ! జననీ ! జ్ఞాన ప్రసూనాంబికా !*

అను ఈ పద్యం పోతన్నగారి "ఆదిన్ శ్రీసతి కొప్పుపై..." యిత్యాదిపద్యాన్నీ "అరయన్ శంతను పుత్రుపై...'' అన్న ఆంధ్రులకు చిర పరిచితమైన "జగదీశా కృష్ణ భక్తప్రియా !" అనే మకుటం గల పద్యాన్ని జ్ఞాపకానికి తెస్తున్నది.

పోతన్న వలె పద్యము వ్రాయాలని యత్నించి తన్నిర్వహణలో ఈమె కృత కృత్యురాలైంది.

*నీ పాదమ్ములు మోక్షదాయకము లం చే వేళ మౌనీంద్రు లు*
*న్నే పాదంబులు సర్వ శక్తిదము లంచేవేళ బ్రహ్మాదులు*
*న్నే పారంగము గొల్తు రట్టి పదము ల్నే గొ ల్తు నే వేళలన్*
*నా పాపౌఘము బాపి బ్రోవ  గదవే జ్ఞాన ప్రసూనాంబికా '*

ఈ శతక మంతయునిట్లు రసవంతమై చిలుగుదువ్వలువల కైసేసిన పుత్తలిక వోలె నున్నది. [1]

*1 ఆంధ్ర కవయిత్రులు - ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, ద్వితీయ ముద్రణ - 1980 పుటలు - 201-204*

# షష్ఠాధ్యాయం

# వచన వాఙ్మయంలో శ్రీ కాళహస్తి

6.0 ప్రాచీనాంధ్ర సాహిత్యం పద్యమయం. దానికి కారణం సంస్కృత సాహిత్య ప్రభావమే. కాని సంస్కృతంలో వామనుని కాలం నాటికి గద్య రచన కొక ప్రత్యేక స్థానమున్నట్లు, ఆయన వ్రాసిన కావ్యాలంకార సూత్రవృత్తిలో ''గద్యం కవీనాం నికషం వదన్తి'' అన్న ఆభాణకం తెల్పుతోంది. అప్పటి నుండి సంస్కృతంలో గద్య రచనలకు విరివిగా ప్రాచుర్యం, ప్రాధాన్యం ఏర్పడింది. ''గద్యమే కవులకు గీటు రాయి'' కాగా 'బాణోచ్ఛిష్టం జగత్సర్వమ్' అన్న సూక్తి బాణుని 'కాదంబరి' వచన రచన వలన జగద్వ్యాప్తమైంది. బాణుని రచనావిధానం ప్రముఖంగా గద్యరచన తర్వాత కవులకు వరవడి యైంది.

తెలుగు సాహిత్యం చంపూ కావ్య పద్ధతితో ప్రారంభమైనా గద్య ప్రయోజనం అక్కడ పరిమితమైంది. అందుకే దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయంలో కోకొల్లలుగా గద్య రచనలే వెలువడినాయి. ఈ యుగంలో గద్య రచనకు ప్రేరకమైన సాహిత్యం స్థల పురాణాలే అంటే అతి శయోక్తి కాదు. ఉదాహరణంగా రామాయణ, భారత, భాగవతాలేగాక శ్రీ రంగమాహాత్మ్యమ్, వైశాఖమాహాత్మ్యం, కార్తీక మాహాత్మ్యం సోమవార మాహాత్మ్యం, ధేనుమాహాత్మ్యం వంటి క్షేత్ర, వ్రత, తిథిమాహాత్మ్యాలకు చెందిన రచనలు వెలువడ్డాయి. కాని యివి చిన్నయసూరి కాలంవరకు గ్రాంథికభాషలోనే వుండడం గమనింప దగిన విషయం. పాశ్చాత్య సాహిత్య ప్రభావం వలన ఆధునిక యుగంలో వచనరచనకు విశేషించి వాడుకభాషలో వ్రాయడానికి ప్రోత్సాహం లభించింది. దీనికి ప్రధాన కారకులు వ్యావహారిక భాషోద్యమాన్ని నడిపిన గిడుగు వేంకట రామమూర్తి పంతులు గారు. దీనితో ఆధునిక యుగంలో వచన రచనల సంఖ్య పుంఖాను పుంఖంగా వెలువడుతున్నాయి. ప్రధానంగా క్షేత్ర మాహాత్మ్య రచనలు పద్యాల్లో గాక

వచనంలో వ్రాయడం మూలాన్నే దానికి విస్తృత పాఠక లోకం లభిస్తున్నది. వచన రచనల తోనే పాశ్చాత్యుల సారస్వత ప్రభావంతో నవలా రచన కూడా ప్రాచుర్యాన్ని సంపాదించింది. తెలుగులో కవిజీవితాలు, మహావీరులజీవితాలు, సాంఘికసమస్యలు నవలా రూపంలో వెలువడుతుండడం దీనికి నిదర్శనం.

ఈ దృష్టితో ఈ అధ్యాయంలో శ్రీ కాళహస్తి క్షేత్ర సాహిత్యంలో వెలువడిన వచన రచనల్ని పరిశీలిద్దాం !

## 6.1 శ్రీకాళహస్తిమాహాత్మ్యము

మ సుబ్బరాయులు నాయుడు దీని కర్త ఇది 1935 లో చెన్న పట్టణం లోని మురహరిముద్రణాలయంలో ముద్రితం ప్రచురణ కర్తలు టి చెంగల్వరాయ నాయుడు అండ్ సన్స్ వారు లోపలి ముఖ పత్రంలో 1934 అని వుంది ఇది గ్రాంధిక భాషలో రచింప బడినది ఇందులో 128 పుటలున్నాయి

ప్రకరణము వారీగా విషయ సూచిక యిట్లున్నది

1) స్నానకాలమంత్రము
2) శ్రీ కాళహస్తీశ్వర స్తుతి
3) శ్రీ కాళహస్తీశ్వర అష్టోత్తర శతనామావళి
4) శ్రీశివశంకరాష్టకము
5) శ్రీజ్ఞాన ప్రసూనాంబా స్తోత్రము
6) శ్రీజ్ఞాన ప్రసూనాంబికాస్తుతి
7) శ్రీజ్ఞాన ప్రసూనాంబికా రాగమాల

ఇవి మొదట స్తోత్రములు కాగా అసలు గ్రంధము 17 వ పుట నుండి ప్రారంభమగు చున్నది

1) నైమిశారణ్య ప్రకరణము
2) విటజంగమ ప్రకరణము
3) దక్షిణ కైలాస ప్రకరణము
4) స్వర్ణముఖీనదీ ప్రకరణము
5) చతుర్ముఖప్రకరణము
6) శ్రీ కాళహస్తి ప్రకరణము

7) కణ్ణప్ప ప్రకరణము
8) నక్కీర ప్రకరణము
9) కన్యా ప్రకరణము
10) వాయుపూజా ప్రకరణము
11) కైలాసశిఖర ప్రకరణము
12) విద్యాపీర పర్వత ప్రకరణము
13) జ్ఞానప్రసూనాంబికా మహత్త్య ప్రకరణము
14) కనక దుర్గా ప్రకరణము
15) ముని సంవాద ప్రకరణము
16) భేదాభేద ప్రకరణము
17) తాళవృక్షప్రకరణము

*తీర్థ ప్రకరణములు*

1) సహస్రదేవతా తీర్థము
2) మార్కండేయతీర్థము
3) వేదతీర్థము
4) రామతీర్థము
5) చక్రతీర్థము
6) శక్తితీర్థము
7) మృత్యుంజయ తీర్థము
8) పాశవిచ్ఛేదక తీర్థము
9) నీలకంఠ తీర్థము
10) తత్త్వప్రకాశ తీర్థము
11) భరద్వాజ తీర్థము
12) చంద్రతీర్థము
13) సూర్యపుష్కరిణీ తీర్థము
14) స్థలవిశిష్ట ప్రకరణము
15) నదీనామములు, వాటి ఫలములు
16) కాళహస్తీశ్వర దండకము
17) జ్ఞానాంబికాఅమ్మవారి దండకము
18) శ్యామలా దండకము

ఈ గ్రంథమున ప్రకాశకులు " చదువరులకు హెచ్చరిక" అని యిట్లు వ్రాసిరి

"శివ స్థలములలో ప్రసిద్ధి గాంచినదియు దక్షిణ కైలాసంబను ప్రఖ్యాతి పడసినదియు, అనేక శివభక్తులు మోక్షము చెందినదియు, శ్రీ, కాళ, హస్తి అను సాలెపురుగుకున్ను, పాముకున్ను, ఏనుగకున్ను యీశ్వరుడు కైవల్య పదవి నొసంగి ఆ మూటి పేరున శ్రీ కాళహస్తి క్షేత్రము యొక్క మహిమలు పూర్వము సంస్కృత శ్లోక రూపమున యుండెను. అవి అందఱికి

అర్థము తెలియక క్షేత్రమహిమలు తెలియలేదని పరితపించుచుండిరి అట్టి దానిని సకల సుజనులకును స్పష్టముగా చదివి తెలుసుకొని ఆనందించుటకు గాను సుమారు 20 సంవత్సరముల నాడు సంస్కృత స్థల మాహాత్మ్యము ననుసరించియు, ధూర్జటి, కలికారి పద్య కావ్య గ్రంధముల ననుసరించియు స్పష్టమగు వచన రూపమున శ్రీ కాళహస్తి క్షేత్ర మాహాత్మ్యము అను యీ గ్రంధమును రచించి ముద్రించి యెల్లవారికిని ఆనందము కలుగ జేయు చుంటిమి. ప్రతి వారును మా గ్రంధమును కొని కుతూహలులగు చుండిరి"

ఇందలి వచన రచనా ధోరణికి నాల్గు వాక్యములు "నక్కీర ప్రకరణము"

వరేంద్రా ! దక్షిణమధురాపట్టణంబున చంద్రశేఖరపాండ్యుడు రాజ్యపరిపాలనంబు సేయుకాలమున కమలోద్భవుండగు బ్రహ్మదేవుడు కాశీపురిం జేరి అశ్వమేధయాగంబు పదింటిని జేసి ముగించి గంగానది యందు నవభృధస్నానంబు సేయనెంచి తన పత్నులగు సరస్వతీ, సావిత్రీ, గాయత్రీ యను ముగ్గురి తోడ బోవుచుండగా సరస్వతి ఆకాశ మార్గంబున నొక విద్యాధర కన్యక వాయించుచుండిన వీణాగానంబును తన మనంబున గీలు కొలిపియుండెను" (పుట - 57)

6 2 ధూర్జటి - (చారిత్రక నవల)

ఆధునికయుగంలో కవిజీవితనవలాకారులుగా శ్రీ నోరినరసింహశాస్త్రిగారు సుప్రసిద్ధులు. వీరు నారాయణభట్టు, కవి సార్వభౌముడు, రఘవిద్యయము వంటి నవలలే గాక మహావీరుల చరిత్రలైన రుద్రమదేవి, మల్లారెడ్డి వంటి నవలలు 'వాఘిరా' వంటి నవలలు రచించారు వీరు 'కవిసమ్రాట్' బిరుదాంకితులు.

నోరి నరసింహశాస్త్రి జననం 6-2-1900 నిర్యాణం 3-1-1978 శ్రీ నరసింహ శాస్త్రిగారు గుంటూరు పట్టణములో పండిత కుటుంబములో జన్మించారు. బి.ఏ, బి.యల్, పట్టా పొంది రేపల్లెలో న్యాయవాదిగా పేరు ప్రఖ్యాతులు గడించారు.

తెలుగు, సంస్కృతము, ఇంగ్లీషు, కన్నడ భాషలలో దిట్ట. కథలు, నవలలు, నాటికలు, పద్య కావ్యాలు రెండు పదులు రచించారు. అన్నీ ముద్రితమైనవే. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ, కేంద్ర సాహిత్య అకాడెమీ వీరి రచనలను శ్లాఘిస్తూ బహుమతులు అందజేశారు. వీరి రచనలు కొన్ని యితర భాషలలోనికి అనువదింపబడ్డాయి.

ధూర్జటి నవల ఎప్పుడు వ్రాయబడిందో ముద్రణ ప్రతిలో వివరాలు లేదు గాని 1987 లో ముద్రిత ప్రతి ఒకటి జయంతి పబ్లికేషన్స్ విజయవాడ వారు అచ్చు వేశారు.

ఈ గ్రంథ 'పీఠిక' లో నోరివారు ధూర్జటి వ్యక్తిత్వాన్ని గురించి యిలా వ్రాశారు.

''తెలుగులో పూర్వకవులు చాలవరకు ఆదర్శమూర్తులు కాని ధూర్జటి అటువంటివాడు కాడు. మన అందరికీ వలెనే తీవ్రమైన రాగద్వేషాలు, కోపతాపాలు, భోగవాంఛ తొందరపాటు, తప్పటడుగులు వెయుట యున్నవి కాని మన బోటి సామాన్యులకు సాధ్యము కాని రెండు విశేషాలు ఆయనలో ఉన్నవి. మొదటిది అచంచలమై భక్తి శ్రీ కాళహస్తీశ్వరుని మీద, రెండవది ఆ స్వామికి ఆయన పైన గల అనుగ్రహము. ఈశ్వరుడు వెలసిన కొండ లెక్కుతూ మనం, 'చేరుకో స్వామీ'! అంటూ ఆర్తనాదం చేస్తాము. ఆ విధంగా చేసిన ధూర్జటి ఆర్తనాదం విని ఆయనను స్వామి తన సన్నిధికి చేరుకొన్నాడు''

''పాశ్చాత్య దేశాలలో పరమ పాపిష్ఠులెందరో పరమభక్తులుగా మారిన వృత్తాంతాలు తెలియవస్తున్నవి. వారి కన్ఫెషన్సు (Confessions) చదువగలుగుతున్నాము. అంత పాపిష్ఠుడు కాకపోయినా కొంత పాప పంక మంటి స్వప్రయత్నము చేతనూ, స్వామి కృప చేతను పాప పంకము ప్రక్షాళనము చేసుకొని పవిత్ర తేజోమూర్తిగా పరిణమించినవాడు ధూర్జటి. ఆయన శ్రీ కాళహస్తీశ్వర శతకము పాప పంక ప్రక్షాళన చేసుకుంటూ అసహాయుడై అసమర్థుడై, స్వామి సహాయమర్థిస్తూ చేసిన ఆర్తనాదము

వంటిది. మన పూర్వ కవులలో ఎవరి విషయమూ మనకు ధూర్జటి విషయము తెలిసినంతగా తెలియరాదు. మంచిచెడ్డలతో నిండిన ఈసంసారసముద్రములో మునుగుతూ, తేలుతూ, ఆర్తుడై ఆక్రోశింపగా స్వామి కరావలంబము ప్రాప్తించిన భాగ్యశాలి ధూర్జటి కవి" (పుట-5)

ఎన్నో చారిత్రాత్మక విషయాలు ఈ నవలా కల్పనలో పడుగు పేకలుగా కలిసిపోయినవి. చారిత్రక నవలలోని కష్టములు చక్కగా వివరించిన గాని తెలియదు. చరిత్రకు సత్యము కావలెను. నవలకు కల్పనతో కూడిన సౌందర్య మవసరము. చారిత్రక నవల సత్య సౌందర్యముల సమ్మేళనము.

ధూర్జటివలెనే నోరివారును ధూర్జటి నవలను శ్రీకాళహస్తీశ్వర స్వామి క అంకితము చేసినారు.

నత్కీరుని కథా విషయంలో ధూర్జటి దానిని 'తిరువిళైయాడల్ పురాణం' నుండి గ్రహించినట్లు నోరివారు స్పష్టపరిచారు. 'నత్కీరుని' పేరును గూర్చి చర్చ సాగిస్తూ ''మొదట ఆ కవి పేరు నత్కీరుడు కాదు నక్కీరుడు నక్ - మంచి, కీరన్ = రచయిత, కవి-సత్కవి అని ఈ పేరుకు అర్థం అరవములో నత్కీరుడంటే అర్థము కుదరదు" అన్నారు. (పుట-121)

నోరివారి చారిత్రక నవలలో వచన రచనా ధోరణికి ఒక సన్నివేశము నందలి మాటలు. తెనాలి రామకృష్ణుడు ''హో తెలిసెన్ " యిత్యాది పూరణమును రాజసభలో చేయగా -

'ధూర్జటి నిలువున నీరైపోయెను. తనప్పుడప్పుడు, ఎప్పుడో ఎవ్వరు, ఎవరికి తెలియకుండ వేశ్యల యిండ్లకు మారు వేషముతో వెళ్ళుచుండెడి వాడు. ఆ సంగతి ఎవరికిని తెలియనట్లు తల పోయును, తాను కూడ తనకే తెలియనట్లు ప్రవర్తించెడి వాడు. ఇప్పుడు రామలింగ మీ పద్యములో, ''భువనైక మోహనోద్ధత..." అని తాను మోహిని యింటికి వెళ్లినచే సూచించుచు, మహాసభలో తన కింత గౌరవము జరిగిన వెంటనే తన దోషమును బయటపెట్టి తన్ను అప్రతిష్ఠపాలు గావించినాడు. ఆ సూచన అబద్ధమని అబద్ధ మాడుటకు మన సొప్పు లేదు. రామలింగకవి వలె నవ్వి

వేయుట కైనను తన మనస్సునకు నిలుకడ లేదు. సహ్యాసాక్షుడగు తిమ్మరుసు, ధూర్జటి దౌర్బల్య మెరిగియున్నను ఎరుగనట్లే యుండెడివాడు" (పుటలు 137 - 138)

వీరి రచనాశైలి సర్వజన మనోహరమైనది.

## 6 3 శ్రీకాళహస్తిమాహాత్మ్యము

దీనిని రచించిన వారు 'పీలా ఆచార్య' గా ప్రసిద్ధులైన వీరవల్లి రామానుజాచార్యులు గారు. వీరు విద్వాన్ బి. ఓ.యల్ పట్టభద్రులు. 'ఆత్మశక్తి' అను పిడులా వీర చరిత్రను కావ్యంగా రచించారు. కవి సమ్రాట్ విశ్వనాథ వారు దానికి అభిప్రాయం వ్రాశారు. మరొక కావ్యం 'అమరజీవి' అన్నది పొట్టిశ్రీరాముల జీవిత చరిత్ర. వీరు శ్రీ కాళహస్తి పై అనేక చిన్న గ్రంథాలు వ్రాశారు. శ్రీకాళహస్తి, స్థలపురాణం, మాహాత్మ్యం, ఆలయదర్శనం, తీర్థములు, భక్త విజయము, స్తోత్రములు, శతకము, దండకము, సుప్రభాతము, బొమ్మల శ్రీ కాళహస్తి. వీటన్నిటి కంటే ప్రముఖమైన వీరి కృతి 'శివ కవచ' వ్యాఖ్యానము. తిరుపతిలో నివాసముంటూ కాళహస్తిలో పుస్తక విక్రయశాల నడుపుతున్నారు. వీరు 1995 డిసెంబరులో కీర్తి శేషులయ్యారు.

ఇది యాత్రీకుల కొఱకు వ్రాయబడిన గ్రంథం (Pilgrim's Guide book) అవతారిక' లో ఆచార్యుల వారిట్లు వ్రాశారు. "ఈ క్షేత్రమును గురించిన స్థల పురాణ మాహాత్మ్యములు, సంస్కృతములోను, ద్రావిడ భాషలోను నొకప్పుడు రచియింపబడినట్లు గానవచ్చుచున్నది. కాని యవి యీనాడు ముద్రితములు. శ్రీ ధూర్జటి మహాకవి కృతంబైన శ్రీ కాళహస్తి మహాత్మ్యమో ప్రబంధ శైలిలో నుండి సర్వజన సామాన్యమున కందుబాటులో లేదు. కావున నీ క్షేత్ర మాహాత్మ్యము వచన శైలిలో నందరికి సులభమగు రీతిని వ్రాయుటకు బ్రయత్నించి యీ కృతి రూపమున వెలువరించితి. సహృదయు లిందలి నెరసుల నెన్నక గుణంబునే గ్రహించి నా యీ ప్రయత్నమునం గృతకృత్యుని గావింతురని యాశించెద."

వీరి వచన శైలికి మచ్చుగా- "శ్రీ పుర గాధ"- శ్రీ కాళహస్తీశ్వరుని నామధేయంబులోనే యొక విధమైన విశిష్టత యిమిడియున్నది. శ్రీ యనగా సాలెపురుగు. కాళ మనగా సర్పము హస్తి యనగా నేనుగు. ఆలయములోని శ్రీ కాళహస్తీశ్వరుని లింగాకారము మీద నివి మూడును రూపుగొని యున్నవి. ఈ మూటికిని మోక్షమొసగి దీనిని తనలో నంతర్భాగముగా నైక్యము చేసికొనిన తత్త్వమునే శ్రీకాళహస్తీశ్వరుని లింగాకృతిలో నుండు నీ మూడు రూపములు ను వ్యక్తము చేయుచున్నది" దీని రచనా కాలం - 1967

## 6.4 శ్రీ కాళహస్తి క్షేత్రము - మాహాత్మ్యము

విద్వాన్ జి. తిరువేంగడ సూరి రచించినదీ గ్రంథం. దీనిని శ్రీ కాళహస్తీశ్వర స్వామి దేవస్థానము వారే 1987 లో ప్రచురించారు.

"క్రమమున మింటికై యెగయు గాక విహంగము మింటికైన పారము గన నేర్చునే" యనునట్లు, నే నీ దివ్య క్షేత్ర మాహాత్మ్యమును వ్రాయుటలో నెంతవరకు కృతార్థుడ నైతినో పాఠకులే నిర్ణయింప వలయును" అన్నారు వినయ విధేయంగా జి.టి. సూరిగారు.

"శ్రీకాళహస్తికివచ్చెడు యాత్రికజనంబులకు శ్రీకాళహస్తి మాహాత్మ్యమును దెల్పు వచన గ్రంథము లేని కొఱత దీర్ప వలయు ననెడి యాశయముతో నీ క్షేత్ర మాహాత్మ్యమును రచించితిని"అన్నారు. కాబట్టి యిది కూడ Pilgrim's Guide book' గా 'యాత్రా మార్గదర్శి'గా నెంచవచ్చును.

ఈ గ్రంథమందు రెండు విభాగములున్నాయి. మొదటి విభాగంలో ప్రార్థన శ్రీ కాళహస్తి క్షేత్రము- ఉనికి, ఆలయము, పరిసరములు, దక్షిణ కైలాస పర్వతములు, తీర్థములు, దుర్గాంబ తిప్ప- కుమార స్వామి తిప్ప, నాటి రాజులు, ఆస్థాన ఆశ్రితులు, స్వర్ణముఖీనది - వృత్తాంతము, క్షేత్ర పరిసరాశ్రమములు.

రెండవ విభాగంలో పార్వతీ పరమేశ్వరులు భువి కవతరించుట, గిరి ప్రదక్షిణము, బ్రహ్మ సరస్వతీయుతుడై దక్షిణ కైలాసమున కేతెంచుట, శ్రీ కాళహస్తులకు పరమేశ్వరుడు సాయుజ్య మొసగుట, తిన్నడు కన్నప్ప యగుట,

నత్కీరుని కథ, వేశ్యాంగనలు శ్రీకాళహస్తి పరమేశ్వరుని దర్శించి మోక్ష మందుట, యాదవనరసింగ రాయని వృత్తాంతములు వివరింప బడ్డాయి.

వీరి రచనా శైలికి మచ్చుగా - ''దామెర్ల రాజులు శ్రీకాళహస్తిని విశాలములైన నాల్గు వీధులుగ నిర్మించినారు. తూర్పు భాగమున రాజ వీధి, ఇందు రాజుల, రాణుల, రాజ బంధువుల యంతః పురములు గలవు. నేడు రాజులు లేనందున నా నగరుం శోభసన్నగిల్లినది. కాని నగర వీధి యన్న పేరు నేటికిని గలదు. ఆనాటి రాజులు శివ కేశవ భక్తులు. నాల్గు వీధులకు నడుమ ప్రసన్న వరదరాజస్వామి యాలయమును నిర్మించి, మడి మాన్యము లేర్పరచి నిత్యోత్సవాదులు జరపించుచు నుండిరి. కాల క్రమమున నెన్ని యో మార్పులు జరిగినవి" (పుటలు 15-16)

## 65 శ్రీ కాళహస్తి క్షేత్ర మహిమ

ఈ గ్రంథాన్ని కూర్చిన వారు శ్రీ కాళహస్తీశ్వర స్వామి దేవస్థానం అసిస్టెంట్ కమీషనర్, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారైన శ్రీ పి.ఎ. సింహప్పమూరాచార్యుల వారు. ఈ గ్రంథము కూడా యాత్రామార్గదర్శియే. ఇది 1987 లోనే దేవస్థానము వారిచే ప్రచురించబడినది. ఇందులో అనేక ఛాయాచిత్రము లుండుట విశేషము.

ఇందులోని శీర్షికలివి: పరిచయము, ఉనికి, చారిత్రక ప్రాశస్త్యము, దేవాలయ పూజా విధానము - ఉత్సవములు, దక్షిణ కైలాసము - దక్షిణ కాశి, ఆలయ నిర్మాణ పద్ధతి, మాహాత్మ్యము, సాలెపురుగు-శివసాయుజ్యము, నాగుపాము, ఏనుగు, శివారాధన చేసి తరించుట, శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా దేవి, వాయులింగము, గోపురములు, సువర్ణ ముఖరీనది, కన్నప్ప, రాహు కేతు క్షేత్రము, శ్రీ దక్షిణామూర్తి విశిష్టత, భక్తుల కావాసము, తీర్థరాజములు, వేయి లింగాల కోన, పాతాళ గంగ - మూక తీర్థము, భరద్వాజ తీర్థము, పరివార దేవతలు, మంటపములు, నటరాజ రంగస్థలము, దేవాలయ పరిపాలక వసతులు, దేవాలయము యొక్క ఆదాయము, ఇతర క్షేత్రములు వివరింపబడి వున్నాయి. ఈ గ్రంథములో మొత్తము ఇరువది పుటలున్నాయి.

## 6 6 శ్రీకాళహస్తీశ్వరమాహాత్మ్యము

రచయిత - విద్వాన్ అమరవాది శేషయ్య ప్రకాశకులు ఎన్.వి. గోపాల్ అండ్ కో, మద్రాసు 1991 లో ప్రచురింపబడినది ఈ గ్రంథంలో ప్రధాన శీర్షికలు

ప్రార్థన శ్లోకములు, సూతుని శౌనకాది మునులు దర్శించుట, నిష్ఠా గరిష్ఠుడౌ వశిష్ఠుని వృత్తాంతము, వశిష్ఠుని పుత్రులను విశ్వామిత్రుడు చంపుట, పరమేశ్వరుని వశిష్ఠుడు ప్రార్థించుట, సువర్ణముఖీ వృత్తాంతము, సరస్వతీ బ్రహ్మలకు సంతానము కల్గుట, శ్రీయను సాలెపురుగు కైవల్యము పొందుట, కాళమను సర్పము, హస్తియను ఏనుగుల వృత్తాంతము, తిన్నడను ఎటుకల వాని వృత్తాంతము, శివునకు అర్జునునకు యుద్ధము, ఎఱుకరాజు, స్వప్నంలో తిన్ననికి శివుడు కనిపించిన తీరు, తిన్నడు పరమేశ్వరుని ప్రార్థించుట, ప్రతి దినము శివునకు తిన్నడు ఆహారము పెట్టుట, మాంసపు దుమ్ములను చూచి శివభక్తుడు అసహ్యించుకొనుట, యాదవ రాజుచే ఆలయ నిర్మాణము, నత్కీరుని చరిత్రము మొదలైనవి వర్ణింపబడి వున్నాయి

ఇంతవరకు పై చెప్పబడిన వచన గ్రంథాలన్నీ ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వ మాహాత్మ్యమునకు వచన రూపమైన అనుసరణలే

## 6 7 శ్రీ కాళహస్తి క్షేత్ర వైభవం

ఈ గ్రంధ రచయిత విద్వాన్ పూడి వేంకట రామయ్య గారు వీరు శ్రీ కాళహస్తి క్షేత్రవాసులు ఈ గ్రంధం 1992 లో అచ్చయినది దీని యందు 218 పుటలున్నాయి

ఈ గ్రంధం పై వచన గ్రంధాల వలె గాక సంస్కృతంలోని శ్రీ కాళహస్తి స్థల పురాణాన్ని దృష్టిలో పెట్టుకొని శ్రీ కాళహస్తీశ శతనామాబ్జమాలికను కూడ చేర్చి ముద్రింప బడిన గ్రంథము ఇందలి ప్రధాన విషయాలివి

క్షేత్ర ప్రాశస్త్యం, శివానందైక నిలయ ప్రాదుర్భావం, క్షేత్ర మాహాత్మ్యం, భక్తులు, తీర్థాలు, తిథులు యుగానుక్రమంగా తరించిన భక్తులు, ఆలయ సోయగం, ఉత్సవ మూర్తులు, ముఖ్యంగా చూడదగిన విశేషాలు, చూడవలసిన ముఖ్యతీర్థాలు, శ్రీ కాళహస్తీశ్వర శతనామావళి, వైశిష్ట్యం మొదలైనవి

# సప్తమాధ్యాయము

## జానపద వాఙ్మయంలో శ్రీ కాళహస్తి

70 శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యంలోనే మనకు భక్తుడైన తిన్నడు కన్పిస్తాడు. ఇతడు ముగ్ధభక్తుడు. జానపదుల అమాయికత్వం, మూఢత్వం, వీరత్వం అన్నీ కలబోసిన మూర్తి యితడు. ఇతడు జానపదుల యాసలో, వారి పలుకుబడిలో మాట్లాడే తీరును ధూర్జటి తన కావ్యంలో అలాగే చిత్రీకరించాడు.

*ఓసామీ! యిటువంటి కొండదరిలో, నొంటిం బులుల్ సింగముల్*
*గాసిం బెట్టెడు కూట నట్టడవిలో గట్టువ్వి క్రీనీడ, నే*
*యాసం గట్టితి వేటిగడ్డ సిలు? నీ వా క్రొవ్వు వో, గూడు నీ*
*కే సుట్టంబులు దెచ్చి పెట్టెదరు? నీ కింపేటికే లింగమా? (3-65)*

*ఇల్లో, ముంగిలియో, మనుంగు వెలలో, యేపాటి సుట్టంబులో*
*యిల్లాలో, కొడుకో, తరింప ఏమే, యే పోయముల్లేవె? మా*
*పల్లెంగోరిన వెల్లనుం గలవు తెప్పింపంగ నే జెప్పెదన్*
*వెల్లంబో! యిట నొంటినుండ నెటు విప్రయుంగావె లింగమా! (3-70)*

పై పద్యాల్లో క్రీ గీతలు గీచిన మాటలు జానపదుల మాటల్లో ఉన్నవే వాటి నలాగే కవి వ్రాశాడు

పాల్కురికి సోమనాథుని బసవపురాణంలోను కన్నప్ప, గొడగూచి వంటి ముగ్ధ భక్తులింకెందరో వస్తారు. వీరందరినీ శివుడు లాలించి, పాలించి దగ్గరకు తీసుకొన్నాడు.

పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రలో పండితుని శిష్యులు తుమ్మెద పదములు, గొబ్బిపదములు, సంజవర్లన్న మణిగణ వర్లన పదములు,

పాడుచు వెలనాటిచోడుని సభకు వెళ్లిరని వ్రాసియున్నాడు. ఆనందగీతములు, శంకర గీతములను కూడ సోమనాథుడు పేర్కొనినాడు. చారుగీతములు, కోలాట పాటలు, ఛాంగుభళాలు శివరాత్రి జాగరణ సందర్భంలో భక్తులు ప్రదర్శించెడి వారని చెప్పినాడు.

ఇవి భారతీయ జన సామాన్య జీవితంలో జీర్ణించిన వేదాంత తత్త్వాన్ని రక్తనిష్ఠ మొనర్చి పరంపరాగత సంప్రదాయంగా పరిణమింప జేసింది. జాన పదుల ఆటపాటలే శిష్టవాఙ్మయావిర్భావానికిమూలమని ఆధునిక పరిశోధకుల నిర్ణయం.

జానపదుల వేదాంతధోరణి పాటల రూపంలో ఉంటుంది. వీటినే వారు 'తత్త్వాలు' అంటారు. ఉదాహరణకు పోతులూరి వీరబ్రహ్మం గారి కాలజ్ఞాన తత్త్వాలు, ఏగంటివారి వచనాలు, తోటవారి పదాలు, కోటప్ప గారి కీర్తనలు, జీవఎలుకల కురవంజి, అచల గురుబోధ యిటువంటివి జానపదుల తాత్త్విక ధోరణికి ఉదాహరణాలుగా చెప్పవచ్చు. సారంగపాణి పదాల్లో జాతీయం, దేశీయం అనే రెండు విభాగాలున్నాయి. అందులో 'దేశీయ' విభాగ మంతా జానపదుల మాటల్లో ఉంటుంది

*పల్లవి ॥ అగ్గి తిరునాళ్లంట- అజ్జునీ కతలంట*
*అవురా యెంత సోద్దెమే*
*బారత కత - ఔరా యెన్ని న్నింతలే*

*అను ॥ సుగ్గీ జయం దీని సుట్టు ఏలాదూరు*
*అగ్గురోరపు అయ్యోర్లుడిగే నీ సాచ్చిగ*

ఇలా సాగుతుందా జానపదుల గీతం ! ఇందులో శ్రీ కాళహస్తిలో యిప్పటికీ జరిగే ద్రౌపదమ్మ తిరునాళ్లు, లేక ధర్మరాజు తిరునాళ్ల సంగతి చెప్పబడింది. సుగ్గీజయం అంటే కందుకూరి రుద్రకవి వ్రాసిన యక్షగానం సుగ్రీవ విజయమన్నమాట ! అజ్జునీ కత లంటే అర్జునుని కథలు. ఆయన

శ్రీకాళహస్తి క్షేత్రం ఉడుమూరులో తిన్నడై పుట్టిన కథలు "అర్జును ‌డు తిన్నడై పుట్టి ‌బడసె ముక్తి" అని ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యం లో చెప్పాడు. వారితో తాదాత్మ్యం చెందే లక్షణం జానపదుల్లో ఉంటుంది. జానపద గీతాల్లో

*ఏమి సేతురా లింగా ! ఏమీ సేతురా !*
*గంగ ఉదకము తెచ్చి నీకూ*
*లింగ పూజలు సేత మంటే*
*గంగ ముప్ప చాప పిల్లా*
*ఎంగి లంటున్నాది లింగా !*
*మాహానుభావా ! మా లింగమూర్తీ! మా దేవ శంభో ॥* ॥ఏమి॥

ఇలా సాగే ఈ గేయం తిన్నని భక్తిని చాటే పాటగా మనం గ్రహించ వచ్చు. దీనికి మూలం బసవేశ్వరుని వచనాల్లో లభ్యమవుతుంది. బసవేశ్వరుడు కన్నడంలో వ్రాసిన గీతాలు ఇటువంటివే! అవి అతని గాఢ భక్తికీ, నిష్ఠకూ ఉదాహరణం ! [1]

## 7.1 'శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యమ్' - కన్నప్ప పాట

పై చలన చిత్రంలో ఘంటసాల పాడిన పాట.

॥ శ్లో ॥ ఓం నమశ్శివాయ ! నవ నీత హృదయా!
తమః ప్రకాశా ! తరుణేందు భూషా!
నమో శంకరా ! నమో దేవ దేవ !!

॥ పల్లవి ॥ మహేశా ! పాపవినాశా ! కైలాస వాసా ! ఈశా !
నిన్ను నమ్మినాను రారా ! నీల కంధరా! దేవా ! ॥మహేశా

॥ అను ॥ భక్తి యేదొ పూజ లేవో తెలియనైతినే
పాప మేదొ పుణ్య మేదో కాన నైతినే ! దేవా! ॥ మహేశా ॥

|| చరణాలు || మంత్ర యుక్త పూజచేయ మనసు కలుగునా !
మంత్రమో తంత్రమో ఎరుగనైతినే
వాద మేదో వేద మేదో తెలియనైతినే
వాద మేల ! పేద బాధ తీర్చ రావయా స్వామి ||మహేశా||
ఏక చిత్తమున నమ్మిన వారికి శోకము తీర్చిన రుద్రయ్యా !
ప్రాకటముగ చిరువేట చూపి నాఆశలు తీర్చగ రావయ్యా !
దీటుగ నమ్మితి గనవయ్యా ! వేట చూపుమా రుద్రయ్యా
|| మహేశా ||

7.2 భక్త కన్నప్ప లో కన్నప్ప పాట

*ఈ పాటను పాడినవారు శ్రీ రామకృష్ణ*

|| పల్లవి || శివ శివ శంకర భక్తవశంకర !
శంభో హర హర నమోనమో !! || శివ శివ ||
||అను పల్లవి || పుణ్యము పాపము ఎరుగని నేను
పూజలు సేవలు తెలియని నేను
ఏ పూలు తేవాలి నీ పూజకూ
ఏ లీల సేయాలి నీ సేవలూ ! || శివ శివ ||
|| చరణం || మారేడు నీ వని ఏరేరితేనా
మారేడు దళములు నీ పూజకూ
గంగమ్మ మెచ్చిన జంగమయ్య వనీ
గంగను తేనా నీ సేవకూ || శివ శివ ||

7 3 ఈ పాట వ్రాసిన వారు శ్రీ బత్తల శ్రీ రాములు

|| పల్లవి || నాపైన దయ చూపవా ఓ నీలకంఠ
నాపైన దయ జూపనా !
|| అను || సంసార భారములో నేమటి నిన్ను మరచినాను
మనములోన బాధ లెపుడు మసలు తూనె వుంటాయి !
|| నాపైన ||

||చరణం|| ఎప్పుడో నేను నిన్ను తలచేది - ఓ నీలకంఠ
నా పైన దయజూపుమా !
కణకుట్లు కన్నప్ప వలె నీకు తినిపింప లేను నేను
మండపాలు కట్టి నీకు మనసు తీర యివ్వలేను
నాపైన దయజూపవా ! ఓ నీలకంఠ
నాపైన దయ జూపవే !!

## 7.4 బావ - మరదల సంభాషణ

ఈ పాట పాడినవారు విద్వాన్ వారణాసి రామయ్య, గ్రేడ్ I తెలుగు పండితులు, ప్రభుత్వోన్నత పాఠశాల, శ్రీకాళహస్తి, వయస్సు 42 సం ||

మరదలు - వద్దు బావ పెళ్లొద్దు బావా !
నీతో, వద్దు బావా ! పెళ్లొద్దు బావ ||వద్దు ||

బావ - సీకాళాస్తిలో చింతకాయ వీధిలో
సిమెంటీతో యిల్లు కట్టిస్తానే - పిల్లా
నీ కిల్లూ కట్టిస్తానే ||వద్దు ||

మరదలు - సీకాళాస్తిలో చింతకాయ వీధిలో
సిమిటితో యిట్లా కట్టొద్దూలే
బావా ! కట్టొద్దూలే || వద్దు ||

బావ - కన్నప్ప కొండ కాడ లోతట్టు బావి కాడ
కనకాంబరం తోట కొనిపెడ తానే పిల్లా ! కొనిపెడతానే

మరదలు - కన్నప్ప కొండ కాడ లోతట్టు బావికాడ
కనకాంబరమూ తోట కొన వద్దూలే బావ కొనవద్దూలే
|| వద్దు |

బావ - గ్యానమ్మ అమ్మోరు - గాలి గోపురం గుడి కాడ
గాజుల ఫ్యాక్టరీ కట్టిస్తానే పిల్లా కట్టిస్తానే

మరదలు - గ్యానమ్మ అమ్మోరు గాలి గోపురం గుడి కాడ
గాజుల ప్యాక్టరీ కట్టొద్దూలే బావ కట్టొద్దూలే
|| వద్దు ||

బావ - మొగిలేరు లో పడవ నీ కోసం కొంటాను
నీవు ఔనంటే నేను పడవ నడుపు తానే పిల్లా నడిపిస్తానే

మరదలు - మొగి లేరు లో పడవ నా కోసం కొన వద్దు
నేను కాదంటే నీవెట్లా నడుపుతావోయ్ బావా
నడుపుతావోయ్ !

బావ - దుర్గమ్మ గుట్ట కాడ దుగ్గాణి లేకుండ
దుకాణం పెట్టిస్తానే పిల్లా ! పెట్టిస్తానే

మరదలు - దుర్గమ్మ గుట్ట మీద దుగ్గాణి లేకుండా
దుకాణాన్ని పెట్టొద్దూలే బావా
దుకాణాన్ని పెట్టొద్దూలే || వద్దు ||

బావ - కుమారప్ప తిప్ప మీద తిప్పి తిప్పి నిన్ను బాగ
కూకోనివ్వనులే పిల్లా ! నిన్ను కూకో నివ్వనులే !

మరదలు - కుమారప్ప తిప్ప మీద తిప్పలన్ని పడలేను
వన్నెత్తుకోని తిరగరా నా ముద్దుల బావా !

## 7.5 శ్రీ కాళహస్తి పాట

రచన - ఎస్.అబ్దుల్ రసూల్,
మ్యూజిక్ టీచర్. శ్రీ కాళహస్తి

పాడినవారు - ఎస్. సాయి ఉమామహేశ్వరి
ఇంటర్ విద్యార్థిని, శ్రీ కాళహస్తి

కాళహస్తి ఊరు శ్రీ కాళహస్తి మా ఊరు
ఊరి ప్రక్కన యేరు సువర్ణ ముఖి యేరది బహు సుందరమైనది
ఆ యేటి గట్టున శివుడు కొలువు తీరియున్నాడు
రారన్నో ! రారన్నో ! శివ శివ యనుమన్న! చింతలన్ని తీరున్న !
కాళహస్తి ఊరు శ్రీకాళహస్తి మాఊరు
సాలె పురుగు, నాగేంద్రుడు, గజ రాజులు పోటీ పడి
పూజలు ఒనరింపగా శ్రీకాళహస్తి అయిన దండి !
కాళహస్తి ఊరు శ్రీ కాళహస్తి మాఊరు
అడుగడుగున గుడులతో భూలోక స్వర్గము రా !
అహా ! చూడ కనుల కింపు శ్రీకాళహస్తి సొంపండి !
కాళహస్తి ఊరు శ్రీకాళహస్తి మాఊరు
భక్త కన్నప్ప యిచ్చట ముక్తి పొందినాడండి !
అందరికీ అభయమిచ్చు భోళాశంకరు డితడండి !!
కాళహస్తి ఊరు, శ్రీ కాళహస్తి మా ఊరు
వేలాది భక్తులు యిచ్చట విచ్చేసి మొక్కుతారు
శివుడాజ్ఞ లేకుంటే చీమయినా కుట్టదండీ !
శివరాత్రి జాతరలో శివమెత్తి ఆడుతారు
కాళహస్తి ఊరు శ్రీ కాళహస్తి మా ఊరు
పానగల్లు లోని సర్కారు పాఠశాల మాది
కళలకు యిది నిలయము
విద్యలకిది ఆలయము
కాళహస్తి ఊరు శ్రీకాళహస్తి మాఊరు

# అష్టమాధ్యాయము

## స్తోత్ర వాఙ్మయంలో శ్రీకాళహస్తి

8.0 వేదకాలం నుండి దైవపరమైన వాఙ్మయమంతా స్తుతి రూపంలోనే ఉంది. భక్తులకు భావోద్వేగ్నత కల్గినప్పుడు అది స్తుతి రూపంగానే వెల్వడుతుంది. సంస్కారభేదాన్ని బట్టి, ఉపాసనావిధానాన్నిబట్టి, దృక్పథాన్ని బట్టి, సమకాలీన సాంఘిక స్థితిగతుల్ని బట్టి, వైయక్తిక జీవితానుభవాల్ని బట్టి స్తుతుల్లో ఉత్తమోత్తమ, ఉత్తమ, మధ్యమ, సామాన్య భేదాలను చూడవచ్చు.

ప్రస్తుతం తెలుగు స్తోత్ర వాఙ్మయంలో శ్రీకాళహస్తీశ్వరుని పై వెలువడిన స్తోత్రాలను కొన్నిటిని గూర్చి చర్చించుకొందాం ! ప్రసక్తాను ప్రసక్తంగా సంస్కృత స్తోత్రాలను మూడవ అధ్యాయంలో చెప్పకుండ విడిచిన వాటిని కూడా యిక్కడ ప్రస్తావింపబడుతుంది.

8.1 శ్రీ కాళహస్తీశ్వర స్తవము

శ్రీనందివెలుగు వేంకటేశ్వరశర్మ దీని కృతి కర్త. ఈయన కవి కోకిల, కవి తిలక, కవి భూషణ బిరుదాంచితులు. వీరు శ్రీకాళహస్తీశ్వర స్వామి దేవస్థానము వారి ఆస్థాన పండితులుగా పని చేశారు. వీరు కృష్ణా జిల్లాలోని మైలవరం గ్రామస్థులు. ఈ రచన 1967 లో రచింపబడి 1969 లో ముద్రితమైనది. ఇందులో 40 తేటగీతులు వున్నాయి. ''కాళహస్తీశ్వరా 'మమ్ము గావుమయ్య'' అనే మకుటంతో వున్న ఈ స్తవం సులభ శైలిలో రచింపబడినది.

ఈయన ఇతర కృతుల్లో 1) శివనుతి ఋక్షమాల 2) వేమనస్తుతి 3) పార్వతీశ స్తవము 4) గణపతి తారావళి 5) దుర్గాదేవి స్తవము 6) శ్రీ కంఠ విజయము 7) బోధానంద విజయము 8) తిరుపతి వేంకటేశ్వర

తారావళి 9) రామలింగేశ్వర స్తవము 10) కోటీశ్వర స్తవము 11) వేదాంత డిండిమము మొదలైనవి.

ఈ స్తుతి లోని కొన్ని పద్యాలివి

*శ్రీ కరమ్ముగ భక్తుల సాఁకు తోడ*
*ఆది శక్తి జ్ఞాన ప్రసూనాంబ తోడ*
*కాళహస్తి పురమ్మున గ్రాలుచుండు*
*కాళహస్తీశ్వరా! మమ్ముఁ గావుమయ్య!* (ప-1)

*భక్త కన్నప్ప నిన్ను నాసక్తి గొలిచి*
*కఠినమౌ పరీక్షకు దానొగ్గి తుదకు*
*కన్ను లర్పించి నీ కృప గాంచినాఁడు*
*కాళహస్తీశ్వరా! మమ్ముఁ గావుమయ్య!* (ప -5)

*సాలెది పురుగెంత! యిఁక దాని జీవ మెంత!*
*అల్లె బహుతంతుపంక్తి గృహమ్ము నీకు*
*మెచ్చి దాని భక్తికి! ముక్తి నిచ్చి తీవు*
*కాళహస్తీశ్వరా! మమ్ముఁ గావుమయ్య!* (ప-14)

*చెప్పుగాల నిన్ దన్నిన ఁజెదర వైతి*
*తాలు ఉమ్మి కొట్టినను మాటాడవైతి*
*శాంతమూర్తి నీవన్న సుస్పష్టమయ్యె*
*కాళహస్తీశ్వరా! మమ్ముఁ గావుమయ్య!* (ప-15)

*భార్య నిమ్మని ఁగోరితి భక్తు నొకని*
*మఱొక భక్తుని నరమాంస మడిగితోయి*
*భక్తులం బరీక్షింప సంబరము నీకు*
*కాళహస్తీశ్వరా! మమ్ము గావుమయ్య!* (ప-20)

ధూర్జటి మహాకవియు నిను స్తుతి యొనర్చి
కాళహస్తి మాహాత్మ్యమున్ గ్రంథమందు
గణ్యుఁడై ధన్యుఁడై, కీర్తి గాంచినాఁడు
కాళహస్తీశ్వరా ! మమ్ము గావుమయ్య ! (ప -13)

## 8.2 శ్రీకాళహస్తీశ్వర స్తుతి

శ్రీ నోరినరసింహశాస్త్రిగారు 'ధూర్జటి' నవలను శ్రీ కాళహస్తీశ్వరునికే అంకితం చేస్తూ మూడు పద్యాలు వ్రాశారు

స్వామీ ! నీ పదపద్మసేవకు కవిస్వామిన్ సదా కామినీ
వ్యామోహాంధు, కథా ప్రపంచ గతులన్ భావించి వర్ణించుచో
ఏమయ్యా ! పితృమాతృ సంస్తుతుల యట్లే కావరాకుండ నీ
శ్రీమూర్తిన్ హృది నావహించితి విటుల్ శ్రీ కాళహస్తీశ్వరా !

ఈ పుణ్యావని నెందు సత్య కరుణో దీర్ణ ప్రభావాన్వితుల్
శ్రీ పాదుల్ గనుపింతు దైవత వరుల్ వేయేల రక్షింప గా
నీ పూర్ణామల దివ్య కారుణిక సందీప్తిన్, క్షమా భూరి వి
క్షేప స్ఫూర్తిని సాటి రాగలరయా ! శ్రీ కాళహస్తీశ్వరా !

నీవు పలికింప పలికితి నీకు గాక
ఎవరి కర్పింతు మరి దీని నీవె చెప్పు
ఆత్మనాథ ! జ్ఞాన ప్రసూనాధినాథ
అందుకోవయ్య శ్రీ కాళహస్తి జియ్య !

## 8.3 శ్రీకాళహస్తి

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, 1925 భారతి మార్చి సంచిక (పుట-55) లో శ్రీకాళహస్తీశ్వరుని పై ఈ క్రింది పద్యాలు స్తుతి రూపంగా ప్రచురించారు

సీ ॥ కన్నప్పగొలిచిన కన్నప్ప గుడిపట్టు
కన్నప్పగొంచి యుత్కంఠ గంటి
దక్షిణ కైలాస ధరణీధ్రమని కడు
గొండాడ బడు వెల్లకొండ గంటి
విమల జలప్రవాహము గల్గు మొగలేటి
తెలిపేటి తీపారు తీరు గంటి
అత్యున్నతంబు వప్రాయ మతిరమ్య
మగు కాళహస్తీశు నగరు గంటి

గీ ॥ కంటి గనులు తనియ జ్ఞానసూనాంబికా
మహోజ్జ స్ఫూర్తి శ్రీకాళహస్తి
లింగమూర్తి వేడలు పొంగ నలౌకికా
నంద సౌఖ్యవశత నంద గంటి

సీ ॥ జామ దెప్పున్మగా జలజల బాఱ నీ
తెలిపాక దేపాడి జలకమాడ
ధూర్జటి కవన మాధురి మీఱిన నీరు
దోయిళ్లతో దప్పి దాయ ద్రాగి
పాప తాపంబు చే నీ పావన
సైకత స్థలుల షికాంతి బడసి
మెచ్చిన వలివాలి తెమ్మెరల్ వొలయ నీ
దరిగూరుచుండి సద్గురు నుతించి
అనుభూత సంతోషమ్ము నందితిన్
సువర్ణముఖరీనదీ నీకు వందనమ్ము
శుచియు నారోగ్యసంపద రుచియు గల్గి
సాగు నీదు స్వర్ణశ్రీకి జయముగాక !

ఏ కాలమ్మున నియ్యెడన్ వెలసితో యే భూవు లే తాపముల్
నీ కైంకర్యము లాచరించి చనిరో నీ వేమి వింతల్ సమా
లోకింపించి తానాడు వే దళిలముల్ లోపించి మెయ్ భవ స్త్రీ
శ్రీకభ్యుచ్ఛ్రయమే కదయ్య యిపుడున్ శ్రీ కాళహస్తీశ్వరా !

## 8.4 శ్రీ కాళహస్తి స్తుతి

శ్రీ పూతలపట్టు శ్రీ రాములు రెడ్డిగారు రచించిన తెలుగు హంస సందేశములో ఈ క్రింది పద్యంలో శ్రీ కాళహస్తి వర్ణన గమనించవచ్చు

కాంచుము తొలు దొల్త కంచి కామాక్షిని
హస్తి స్థిరాద్వరదు నేకామనాథు
లీల జూడుము చోళ లింగ పురింగల
యోగన్న హరి భావ రోగ హారి
కలి కల్మషంబుల దలచు మ్రాతనడంచు
శేష శైలేశు వీక్షింపు మరల
స్వర్ణ ముఖిం గ్రుంకి శర్వుని శ్రీ కాళ
హస్తి వరదు గన్నులారగమును

మునుపే నెల్లూరి రంగనాథునకు మ్రొక్కి
కృష్ణవేణిని మంగళగిరి నృసింహు
మల్లికార్జును సేవించి మహిత గౌత
మిని స్పృశించి భద్రాద్రి రాముని భజింతు

## 8.5 శ్రీకాళహస్తి - వామన భట్టబాణుని స్తుతి

క్రీ.శ. 15 వ శతాబ్దానికి చెందిన వామన భట్టబాణుడు తన హంస సందేశ కావ్యంలో శ్రీకాళహస్తిని గురించి యిలా వర్ణించాడు.

లక్ష్మోద్భగే తదను భవితా కాళహస్తే గిరిస్తే
తత్పార్శ్వే కనకముఖరీ నామ కల్లోలినీ చ ।
తీరే యస్యా కలిత మహతే ర్మూర్తి శంభోః కిరాతో
గండూషాంభః స్నపన విధయా ప్రాప గంగాధరత్వమ్ ॥

కన్నప్ప పుక్కిలించిన నీటితో అభిషేకము చేయగా స్వామికి గంగాధరత్వ మబ్బినదట ! ఇది చమత్కారము !

8.6 జ్ఞాన ప్రసూనాంబికా రత్నమాలికా

ఇది వట్టిపల్లి నరకంఠీరవ శాస్త్రి విరచితము. వీరు క్రీ.శ. 1869 లో జన్మించి 1910 లో దివంగతులైనారు. ఈ రత్న మాలిక 'నవరత్న మాలిక'

శ్రీ నాకనాథ ముఖ నానా సహస్ర సుర సేవ్యాగమాలి వలభీ
సూనావలి బహుళ లీలాళినీ మధుర గానాంచితాంఘ్రినళినా
మానాతి లంఘ్య మహిమా శివాది దానత జనా మనేక ఫలదా
జ్ఞానాంబికా భవతు దీనావనీ కుశల దానాయమే భగవతీ జ్ఞానప్రసూనాంబికా

8.7 సువర్ణముఖరీ స్తుతి

వృద్ధి క్షేమ శివాపేక్షీ సువర్ణ ముఖరీం శుభాం
అగస్త్యాచల సంభూతాం తత్పూర్వోదధిగామినీమ్
సమస్తపాపహంత్రీ త్వామహం స్నాతుం సమాశ్రయే
మహాపాతక సంస్పృష్టం గాత్రం మమ శుభోదకైః
క్షాళయామి జగద్ధాత్రీ శ్రేయసా పూరయస్వమామ్

8.8 శ్రీకాళహస్తీశ్వర స్తుతి

మ. సుబ్బారాయలు నాయుడు వ్రాసిన స్తుతి యిది. ఇది శ్రీకాళహస్తి స్థల మాహాత్మ్య మనే వచన గ్రంథము లోనిది. ఇందు 10 పద్యాలున్నాయి

మచ్చునకు రెండు -

శా॥ శ్రీ రామ ప్రియమిత్ర ! నిన్ను బ్రోగడన్ సేవింప, బూజింపన
క్రూర జ్ఞానినె? పామునే ! యక్షం బెట్టి గణ్ణప్ప నై
నారున్ మించుని ! మంత్ర తంత్రముల విన్యాసంబులన్ మున్న నన్
జేరం దీయుము యల్పునిన్ జడు, గృపన్ శ్రీ కాళహస్తీశ్వరా!

॥మత్తకోకిల ॥ కాలకాల ! మహేశ ! శంకర ! కావవేల ! యుమాపతీ!
వాలకాలము నిన్ను వేడ గ్రజాల నాపయి కోపమా !
పాలుమాలిక మున్న వాడను బాలు నన్నును నేలుకో
తాళ జాల ఫణీంద్ర కంకణ ! ధర్మవర్ధనతత్పరా !

## 8.9 శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా స్తుతి

ఇది కూడ మ. సుబ్బరాయులు వాయుజుడు వ్రాసినదే ఇందులో 6 పద్యములున్నాయి. మచ్చునకు రెండు

తరమే నోనరించు చెడ్డ పనులన్ దర్శింప లెక్కింపగా న
శ్వరమా దేహమె యాత్మ యంచు విషయాశా భోగమే మోక్ష మం
చరయున్ నేర్పితి, చెడ్డలన్ వదలితిన్ హా హా యుకెట్లోకదే
కరమున్ మచ్చిక నన్ను నేల వలయున్ జ్ఞాన ప్రసూనాంబికా !

వినవే నా మొఱ యింక నైన, ఘనమౌ వేదాంత చర్చన్ విన
గన జాలన్ బలుసాధనంబులను బ్రోక్కంజాల నే డస్సితిన్
క్షణకాలంబున మోక్షమందు తెరువున్ గాన్పింపవే మ్రొక్కెదన్
సనకాద్యర్చిత పాదపద్మయుగళా ! జ్ఞానప్రసూనాంబికా !

## 8.10 జ్ఞానాంబికా రాగమాల

ఇది కూడ మ. సుబ్బరాయులు నాయుని చేతనే విరచింపబడినది. ఇందు 32 రాగ వరుసలు గలవు. మచ్చుకు కొన్ని.

*శ్రీ కాళహస్తీశ్వరుం, జేపట్టి చెంత జేరెడు భక్తులన్*
*సాకినావని నీమయుం, గును జేరి సాగిలితి జ్ఞానాంబికా !*
*పాల ముంచిన ముంచుమా । యటుగాక పట్టి నీళ్లను ముంచుమా*
*మేలాగు నొనరించినన్ । నే విడను నీ క్రమీద జ్ఞానాంబికా !*
*ఇంత ఎఱి కెన్నొ న్నియో । కష్టముల దొంతి జిక్కి తపించితిన్*
*వంతలం దెగటార్చినా । మొఱ్ఱలన్ వాలించు జ్ఞానాంబికా !*
*సుద్దులను జెప్పి నిన్ను । మెప్పింప, సుకవీశు డనె యమ్మరో*
*మొద్దులను దొలచు శక్తిం । గల యట్టి పూబోణి జ్ఞానాంబికా !*

## 8.11 నక్కీరుని స్తుతి

[1] నక్కీరునికి కుష్ఠు వ్యాధి ఆవేశించెను. కైలాస దర్శనాపేక్షచే నతడు తీర్థయాత్రలకు బయలుదేరి దారిలో భూతము చేజిక్కి యితరులతో గుహార బంధితుడయ్యెను. నక్కీరుడు తన యిష్ట దైవమైన సుబ్రహ్మణ్య స్వామిని అచ్చ యరవ పదములతో ఒక్క సంస్కృత పదము కూడ లేకుండ 317 పంక్తుల స్తోత్రము రచించి ప్రార్థించెను. దానికి తిరుమురుగాట్రుప్పడై - మురుగన్ కడకు దూత నంపుట - అని పేరు. దీనిని, తర్వాత సంకలితమైన 'పత్తుప్పాట్టు' తొలి గ్రంథముగా కూర్చినారు. ఈ స్తోత్తముతో నక్కీరుడు మురుగన్ దయవలన బంధ విముక్తుడై దక్షిణ కైలాసమగు శ్రీ కాళహస్తిని చేరి "అంతాది" యను శతకము రచించెను. దానిలో నతడు కాళహస్తిని కైలాసముతో సమానముగా వర్ణించెను (ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యములో ఈ రెండు స్తుతులను ప్రస్తావించి యున్నాడు. వేశ్యాకుమార్తెలు నక్కీరుని రచనయైన నాలుగు ...్యాలు పారాయణము

చేయుచున్నట్లును పునరుద్ఘాటించియున్నాడు) అందు కైలాస వర్ణన పద్య మొకటి (కైలైపాది) దాని వెంటనే కాళహస్తి వర్ణన పద్య మొకటి (కాళత్తిపాది) కూర్చినాడు. మొదటి పద్యములోని చివరి పదముతో రెండవ పద్య మారంభ మగును. రెండవ పద్యము చివరి పద్యముతో మూడవది. ఇట్లు ముక్త పద గ్రస్తమువలె రచితమైనది. ఈ 'అంతాది' రచనతో నక్కీరుడు స్వస్థుడై స్వామి సాయుజ్యము ప్రాపించెను.'

*పొల్లుం పురళమే తూత్తురియుం నెయ్యుమా*
*వల్లిడింజల్ ఎన్నుడైయ నీవాగచ్చొల్లరియ*
*వెణ్బా విళక్కా వియన్ కైలైమేలిరున్ద*
*పెణ్బాగ క్కేట్టి నేన్ షెట్టో*

*షెట్టు పయన్ ఇదువే ఆణ్డే పిరందు యాన్*
*కెట్టవర్ గళ్ ఎత్తుం శీర్ కాళత్తి క్కొట్టువర్కు*
*తోళాగత్తాడరవం సూళ్ణెన్ద అమ్మానుక్కు*
*ఆళాగ షెట్టేన్ అఢైందు*

### 8.12 శివపదకేళి

ఇది 'తాండవ శోభ' అనే గ్రంధంలో లగడపాటి భాస్కర్ రచించినది మచ్చుకు కొంత భాగం

*కరుణాకర శంకర గౌరివరా ! పరిపాలయ మాం పరమేశ ప్రభో !*
*వర శూలి దిశా వసనాంచిత నీ- చరణం శరణం చిర పాపహరమ్*
*మొగలేటి తటంబున మా యెదుటన్-మరి జ్ఞాన ప్రసూనము తోడగుచున్*
*విలసిల్లుట ఎంతటి భాగ్యమహో - తొలి జన్మల పుణ్యము పండెనహో!*

ఇలా ఈ గేయం 53 పాదాల్లోసాగింది

### 8.13 శివ స్తుతి

గంగరాజు రామ్మోహనరావు దీనికి కర్త. వీరు చిత్తూరు జిల్లాలో 5-

11-1936 న జన్మించారు. ప్రస్తుతం కొమ్మిరెడ్డిగారి పల్లె ఎలిమెంటరీ స్కూల్ లో ప్రధానోపాధ్యాయులుగా పని చేయు చున్నారు ''రాచ బాట గంగ రాజు మాట'' సత్యసాయి నామ సాయిరామ , వాణీ శతకము మున్న గు శతకాలు ముద్రితాలు. ప్రస్తుతం ''కాళహస్తి వాస! కామ నాశ !'' అనే మకుటం తో వీరు వ్రాసిన శతకంలో కొన్ని పద్యాలు 'పద్య పారిజాతాలు' అనే పద్య కవిత సంపుటిలో (యువ సాహితీ సమితి ప్రచురంలు నదీకోట, కడప, 1991) పుట 18 లో అచ్చయింది.

ఆ || వె || *శ్రీని కంఠమందు వెలుఁగొందగా, దాల్చి*
*శిరమందు గంగ చిందులాడ*
*ప్రక్కయందు చేరె పార్వతి దేవేరి*
*కాళహస్తివాస ! కామనాశ !*

ఆ || వె || *రజత శైలమందు రాజిల్లు నా తండ్రి*
*తల్లి గౌరి తోడ ధరణి యందు*
*కాళహస్తిలోన కాపురమున్నట్టి*
*కాళహస్తివాస కామానాశ !*

ఆ || వె || *మేనినిండ భూతి మెడలోన పాములు*
*నొసటియందుకన్ను నోటినిండ*
*కాల కూట విషము కలిగిన నా స్వామి*
*కాళహస్తివాస ! కామనాశ !*

8.14 జ్ఞాన ప్రసూనాంబిక

*మరకువ చేత మత్తిల్లిన వాణ్ణి*
*పరిపరివిధాలుగాను ఉత్థాపింప జేస్తుంది*
*అమృతవంతునిగాను, మహాదేవునిగాను*
*సర్వజ్ఞునిగాను, భాసింపజేస్తుంది*

*ద్యుతింపజేస్తుంది వాసింపజేస్తుంది*
*ఉత్తమ గ్రంథం - అది -*
*జ్ఞాన ప్రసూనాంబిక "*

ఇది కిశోరు బాబు - అశోక బాబుల రచన భారతి, 1982 సం. 8. పుట 34

8.15 శ్రీ కాళహస్తి

ఇది కూడ కిశోరు బాబు, అశోక్ బాబుల రచనయే

ప్రభూ ! *నాలో అల్లు కొంటున్న ఈర్ష్యా తంతువుల్ని*
*మూలముట్టుగా కాల్చి వేయు !*
*నువ్వు అగ్ని నేత్రుడవు కదా !*
*నాలో మడుగు కడుతున్న*
*ద్వేష గరళాన్ని*
*చుక్కపట్లు గొనునట్లుగా క్రోలి వేయు !*
*నువ్వు శ్రీ కంఠుడవు గదా !*
*నాలో రెక్కలొంటున్న శౌర్యమదాన్ని*
*సమగ్రంగా అణచి వేయు !*
*నువ్వు 'శూలివి' కదా !*
*నన్ను బాగుపరచి సువర్ణముఖి తీరాన వెలసిన*
*శ్రీకాళహస్తిగా మార్చి వేయు*
*నువ్వు జ్ఞాన ప్రసూనాధిపుడవు కదా !*

*- భారతి, మే, 1983 పుట -61*

8.16 శివస్తుతి గీతం

షేక్ జానీభాషా అను ముస్లిం సోదరుడు 'శివనుత గీత మాలిక' అనే గ్రంథాన్ని వ్రాసి ప్రకటించారు (1990) అందు శివ సంబంధమైన

గీతాలు పరమేశ్వర స్తుతి గీతం, పరమేశ్వర స్తుతి, శివస్తుతి గీతం, జ్ఞాన ప్రసూనాంబ స్తుతి గీతం, తో పాటు గణేశ, అయ్యప్పస్వామి గీతాలు ఉన్నాయి. శివస్తుతి గీతంలో -

*''హర హరా ! అభయంకరా*
*కరుణాసాగర శ్రీకాళహస్తీశ్వర*
*నీ నామమే పావనం*
*స్మరియించు ప్రతి జీవి జీవిత మే ధన్యం ''*

*అంటారు జానీభాషా ! మరో శివ స్తుతి గీతంలో -*

*వందనాలను అందరావేమి స్వామి*
*భవపాపనాశ శ్రీకాళహస్తీశ !*
*విందు సేయ నీకు సిరియాళుడానాడు*
*కన్నపావను కోసి వండినాడు*
*ఆ ఆత్మ స్థైర్యం నాకీయవేమి*
*అంతర్యమేమి? నాపై వైరమేమి స్వామి !*

*పరమేశ్వర స్తుతి గేయంలో -*

*ఓం నమః శివాయ*
*నీ సేవ దయ సేయుమయా*
*నీ సేవ చేయుని తనువెందుకో !*
*శ్రీకాళహస్తీశ ప్రణతు లందుకో !!*

అని కవి శివునికి సాష్టాంగ దండ ప్రణామాలు అర్పించి ధన్యుడైనాడు.

*ఓం తత్సత్*

## ఉపసంహారం

'శ్రీకాళహస్తి క్షేత్ర సాహిత్యాను శీలన' అనే యీ సిద్ధాంత గ్రంథంలోని ఎనిమిది అధ్యాయాల్లో కొన్ని మౌలికమైన అంశాలు ప్రస్తావించ బడినాయి.

'శైవ మతం - దాని ప్రాచీన స్వరూపం' అనే ప్రథమాధ్యాయంలో తమిళ శైవ మతమే ఈనాటి సమాజంలో మానవ ప్రవృత్తికీ, నివృత్తికీ అత్యంత సన్నిహితంగా ఉందని నా అభిమతం. అందుకే పశువు-పతి, పశుపతి లక్షణాలు ఎక్కువగా వివరించడం జరిగింది.

'శ్రీ కాళహస్తిక్షేత్ర చరిత్ర - సంస్కృతి' అనే ద్వితీయాధ్యాయంలో తమిళ గ్రంథ లిపిలోని కన్నప్పను ప్రశంసించే శాసనానికి తెలుగు లిపి వ్రాయడం, దానికి తాత్పర్యం వ్రాయడమే గాక కన్నప్ప ఛాయాచిత్రాన్ని కాళహస్తి దేవాలయ శిల్పాల నుండి గ్రహించి పొందుపరచడం ప్రత్యేకత. ఈ విషయంలో ఇదే తొలి ప్రయత్నం !!

సంస్కృత, తమిళ, కన్నడ సాహిత్యాలలో శివుడు, శ్రీకాళహస్తి అనే మూడవ అధ్యాయంలో కేన, ఈశ, ఈశావాస్యోపనిషత్తుల్లో శివతత్త్వం, నిగూఢంగా ప్రతిపాదింపబడిందనీ, శ్రీ కాళహస్తిస్థల మాహాత్మ్యం సంస్కృతంలో ఉపపురాణమనీ అది ధూర్జటి తర్వాతనే వ్రాయబడి వుంటుందనీ ప్రతిపాదింపబడింది.

వేదాలలో రుద్రుడే, 'శివ' మనే మంగళకరనామమే ('వశి' అనేదే 'శివ' గా మారింది. వశిత్వము గలవాడు 'వశి' శమదమములు వశిత్వము. 'వశిష్ఠుడు' అంటే అర్థం అదే. 'వశి' తిరగ వేస్తే 'శివ' అయింది 'మరా' 'రామ' అయినట్లు 'పశ్యక' - 'కశ్యప' అయినట్లు. కాగా, వశిత్వ సంపన్నుడు శివుడు) ఉపనిషత్తులలో తత్త్వార్థ స్ఫోరకంగా ప్రపంచింపబడినవి, పురాణాలలో త్రిమూర్తులలో ఒకడైన 'శివుడని' చెప్పబడినది శివ పురాణాదులను గూర్చి వివరించబడినాయి.

ధూర్జటి, కన్నప్ప కథను శేక్కిలార్ రచించిన పెరియపురాణం నుండి,

పాల్కురికి బసవ పురాణం నుండి గ్రహించినాడని మూలం చెప్పబడింది. ధూర్జటి కథకు సంస్కృత మూలము లేదు. నక్కీరర్ కథను తిరువిళైయాడల్ పురాణం నుండి గ్రహించినాడని, ధూర్జటి తర్వాతనే సంస్కృతంలో, కన్నడంలో తెలుగులో నత్కీర కథ వ్రాయబడిందని తెలుగులో తొలిసారి నత్కీరుని కథను చెప్పిన ఘనత ధూర్జటికే దక్కుతుందని, అది ఆయన విశాల దృక్పథానికి నిదర్శన మని తులనాత్మక సాహిత్యాధ్యయనం ధూర్జటే ప్రారంభించినాడని చెప్పబడింది.

'ప్రాచీన ఆధునిక తెలుగు కావ్యాలలో శ్రీకాళహస్తి' అనే నాల్గవ అధ్యాయంలో పాల్కురికి బసవపురాణంలోని ఉడుమూరి కన్నప్ప కథతో ధూర్జటి తిన్నని కథ పోల్చ బడింది. ఈ విషయంలో ఇదే తొలి ప్రయత్నం ! తర్వాత తెలుగు కావ్యాలలో శ్రీకాళహస్తి ప్రశంస గల చోట్లు చెప్పబడింది. సంస్కృత స్థలపురాణ విశేషాలు చెప్ప బడింది. ధూర్జటి కావ్యం సమగ్రంగా సమీక్షింప బడింది. నత్కీరుని కథలో 'తిరుమురుగ్గాట్రుప్పడై' అనే సుబ్రహ్మణ్య స్తోత్రమూ, కైలైపాది, కాలత్తిపాది, అంతాది స్తోత్రాలు శివస్తుతి పరంగా చెప్పిన సందర్భాలు, నత్కీర, ధూర్జటి కవీశ్వర వ్యక్తిత్వాలు సమీక్షింప బడినాయి. నత్కీరుని కథలో అంతర్గ ర్భితంగా వ్యాఖ్యానించవలసిన అంశాలెన్నో ఉన్నాయని సూచింపబడింది. భక్తునికీ, శివునికీ మధ్య స్పర్థ, శైవం తత్రాపి వీరశైవం లోనే ప్రత్యేకించి వుందని చెప్పబడింది. ఇతర మతాలు 'శరణాగతి' నే చెబుతాయి. వీరశైవంలో శోధించి సాధింప బడుతుంది మోక్షం !

ఆధునిక కాలంలో వెల్వడిన శ్రీ మద్దక్షిణ కైలాస గిరి ప్రదక్షిణ మహా కావ్యాన్ని అనుశీలించడం జరిగింది. ఇది ధూర్జటి కావ్యాన్నీ, సంస్కృత స్థల పురాణాన్ని, స్థానిక గాథలను అనుసరించి రచింపబడిన కావ్యం.

'శతక వాఙ్మయంలో శ్రీ కాళహస్తి' అనే ఐదవ అధ్యాయంలో ధూర్జటి శతకంలోని ప్రత్యేకత, కవితా వ్యక్తిత్వముద్ర చెప్పబడింది. విశ్వనాథ వారి మధ్యాక్కరలు మరల అంతటి వైయక్తిక ముద్రతో వెల్వడిన శతకమనీ,

తత్తుల్యమైనవే శివానుగ్రహము, త్రిశతి అని నిరూపింప బడినాయి.

'వచన వాఙ్మయంలో శ్రీకాళహస్తి' అనే ఆరవ అధ్యాయంలో ఆధునిక యుగంలో వెల్వడిన కొన్ని వచన రచనలు చెప్పబడినాయి.

'జానపద వాఙ్మయంలో శ్రీ కాళహస్తి' అనే ఏడవ అధ్యాయంలో ఆధునిక కవులు వ్రాసిన కొన్ని జానపద గీతాలను చెబుతూ పాల్కురికి, బసవేశ్వరుల మౌలిక రచనల వైపు దృష్టి ప్రసరింప జేయబడింది. బసవేశ్వరుని కన్నడ గీతాలు అత్యంత మౌలిక భావసంపదతో కూడినవని సూచింప బడింది.

'స్తోత్ర వాఙ్మయంలో శ్రీ కాళహస్తి' అనే ఎనిమిదవ అధ్యాయంలో స్తోత్రమనేది అనాది ప్రక్రియ అని, వేదకాలం నుండి నేటి వరకు అది కొనసాగుతూనే ఉందని పొగడ్తకు లొంగని వాడు లేడు కాబట్టి, విశేషించి భోళా శంకరుడైన శివుడు స్తుతికి పరవశిస్తాడని కొన్ని స్తుతులు ముఖ్యంగా నక్కీరర్ స్తుతి, వట్టిపల్లి నరకంఠీరవ శాస్త్రిగారి జ్ఞానప్రసూనాంబికా నవరత్నమాలికా స్తుతిని గూర్చి ప్రస్తావింపబడింది

ఇలా ఈ ఎనిమిది అధ్యాయాల్లో అష్టమూర్తి యైన శివుని వాఙ్మయాన్నీ, తత్త్వాన్నీ, భక్తానుగ్రహవిధానాన్నీ వివేచించి చెప్పడానికి ప్రయత్నం చేయబడింది.

*కైలాసవాసీ భగవాన్ కాళహస్తీశ్వర శ్శివః ।*

*కరోతు నిత్యం కల్యాణం కరుణా వరుణాలయః ॥*

-ఇతి శివమ్-

# అనుబంధం - I

## అరవై ముగ్గురు నాయన్మారుల పేర్లు

1) ఆది బత్త నాయనార్ 2) అప్పూది అడిగళ్
3) అమర నీతియార్ 4) అర్వళ్తాయార్
5) అనాయ నాయనార్ 6) ఇసై జ్ఞానియర్
7) ఇతీం గట్టు నాయనార్ 8) ఇయర పగైయార్
9) ఇళైయాన్ కుడిమారన్ 10) రుద్ర పశుపతి
11) ఎరిపత్తనాయనార్ 12) ఎియర్ కోన్ కలక్కామర్
13) విణాదినాధ నాయనార్ 14) ఐయుడిగళ్ రాడవర్ కోన్ నాయనార్
15) కణనాదర్ 16) కణంపుల్ల నాయనార్
17) కణ్ణప్పర్ 18) కంశిక్కంబ నాయనార్
19) కలియువ నాయనార్ 20) కటిచ్ జంగ నాయనార్
21) కారి నాయనార్ 22) కారైక్కాల్ అమ్మైయార్
23) కుంగిలి యక్కలియ నాయనార్ 24) కులచ్చిరైయార్
25) కుఱ్ఱువ నాయనార్ 26) కోచ్చెంగణ చోళర్
27) కోట్పులి నాయనార్ 28) శైడైయ నాయనార్
29) చండేశ్వరర్ 30) పత్తి నాయనార్
31) శాక్కియ నాయనార్ 32) శిరప్పులి నాయనార్
33) శిరుత్తొండర్ 34) సుందరమూర్తి
35) శిరుత్తుణైయార్ 36) శేరమాన్ పెరు
37) సోమసి మారర్ 38) తండి యడిగళ్

39) తిరుక్కురిప్పు తొండర్ 40) తిరుజ్ఞాన సంబందర్
41) తిరువావుక్కరసర్ 42) తిరునాళైపూవవర్ (నందనార్)
43) తిరునీల కంఠర్ 44) తిరునీల కంఠ యాలప్పాణర్
45) తిరునీల నక్క నాయనార్ 46) తిరుమూలర్
47) నమినంది అడిగళ్ 48) నరసింగమునైయార్
49) నడుమార నాయనార్ 50) నేశ నాయనార్
51) పుగళ్ చోళర్ 52) పుగళ్తుణై నాయనార్
53) పూసల నాయనార్ 54) పెరుమిళలైక్కురుంబార్
55) మంగై యారక్కరసియార్ 56) మానక్కం జారర్ (మాణిక్య వాసగర్) 57) మురగ నాయనార్ 58) మునై యిడువర్
59) మూర్కి నాయనార్ 60) మూర్తి నాయనార్
61) మెయ్యో పూరుళల్ నాయనార్ 62) వాయల్లార్ నాయనార్
63) విరల్ మిండ నాయనార్.

## అనుబంధం - II

## శ్రీజ్ఞానప్రసూనాంబికా స్తోత్రమ్

*మాణిక్యాంచిత భూషణాం మణిరవాం మహేంద్ర నీలోజ్జ్వలాం*
*మందార ద్రుమమాల్య భూషితకుచాం మత్తేభకుంభస్తనీం ।*
*మౌని స్తోమ నుతాం మరాళ గమనాం మాధ్వీరసానందినీం*
*ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం ॥ -1-*

*శ్యామాం రాజనిభాననాం రతిహితాం రాజీవపత్రేక్షణాం*
*రాజత్కాంచన రత్నభూషణయుతాం రాజ్యప్రదామీశ్వరీం ।*

రక్షో నివారిణం త్రిజగతీ రక్షైక చింతామణిం
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం ॥ - 2 -

కల్యాణీం కరికుంభ భాసురకుచాం కామేశ్వరీం కామినీం
కల్యాణాచల వాసినీం కలరవాం కందర్ప విద్యాకళామ్ ।
కంజాక్షీం కలబిందు కల్పలతికాం కామారి చిత్తప్రియాం
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం ॥ - 3 -

భావాతీత మనః ప్రభావ భరితాం బ్రహ్మాండ భాండోదరీం
బాలాం బాల కురంగనేత్ర యుగళాం భాను ప్రభా భాసితామ్ ।
భాస్వత్ క్షేత్ర రుచిరాభిరామ నిలయాం భవ్యాం భవానీం శివాం
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం - ॥ 4 -

వీణాగాన వినోదినీం విజయినీం వేదండ కుంభస్తనీం
విద్వద్వందిత పాదపద్మయుగళాం విద్యా ప్రదాం శాంకరీం ।
విద్వేషిణ్యారి భంజనీం శ్రుతి భవాం వేదాంత వేద్యాం శివాం
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం - ॥ 5 -

నానాభూషణ భూషితాం ప్రవిమలాం లావణ్య పాథోనిధిం
కాంచీ చంచల ఘంటికా కలరవాం కంజాతపత్రేక్షణాం ।
కర్పూరాగరు కుంకుమాంకిత కుచాం కైలాసనాథ ప్రియాం
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞానప్రసూనాంబికాం ॥ - 6-

మంజీరాంచిత పాదపద్మయుగళాం మాణిక్య భూషాన్వితాం
మందార ద్రుమ మంజరీ మధుకరీ మాధుర్య ఖేలద్గిరామ్ ।
మాతంగీం మధురాలాపాం కరశుకాం నీలాలకాలంకృతాం
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం ॥ - 7-

కర్ణాలంబిత హేమకుండలయుగాం కాదంబవేణీముమాం
అంభోజాసన వాసవాది వినుతా మర్ధేందు భూషోజ్జ్వలామ్ ।
కస్తూరీ తిలకాభిరామ నిటలాం గాన ప్రియాం శ్యామలాం
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం ॥- 8 -

కౌమారీం నవ పల్లవాంఘ్రి యుగళాం కర్పూర భాసోజ్జ్వలాం
గంగా వర్త సమాన నాభి కుహరాం గాంగేయ భూషాన్వితామ్ ।
చంద్రార్కానల కోటి కోటి సదృశాం చంద్రార్క బింబాననాం
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం - ॥ 9 -

బాలాదిత్య నిభాననాం త్రినయనాం బాలేందునా భూషితాం
నీలాకార సుకేశినీవిలసితాం నిత్యాన్నదాన ప్రదామ్ ।
శంఖం చక్ర వరాభయం చ దధతీం సారస్వతార్థప్రదాం
ధ్యాయే చేతసి కాళహస్తి నిలయాం జ్ఞాన ప్రసూనాంబికాం -1॥ 0 -

## అనుబంధం - III

## శ్రీకాళహస్తీశ్వరస్తోత్రమ్

స్వాధీనశక్తి లవకల్పిత పంచకృత్యం
మద్దేందుఖండ సురసింధు జటావిభూషం ।
జ్ఞానప్రసూనకలికా కలితార్ధ దేహం
శ్రీకాళహస్తినిలయం శివమాశ్రయామి ॥ - 1 -

పాణిస్ఫురత్ కులిశ శూల కురార ఘంటా
ఖడ్గా హ్యుషర్బుధ వరాభయ పాశ మీశం ।
శ్రీ సంప్రతి ప్రబల వారిధి తారకాంఘ్రిం
శ్రీకాళహస్తి నిలయం శివ మాశ్రయామి ॥ - 2 -

విద్వేశ్వరై ప్రతత మష్టభిరష్టదిక్షు
వీతం లలాటఫుట పంకువితావలాక్షం ।
కూటోచ్చకూట కరివర్మ కృతోత్తరీయం
శ్రీకాళహస్తి నిలయం శివమాశ్రయామి ॥ - 3 -

క్షోణీరథం రవి శశాంక రథాంగముష్ట
ధూరథిం శ్రుతిహయం హరివహ్నిబాణం ।
కోదండతూణగుణ రుక్మ ధరాబ్ధిశేషం
శ్రీ కాళహస్తి నిలయం శివమాశ్రయామి ॥ - 4 -

విశ్వాధికం హరివిరించి సుతాపదానం
పశ్వాయితాఖిల జగత్పతి మద్వితీయం ।
ఆనంద సింధు మఖిల శ్రుతి తత్వసారం
శ్రీ కాళహస్తి నిలయం శివ మాశ్రయామి ॥ - 5 -

శ్రీ మన్ముఖాంబుజ వరాటనిభానలాక్ష
శుద్ధం భగాక్ష హర మక్షర మాత్మతత్వం ।
ఆపాకృతాకృతి మనంతగుణాభిరామం
శ్రీ కాళహస్తి నిలయం శివమాశ్రయామి ॥ - 6 -

శంపాలతా శత సుగంధ జటావిలగ్న
శమ్యాక బిల్వ శశి సింధు శిరఃకపాలం ।
సృష్ట్యాది కారణగుణేశ మయూక్షి కోణం
శ్రీ కాళహస్తి నిలయం శివమాశ్రయామి ॥ - 7 -

వాతాబ్జబంధు శిఖి వాసవ మృత్యువస్తే
యస్యాజ్ఞయా ధృత భయప్రతతంస్వకృత్యం ।

కుర్వంతి తః కుటిల దక్ష హరం క్షణేన
శ్రీకాళహస్తినిలయం శివమాశ్రయామి || - 8 -

పశ్యంతి యం సకల వస్తుషు వస్తు సర్వం
యస్మిన్నపి ప్రబల యోగ విశుద్ధ సత్వాః |
సర్వాంతరామల దృశం శశిఖండ గౌరం
శ్రీ కాళహస్తి నిలయం శివమాశ్రయామి || - 9 -

పంచాననం కనకలోచన పుత్ర గాత్ర
శృంగారిత త్రిశిఖ చారు కరాంబుజాతం |
వక్షస్థల ప్రలగదాది వరాహశృంగం
శ్రీకాళహస్తి నిలయం శివమాశ్రయామి || - 10 -

ఆఖండలోప గళాభ సుశీత శీత
ధాన్వగ్నిరూపనయనం నటరాజరాజం |
బ్రహ్మేంద్ర విష్ణు రవిచంద్ర మయూర కాళ
శ్రీ దంతిరాజ షుధగా విజయార్తి నాశం || - 11 -

సుష్టి ప్రమస్త జగతాం ప్రలయోదయీయో
వేదా భవంతి పథ నిశ్వసితం యదీయం |
విద్యాభవం వినతలోక విశేషకల్పం
శ్రీకాళహస్తి నిలయం శివమాశ్రయామి || - 12 -

నిత్య ప్రబోధ సుఖ పద్వపుష్పన్నిరస్త
దోషాన్నిషాద వరలోచన చిహ్నితాస్యం |
మందస్మితం స్ఫుటత శతృపురం క్షణేన
శ్రీకాళహస్తి నిలయం శివమాశ్రయామి || - 13 -

బ్రహ్మాది పూరుష శరీర ముఖాగుణోత్థ
మాస్థాయ యః స్వయ మనంత విచిత్ర శక్తిః ।
సృష్ట్యాది కర్మ వితనోతి సహాధ్యస్తం
శ్రీ కాళహస్తి నిలయం శివమాశ్రయామి ॥ - 14 -

శ్రీభీత విష్ణు ముఖ దేవకులం పురాయ
సర్వం రరక్ష కృపయా పరయా క్షణేన ।
స్వకృత్యతాంత మహితామ పునర్భవాయ
శ్రీ కాళహస్తి నిలయం శివమాశ్రయామి ॥ - 15 -

అగ్నిర్ముఖం శశి రవీ నయనే దిశస్తు
శ్రోత్రే వచాంసి నిగమాః శ్వసన స్సమీరః ।
విశ్వం హ్యాదఘ్రి యుగళం పృథివీ చ యస్య
శ్రీకాళహస్తి నిలయం శివమాశ్రయామి ॥ - 16 -

నిత్యం విశుద్ధ మమలం పరిపూర్ణ శక్తిం
సత్యం పరం పరమకారణ మద్వితీయం ।
ఆనందకంద మఖిలాభయ వల్లికాయాః
శ్రీ కాళహస్తి నిలయం శివ మాశ్రయామి ॥ - 17 -

కైలాసవాసీ భగవాన్ శ్రీకాళహస్తీశ్వరశ్శివః ।
కరోతునిత్యం కల్యాణం కరుణావరుణాలయః ॥ - 18

ఇతి శివమ్

ఓం తత్సత్

# ఉపయుక్త గ్రంథ సూచిక

## తెలుగు


| | | |
|---|---|---|
| అక్కమహాదేవి బోధోల్లాసము<br>బాలపాపాంబ ప్రణీతము<br>(యక్షగానము) | 1988 | పరిష్కృత ముద్రణ<br>డా॥ మువేడు ప్రభాకరరావు<br>S V U Oriental Journal<br>Vols XXX - XXXI 1987-88,<br>పుటలు167-238 |
| ఆంధ్ర కవయిత్రులు - | 1980 | ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ<br>బాపట్ల, గుంటూరు జిల్లా |
| ఆంధ్ర శతక సాహిత్య వికాసము | 1976 | డా ॥ కె. గోపాల కృష్ణరావు<br>ఉస్మానియా విశ్వవిద్యాలయం<br>హైదరాబాదు |
| ఆంధ్రుల సాంఘిక చరిత్ర | 1982 | సురవరం ప్రతాపరెడ్డి<br>తృతీయ ముద్రణ<br>వైజయంతీ ప్రచురణలు |
| ఆంధ్రప్రదేశ్‌లోని ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు | 1987 | జి.ఎస్. మోహన్<br>శ్రీనివాస పబ్లికేషన్స్<br>మలయనూరు<br>అనంతపురం జిల్లా |
| ఆంధ్ర కవుల చరిత్రము | 1949 | కందుకూరి వీరేశ లింగము<br>తృతీయ ముద్రణము<br>హితకారిణీ సమాజము<br>రాజమహేంద్రవరము |

| | | |
|---|---|---|
| ఆంధ్ర కవితరంగిణి | 1935 | చాగంటి శేషయ్య<br>సంపుటాలు 8,9,10 |
| ఆంధ్రుల సంస్కృతి<br>సంక్షిప్త చరిత్ర | | చెరుకు రామారావు |
| ఈశావాస్యోపనిషత్<br>సత్య వ్రత భాస్కర క్షేత్రం | 1982 | పసని సీతారామయ్య<br>పసని వేణుగోపాల్<br>మద్రాసు |
| ఈశావాస్యోపనిషత్<br>(భాష్యారవిందము) | 1987 | డా॥ తుమ్మపూడికోటీశ్వర రావు<br>మలయకూట ప్రచురణలు<br>అనంతపురం |
| కావ్య పరిమళము | 1978 | విశ్వనాధ సత్యనారాయణ<br>ఆం.ప్ర.సా అకాడెమీ<br>హైదరాబాదు |
| తిక్కన సోమయాజి(నవల) | 1970 | తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు<br>వావిళ్ల, మద్రాసు |
| తెలుగు సాహిత్య సమీక్ష<br>సంపుటం - 1 | 1983 | డా ॥ జి. నాగయ్య<br>నవ్య పరిశోధన ప్రచురణలు<br>తిరుపతి |
| తెలుగు సాహిత్య సమీక్ష<br>సంపుటం - 2<br>ప్రచురణలు | 1985 | డా ॥ జి. నాగయ్య<br>నవ్య పరిశోధక<br>తిరుపతి |
| ధూర్జటి చారిత్రక నవల) | 1986 | నోరి నరసింహశాస్త్రి<br>జయంతి పబ్లికేషన్స్<br>విజయవాడ |

| | | |
|---|---|---|
| ప్రాచీన తెలుగు కావ్యాల్లో తెలుగునాడు | 1984 | డా॥ పి. నరసింహారెడ్డి<br>శ్రీనివాస మురళీ పబ్లికేషన్స్<br>తిరుపతి |
| బ్రాహ్మమయమూర్తి – విశ్వనాథ సాహితీ దర్శనం | 1976 | డా॥ ముదివేడు ప్రభాకరరావు<br>తాటికొండ వేంకటకృష్ణయ్య<br>విశ్వభారతీ ప్రచురణలు<br>తిరుపతి |
| భారతీయ తత్త్వ శాస్త్రం సంపుటం -4 | 1988 | బులుసు వేంకటేశ్వర్లు<br>తిరుమల తిరుపతి దేవస్థానములు<br>తిరుపతి |
| మన మతములు– సంప్రదాయములు | 1970 | డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు<br>ఆం.ప్ర సా అకాడెమీ<br>హైదరాబాదు |
| రాయలసీమ లోని ముఖ్య దేవాలయాలు | 1970 | పి. కృష్ణమూర్తి<br>తిరుపతి |
| మన మతములు–ప్రవక్తలు | 1970 | దేవరకొండ చిన్నికృష్ణ శర్మ<br>వాహినీ ప్రచురణాలయం<br>విజయవాడ |
| విజయనగర చరిత్రము | 1970 | నూతలపాటి పేరరాజు |
| విశ్వనాథ వాఙ్మయ సూచిక | 1970 | కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి<br>కోవెల సుప్రసన్నాచార్యులు<br>వరంగల్లు |

శతక కవుల చరిత్రము 1970 - వంగూరు సుబ్బారావు

శివ తత్త్వ సారము 1967 మల్లికార్జున పండితారాధ్యుడు
సంపా నిడుదవోలు వేంకటరావు
కృష్ణా పత్రిక ప్రచురణ
తెనాలి

శివ స్తుత గీతమాలిక 1990 షేక్ జానీ భాషా
దయా ఎంటర్ ప్రైజెస్
శ్రీ కాళహస్తి

శివ రహస్య ఖండము 1932 - కోడూరు వేంకటాచలకవి
సంపా ముదిగొండ వీరభద్రేశ్వరారాధ్యులు
నందిగామ, కృష్ణాజిల్లా

శివానుగ్రహము 1957 తుమ్మలపల్లి రామలింగేశ్వర రావు
మునిరావు వీధి, కడప

శ్రీజ్ఞాన ప్రసూనాంబికా 1918 శిష్టు సర్వశాస్త్రి
శతకము ఆంధ్ర సాహిత్య పరిషత్
కాకినాడ

శ్రీకాళహస్తీశ్వర శ్రీజ్ఞాన 1981 శ్రీకాళహస్తి ప్రచురణాలయం
ప్రసూనాంబా దండకములు శ్రీ కాళహస్తి

శ్రీజ్ఞాన ప్రసూనాంబికా 1988 శ్రీ కాళహస్తీశ్వర దేవస్థానం
స్తోత్రము శ్రీ కాళహస్తి

శ్రీజ్ఞాన ప్రసూనాంబికా 1992 గంటికృష్ణవేణమ్మ
శతకము కడప

| | | |
|---|---|---|
| శ్రీజ్ఞాన ప్రసూనాంబికా సమేత శ్రీకాళహస్తీశ్వర స్వామి త్రిశతి | 1974 | చెఱుకుపల్లి జమదగ్ని శర్మ<br>శ్రీ కాళహస్తి |
| శ్రీకాళహస్తి మాహాత్మ్యము | 1895 | సంపాదకుడు<br>కొ. పద్మనాభ శాస్త్రి<br>ర.వెంకటసుబ్బయ్య<br>జ్ఞాన ప్రసూన మాలిక. |
| శ్రీకాళహస్తి మాహాత్మ్యము | 1914 | సంపాదకుడు<br>కొత్తపల్లి అన్నపూర్ణమ్మ |
| శ్రీకాళహస్తి మాహాత్మ్యము | 1963 | సంపాదకుడు<br>తిమ్మావజ్ఝల కోదండరామయ్య<br>సార్స్వత కుటీరము, మద్రాసు |
| శ్రీకాళహస్తి మాహాత్మ్యము | 1967 | పరిష్కర్త<br>వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి<br>పీఠిక<br>చిలుకూరి పాపయ్య శాస్త్రి<br>వేంకట్రామాఅండ్‌కో,<br>విజయవాడ |
| శ్రీ కాళహస్తి మాహాత్మ్యము | 1970 | చెలమచర్ల రంగాచార్యులు<br>(పీఠిక)<br>వేంకట్రామాఅండ్‌కో,<br>విజయవాడ |
| శ్రీకాళహస్తి మాహాత్మ్యము | 1968 | డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు |

| | | |
|---|---|---|
| | | ఆం.ప్ర.సా. అకాడెమీ<br>హైదరాబాదు |
| శ్రీకాళహస్తి మాహాత్మ్యము | 1970 | విశ్వనాథ సత్యనారాయణ<br>(పీఠిక)<br>ఎమెస్కో, మచిలీపట్నం |
| శ్రీ కాళహస్తి మాహాత్మ్యము<br>(వచనము) | 1935 | మ. సుబ్బరాయులు నాయుడు<br>మురహరి ముద్రణాలయం |
| శ్రీకాళహస్తి శతకము | 1982 | శ్రీ కాళహస్తి దేవస్థాన ప్రచురణ<br>శ్రీ కాళహస్తి |
| శ్రీకాళహస్తీశ్వర శతకము | 1986 | ప్రచురణ గొల్లపూడి<br>వీరాస్వామి అండ్‌సన్స్<br>రాజమండ్రి |
| శ్రీకాళహస్తీశ్వర స్తవము | 1969 | నందివెలుగు వేంకటేశ్వర శర్మ<br>శ్రీ కాళహస్తి దేవస్థానములు<br>శ్రీ కాళహస్తి |
| శ్రీకాళహస్తి మాహాత్మ్యము<br>(వచనము) | 1967 | వీరవల్లి రామానుజాచార్యులు<br>శ్రీ కాళహస్తి |
| శ్రీకాళహస్తి క్షేత్ర మాహాత్మ్యము<br>(వచనము) | 1970 | విద్వాన్ జి. తిరువేంగడ సూరి<br>శ్రీ కాళహస్తి |
| శ్రీకాళహస్తి మాహాత్మ్యము<br>(వచనము) | 1991 | అమరవాది శేషయ్య<br>ఎన్.వి.గోపాల్ అండ్ కో<br>మద్రాసు |

| | | |
|---|---|---|
| శ్రీకాళహస్తి క్షేత్ర మహిమ | 1985 | బి.వి. సంపత్కుమారాచార్యులు<br>శ్రీ కాళహస్తి |
| శ్రీకాళహస్తి క్షేత్ర వైభవం<br>(వచనము) | 1992 | పూడి వెంకట రామయ్య<br>శ్రీ కాళహస్తి |
| శ్రీ శివ పురాణము<br>(తెలుగు వచనము) | 1986 | శివశ్రీ నిర్మల శంకర శాస్త్రి<br>ఆరాధ్యులవారు<br>ప్రేమాబుక్ డిపో<br>సికింద్రాబాద్ |
| శ్రీ మదాంధ్ర హాలాస్య మాహాత్మ్యమ్<br>(పద్యకావ్యం) | 1906 | జనమంచి శేషాద్రి శర్మ<br>శారదా మకుట ముద్రాక్షర శాల<br>విశాఖ పట్టణం |
| హాలాస్య మాహాత్మ్యము<br>(పద్యకావ్యం) | 1988 | తిరుమల శెట్టి<br>జగన్నాథ దాసు<br>వావిళ్ల, మద్రాసు |
| హాలాస్య మాహాత్మ్యము<br>(పద్యకావ్యం) | 1917 | మల్లమపల్లి బుచ్చికవి<br>శ్రీ మాహిష్మతీ ముద్రణ శాల, ముక్త్యాల |

## సంస్కృతం

| | | |
|---|---|---|
| Minor Works of<br>Nilakantha Dikshita | 1967 | Ed J Filliozat<br>Institute of Indology<br>Pondicherry |
| స్తోత్ర లహరి (సంకలనం) | 1969 | కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి<br>ఆంధ్ర ప్ర సా అకాడెమీ<br>హైదరాబాదు |

| | | |
|---|---|---|
| శివ లీలార్ణవః | 1911 | నీలకంఠ దీక్షితులు<br>వాణీవిలాసముద్రాక్షరశాల<br>శ్రీరంగం. |
| శ్రీ కాళహస్తి స్థలపురాణమ్ | 1893 | సంపాదకుడు<br>చేట్లూరి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి<br>కాశీవిశ్వనాథ ప్రెస్, వెంకటగిరి |
| శ్రీ కాళహస్తీశ్వర | 1893 | సంపాదకుడు<br>చేట్లూరి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి<br>కాశీ విశ్వనాథ ప్రెస్ , వెంకటగిరి. |
| శివ పంచస్తవి (సంపా.) | 1943 | చిదిరెమఠం వీరభద్రశర్మ<br>(భక్తి రంజనీ వ్యాఖ్యాతలు)<br>మటొకె నాగయ్య ధర్మ నిలయము<br>సికింద్రాబాద్ |
| బృహత్ స్తోత్ర రత్నాకరమ్ | 1936 | (సంపా )<br>గరిమెళ్ల సుబ్బారాయశాస్త్రి<br>అమెరికన్ డైమండ్ ముద్రాక్షరశాల<br>చెన్నపురి. |
| ఆది శంకరుల స్తోత్రావళి | 1935 | శ్రీ శంకర సంపూర్ణ గ్రంధావళి<br>శ్రీ వాణీవిలాస ప్రెస్ Vol 18<br>శ్రీ రంగం |

# అముద్రిత సిద్ధాంత వ్యాసాలు

| | | |
|---|---|---|
| అక్కమహాదేవి చరిత్ర పరిశీలన | 1984 | డా॥ బి. శ్రీరాములు ఎంఫిల్ అముద్రిత సిద్ధాంత వ్యాసం |
| శ్రీకాళహస్తీశ్వర శతకము | 1982 | అంజనాదేవి ఎంఫిల్ అముద్రిత సిద్ధాంత వ్యాసం |
| Art and Architecture of Sri Kalahastiswara Temple Sri Kalahasti (Ph D Thesis) - | -1988 | Dr D Kiran Kranth Choudary |
| History and Administation of Sri Kalahastiswara Temple (Ph D Thesis ) | -1991 | - Dr Subba Raju |

# సాహిత్యవ్యాసాలు

| | | |
|---|---|---|
| పాదిలెపేమకు చెందిన - అముద్రిత వీరశైవ ద్విపదకృతి - గణపాల చరిత్ర | 1981 | ముదివేడు ప్రభాకరరావు SVUO Journal Vol XXIV 1981 |
| శ్రీ విద్యానిధి - శ్రీ జమదగ్ని - | 1980 | ముదివేడు ప్రభాకరరావు స్రవంతి, హైదరాబాదు |

మహాకవి ధూర్జటి - మాధురీ మహిమ — కె.జె. కృష్ణమూర్తి, కాదంబిని, తిరుపతి

తిన్నని కధ - ధూర్జటి కవితా శిల్పము — వాగళ్ల గురుప్రసాదరావు, భారతి, 1980

నత్కీరుని కధ - ఔచిత్యము - — నోరి నరసింహశాస్త్రి, భారతి, మే, 1964

నత్కీరుని కధ కొన్ని విశేషములు - — తిమ్మావజ్ఝల కోదండరామయ్య, భారతి, నవంబర్, 1960

కాళహస్తి మాహాత్మ్య పారపరామర్శనము — దీపాల పిచ్చయ్య శాస్త్రి, భారతి, జులై 1962

కాళహస్తి మాహాత్మ్యము - ఇతివృత్త పరిశీలనము — (- వి.జి. కృష్ణమాచార్యులు, ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక సం 47, 2, 3 భాగాలు)

## ENGLISH

1) Gazetteers of Andhra Pradesh- Chittoor — Dr N Ramesan, Govt Press, 1979

2) Sri Kalahasti Temple - (A Monograph) — P Sitapati & P Nagi Reddy

3) Isavasyospanishad Satya vrata bhaskara Kshetram — P Sitaramaiah & P Venugopal, Madras 1982

4) South Indian Inscriptions — Vol IV VIII IX, XVII

5) Select Andhra Temples — Dr M Rama Rao, Govt of Andhra Pradesh, Hyderabad 1970

6) Inscriptions of Andhradesa - Dr M Rama Rao
Pub - S V University
Tirupati, 1967

7) South Indian Temple Inscriptions - Ed T N Subrahmanyam
Vols, III Pts 1 & 2
Govt Oriental
Manuscripts Library,
Madras, 1955

8) Temple of Andhra Pradesh - B Rajendra Prasad
Publications Division,
New Delhi 1965

## తెలుగు - పరిశిష్ట గ్రంధాలు

1) వీర శైవాంధ్ర వాఙ్మయము - శిష్టా రామకృష్ణశాస్త్రి
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి 1956

2) శివానందలహరి - దేవులపల్లి చెంచుసుబ్బయ్య
పెద్ద తుంబలం, ఆదోని, కర్నూలు

3) శివానందలహరి - కార్యంపూడి రాజమన్నార్,
హైదరాబాద్

4) సౌందర్యలహరి - (వ్యాఖ్యాత)
(ఆదిశంకరులు)
చదలవాడ జయ రామశాస్త్రి
శ్రీ అరుణ బుక్‌హౌస్
మద్రాసు, 1982

## కన్నడము

1) కన్నడ సాహిత్య చరిత్ర - రం శ్రీ ముగళి
అనువాదం-ఎం ఎస్ ఘహంతయ్య
సాహిత్య అకాడెమీ,
న్యూఢిల్లీ, 1978

2) హాలాస్య పురాణమ్ - ఇమ్మడి గురుసిద్ధ
సంపా. జి.జి. మంజునాథన్
కన్నడ అధ్యయన సంస్థ,
మైసూరు, 1975.

3) కన్నడ సాహిత్య చరిత్ర - డా॥ R V S సుందరం
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ,
హైదరాబాద్ 1977.

4) వీరశైవ పురాణగళు - కన్నడ సాహిత్య పరిషత్తు
భీమరాజాపేట,
బెంగళూరు, 1983.

తమిళము

1) తమిళ సాహిత్య చరిత్ర - ము. వరదరాజన్
అనువాదం - తిమ్మావఝల
కోదండ రామయ్య
సాహిత్య అకాడెమీ,
న్యూఢిల్లీ, 1982.

2) తమిళ సాహిత్య చరిత్ర - చల్లా రాధాకృష్ణశర్మ
ఆం.ప్ర.సా. అకాడెమీ
హైదరాబాదు, 1978

3) తేవారమ్ -Vol I & II - Institute of Indology
(Hymns of Saivite Saints) Pondicherry, 1984

4) తిరువాచకమ్ - మాణిక్య వాచకర్ నాయనార్